# కాటమరాజు కథలు

## మూడవ సంపుటం

*పరిష్కర్త - పీఠికాకర్త -*
*ప్రధాన సంపాదకుడు:*
"వీరగాథల సవరాలజిమ్మడు" -"రసజ్ఞ రాజశేఖరుడు"
**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

*తాళపత్రగ్రంథ సేకరణ:*
కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్య
కీ.శే. డా॥ కనకబండి మోహనరావు
శ్రీ మట్టి గురవయ్య
విద్వాన్ జ్యోతి చంద్రమౌళి
ఆచార్య మట్టెబోయిన జయదేవ్

ప్రచురణ:
ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు
వ్యవస్థాపక అధ్యక్షుడు
శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య (రి.)
బెంగుళూరు
**2021**

**KAATAMARAAJU KATHALU,** Volume-III Edited and Published by **Prof. T.V. Subba Rao**, Founder President, Sri Krishnadevaraya Rasajna Samakhya (R.), Bengaluru - 560 060.

**No. of Pages:** lxxiv + 330 (including 52 pages of photos)

**First Edition : 14-01-2021, Sarvari 'Makara Sankranthi'.**

**No. of Copies :** 1000

**Price:** Rs.400/-



**ముఖచిత్రం:** ఓరుగల్లు కోటగుమ్మం దగ్గర 'గండకత్తెర' గుఙ్జంమీద ఏకాంగవీరుడు కటియావులరాజు. చిత్రకారుడు – శ్రీ అరసవల్లి గిరిధర్. ఆధారం: ఫ్రెంచి చిత్రకారుడు డేవిడ్ (క్రీ.శ. 1748–1824) చిత్రించిన "నెపోలియన్ బొనాపార్టి" చిత్రం. "మిసిమి చిత్రకళానీరాజనం" సౌజన్యంతో.

**For Copies:**

**1) Prof. T.V. Subbarao**
#1708, *"Siitaavadhaanam"*
11th Cross; 1st "G" Main
Kengeri Satellite Town
BENGALURU – 560 060
Mobile: 99454 22742

**2) All Leading Bookshops:**
**1) Visalaandhra Book House, Vijayawada and all its Branches**
**2) Sahiti Prachuranalu, Vijayawada**
**3) Navachetana Book House, Hyderabad and all its Branches**
**4) Navodaya Book House, Hyderabad**

**DTP: Nagasri Graphics**
H.No.1-18, Plot No.17; Brindavana Colony
Near Agnimaremma Temple; Gundlasagaram Village
Gudupalli Mandal; Chittoor District, PIN-517 425
Andhra Pradesh; 08570-517 825; Mobile: 8500619283

*Printing :*
**Omkar Offset Printers**
3/3, 1st Main Road, New Tharagupet
Chamarajpet, Bengaluru - 560 002
Phone: 080-2670 8186/2670 9026

# అంకితం

నా కాటమరాజుకథలు మొదటి సంపుటాన్ని, రెండవ సంపుటాన్ని మా అన్నయ్య శ్రీ టి.వి.కె. సోమయాజులు (శ్రీ తంగిరాల వెంకటకృష్ణ సోమయాజులు) గారికి అంకితం చేశాను. ఈ మూడవ సంపుటాన్ని కూడా వారికే అంకితం చేస్తున్నాను. వారితోపాటు ఈ క్రిందివారికి కూడా –

1. నాకు 1964–67 మధ్యకాలంలో తమ దగ్గరనున్న తాళపత్రగ్రంథాలను ఇచ్చిన కొమ్ములవారికి, గొల్లసుద్దులవారికి – వీటిని సేకరించడంలో సహకరించిన మిత్రులకు (చూ. అనుబంధం)–
2. ఆనాటి ఆంధ్రప్రదేశ్ యాదవసంఘం కార్యదర్శి కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్య యాదవరాజుగారి దివ్యస్మృతికి –
3. నేను సేకరించిన తాళపత్ర గ్రంథాలను 1974–76 మధ్య పరిష్కరించి, ఎత్తి వ్రాసుకొనడంలో నాకు ఎంతగానో తోడ్పడిన పండితమిత్రులు, ప్రాణసఖులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారి దివ్యస్మృతికి –
4. ఈ గ్రంథంలోని కాటమరాజుకథలను సేకరించి యిచ్చిన మిత్రులకు – అంటే – కీ.శే. డా॥ కనకబండి మోహనరావుగారి పుత్రులు శ్రీ కనకబండి కృష్ణయాదవ్‌గారికి – మిత్రులు శ్రీ మట్టి గురవయ్యగారికి, వీరు సేకరించిన తాళపత్ర గ్రంథంలోని 'బొంగరాలకథ'ను ఓపికతో ఎత్తివ్రాసి పంపిన విద్వాన్ జ్యోతి చంద్రమౌళిగారికి – తాము సేకరించిన "పాపనూక వలపోత"ను నాకు ఆత్మీయతతో పంపిన చిరకాల సఖులు ఆచార్య మట్టెబోయిన జయదేవ్‌గారికి–
5. ఈ గ్రంథముద్రణకు భూరివిరాళం (రూ. 30,000/–లు) ఇచ్చిన మాన్యమిత్రులు శ్రీపోచా బ్రహ్మానందరెడ్డిగారికి (పార్లమెంటు సభ్యులు, నంద్యాల, కర్నూలుజిల్లా) – మరియు ఇతర దాతలకు –
6. ప్రత్యేకంగా 2002 లో నల్లమల అడవులలోకి వెళ్లి కాటమరాజుకథల కలర్ ఫోటోలు తీసి పంపిన చిరకాల మిత్రులు డా॥ మూడమంచు వెంకటేశ్వర్లు (విశ్రాంత తాహశీలుదారు)గారికి – ఇటీవల (2020లో) పాలేటి గంగగుడిలోని విగ్రహాల కలర్ ఫోటోలు తీసి పంపిన శిష్యులు శ్రీ పావళ్ల మహేష్ ("ప్రజాశక్తి" విలేఖకుడు)గారికి – "తెలుగు జానపద సాహిత్య పరిషత్తు" అధ్యక్షురాలు డా॥ చింతపల్లి వసుంధరారెడ్డిగారికి, ప్రధాన కార్యదర్శి ఆచార్య చిగిచెర్ల కృష్ణారెడ్డిగారికి – మరియు ఆత్మబంధువులకు – ప్రాణమిత్రులకు –

నిండు మనస్సుతో....

**తంగిరాల వెంకట సుబ్బారావు**

## ఈ గ్రంథముద్రణకు ధనసహాయం చేసిన ఉదారహృదయులు

| | | |
|---|---|---|
| 1. | "రైతుబాంధవుడు" శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు, పార్లమెంటు సభ్యులు, నంద్యాల, కర్నూలుజిల్లా. | రూ. 30,000/- |
| 2. | ఆచార్య చన్నాప్రగడ జయలక్ష్మిగారు, బెంగుళూరు. | రూ. 10,000/- |
| 3. | శ్రీమతి ఎం.వి. లక్ష్మి-శ్రీ మల్లెబోయిన లక్ష్మీనారాయణ యాదవ్ దంపతులు, హైదరాబాద్. | రూ. 10,000/- |
| 4. | ఆచార్య మల్లెబోయిన జయదేవ్‌గారు, హైదరాబాద్. | రూ. 10,000/- |
| 5. | డా॥ మూడమంచు వెంకటేశ్వర్లుగారు, (విశ్రాంత తహసీల్దారు) ఒంగోలు. | రూ. 10,000/- |
| 6. | శ్రీ వి. నారాయణరెడ్డిగారు, బెంగుళూరు. | రూ. 10,000/- |
| 7. | కీ.శే. బొడ్డెబోయిన గంగయ్యగారి స్మారకంగా వారి కుమారుడు శ్రీ బ్రహ్మయ్యగారు; మనుమలు శ్రీ సోమరాజు, శ్రీ వేణుగోపాల్, శ్రీ విష్ణు; మనుమరాలు కుమారి యమున, వెంగళాపురం ప్రకాశంజిల్లా | రూ. 10,000/- |
| 8. | శ్రీ దండమూడి అవనీంద్రకుమార్‌గారు, హైదరాబాద్ | రూ. 10,000/- |
| 9. | శ్రీ ఆర్. చంద్రశేఖరయ్యగారు, బెంగుళూరు. | రూ. 5,000/- |
| 10. | డా॥ వి. నారాయణప్పగారు, ఢిల్లీ. | రూ. 5,000/- |
| 11. | ఆచార్య ఎం. రామనాథంనాయుడుగారు, మైసూరు. | రూ. 5,000/- |
| 12. | డా॥ ఇప్పగుంట మాధవరావుగారు, కందుకూరు, ప్రకాశంజిల్లా. | రూ. 5,000/- |
| 13. | శ్రీమతి కమలాకర రాజేశ్వరిగారు, చెన్నై. | రూ. 5,000/- |
| 14. | ప్రొ॥ జి.యస్.మోహన్‌గారు, బెంగుళూరు. | రూ. 5,000/- |
| 15. | శ్రీమతి నూకవరపు రాజేశ్వరి-శ్రీమాదల శివగంగాప్రసాదరావు దంపతులు, పెదరావూరు, గుంటూరుజిల్లా. | రూ. 5,000/- |
| 16. | ఆచార్య జె.వి. సత్యవాణిగారు, కుప్పం, చిత్తూరుజిల్లా. | రూ. 5,000/- |
| 17. | డా॥ సనపల ఢిల్లీశ్వరరావుగారు, సీతంపేట శ్రీకాకుళంజిల్లా | రూ. 5,000/- |
| 18. | శ్రీ శేషగిరి వెంకటేశ్వరరావుగారు, బెంగుళూరు | రూ. 3,000/- |
| 19. | డా॥ బి. రామకృష్ణారెడ్డిగారు, బెంగుళూరు. | రూ. 1,000/- |
| 20. | శ్రీ పావళ్ళ మహేష్‌గారు, పెదచెర్లోపల్లి, ప్రకాశంజిల్లా | రూ. 1,000/- |

# విషయసూచిక



"బ్రహ్మరుద్రయ్య-ఖడ్గతిక్కన ద్వంద్వయుద్ధం" - కళాప్రపూర్ణ 'బాపు'

# పీఠిక-I

# కాటమరాజు కథాచక్రము

# (The Ballad-cycle of Katama Raju)

భారతీయులకు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన రెండు గొప్ప ఇతిహాసాలు ఉన్నాయి: వాల్మీకి రామాయణం, వ్యాస మహాభారతం. ఆంధ్రులకు (తెలంగాణా కూడా కలుపుకొని తెలుగువారికి) ఈ రామాయణ మహాభారతాలతోపాటు మరో రెండు జాతీయమైన ఉత్తమ ఇతిహాసాలున్నాయి. అవి "పల్నాటి వీరచరిత్ర", "కాటమరాజు చరిత్ర". వీటిని "జానపద ఇతిహాసాలు" (Folk Epics) అంటారు. 1963 నుండి 1968 వరకు నేను తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో "తెలుగు వీరగాథాకవిత్వం" అనే అంశాన్ని గురించి పరిశోధన చేశాను. ఆ పరిశోధనలో పల్నాటి వీరచరిత్రలో 25 వీరగాథలు, కాటమరాజుచరిత్రలో 32 వీరగాథలు ఉన్నాయని తెలుసుకున్నాను. కాని ఇవన్నీ పూర్తిగా నేడు లభించడం లేదు. కాటమరాజుచరిత్రలోని కథలసంఖ్యను గురించి నా సిద్ధాంతగ్రంథంలో ఈ క్రింది విధంగా వివరించాను:-

తెలుగు వీరగాథాసంపదలో పల్నాటి వీరగాథల తరువాత పేర్కొనదగినవి 'కాటమరాజుకథలు'. వీనికి 'యాదవరాజుల కథలు, యాదవభారతము, యదుశాస్త్రము' అను నామాంతరములు గలవు. ఇవి ఆంధ్రప్రదేశమునందంతటను పాడబడుచున్నను, నెల్లూరుజిల్లాలో దర్శి, కనిగిరి, కందుకూరు, ఉదయగిరి, నెల్లూరు ప్రాంతములందు ఈ కథలకు విశేషప్రచారమున్నది. గుంటూరు, కడప, కర్నూలు జిల్లాలలోను కాటమరాజుకథల కాదరము మెండు. పల్నాటి వీరకథల వలెనే ఇవియును చారిత్రక వీరగాథలు. పల్నాటి వీరకథలు క్రీ.శ. 12వ శతాబ్దమున జరిగిన సంఘటనలు కాగా, ఈ కాటమరాజు కథలు 12-13 శతాబ్దముల నాటివని తెలియుచున్నది. ఇవి మొత్తము ముప్పదిరెండు కథలున్నవని యాదవగాథాకారులవలన (కొమ్మలవారివలన, గొల్లసుద్దులవారివలన) తెలియుచున్నది. ఈ కథలన్నియు కాటమరాజునకును, ఆతని

సోదర సోదరీమణులకును, పితృపితామహులకును సంబంధించిన ప్రశస్త సాంప్రదాయిక వీరగాథలు. ఈ ముప్పదిరెండు వీరగాథలును చక్కని వరుసక్రమమున నొక పెద్ద కథాచక్రముగా నేర్పడియున్నవి. వీనిని 'కాటమరాజు కథాచక్రము'గా పిలువవచ్చును. ఈ కథాచక్రము ఐతిహాసికదశకు మిక్కిలి దగ్గఱలో నున్నది.

**1. కాటమరాజుకథల సంఖ్య**

'కాటమరాజుకథ, కాటమరాజుకథ' అనుటయే కాని దీనినిగూర్చిన సంపూర్ణ విషయములేవియు తెలుగు సాహిత్య లోకమునకు నేటి (1967) వఱకును తెలియవు. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము (Madras Government Oriental Manuscripts Library)లో ఆఱు కథలున్నవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనవలన ఇందలి కథలు నాలుగు ముద్రింపబడినవి. ఇవి తప్ప తక్కినవేవియు ఆంధ్రసాహిత్య సంసేవ్యులకు తెలియవు.

'కాటమరాజుకథ' అను ఏకవచన ప్రయోగము తప్పు. ఏలయన ఇది ఒక్క కథ కాదు; మ్ముపదిరెండు కథల సువిశాల చక్రము. ఈ చక్రములోని ప్రధానవ్యక్తి కాటమరాజైనను, ఈ ముప్పదిరెండు కథలలోను ఏ కథకును'కాటమరాజుకథ' అను పేరు లేకపోవుట ఆశ్చర్యకరము! ఇవి వీరగాథాచక్రమని సూచించుటకే కాబోలును, జానపదులు 'కాటమరాజుకథలు' అను బహువచన రూపమునే వాడుచున్నారు. పల్నాటి వీరకథలును కాటమరాజు కథలును వీరగాథావృత్తములని తెలిసియే కాబోలు బ్రౌనుదొరగారు వీని చివర 'చరిత్ర' అను శబ్దమును చేర్చి ప్రయోగించినారు ('పల్నాటి వీరచరిత్ర', 'కాటమరాజు చరిత్ర'). వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'కాటమరాజుకథ' అను పేరుతో సంగ్రథితము చేసినది నిజమునకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను నొక్క వీరగాథ మాత్రమే. వేటూరివారి ఛాత్రులును, మద్గురువర్యులును నగు శ్రీతిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఈ 'కాటమరాజుకథ' కాటమరాజుచరిత్రను సంపూర్ణముగా నభివర్ణించు గ్రంథమని ప్రశంసించిరి. ఇది ప్రామాదికము. వేటూరివారిచే పరిష్కరింపబడి, 'కాటమరాజు కథ'గా ప్రకటితమైన యీ కథ, సుదీర్ఘమగు కాటమరాజు కథాచక్రమున నొక భాగము మాత్రమే. ఈ కథాచక్రము, కాటమరాజు పితామహుడగు ఆవుల వలురాజుకథతో ప్రారంభమై, కాటమరాజు సోదరుడగు భక్తిరన్నకథతో అంతమగును. ఈరెండు కథలకును మధ్య అనేక కథలున్నవి. వానిలో ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట యొకటి. ఇదియే కాటమరాజు వృత్తాంతమును సంపూర్ణముగా నభివర్ణించుననుట పొసగదు.

ఈ కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు కథలున్నవని చెప్పుటయే కాని, ఆ ముప్పదిరెండు కథల నామములను వరుసగా జెప్పగలిగిన గాథాకురుదెవ్వడును నాకు తటస్థపడలేదు. మద్రాసు GOML లో పల్నాటి వీరకథ లెక్కువగా నున్నవి కాని, కాటమరాజు కథలు మాత్రము మిక్కిలి తక్కువగ నున్నవి. ఇందున్న మొత్తము కథలు ఆఱుమాత్రమే. తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక (1953-54)లో మదరాసు గ్రంథాలయమునగల ఈ యాఱుకథలనుగూర్చి విపులముగా చర్చించియున్నారు. వేటూరివారు పరిష్కరించిన 'కాటమరాజుకథ'ను 1953లో మదరాసు GOML వారు ప్రకటించిరి. దీనికి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పీఠిక వ్రాయుచు, ఈ కథాచక్రమున ఇంకను మఱికొన్నికథలుండియుండుననియు, అవి మదరాసు గ్రంథాలయమందు సహితము లేవనియు ఒక చక్కని ఊహను వెల్లడించిరి:

"The story proper or the section, dealing with the original agreement and the cause of the quarrel, is not found here in this work. Hence, it seems that there should be some more sections in this work which even the Government Oriental Library does not possess."

సత్యాన్వేషణము పరిశోధకుల లక్షణము. అట్టి యన్వేషణమున నూటికి నూఱుపాళ్లును కృతార్థులైనవారు మల్లంపల్లివారు. వారు పైన వెలిబుచ్చిన ఊహయే నాకు కరదీపిక కాగా, ఈ కథాచక్రమందలి తక్కిన వీరగాథలను సంపాదించుటకు నడుముకట్టి ఆంధ్రదేశమంతయు శోధించితిని. యాదవ వృద్ధులను అనేకులను సంప్రదించితిని. ఆంధ్రదేశమున వివిధ ప్రాంతములందుగల గాథాకారులను (కొమ్ములవారిని, గొల్లసుద్దులవారిని) కలసికొంటిని. సుమారు ముప్పది వఱకును తాళపత్ర గ్రంథములను సంపాదించితిని. ఈ త్రివిధ పరిశీలనముతో ఈ కాటమరాజు కథాచక్రమునగల ముప్పది రెండు వీరగాథల నామములను చాల భాగము నిర్ణయింపగలిగితిని. నాకు తెలిసినంతవరకును కాటమరాజు కథాచక్రమున ఈ క్రింది వీరగాథలున్నవి:-

1. 'వల్లురాజుకథ' లేక 'వలురాజుకథ' లేక 'ఆవుల వలురాజుకథ' (వలరాజు > వలురాజు > వల్లురాజు).

2. 'పంపాద్రికథ'.
3. 'పెద్దిరాజుకథ'.
4. 'సింహాద్రిరాజుకథ' (అలభ్యము).
5. 'ఎఱనూకరాజుకథ'.
6. 'నలనూకరాజుకథ' (అలభ్యము).
7. 'పోలురాజుకథ' లేక 'శివపురాణము'. దీనిలో ఆఱు చాటువలు కలవు. (చాటువ = ఉపాఖ్యానము)
   1) 'చంద్రగుప్తుని చాటువ'.
   2) 'మల్లికాదేవి చాటువ'.
   3) 'ముక్కంటి చాటువ' లేక 'బ్రాహ్మణ చాటువ'.
   4) 'జంగాల చాటువ'.
   5) 'కపోత చాటువ'.
   6) 'గయుని చాటువ'.
8. 'బల్లికురువ పోట్లాట'.
9. 'కఱియావులరాజుకథ'.
10. 'కాటమరాజుకు పట్నంకట్టిన కథ' లేక 'కాటమరాజు పట్టాభిషేకము'.
11. 'పాపనూకకథ'.
12. 'ఆవులమేపు' – నామాంతరములు: 'ఉత్తరాది ఆవులమేపులు' – 'కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు' – 'ఆవులమేపులు: ఉత్తరకాండము'. (ఉత్తరాది = ఉత్తర దిక్కు).
13. 'పాలేటికథ' లేక 'గంగతర్కము', లేక గంగ–కాటమరాజు తరకవాదము'.
14. 'ఎఱ్ఱయ్య తరకవాదము'.
15. 'జన్నివాడ కథ' – దీనికి ఆరు నామాంతరములు: 'దక్షిణాది ఆవులమేపు' – 'కాటమరాజు 'దక్షిణాది ఆవులమేపు' – 'ఆవులమేపులు: దక్షిణకాండము' – 'దక్షిణకాండము' – 'చదరంగంకథ' – 'పుల్లరికథ' (దక్షిణాది = దక్షిణదిక్కు)
16. 'భట్టు రాయబారము' లేక 'కల్లి రాయబారము'.
17. 'కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ'.

18. 'బొంగరాలకథ' – మూడు నామాంతరములు – 'ముమ్మయ్య – పోచయ్య బొంగరాలు'–'వేడుక బొంగరాల కథ' – 'అలుగుల పోలు'.
19. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' – దీనిలో ఏడు కాండలున్నవి:
    1) 'చల్లవారి జగడము' లేక 'ఈర్లమాని కథ' లేక 'తిక్కనామాత్యుని కథ'.
    2) 'బొల్లావు జగడము'.
    3) 'బీర్నీడు యుద్ధము'.
    4) 'అయితమరాజు – కఱియావులరాజుల యుద్ధము'.
    5) 'బాలరాజుల యుద్ధము.
    6) 'ఆవుల యెద్దుల జగడము' – 'ఎఱ్ఱయ్యల యుద్ధము'.
    7) 'కాటమరాజు యుద్ధము'.
20. 'అగుమంచి కథ'.
21. 'పాపనూక వలపోత'.
22. 'భక్తిరన్న కథ'.

ఈ కథలలో పెద్దిరాజుకథ, పోలురాజుకథ, కఱియావులరాజుకథ, గంగతర్కము, భట్టురాయబారము, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భక్తిరన్నకథ – అను ఏడు వీరగాథలు ఎక్కువగా పాడబడుచుండును.

పై కథలలో 'సింహాద్రిరాజుకథ' – 'నలనూకరాజుకథ' – అను రెండు వీరగాథలు తప్ప తక్కినవన్నియును నాకు లభించినవి. ఈ రెండు కథలకును ప్రచారము తక్కువ. అందుచే లభించుట కష్టము. ఇంకను 'అగుమంచి వలపోత, గంగపుట్టుక, పల్లకొండ పుట్టుక, భైరవకురువ యుద్ధము'' అను మఱి నాలుగు వీరగాథలున్నవని తెలియుచున్నది. ఇవి నిజముగా లోకమున నున్నవో లేవో చెప్పలేను. 2010లో ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు చెందిన ప్రొ॥ మఱ్ఱిబోయిన జయదేవ్‌గారు 'పాపనూక వలపోత'ను సేకరించి ప్రచురించినారు. కాటమరాజు ముత్తాత (ప్రపితామహుడు) అయిన 'కవులావుల గంగురాజుకథ'ను తెలంగాణములోని 'మందెచ్చులవారి' నుండి శ్రీ రంగు రాజపాపయ్యగారు సేకరించినారు (కాకతీయ విశ్వవిద్యాలయము, 1996). నేను దీనిని పరిశీలించినాను. కాని యిది చారిత్రక వీరగాథవలె లేదు, కల్పిత జానపదకథవలె నున్నది. కాటమరాజుకథలతోపాటు యాదవగాథాకారులు తఱచుగా పాడుచుండు 'కంసుడుకథ' లేక 'కృష్ణభాగవతము' లేక 'విష్ణుభాగవతము'ను గూడ

దీనికి చేర్చవలెనని కొందఱు చెప్పుచున్నారు. కాటమరాజు విష్ణుమూర్తి అవతారమే కావున, 'కృష్ణభాగవతము' కాటమరాజుయొక్క పూర్వజన్మకథ యగును.

ఈ విధముగా పైన తెల్పిన 22 కథలకు "అగుమంచి వలపోత, గంగపుట్టుక, పల్లికొండ పుట్టుక, కంసుదుకథ" అను నాలుగు వీరగాథలన చేర్చినచో మొత్తము ఇరువదియాఱు వీరగాథలగును. ఇంకను ఆరు కథలు తగ్గుచున్నవి. ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాటలోని ఏడు కాండలను ఏడు ప్రత్యేక వీరగాథలుగా భావించినచో నీ చిక్కు తొలగిపోవును. (ఈ కాండలేడును ప్రత్యేక వీరగాథలవలెనే పాడబడుచుండును.) అప్పుడు కాటమరాజు కథాచక్రములోని మొత్తము వీరగాథలు ముప్పదిరెండగును. లేదా అగుమంచి వలపోత మొదలగు నాలుగు కథలును ఈ కథాచక్రమున లేవనియు కంసుదుకథ దీనికి చేర్చరాదనియు భావించినచో, ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాటను ఏడు ప్రత్యేక గాథలుగా నిర్ణయించుటతో పాటు పోలురాజుకథను కూడ ఆరు ప్రత్యేకగాథలుగా తలంపవలెను. (కాని పోలురాజు కథలోని చాటువలు ప్రత్యేక కథలనదగినంత పెద్దవికావు.) అప్పుడు కథాచక్రమున ముప్పదిరెండు కథల సంఖ్య సరిపోవును. బొంగరాలకథలోను, భక్తిరన్నకథలోను వచ్చిన ప్రసక్తిని బట్టి "భైరవకురువ యుద్ధము" అను వీరగాథ కలదను అనుమానము వచ్చుచున్నది. ఇది చిట్టినూక భర్తయగు 'కల్లందుల పోల్నీడు' చేసిన యుద్ధపరాక్రమమును తెలుపు కథయై యుండును. (–తెలుగు వీరగాథా కవిత్వము, పుటలు 287–289)

పై చర్చను బట్టి భవిష్యత్ పరిశోధకులకు ఈ క్రింది సూచనలు చేస్తున్నాను:–

(1) కాటమరాజుకథలలో మొత్తం ఉండవలసిన 32 కథలలో నేను 19 కథలు సేకరించాను. ప్రొ॥ ఎం. జయదేవ్‌గారు ఒక కథ (పాపనూక వలపోత) సేకరించారు. నా దృష్టిలో ఇంకా సేకరించవలసిన కథలు ఆరు ఉన్నాయి. అవి:– సింహాద్రిరాజుకథ, నలనూకరాజుకథ, భైరవకురువ యుద్ధం, గంగపుట్టుక, పల్లికొండపుట్టుక, అగుమంచి వలపోత. వీటిని మీరు సేకరించాలి.

(2) ఇంకా మిగిలిపోయిన (32–20=12–6=6) ఆరుకథల పేర్లు ఏమిటో తెలిసికొని, వాటిని సేకరించడానికి నడుము కట్టాలి.

నేను సేకరించిన 19 ప్రధాన కథలను 6 అనుబంధ కథలను కలిపి మొత్తం 25 కథలను, అప్పటి సంయుక్త ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు "కాటమరాజుకథలు" అనే పేరుతో రెండు సంపుటాలుగా (ఒక్కొక్కటి సుమారు 1000

పుటలు) ప్రచురించారు. మొదటి సంపుటం 1976లోను, రెండవ సంపుటం 1978లోను అందంగా బౌండు పుస్తకాలుగా వెలువడ్డాయి. 20 ఏళ్ళు గడిచాక 1998లో వీటిని పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు రెండవ ముద్రణగా తీసికొని వచ్చారు. ఇవి Paper Back సంపుటాలు. ఇవి కూడా ఇప్పుడు లభించడం లేదు. మరో 22 ఏళ్ళు గడిచిపోయాయి కదా! ఎలా లభిస్తాయి? పునర్ముద్రణ చేయాలి. కాని ఇప్పుడు నా "కాటమరాజుకథలు" రెండు సంపుటాలూ Internet లో లభిస్తున్నాయి. కావలసిన వారు చూడవచ్చును. Google search లో internet archives లేదా archives.org కొట్టాలి. అందులో "Dr. Tangirala" అని కాని "Katamaraju Kathalu" అని కాని కొడితే రెండు సంపుటాలూ వస్తాయి.

కాటమరాజులకథలలోని వీరుల కాలము (సుమారుగా):-

ఆవుల వలురాజు (క్రీ.శ.1170-1195); పెద్దిరాజు (క్రీ.శ.1195-1223); పోలురాజు (క్రీ.శ.1212-1223); అయితమరాజు (క్రీ.శ.1222-1283); కాటమరాజు (క్రీ.శ.1217-1283); ఎఱగడ్డపాటి పోట్లాట (క్రీ.శ.1283); చోడతిక్క లేక మొదటి తిక్క (క్రీ.శ.1209-1248) (ఇతడే "ముక్కంటి"); మనుమసిద్ధి (క్రీ.శ.1248-1267); నల్లసిద్ధి (క్రీ.శ.1270-1283)

**2. కాటమరాజు వంశవృక్షం - బంధువుల పరస్పర సంబంధాలు:-**

**2.1** ఈ క్రింది ప్రాథమిక విషయాలు తెలిస్తేకాని కాటమరాజుకథలు అర్థంకావు:- కాటమరాజు పితామహుడైన ఆవుల వలురాజు క్రీ.శ.12వ శతాబ్ది చివరిభాగంలో (క్రీ.శ. 1170-95లో) ఎలమంచిని పరిపాలించాడు. అతడు కరణాలకు అభయమిచ్చి ఖండెమొండెముల కోటనేలే కలభూత గంగురాజుతో యుద్ధంచేసి వీరస్వర్గమలంకరిస్తాడు. వలురాజుభార్య వల్లమ్మ. ఈ దంపతులకు ఐదుగురు కొడుకులు, ఒక కూతురు. కొడుకులు: "సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు." కూతురు "కొమరక్క". వలురాజు తరువాత జ్యోతిష్కుల సూచన మేరకు, పెద్దకొడుకు సింహాద్రిరాజు కాకుండా, రెండవ కొడుకు పెద్దిరాజు (క్రీ.శ. 1195-1223) సింహాసనమెక్కుతాడు. అతడు ఎలమంచిని పదేళ్ళు పాలిస్తాడు. తరువాత అన్నదమ్ములతో కలిసి పంపాద్రికి వచ్చి, అక్కడ పంపానదీతీరంలో నగరం నిర్మించుకొని ఏడేళ్ళు ఏలుతాడు. పంపాద్రి బసవన్నను కొలవడంవల్ల ఒక్క పెద్దిరాజుకు తప్ప తక్కిన అన్నదమ్ములందరికీ సంతానం

కలుగుతుంది. అందువల్ల అతడు అన్నదమ్ములతో ఆలమందలను పంచుకొని, పోలురాజును మొత్తం ఆలమందలకు అధిపతిగా పట్టాభిషిక్తుని చేసి, సంతానం కొరకు సోమేశ్వరుని పూజించటానికి కర్ణాటకలోని కల్యాణనగరానకి వెళ్ళిపోతాడు. అక్కడ సోమేశ్వరుని కృపవల్ల పెద్దిరాజుకు "కాటమరాజు" అనే కొడుకు, "పాపనూక" అనే కూతురు కలుగుతారు.

అందరూ పంపాద్రిలో ఉండగా పెద్దిరాజు అన్నదమ్ములకు కలిగిన సంతానం వివరాలు: అన్న సింహాద్రిరాజుకు "కఠియావులరాజు" అనే కొడుకు, "చిట్టినూక" అనే కూతురు పుడతారు. తమ్ములైన ఎఱనూకరాజుకు – "బట్టావులరాజు" లేక "బట్టావుల వల్లభన్న" (కొడుకు), "బాలనాగమ్మ" (కూతురు); నలనూకరాజుకు – "పెయ్యల ఎఱ్ఱయ్య" లేక "పయ్యావుల ఎఱ్ఱయ్య" (కొడుకు), "పొట్టినూక" (కూతురు); పోలురాజుకు "సిరిదేవి" అనే భార్యయందు – "భక్తిరన్న", "అయితమరాజు", "ముమ్మయ్య" (ముగ్గురు కొడుకులు), "అగుమంచి" (కూతురు) కలుగుతారు. (ఆనాటి "పంపాద్రి"యే ఈనాటి తూర్పుగోదావరిజిల్లాలోని 'అన్నవరం' కొండ.)

**2.2** సింహాద్రిరాజాదుల చెల్లెలు "కొమరక్క" ఈమె భర్త "పందుముల పాపినాయుడు". ఈ దంపతులకు "పల్లికొండ" దత్తపుత్రుడు. (ఇతడు దైవాంశ సంభూతుడు. ఆవుల వలురాజు వేటకు వెళ్ళినప్పుడు ఒక సరస్సులో వికసించిన పద్మంలో పసిబాలుడుగా కనిపించినాడట. ఆ బాలుని తెచ్చి కూతురు కొమరక్క కిచ్చెనట. ఆమె పెంచి పెద్దచేసినది. ఈ విషయం "పల్లికొండపుట్టుక" అనే కథలో వస్తుంది. ఆ కథనాకు లభించలేదు.) "పుత్తమరాజు"– "చట్టువారి ఎఱ్ఱయ్య" – "నాచకూళ్ళ నాయుడు" – "పుల్లావుల కేశవయ్య" – ఈ నలుగురు నిజపుత్రులు. "పల్లికొండ" మూడు తరాలకు చెందిన అయిదుగురు యాదవరాజులకు (ఆవుల వలురాజు, పెద్దిరాజు, పోలురాజు, అయితమరాజు, కాటమరాజులకు) మంత్రిగా ఉన్నాడు. కాటమరాజుకథలలో ఇతడు ప్రధానపాత్ర. ("పల్లికొండ" అంటే తమిళభాషలో "పండుకొన్న దేవుడు" అని అర్థం. నెల్లూరులో ఉన్న రంగనాథ స్వామివారిని లేక రంగనాయకులవారిని, "పల్లికొండ" అని పిలుస్తారు. ఆ పేరే యితని పేరు.) రెండవ కొడుకు "పుత్తమరాజు" పోలురాజు కూతురు అగుమంచిని పెండ్లి చేసుకొన్నాడు. వీరి పెంపుడు కొడుకు "పోచయ్య". మూడవవాడు "చట్టువారి ఎఱ్ఱయ్య", కాటమరాజుతో కలిసి విస్తారమైన ఆలమందలను మేపుతూ ఉంటాడు.

నాల్గవవాడు ''నాచకూళ్ళ నాయుడు'', కాటమరాజు చెల్లెలు ''పాపనూక''ను వివాహమాడవలసినవాడు. కాని ఆమె దుష్టనక్షత్రంలో పుట్టడంవల్ల, కొమరక్క ఇతనిని ఇల్లరికం పంపడానికి ఇష్టపడక పోవడంవల్ల, ఆ వివాహం జరగలేదు. దుష్టనక్షత్రంలో పుట్టిన "పాపనూక"ను సిరిదేవి (పోలురాజు భార్య) ధనముకొండలో ఊరిబయట ఒంటిస్తంభం మేడలో ఉంచుతుంది. పెండ్లికాకపోవడం, ఏకాంతవాసం ఆమె జీవితాన్ని దుర్భరం చేశాయి. ఈ విషాద గాథ "పాపనూక కథ"లోను, "పాపనూక వలపోత"లోను మనకు స్పష్టమవుతుంది. ఐదవ కొడుకైన "పల్లావుల కేశవయ్య" కఠియావులరాజుకు మంత్రిగా ఉంటాడు.

**2.3** సంతానంకోసం కల్యాణనగరానికి వెళ్ళిన పెద్దిరాజు, తనకూతురు పాపనూక దుష్టనక్షత్రంలో పుట్టడంవల్ల ఆమె పుట్టిన ఏడవనాడే, మారాసపువారి పగ తీర్చటంకోసం, వాలికేతువరాజుపై దండెత్తిపోయి, ఆర్లపెంట రణరంగంలో మరణిస్తాడు. అప్పటికి ఏడేండ్ల బాలుడైన కాటమరాజు వాలికేతువరాజుపై దండెత్తిపోయి, అతనిని చంపి, తండ్రి పగ తీర్చుకుంటాడు. పెద్దిరాజుభార్య పెద్దమ్మ సాగుమానం చేస్తుంది. కాటమరాజు, అతని చెల్లెలు పాపనూక, పెందోట ముద్దమ్మ అనే మారాచపురాణి దగ్గర పెరుగుతూ ఉంటారు.

సరిగ్గా పెద్దిరాజు మరణించే సమయానికే వివిధ ప్రదేశాలలో అతని అన్నదమ్ములు శరణాగత రక్షణకోసం యుద్ధాలుచేసి ప్రాణత్యాగాలు సలుపుతారు. సింహాద్రిరాజు శ్రీకూర్మంలో శ్రీవైష్ణవులను రక్షించడంకోసం సింధుభళ్ళానిరాజుతో పోరాడుతాడు. ఎఱనూకరాజు ఏనుగనాథుని కొండమీద తన్ను శరణుజొచ్చిన ఎఱుకలను, గాయపడ్డవారి పెద్దపులిని రక్షించడంకోసం ఎఱ్ఱభూపతితో యుద్ధంచేస్తాడు. నలనూకరాజు, నున్న బెజవాడను పాలించే నున్న భూపతియైన నందికేశవరాజు అధికంగా పన్నులు వసూలుచేసి ప్రజలను బాధిస్తుంటే, "దిగ్విదేవుని పెంట" దగ్గర అతనితో తలపడతాడు. ఆ పోరులో నలనూకరాజు మరణించగా, అతని కొడుకు పెయ్యల ఎఱ్ఱయ్య, నున్నభూపతిని చంపి "బెజవాడ బెబ్బులి''గా పేరు గడిస్తాడు.

పోలురాజు తన అపారమైన ఆలమందలతో అర్థవీడుకు వెళ్ళి, అక్కడ కొంతకాలం పాలించి, తరువాత దక్షిణదిక్కుగా శ్రీరంగంవెళ్ళి, శ్రీరంగనాథుని సేవిస్తాడు. పిమ్మట తన ఆలమందలతో చెరుకూరు సమీపంలో ఉన్న "చిలకలమఱ్ఱి"

దగ్గర విడిది చేస్తాడు. శ్రీరంగం పాలించే చోడాని కావేరి వెట్టిపనికై చెరుకూరులో ఉన్న జంగాలను బలవంతం చేస్తాడు. వారు చిలకలమఱ్ఱిదగ్గర ఉన్న పోలురాజును శరణువేడుతారు. పోలురాజు వారికి అభయమిచ్చి, కొంత సేనను, కొందరు వీరులను వారికి సహాయంగా ఇచ్చి, శ్రీశైలం పంపివేస్తాడు. దీనితో చోడాని కోపించి, తన సామంతుడైన ముక్కంటిని పోలురాజు మీదికి పంపుతాడు. అతనితో జరిగిన ద్వంద్వయుద్ధంలో పోలురాజు వీరమరణం పొందుతాడు. ఆతని ఆలమందలను, పిల్లలను, అంతఃపురకాంతలను పల్లికొండ ఎలమంచికి తీసికొనివస్తాడు.

నెల్లూరును పాలించిన చోడతిక్క లేక మొదటి తిక్క (క్రీ.శ. 1209–1248) కే "ముక్కంటి" అనే బిరుదు ఉంది. అతని కొడుకు మనుమసిద్ధి (క్రీ.శ. 1248–1267); మనుమసిద్ధి కొడుకు నల్లసిద్ధి (క్రీ.శ. 1270–1283).

ఈ విధంగా ఆవుల వలురాజు ఐదుగురు కొడుకులు తమ తండ్రివలెనే శరణన్నవారిని రక్షించడం కోసం తమ ప్రాణాలను తృణప్రాయంగా బలియిచ్చారు. అందువల్లనే "పరకార్యం మీద పాడైపోయింది యాదవకులం" అనే సామెత జానపదగాయకులు (గొల్లసుద్దులవారు) చెపుతూ ఉంటారు.

**2.4** సింహాద్రిరాజు కొడుకు కఠియావులరాజు. ఇతడు మహావీరుడు. (ఇతనిని గురించిన వీరగాథ ఈ పుస్తకంలో ఉంది.) ఇతని చెల్లెలు చిటినూక.. ఈమె భర్త కల్లందుల పోలినేడు. వీరిపుత్రుడు "పోచయ్య". కల్లందుల పోలినేడు భైరవకురువ యుద్ధంలో చనిపోయాడు. పసిబిడ్డ అయిన పోచయ్యను అగుమంచికి అప్పగించి, చిటినూక మగనితో సాగుమానం చేస్తుంది. సిరిదేవి పోలురాజుల పెద్దకొడుకు భక్తిరన్న లేక బత్తినన్న. ఇతడు గొప్ప శివభక్తుడు. యాదవులకు "శివగురువు". రెండవ కొడుకు అయితమరాజు (క్రీ.శ. 1222–1283) మొదట ఎలమంచిని, తరువాత దొనకొండ (ధనముకొండ)ను పాలించాడు. ఇతని కొడుకు "అల్లుదాదెన్న", కూతురు "సిరిగిరమ్మ". ఈమెను పోచయ్యకిచ్చి పెండ్లి చేశారు. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట (క్రీ.శ. 1283)కు ముందు తమ వంశాంకురమైన అల్లుదాదెన్నకు కొంత సైన్యమును, ఆలమందలను ఇచ్చి కటకమునకు పంపివేస్తారు యాదవులు. కురుక్షేత్ర మహాసంగ్రమం తరువాత పాండవులకు "పరీక్షిత్తు" మిగిలినట్లు, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట తరువాత యాదవులకు ఈ "అల్లుదాదెన్న" మిగిలాడు. అయితే కురుక్షేత్ర సంగ్రామానంతరం పాండవులు బ్రతికి ఉన్నారు. కాని ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో కాటమరాజాదులందరూ చనిపోయారు. భక్తిరన్న వారికి పాలేటితీరంలో పిండప్రదానం చేశాడు.

**2.5** "బల్లికురవ పోట్లాట", "కాటమరాజుకు పట్నం కట్టిన కథ" (కాటమరాజు పట్టాభిషేకం) – అనే వీరగాథలను బట్టి రెండు కొత్త విషయాలు తెలుస్తున్నాయి. దక్షిణాదిని చిలకలమట్టి ఠాణాలో పోలురాజు నెల్లూరురాజైన "ముక్కంటి" (చోడతిక్క)తో ద్వంద్వయుద్ధంచేసి వీరస్వర్గమలంకరిస్తాడు. మంత్రి పల్లికొండ బాలరాజులను (భక్తిరన్న, ఐతమరాజు, ముమ్మయ్యలను), ఆలమందలను, అంతఃపురకాంతలను తీసికొని యలమంచికి ప్రయాణమవుతాడు. దారిలో బల్లికురువ దగ్గర శ్రీరంగమేలుతున్న చోళరాజుకొడుకు "ఇమ్మధక్కమరాజు" (ఈపేరు "ఇమ్మడి అక్కమరాజు" కావచ్చును.) తన సేనలతో వారిని ఎదిరిస్తాడు. పల్లికొండ ప్రార్థించగా విష్ణుస్వరూపమైన బొల్లావు వచ్చి శత్రువులను చంపివేస్తుంది. తరువాత పల్లికొండ యమలంచి చేరుతాడు. అప్పుడు దానిని కాటమరాజు పినతల్లికుమారుడైన చల్ల పిన్నమనీడు పాలిస్తున్నాడు. అతడు సంతోషంతో సింహాసనం దిగివచ్చి బాలరాజులను ఆహ్వానిస్తాడు. పల్లికొండ అయితమరాజుకు కన్నుగీటుతాడు. అతడు తిన్నగా వెళ్ళి చల్లపిన్నమనీడి సింహాసనంపై కూర్చుంటాడు. పల్లికొండ అతనికి నమస్కరిస్తాడు. తక్కిన యాదవులూ నమస్కరిస్తారు. విధిలేక చల్ల పిన్నమనీడుకూడా అయితమరాజుకు నమస్కరిస్తాడు. ఈ విధంగా కపటోపాయంతో పల్లికొండ యలమంచి సింహాసనాన్ని చల్లవారినుండి గ్రహించి అయితమరాజుకు ఇస్తాడు. ఇది "బల్లికురవ పోట్లాట"లోని కథ.

**2.6** "కాటమరాజుకు పట్నం కట్టిన కథ"లో కూడా పల్లికొండ, చల్ల పిన్నమనీడును మోసగించి యలమంచి రాజ్యాన్ని అయితమరాజుకు ఇవ్వడం యథాతథంగా ఉంది. తరువాత పల్లికొండ కల్యాణనగరంలో ఉన్న కాటమరాజును, పాపనూకను తీసికొని రావడానికి భక్తిరన్నను పంపుతాడు. అతడు జంగంవేషంలో వెళ్ళి వారిని తీసికొనివస్తాడు. కాటమరాజుకు "మర్లవారి గంగ"నిచ్చి వివాహం చేస్తారు. ఆలమందలన్నింటికి అధినాథునిగా అతనికి పట్టాభిషేకం చేస్తారు. భక్తిరన్న కల్యాణనగరానికి వెళ్ళేముందు యాదవులు యలమంచిని సింహాద్రిరాజు కొడుకులకు ఇచ్చివేసి, అందరూ బయలుదేరి ఓరుగల్లుకు సమీపంలో ఉర్లుకొండ దగ్గర వేరొక పట్టణాన్ని కట్టుకొని, దానికి కూడా "యలమంచి" అని పేరుపెట్టుకున్నట్లుగా ఈ "కాటమరాజు పట్టాభిషేకం" కథలో ఉంది. కటియావులరాజుకథలో అయితమ రాజాదులు ఓరుగంటి శంభుని సేవించడానికి ఈ కొత్త యలమంచినుండే బయలురేరి

వెళ్ళారు. దీనిని "ఉర్లుకొండ యలమంచి" అనవచ్చును. (ఆవుల వలురాజు, పెద్దిరాజు, చల్లపిన్నమనీడు పాలించిన విశాఖజిల్లాలోని యలమంచిని "విశాఖ యలమంచి" అని అంటే స్పష్టత వస్తుంది.)

**2.7** ఈ కథాచక్రంలోని ప్రధానవీరుడు, అవతారపురుషుడు అయిన కాటమరాజు (క్రీ.శ.1217-1283), ఎఱ్ఱగడ్డపాడులో, నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధిరాజు (క్రీ.శ.1270-1283)తో చిత్రభాను సంవత్సరం ఫాల్గున బహుళ అమావాస్యనాడు (అంటే నా లెక్క ప్రకారం 07-03-1283 మంగళవారంనాడు) ఘోరయుద్ధం చేసి వీరస్వర్గమలంకరించాడు. అందువల్లనే ప్రతిసంవత్సరం ఫాల్గున బహుళ అమావాస్యనాడు (అంటే సరిగ్గా ఉగాది పండుగకు ఒకరోజు ముందు) తెలుగు రాష్ట్రాలలోని యాదవులందరూ నల్లమలలోని రాజమలారణ్యంలో ఉన్న వేనూతల కాటమరాజుకి, వేనూతల గంగాభవానికి భక్తిప్రపత్తులతో పూజలు చేసి, అక్కడ పెద్ద జాతర జరుపుతారు. (కాటమరాజు వంశవృక్షాన్ని, ఆయావీరుల పరస్పర సంబంధాలను సంపూర్ణంగా తెలిసికొనగోరేవారు నా సిద్ధాంతగ్రంథం "తెలుగు వీరగాథా కవిత్వము"లో 320వ పుటను చూడగలరు.)

**3. మరికొన్ని విషయాలు**

**3.1 కాటమరాజు జననం:-** ధాతనామ సంవత్సరం ఫాల్గున శుద్ధపంచమి గురువారంనాడు కల్యాణనగరంలో సోమేశ్వరుని వరంచేత పెద్దిరాజు-పెద్దమ్మ దంపతులకు కాటమరాజు జన్మించాడు. ఈ విషయం పెద్దిరాజుకథలోను, పాపనూకకథలోను గాథాకారులు పాడుతున్నారు. ఫాల్గున శుద్ధపంచమిని యాదవులు ఈ నాటికిని పర్వదినంగా పాటిస్తున్నారు. కాటమరాజు జననం ఆంగ్ల కాలమానం ప్రకారం క్రీ.శ. 1217 ఫిబ్రవరి 19వ తేది గురువారం అవుతుంది. (కాని ఈ గ్రంథంలోని 'జన్నివాడ కథ"లో కాటమరాజు జననం "ధాతనామ సంవత్సరం ఫాల్గున బహుళ పంచమి" అని ఉంది. అది 26.02.2017 ఆదివారం అవుతుంది. కాని యిది సరికాదు. దీనిని యాదవులు పర్వదినంగా పాటించడంలేదు.)

**3.2 కాటమరాజు కులగోత్రాలు:-** కాటమరాజు యదుకులానికి చెందిన చంద్రవంశ క్షత్రియుడు. ఆత్రేయ గోత్రజుడు. దర్శనములు ఆరు: "అమ్మగారివారు - అయ్యగారివారు - దేవాదులవారు - మారాచపువారు - బదుగులవారు -

శివగణము: దేవగణము". ఈ షడ్దర్శనాలో కాటమరాజు బదుగులదర్శనానికి చెందినవాడు. అందువల్లనే వీరగాథలలో పలుతావులందు కాటమరాజు "బదుగులరాజు"గా స్తుతింపబడినాడు. ఈతని కులదైవము ఆదిశక్తి అవతారమైన గంగ. "వల్లవులు-స్తిరమందులు (తిరమందులు)" అను యాదవ ప్రధానశాఖలలో కాటమరాజు వల్లవులశాఖకు చెందినవాడు. ఈ వల్లవులు రాజ్యమును పాలించువారు; స్తిరమందులు (తిరమందులు) వీరి దగ్గర మంత్రిత్వమును నెరపుచుందురు.

**3.3 కాటమరాజు ఇంటిపేరు:-** కాటమరాజు ముత్తాతపేరు 'కవులావుల గంగురాజు"; తాత పేరు: "ఆవుల వలురాజు". కాబట్టి కాటమరాజు యింటిపేరు మొదట "కవులావులవారు"గా ఉండి, తరువాత "ఆవులవారు"గా మారియుండును. "కవులావులవారు" అంటే "కపిలగోవులు కలవారు" అని అర్థం. గుజ్జంకొండ భక్తవత్సలకవి తన పద్యకావ్యంలో కాటమరాజు యింటిపేరు "కఱియావులవారు" అని వ్రాశాడు. ఇతడు "కవులావుల"నే "కఱియావుల"గా మార్చియుండును. ("కఱియావులవారు" = "నల్లని ఆవులు కలవారు")

**3.4 కాటమరాజు పేర్లు:-** కాటమరాజుకు మొత్తం ఆరుపేర్లు ఉన్నట్టుగా వీరగాథలనుబట్టి తెలుస్తోంది. అవి: "నలనన్న - ఆవులన్న - పశువులన్న - కాటకోటేశ్వరుడు - కాటమరాజు - కత్రేయుడు". నరజన్మ ఎత్తడంచేత "నలనన్న" అనీ; ఆవులను కాయడంచేత "ఆవులన్న" అనీ; పసువులకు రాజుగా పట్టం కట్టబడటంచేత "పశువులన్న" అనీ పేర్లు కలిగాయి. కాటకోటేశ్వరుని వరంచేత పుట్టడంచేత "కాటకోటేశ్వరుడు - కాటమరాజు - కత్రేయుడు" అనే పేర్లు వచ్చి ఉంటాయి.

**3.5 కాటమరాజు బిరుదులు:-** కాటమరాజునకు 77 బిరుదులున్నాయని తెలుస్తోంది. "ఆంభోజబిరుదు - ప్రళయకాల బిరుదు - సింగిణీ తోరణాలు - కనకసింగిణీలు - విష్ణుబిరుదు - చంద్రబిరుదు - గరుడశార్దూల-కనక పడగలు - పిగిలి తలాటము - పిగిలి కుచ్చులు - పంచలోహ తలాట - భస్మశంకర" ఇత్యాదిగా డెబ్బదియేడు బిరుదులున్నవట.

**3.6 "కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు" లేక "ఆవులమేపులు-ఉత్తరకాండము" :-** కాటమరాజు తన అసంఖ్యాకమైన గోగణాన్ని మొదట శ్రీశైలం అడవులలో మేపాడు. అవి నల్లమల అడవులు. ఆ అడవులలో "వేసూతల" అనే ప్రదేశం ఉంది. దానిని

"రాజమలారణ్యం" అంటారు. అక్కడ కాటమరాజు "గజాశూలం" వల్ల పుట్టిన "గూబగుండంబావి", కాటమరాజు గుఱ్ఱంమీద స్వారీచేస్తున్న శిలావిగ్రహం, గంగాభవాని శిలావిగ్రహం ఉన్నాయి. వీటిని "వేనూతల కాటమరాజు" అని, "వేనూతల గంగాభవాని" అని పిలుస్తారు. ఈ ప్రదేశం మొదట కర్నూలు జిల్లాలో ఉండేది. ఇప్పుడు ప్రకాశం జిల్లాలోకి మారింది. ఇది "పెద్ద ఆరవీడు" మండలంలో, "గుండంచర్ల" – "కలనూతల" అనే గ్రామాలకు సుమారు 4 కి.మీ. దూరంలో నల్లమల అడవులలో, మావుటూరు–గొట్టిపడియ గ్రామాల పొలిమేరలో ఉంది. ఇక్కడ ప్రతి సంవత్సరం ఫాల్గున బహుళ అమావాస్యనాడు – అంటే కాటమరాజు నల్లసిద్ధిరాజుతో యుద్ధంచేసి వీరస్వర్గం చూరగొన్న రోజు (ఉగాదికి ఒక్కరోజు ముందు) – ఆంధ్రప్రదేశంలోని వివిధ ప్రాంతాలనుండి యాదవులు తండోప తండాలుగా ఈ రాజమలారణ్యంలోని "వేనూతల"కు వచ్చి పెద్ద జాతర జరుపుకుంటారు. కాటమరాజును, గంగాభవానిని మిక్కిలి భక్తితో పూజిస్తారు.

**4. యాదవుల రాజధానులు – కోటలు:–** "కాటమరాజు వంశీయులు మధ్యయుగంలో ఆంధ్రదేశమందు చిన్నచిన్న ప్రాంతాలను పాలించారు: యలమంచి – పంపాద్రి – అర్థవీడు – ఉర్లుకొండ యలమంచి – దొనకొండ – యరగడ్డపాడు. ప్రస్తుతం యలమంచి విశాఖజిల్లాలోను, పంపాద్రి తూర్పుగోదావరి జిల్లాలోను, అర్థవీడు–దొనకొండ–యరగడ్డపాడు ప్రకాశంజిల్లాలోను, ఉర్లుకొండ యలమంచి నల్లగొండజిల్లాలోను ఉన్నాయి. కాటమరాజు తాత ఆవులవలురాజు, తండ్రిపెద్దిరాజు యలమంచిని 12వ శతాబ్దం చివర్లో పరిపాలించారు. యలమంచి కోటకు బురుజులు, దాని చుట్టూ కందకం ఉన్నాయి. కోటపై కొమ్ములు, కొత్తళంబులు ఉన్నాయి.

"ఆవుల వలురాజు చనిపోయిన తర్వాత పెద్దిరాజు యలమంచిని పదేండ్లు పాలించాడు. పిమ్మట పెద్దిరాజు అతని సోదరులు రాజధానిని యలమంచినుండి పంపాద్రికి మార్చారు. ఇది పంపానది ఒడ్డున ఉన్నది. ప్రస్తుతం దీనిని "అన్నవరం" అని పిలుస్తున్నారు. పంపాద్రిలో పెద్దిరాజు (ఏడేండ్లు పాలించిన తరువాత) అన్నదమ్ములు భాగాలు పంచుకొని విడిపోయినారు. (పెద్దిరాజు సంతానం కోసం కల్యాణనగరానికి వెళ్ళిపోయాడు.) కాటమరాజు పినతండ్రి పోలురాజు అర్థవీడును రాజధానిగా చేసికొని పరిపాలన చేశాడు. (తరువాత అతని కుమారుడు) అయితమరాజు (యలమంచిని, ఉర్లుకొండ యలమంచిని), దొనకొండను కేంద్రంగా చేసికొని అధికారం నడిపించాడు. ఇప్పుడు దీనిని "గంగదొనకొండ" అని

పిలుస్తున్నారు. ఈ దొనకొండకు ఒక కిలోమీటరు దూరంలో అయితమరాజు కోట శిథిలాలు ఒక కొండపై కనిపిస్తున్నాయి. కనిగిరికోటను కాటమరాజు కట్టించాడని ఆప్రాంతం ప్రజలు నమ్ముతున్నారు. తర్వాత గజపతులు దీనిని అభివృద్ధిచేశారు. యరగడ్డపాడు కోట శిథిలాలు పంచలింగాలకొండ సమీపంలో ఉన్నాయి. యరగడ్డపాడు యుద్ధం జరిగింది ఇక్కడే. ఇది ప్రకాశం జిల్లాలో ఉన్నది." (–డా॥ కనకబండి మోహనరావు, కాటమరాజు చరిత్ర, పుట 95)

**5. వల్లవులు – తిరుమందులు:–**

ఈ కాటమరాజుకథలలో మాటిమాటికి "వల్లవులు–తిరుమందులు" అనే పదాలు వస్తూ ఉంటాయి. వీరినే "వల్లవులవారు" – "తిరుమందులవారు" అని కూడా అంటారు. వీరు యాదవవీరులలో రెండు రకాలవారు. యయాతికి క్షత్రియ కన్యయైన శర్మిష్ఠయందు పుట్టినవారు వల్లవులవారట; బ్రాహ్మణకన్యయైన దేవయానియందు పుట్టినవారు తిరుమందులవారట. ఆవుల వలురాజు; అతని ఐదుగురు పుత్రులు: సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, మరల ఈ ఐదుగురి పుత్రసంతానము "వల్లవులు" అవుతారు. వల్లురాజుకూతురు కొమరక్క పుత్రసంతానం, సింహాద్రిరాజాదుల పుత్రికల పుత్రసంతానం "తిరుమందులు" అవుతారు. వల్లవులవారు సింహాసనమెక్కి రాజ్యాన్ని పాలిస్తారు; తిరుమందులవారు వల్లవులవారికి మంత్రులుగా ఉండి సలహాలు ఇస్తూ ఉంటారు. అందువల్ల వల్లవులవారిని "రాజులవారు" అనీ, తిరుమందుల వారిని "ప్రధానులవారు" అనీ పిలుస్తూ ఉంటారు. ఈ రెండు రకాలవారూ వియ్యమందుతూ ఉంటారు. వల్లవులు ఆరువేలమందీ, తిరుమందులు ఏడువేలమందీ ఉన్నారట. వీరు పరస్పరం వియ్యమందే విషయంలో పల్లికొండ ఒక నియమం చేశాడు. ఆరువేలమంది వల్లవులతో, తిరుమందులలోని ఆరువేలమంది వియ్యమందాలి. తిరుమందులలో అధికంగా ఉన్న వేయిమందిలో 500 మంది ఒకవైపున, మిగిలిన 500 మంది మరొకవైపున వియ్యమందాలి. వల్లవులు – తిరుమందులు పరస్పరం వియ్యమందటం కాటమరాజు కథలన్నింటిలోనూ కనబడుతుంది.

**6. హరిగురువు – శివగురువు:–**

"హరిగురువు" అంటే హరిభక్తుడైన గురువు (వైష్ణవుడు). "శివగురువు" అంటే శివభక్తుడైన గురువు (శైవుడు). కొమరక్క పెంపుడు కొడుకైన పల్లికొండ యాదవులకు హరిగురువు. అతని పేరులోనే వైష్ణవత్వం ఉంది. "పల్లికొండ" అంటే "పండుకొనిన

దేవుడు". తమిళ ఆళ్వారుల రచనల్లో "పళ్ళికొండాన్" (పండుకొనినవాడు) – "పళ్ళికొండ పెరుమాళ్" (పండుకొనిన దేవుడు) అనే రెండు పేర్లు కనిపిస్తాయి. (cf. ప్రొ॥ జె.వి.సత్యవాణి). తమిళంలోని ఈ "పళ్ళికొండాన్" శబ్దమే తెలుగులో "పల్లికొండ" అయింది. ఈ దైవం దక్షిణాదిని (తమిళదేశంలో) శ్రీరంగంలోను ఆంధ్రదేశంలో నెల్లూరులోను ఉన్నాడు. ఆయన పేరు "శ్రీరంగనాథస్వామి" లేక "శ్రీరంగనాయకులు". (తిరుపతిలోని గోవిందరాజస్వామికూడా పండుకొనిన దేవుడే!) పోలురాజు పెద్దకుమారుడైన "భక్తిరన్న" లేక "బత్తినన్న" యాదవుల శివగురువు. ఈ విధంగా ఆనాటి యాదవులలో శివకేశవుల సమన్వయం కనబడుతుంది. ఇది ఆ కాలంలో కవితిక్కన ప్రతిపాదించిన హరిహరాద్వైత ప్రభావం కావచ్చు.

### 7. "కవితిక్కన"–"ఖడ్గతిక్కన" లేక "రణతిక్కన":–

కవితిక్కన, ఖడ్గతిక్కనయొక్క పినతండ్రియైన కొమ్మనామాత్యుని పుత్రుడు. ఖడ్గతిక్కన తండ్రి సిద్ధనామాత్యుడు, ఈ కొమ్మనామాత్యుడు అన్నదమ్ములు. "కవిబ్రహ్మ" – "ఉభయకవిమిత్రుడు"–మహాకవి అయిన తిక్కన సోమయాజిగారు తన తమ్ముడైన మహావీరుడు ఖడ్గతిక్కన ప్రసక్తి ఎక్కడా తీసికొని రాకపోవడం మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. నా ఉద్దేశంలో కవితిక్కన వయస్సులో చాలా పెద్దవాడుగాను, ఖడ్గతిక్కన లేక రణతిక్కన వయస్సులో చాలా చిన్నవాడుగాను ఉండి ఉంటారు. అందువల్లనే కవితిక్కన మనుమసిద్ధి ఆస్థానంలోను, రణతిక్కన మనుమసిద్ధి కొడుకైన నల్లసిద్ధి ఆస్థానంలోను ఉన్నారు. ఇద్దరికీ ఒకతరం తేడా ఉంది. కవితిక్కన చనిపోయిన తరువాత ఖడ్గతిక్కనయుద్ధం జరిగిందనిపిస్తోంది. కవితిక్కన యజ్ఞంచేసిన ప్రదేశంలో ఒక గ్రామం ఏర్పడింది. దానిపేరు "జన్ననాడ". 'జన్నం' అంటే యజ్ఞం. కాటమరాజు ఈ గ్రామం దగ్గరే తన ఆలమందల్ని మేపాడు. అందువల్లనే "కాటమరాజు దక్షిణాది ఆవులమేపు" అనే కథకు 'జన్నివాడ కథ" అనే పేరువచ్చింది. కవి తిక్కన యజ్ఞంచేయడం, అక్కడ ఒక గ్రామం ఏర్పడటం – ఈ పరిణామానికి కొన్ని ఏండ్లు పట్టి ఉంటుంది.

### 8. ఆవుల రంగులనుబట్టి యాదవవీరుల పేర్లు:–

పూర్వకాలంలో ప్రధానంగా గోధనమే ధనంగా పరిగణించేవారు. ఎన్ని గోవులుంటే అంత ధనవంతుడు. వాల్మీకి రామాయణంలో రామలక్ష్మణులు అరణ్యవాసానికి వెళ్ళేముందు తమ గోవులన్నింటినీ పేదబ్రాహ్మణులకు దానం

చేసివేశారు. కాటమరాజు ఆలమంద చాలా విస్తారమైనది. ఆవులన్నీ ఒక చోట కుదిరితే ఆరు ఆమడల దూరం వ్యాపించి ఉండేవట. నలుదిక్కులా చెదిరి మేతమేస్తూంటే పన్నెండు ఆడమల దూరం వ్యాపించి ఉండేవట.

"కుదురు ఆరామడ, చెదురు పన్నెండామడ
కదలినవోయి ఆ కామధేనువులు" –అని గాథాకారులు పాడుతూ ఉంటారు.

గోధనమే ప్రధానధనం కాబట్టి కాటమరాజుకాలంలో యాదవవీరులు తమ ఆలమందల్ని పంచుకొనేవారు. ఒకేరంగులో ఉన్న ఆవుల్ని ఒక్కొక్కరు తీసికొనేవారు కాబోలు! ఆ ఆవుల రంగుల్నిబట్టి వాటికి అధిపతులైన ఆయా వీరులకు పేర్లు వచ్చినట్టుగా నేను ఊహిస్తున్నాను. ముందు ఆవురంగు, దాని అర్థమూ తెలిపి, తర్వాత తద్వారా వచ్చిన వీరుని పేరు చెపుతాను.

8.1 "కట్టి" శబ్ద రూపాంతరం – "కఠియ" = నలుపురంగు; కఠియ + ఆవు = కఠియావు = నల్లని ఆవు. నల్లని ఆవులకు అధిపతి కాబట్టి "కఠియావుల రాజు" (సింహాద్రిరాజు కొడుకు)

8.2 "బట్ట"–పసుల దేహము మీఁది తెలుపులోనగు వాని చాఱ (శబ్దరత్నాకరము); బట్ట+ఆవు=బట్టావు=తెల్లచారలు లేదా ఇతర చారలు గల ఆవు. బట్టావులకు అధిపతి కాబట్టి "బట్టావులరాజు" లేక "బట్టావుల వల్లభన్న" (ఎఱనూకరాజు కొడుకు) (నేను నా సిద్ధాంతగ్రంథంలో ఈ వీరుని పేరును మహాప్రాణంతో "భట్టావులరాజు" అని వ్రాశాను. అది తప్పు)

8.3 "పుల్ల" = పసుపు మించిన తెలుపు వన్నె; గోరోజనము వంటి రంగు. దీనినే సంస్కృతంలో "కపిల" అని తద్భవ రూపంలో "కవిల" అని అంటారు. పుల్ల + ఆవు = పుల్లావు; కపిల + గోవు = కపిలగోవు, కపిల; కవిల + ఆవు = కవిలావు > కవులావు. పుల్లావులకు అధిపతి కాబట్టి "పుల్లావుల కేశవయ్య" (కొమరక్క కొడుకు, కఠియావులరాజు మంత్రి). కపిలధేనువులకు లేక కవులావులకు అధిపతి కాబట్టి "కవులావుల గంగురాజు" – ఇతడు ఆవుల వలురాజు తండ్రి, కాటమరాజు ముత్తాత.

8.4 "పెయ్య" = పాలు విడిచిన దూడ, పెయ్య + ఆవు = పెయ్యావు = తొలిచూలు ఆవు. "పెయ్యావు" జానపదోచ్చారణలో "పయ్యావు" అయింది. "పెయ్యల ఎఱ్ఱయ్య" లేక "పయ్యావుల (పెయ్యావుల) ఎఱ్ఱయ్య" (నలనూకరాజు కొడుకు).

8.5 "బొల్లి" = తెల్లనిది, బొల్లి + ఆవు = బొల్లావు = తెల్లని ఆవు. కాటమరాజు కథలలో ఒక అద్భుత ప్రతిభకలిగిన తెల్లని ఆవు ఉంది. దానికి ఒక్కటే కొమ్ము ఉంటుంది. అందువల్ల దానిని "ఒంటికొమ్ము బొల్లావు" అని పిలుస్తారు. ఇది విష్ణుమూర్తి అవతారమని యాదవుల విశ్వాసం. ఇది "బల్లికురవ పోట్లాట"లో పాల్గొని శత్రువులను చంపింది. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో "బొల్లావు జగడము" ఒక ప్రత్యేక కాండగా ఉంది.

8.6 "నఱ్ఱ" = ప్రయాసముచేత పిదుకఁదగిన యావు (శబ్దార్థచంద్రిక). నఱ్ఱ+ఆవు = నఱ్ఱావు. కాటమరాజుదగ్గర నఱ్ఱావులు అసంఖ్యాకంగా ఉన్నట్లుగా వర్ణనలు ఉన్నాయి.

8.7 ప్రత్యేకమైన "బొల్లావు" లాగే, కాటమరాజుకు అత్యంత ప్రియమైన ఒక పెయ్య ఉంది. దానిపేరు "మట్టె పెయ్య" (దీనిని గంగ, గుంటికింద దాచివేసింది). "మట్టె" = బట్టచాఱలుగల ఆవు (శబ్దార్థచంద్రిక). ఆ మట్టె ఆవుదూడ "మట్టెపెయ్య". "మైలావులు" – పొగచాయగల ఆవులు (శ.ర.). "బోడావులు" అంటే కొమ్ములు లేని ఆవులు కాబోలు. ఇంకా "సలుగు టావులు" (?) "ముచ్చావులు (ముచ్చటావులు)" లేదా "మచ్చావులు" కావచ్చును. అంటే "మచ్చల మచ్చల ఆవులు" కాబోలు. "సలుగుటావులు" – "సలుగుటెద్దులు" అంటే ఏమిటో నాకు తెలియలేదు.

**9. కాటమరాజుకథలు వ్రాసిన జానపదకవులు:–**

పూర్వం రాజులు తాము చేసిన యుద్ధవిజయాలనుగురించి పాటలలో కీర్తించేటందుకు తమ ఆస్థానాలలో వంది–మాగధులను, భట్రాజులను, కవులను పోషించేవారు. వారు తమరాజులు చేసిన సంగ్రామాలను స్వయంగా చూసి, ఉద్రేకంతో యథాతథంగా వర్ణించి పాడేవారు. పృథ్వీరాజు వీరగాథను ఆయన ఆస్థానకవి 'చందు వరదాయి' "పృథ్వీరాజ్ రాసో"గా రచించాడు. దీనికి ఉత్తర హిందూస్థానంలో (ముఖ్యంగా రాజస్థాన్‌లో) ఎంతో పేరు ఉంది. మన 'పల్నాటి వీరచరిత్ర'లాగ, 'కాటమరాజుచరిత్ర'లాగ ప్రజలు తన్మయులై పాడుకుంటారు.

యలమంచి, పంపాద్రి, అర్థవీడు, ఉర్లుకొండ యలమంచి, ధనముకొండ (నేటి గంగ దొనకొండ) ఎఱ్ఱగడ్డపాడు పట్టణాలను ఏలిన ఆవుల వలురాజు, పెద్దిరాజు, చల్ల పిన్నమనీడు, పోలురాజు, అయితమరాజు, కాటమరాజు మొదలైన యాదవరాజులు; ఆలమందలకు రాజులైన పోలురాజు, కాటమరాజు మొదలైన

వారంతా తమ ఆస్థానాలలో ఎందరో భట్రాజులను, కవులను పోషించి ఉంటారు. వారు ఈ వీరుల సాహసగాథలను, కళ్ళారా చూచి, యథాతథంగా వర్ణించి కాటమరాజుకథలను వ్రాసి ఉంటారు. లేకపోతే ఈ కథలలో ఉండే అతిసూక్ష్మమైన వివరాలు, అత్యద్భుతమైన వర్ణనలు, వీర-రౌద్ర-కరుణ-అద్భుత రసాల పోషణ ఎక్కడినుండి వస్తాయి? ఆయా ఆస్థాన కవులు వ్రాసిన వీరగాథలనే ఆధారంగా చేసికొని, తరువాతి కాలంలోని జానపదకవులు రచనలు చేస్తూ, ఆనాటినుండి ఈనాటివరకూ వీరసంప్రదాయాన్ని కాపాడుతూ వచ్చారు. పల్నాటి వీరచరిత్రను ద్విపదగా వ్రాసిన శ్రీనాథుని రచనను ఆధారంగా చేసికొని తరువాతి కాలంలో మల్లయ్య, కొండయ్య అనే కవులు రచనలు చేశారు. పల్నాటి వీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుడే కాటమరాజు చరిత్రను కూడా వ్రాశాడని జనశ్రుతి. కాని శ్రీనాథుని రచనగా నేడు ఏకథా లభించటం లేదు. కాని ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట రచించిన గంగుల పినయల్లయ తాను "వల్లనొప్పు శ్రీనాథువచన పద్ధతిని, సలిపెను యదుశాస్త్ర చరితమంతయును" అని స్పష్టంగా వ్రాసుకున్నాడు. దీనినిబట్టి పూర్వం ఆస్థానకవులు వ్రాసిన వీరగాథలను, తరువాతి కాలంలో జానపద కవులు అనుకరిస్తూ వ్రాశారని స్పష్టమవుతోంది.

నేను కాటమరాజుకథలకు సంబంధించి సుమారు 30 తాళపత్రగ్రంథాలు సేకరించాను. వీటినిబట్టి "గంగుల పినయల్లయ" తోపాటు మరో ఎనిమిదిమంది (మొత్తం తొమ్మిదిమంది) కవులున్నారని గుర్తించగలిగాను:-

(1) "వదరుప మద్దులేటికవి" - ఆవుల వలురాజుకథ

(2) "మల్లయ్య" - పంపాద్రికథ

(3) "కనకబండి ఘట్టయ్య" - పోలురాజుకథ - జన్నివాడకథ (దక్షిణాది ఆవులమేపు) - కంసుదుకథ (విష్ణుభాగవతము)

(4) "కట్టెబోయిన మారయ్యకవి" - కాటమరాజుకు పట్టంకట్టినకథ (కాటమరాజు పట్టాభిషేకము)

(5) "గొట్టిపాటి మల్లయ్య" - బొంగరాలకథ

(6) "గంగుల పినయల్లయ్య" ("పినయల్లన") - కఱియావులరాజుకథ; ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట.

(7) "కదిరిమంగళం వెంకటాద్రి" లేక "మంగళపురి వెంకటాద్రి"-పాపనూకకథ

(8) "రాంపాక వెంకురాంకవి" - పాపనూకకథ

(9) "జరుగుపల్లె చెన్నయ్య" – అగుమంచికథ.

ఈ కవులందరు కాటమరాజు కథలను మొట్టమొదట యతిప్రాసలు పాటిస్తూ చక్కని ద్విపదలో వ్రాసి ఉంటారు. అవి జానపద గాయకుల నోళ్ళలోపడి, యతిప్రాసలు పోగొట్టుకొని, మంజరీ ద్విపదగా, ఖండగతిగా మారిపోయి ఉంటాయి. కొన్ని కథలలో ఈ ఛందస్సు ఇంకా సాగిపోతూ, లయాత్మక వచనమా అనిపించేలా ఉన్నాయి. అయినా కవితావైభవం ఏమాత్రం చెడలేదు. ఈ జానపదకవులు గొప్ప ప్రతిభావంతులు. ఎంతో అందమైన కవిత్వాన్ని వ్రాశారు. వీర, రౌద్ర, అద్భుత, బీభత్స, కరుణరసాలను ఎంతో అభినివేశంతో పోషించారు.

## 10. కాటమరాజుకథలు – వీరరసపోషణ: –

వీరగాథలలో వీరరసం ప్రధానమని వేరుగా చెప్పపనిలేదు. ఆ రసానికి అనుగుణంగా కొన్ని సందర్భాలలో రౌద్రరసం, అద్భుతరసం, కరుణరసం, బీభత్సరసం పోషింపబడతాయి. కాటమరాజుకథలలోని వీరరసానికి రెండు ఉదాహరణలు ఇస్తాను: –

### 10.1 ఖడ్గతిక్కన శౌర్యం: –

ఖడ్గతిక్కన మొదటిసారి చల్లవారి మీదికి యుద్ధానికి వెడతాడు. బ్రాహ్మణుడు కథా అని చల్ల పిన్నమనీడు చంపకుండా వదిలివేస్తాడు. రణంలో ఓడివచ్చిన తిక్కనను ఊరిలోని ప్రజలు, తల్లిదండ్రులు, భార్య జానమ్మ అవమానిస్తారు. అతనిలో పౌరుషం ప్రజ్వరిల్లుతుంది. మర్నాడు తిరిగి యుద్ధానికి వెడుతూ తండ్రి సిద్ధనామాత్యునితో ఇలా అంటాడు: "ఓ తండ్రీ! నేను యాదవుల మీదికి యుద్ధానికి వెడుతున్నాను. వారిని చంపి వస్తే సరేసరి. లేక పోరాడి చనిపోతే, నీవు యుద్ధభూమికిరా. పగవారు నా కండలు నరికివేసినా సరే, నా శరీరంలో ఎముకలు ఉంటే చాలు వారిని చంపివేస్తా. నేను రణరంగంలో వీరవిహారం చేస్తాను కాబట్టి, నా బొంది ఒక చోట పడి ఉండదు. బొంది కనపడకపోయినా అక్కడ తెగిపడిన నా కండలు ఉంటాయి. అయితే, కదనరంగంలో ఎందరో వీరుల కండలు ఉంటాయి. ఆ కండలలో నా కండల్ని ఎలా గుర్తిస్తావంటే, ఏ కండలయితే నా శరీరం నుండి విడిపోయినా సరే, పౌరుషంతో ఎగిరెగిరి పడుతూ ఉంటాయో, ఆ కండలు తిక్కన్న కండలని తెలుసుకో!"

**"ఓ తండ్రి! వినవయ్య ఒక విన్నపంబు**
**నా యొక్క కీర్తి ఆనందంబు నొంద**
**యదుబలంబుల మీది కరుగుచున్నాడ**

**వారిని దునుమాడి వస్తినా మేలు,**
**పోరాడి వారిచే పొలిసితినైన**
**నీవట కావార్త నిజమని తెలిసి**
**వేవేగ రణభూమి వెదకంగ రమ్ము**
**ఆముకొని పగవారి హతము సేయంగ**
**కవగొని పగలు నా కండలు నఱుక**
**పరగ నెమ్ములె యున్న పగతుర ద్రుంతు**
**ఒకచోటె నుండబో దొనరగా బొంది**
**కదనంబులో బొంది కానకుంటేను**
**అచ్చట నిచ్చట నా యుద్ధభూమి**
**పరగ కండలు ఎగిరి పడుచుండెనైన**
**తిక్కన్న కండలని తెలియంగ జూడు!"**

తరువాత తల్లిని, భార్యను పిలుస్తాడు. "పూర్వం ఒక భట్రాజువచ్చి నన్ను గురించి ఒక సీసపద్యం చెబుతూ నాలుగు పాదాలే చెప్పాడు. ఎత్తిగీతి చెప్పలేదు. నేను అతనికి ఎనిమిదివేల వరహాలు వచ్చాను. అతడు మళ్ళీవచ్చి ఎత్తుగీతి చెబుతాడు. అతనికి మరో నాలుగువేల వరహాలు ఇవ్వండి" అని చెబుతాడు. సైన్యంతో కదలి రణతిక్కన కదనరంగానికి వెడతాడు. మళ్ళీ అతని సైన్యమంతా నశించిపోతుంది. ఒక్కడితో పలువురు పోరాడరాదని యాదవులు యుద్ధాన్ని నిలిపివేస్తారు. బ్రాహ్మణునితో యుద్ధం చేయడం ఎలాగ అని చింతిస్తూ ఉంటారు. అప్పుడు చల్ల పిన్నమనీడి మంత్రి, శివబ్రాహ్మణుడు అయిన బ్రహ్మరుద్రయ్య ముందుకు వస్తాడు. ఖడ్గతిక్కన ఆ బ్రహ్మరుద్రయ్యతో ద్వంద్వయుద్ధం చేస్తాడు. ఈ యిద్దరు బ్రాహ్మణుల ద్వంద్వయుద్ధాన్ని జానపదకవి గంగుల పినయెల్లయ 'నభూతో నభవిష్యతి'గా వర్ణించాడు:–

**"అప్పుడు తిక్కన్న అగ్నిచందమున**
**కదిసెను కోపాగ్ని కన్నుల నురల**
**అదలించి రుద్రుని అడ్డాన వైచె**
**వడి రుద్రుడంత నా వాటు దప్పుకొనె**
**కరవాలు గొకొని కదిసె రుద్రుండు**
**విడిబడి రిద్దఱు వీరయుద్ధమున**

**ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు**
**లఘించి వెనుకకు రాగడిల్లుచును**
**ప్రాకుచు, దూకుచు, పైకి రేగుచును,**
**తాటించి నఱుకుచు, తాకి పొద్చుచును,**
**ఉరవడితో వచ్చి పరువడి సేసి**
**కటపెట ఖంఖంగు ఘల్లు ఘల్లనుచు**
**మెఱుపులవలె మీఱి మెఱయుచు, పిడుగు**
**చఱపులవలె గొప్ప సడిని వ్రేయుచును**
**ఇర్వురు పోరిరి దుర్వారు లగుచు**
**తిక్కదుద్రిక్తుడై తెగవ్రేయ, రుద్రు**
**దక్కడ చెక్కలై అవనిపై బడియె,**
**పడుచునే రుద్రుడాపక ఖడ్గధార**
**తడయక ఆ మంత్రితల ద్రుంచివైచె!"**

కొడుకు వీరమరణవార్తవిని, తండ్రి సిద్ధనామాత్యుడు రణభూమికి వస్తాడు. కొడుకు చెప్పినట్లుగానే అతని బొంది ఎక్కడా కనబడదు; పౌరుషంతో ఎగిరిపడుతున్న తిక్కన్న కండలు కనబడతాయి. అవి ఎలా ఉన్నాయో చూడండి:-

**"జలధిలో మీనముల్ చలియించునట్లు**
**నెత్తుటి వఱ్ఱులో తుత్తునియలుగ**
**తిక్కన్న కండలు తేలాడుచుండె!**
**ఎగిసెగిసి పడుచుండె నీవలావలకు!!**
**కనుగొని అవిచూచి కన్నీరు కార్చి**
**కావిధోవతిని ఆ కండలు పొదివి**
**ఆతదు నెల్లూరి కప్పుదేతేర..."**

ఖడ్గతిక్కన భార్య జానమ్మ ఆ కండలతో సహగమనం చేస్తుంది.

**10.2 కఠియావులరాజు పరాక్రమం:-**

ఈ పుస్తకంలో నేను చేర్చిన "కఠియావులరాజుకథ" అంతా కూడా ఉత్తమ వీరరసానికి ఉదాహరణమే!

"ఉర్లకొండ యలమంచి"ని పాలించే అయితమరాజు మంత్రి పల్లికొండతోను,

ఇతర యాదవవీరులతోను కలిసి, ఓరుగంటి శంభుని తిరునాళ్ళకు వెడతాడు. అక్కడ జరిగిన కథ యిది. కటియావులరాజు ఎక్కే గుఱ్ఱంపేరు "గండకత్తెర" (నేను సేకరించిన మరొక కథలో "రెక్కలగుఱ్ఱం"). ఓరుగల్లు సింహద్వారానికి ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షుడు, ఏకాంగివీరుడు, మాస్టీడు అయిన "కలియుగ బేతాళుడు" తన బిరుదులను వ్రేలాడదీస్తాడు. గండకత్తెర ఆ బిరుదులు దగ్గర ఆగిపోతుంది. శత్రువు బిరుదుల క్రిందనుండి దూరిపోవడం వీరునికే కాదు, వీరుని గుఱ్ఱానికి కూడా అవమానమే! అది గమనించి ఆ బిరుదులను తొలగించమని బేతాళునికి అతని బోడికల (సేవకుల) ద్వారా కబురుచేస్తాడు. బేతాళుడు పొగరుగా తిరస్కరిస్తాడు. కటియావులరాజు ఎడమకాలితో ఆ బిరుదుల్ని తన్ని ఓరుగల్లులో ప్రవేశిస్తాడు. ఈ కారణంగా ఇద్దరికీ ద్వంద్వయుద్ధం జరుగుతుంది. తీవ్రంగా జరిగిన ఆ యుద్ధంలో కటియావులరాజు బేతాళుని సంహరిస్తాడు. (వీరి ద్వంద్వయుద్ధం కూడా వీరరస స్ఫోరకంగా వర్ణింపబడింది. సుదీర్ఘంగా ఉండటం వల్ల ఇక్కడ ఉదాహరించలేదు). ఇది తెలిసి ప్రతాపరుద్రుడు అయితమరాజును నిందిస్తాడు. అయితమరాజు కోపించి, కటియావులరాజును చంపి, ఆ నెత్తుటి కోకలను ప్రతాపునికి చూపుమని పల్లికొండను ఆజ్ఞాపిస్తాడు. పల్లికొండ కటియావులరాజును ఒక కావుపాతరలో దాచిపెట్టి, ఒక కుందేలును చంపి, దాని నెత్తుటితో తడిపిన కోకలను ప్రతాపునకు చూపిస్తాడు.

శంభుని సేవించి యాదవులు తిరుగుప్రయాణంలో "గవిలికొండ" దగ్గర మజిలీ చేస్తారు. ప్రతాపరుద్రుడు వారిని చంపడానికి సైన్యాలను పంపుతాడు. ఆ శత్రుసైన్యాలను ఎదుర్కొనేందుకు మహావీరుడైన కటియావులరాజును పిలవమంటాడు అయితమరాజు. "నీ ఆజ్ఞప్రకారము అతనిని చంపి దహనం చేసివేశాను" అంటాడు మంత్రి పల్లికొండ. అయితమరాజు మిక్కిలి దుఃఖించి, "కటియావులరాజును దహనం చేసిన చోటునుండి పిడికెడు బూడిద తెచ్చి మన సేనలమీద చల్లు!" అంటాడు. అంటే మహావీరుడైన కటియావులరాజు చనిపోయినా సరే, అతని చితాభస్మంలో కూడా అతని శౌర్యప్రతాపాలు దాగి ఉంటాయన్నమాట! (ఇది నరకబడిన ఖడ్గతిక్కన కండలు అతడు చనిపోయినా సరే పౌరుషంతో ఎగిరెగిరి పడటంలాంటిదే!) అతని బూడిద చల్లితే ప్రతిసైనికుడు ఒక కటియావులరాజై పోరాడతాడన్నమాట. "ఆ బూడిద సుడిగాలికి ఎగిరిపోయింది!" అంటాడు పల్లికొండ. "కనీసం ఆ శ్మశానంలోని మట్టిని తెచ్చి మన సేనలమీద చల్లు!" అంటాడు అయితమరాజు. "గాలివానతో కూడిన వర్షానికి ఆ మట్టి కొట్టుకు పోయింది!" అంటాడు పల్లికొండ. అయితమరాజు తమ్ముని

తలచుకొని భోరున ఏడుస్తాడు. అప్పుడు పల్లికొండ అతనిని ఓదార్చి "చనిపోయిన కటియావులరాజును తిరిగి బ్రతికించలేను కాని, భూమిలోనుండి కటియావుల రాజువంటి ఒక ప్రతివీరుని మొలిపిస్తాను, యుద్ధం గెలిపిస్తాను!" అని అంటాడు. వీరి సంభాషణలో కటియావులరాజు శౌర్యప్రతాపాలు వీరరసస్ఫోరకంగా మనకు దర్శనమిస్తాయి:-

**"బావరో! వినుము బావ పల్లికొండ!**
**ఆ కరియావులరాజును దహనము చేసిన చోటికి**
**నీవు పరుగున పోయి బావ పల్లికొండ! దండుమీద**
**పిడికెడు బూడిదెన్నా తెచ్చి చల్ల"మన్నాడు**
**"సురగాలికి బూడిద ఎగిరిపోయినది, మరిది అయితమరాజ!"**
**"వలికెలో మన్ను తెచ్చి దండుమీద చల్లు బావ పల్లికొండ!"**
**"గాలివర్షానికి సుడిగుంతలు పెట్టినది మరిదీ!"**
**ఆ మాటలకు అయితమరాజు దుఃఖింపసాగెను.**

ఇక్కడ అయితమరాజు శోకవర్ణన కరుణరసానికి మంచి ఉదాహరణం-

**"పగవారి మాటలు విని తమ్ముడా! నిన్ను**
**పాయదెరువులు జేస్తిని కరియావులరాజా!"**
**అని వలవల కన్నీరు అయితమరాజుకు వరదలాయెను**
**కుడికంటి వుతకము కుంభద్వారము లాయెను**
**ఎడమకంటి వుతకము ఏరులై పారె**
**"ఓహో! తమ్ముడా!" యని అయితమరాజు అడలంగసాగె.**

పగవారి మూకలు యాదవులను చుట్టుముట్టినవని పల్లికొండ తెలుపగా, కావుపాతరనుండి కటియావులరాజు తన రెక్కలగుఱ్ఱంమీద పెద్ద విస్ఫోటనం లాగ ఎగిరి గవిలికొండ రణరంగంలో వ్రాలడం, శత్రువులందరూ కకావికలై పారిపోవడం - వీరరసానికి అద్భుతరసానికి సాటిలేని మేటి ఉదాహరణం:- (ప్రారంభంలో రౌద్రరసం, శత్రువులు పారిపోవడంలో హాస్యరసం కూడా గోచరిస్తాయి.)

**ఆ వార్తలకు కరియావులరాజు ఆగ్రుడై మండెను**
**తెల్లని కన్నులకు తెచ్చె రక్తంబు**
**అంకెములో పాదమేసి అశ్వాన్ని యెక్కెను**

కావుపాతరలోనుంచి అశ్వం రెక్కల పెటపెటనార్చి
ఎగిరెను అశ్వం ధరణందు నిలిచెను
గవిలికొండ గుదార్లు అశ్వం కన్నుల చూచెను
రెపరెప రెక్కల నార్చి, కాలుజిమ్మి అశ్వం
ఖణీఖణీయని కిలారించసాగెను
తేజీ అలుకుడు వోరుగంటి గడిమన్నీలకు బాకులై నాటెను
. . . . . . . . . . . . . . .
వోరుగంటివారు, పానుగంటివారు
గవిలికొండవారు, గవిచెర్లవారు
గర్భవిరోధులు అల్లకల్లోలమై
తోకలెత్తి కళ్ళేల తొడిగేటివారు
వెనక ముందుగా గుర్రాల నెక్కేటివారు
కూబుకూబున నేల కూలేటివారు
వకరి చేతిని వకరందుకోని
కూబుకూబున నేల కూలేటివారు
ఈ ప్రకారంబున వోరుగంటివారు
ఎర్రని రక్తములోను దొర్లాడుచున్నారు.

**10.3 బీభత్సరసం:-**

బీభత్సరసం పరోక్షంగా వీరరసాన్ని పోషిస్తుంది. రక్తసిక్తమై శవములతో నిండి జుగుప్సావహంగా ఉన్న రణభూమిని చూచి, దానికి కారకుడైన వీరుని వీరత్వాన్ని ఊహించవచ్చును. "ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట"లో యాదవవీరులు నల్లసిద్ధితో చేసిన యుద్ధానంతరం కవి గంగుల పినయెల్లయ రణరంగాన్ని ఈ క్రింది విధంగా వర్ణించాడు:-

"చినిగిన డొక్కలు, చిదికిన తలలు
పారేటి రక్తాన పడిన మొండాలు
వక్కలు ముక్కలై పరగ రణమందు
పెదవులు దంతముల్ పెనగొనియుండె
చెక్కిళ్ళు చెవులును చేతులు మరియు

**మోకాటిచిప్పలు ముంజేతి వ్రేళ్ళు**
**కనుగ్రుడ్లు నాదాడ కండలు నుండు**
**పుత్తైలు పునుకలు ప్రోగులై యుండె**
**పండ్లసందున కరచిపట్టి నాయకులు**
**తరచుగా రణమందు తలలు పడియుండె**
**బాకులు చేపట్టి పరగ విదువకను**
**అటు ఒక్క ప్రాణాన నల్లాడు నరులు**
**మొనతెగిన హస్తముల్ మోపులై యుండె**
**కుమ్మరి చేసిన కుండల కుదురు**
**కూర్చినట్లు తలలు గుట్టలై యుండె**
**గజములు అశ్వాలు కాలుబలములును**
**రణమందు నరలేక రాసులై యుండె."**

ఈ వర్ణనలోని బీభత్సాన్నిబట్టి కాటమరాజాదుల శౌర్యసాహసాలను ఊహించవచ్చును.

కాటమరాజుకథలలోని "పాపనూకకథ – అగుమంచికథ – పాపనూక వలపోత – భక్తిరన్నకథ" అనే నాలుగు వీరగాథలూ కరుణరసావిష్కరణకు ఎత్తిన విజయపతాకలు! ముఖ్యంగా భక్తిరన్నకథ చదువుతుంటే, మహాభారతంలోని "స్త్రీపర్వం" అడుగడుగునా జ్ఞాపకం వస్తుంది. ఇది "యాదవభారతం" కదా!

### 11. కాటమరాజుకథలు – అచ్చతెనుగు (దేశ్య) పదాలు:–

కాటమరాజుకథలలో వృత్తిపదాలు, అచ్చతెనుగు పదాలు కోకొల్లలుగా ఉన్నాయి. వీటిలో చాలాభాగం నిఘంటువులలోకి ఎక్కలేదు. మన నిఘంటువులలో ఎక్కువ భాగం ప్రాచీన శిష్టకావ్యభాషాపదాలు మాత్రమే ఉంటాయి. కాని యిటీవల మిత్రులు ఆచార్య రవ్వా శ్రీహరిగారు తమ నిఘంటువు (శ్రీహరి నిఘంటువు)లో నేను సేకరించిన కాటమరాజుకథలనుండి, ఇతర వీరగాథలనుండి ఎన్నో అపురూపమైన పదాలు స్వీకరించారు. "వలపోఁత" అనే పదానికి "మిక్కిలి ఏడ్పు" అనే అర్థాన్నిచ్చారు. "కంపటీలు" వంటి పదాలకు అర్థాలు తెలియలేదని ప్రశ్నార్థకంతో సూచించారు. "మేపు" అంటే "మేయజేయు" అని ప్రేరణార్థక క్రియ. కాని ఇక్కడ జానపదకవి "మేపుట" అనే అర్థంలో కృదంతం చేసి విశేష్యంగా ప్రయోగించాడు. "కాయు > కాపు" లాగ "మేయు > మేపు". "దక్షిణాది ఆవులమేపు" – "ఉత్తరాది

ఆవులమేపు'' అని ఎంతో అందంగా "మేపు" శబ్దాన్ని ప్రయోగించాడు. అలాగే "వవలపోఁత" శబ్దం కూడా. ఈ సంకలనం లోని నాలుగు వీరగాథలలో ఇటువంటి దేశ్యములు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణానికి కొన్ని ఇస్తున్నాను–

సురగాలి = సుడిగాలి; స్రుక్కు = వెనుదీయు, భయపడు; సురుఁగు = అదృశ్యమగు, చలించు; అడియారము (అడియాలములు) = గుఱుతు, ఆనవాలు; జముదళము = నిడుపు పిడిగల కత్తి, బాకు; సురియలు = చురకత్తులు; అడలు = ఏడ్చు; వలికి = శ్మశానము; పాయు = నశించు; కంపటీలు = ఆలమందలకు రక్షణగా నుండెడి సైనికులు(?); ఏఱువ = దేశము, సీమ; అలుగులు = ఖడ్గములు, ఆయుధములు; కురవ / కురువ = కొండమీది కాలిత్రోవ; కందువ = ముచ్చటైనది; ఆదరువు = ఆధారము, ఆశ్రయము; నరవ= కొండత్రోవ; అంపకోలలు = బాణములు; నేజ = ఈటె; పరుజు = కత్తిపిడి; కటారి = కత్తి, బాకు; అరిగ = డాలు; పుల్లరి (పుల్లు + అరి) = పచ్చగడ్డికి చెల్లించవలసిన పన్ను (పుల్లు = పచ్చగడ్డి); బోడికలు =సేవకులు, శిష్యులు, చెలికాండ్రు; "కొదుకు" లేక "కొతుకు" = సంకోచించు, భయపడు; గమకించు = యత్నించు, ఒప్పు; చట్టు = పర్వతము; కుందు = దుఃఖించు; పేరెము = గుఱ్ఱపు పరుగు; "యుద్ధము" అనే తత్సమపదానికి బదులుగా ఈ కాటమరాజుకథలలో "జగడము" – "పోట్లాట" అనే చక్కని అచ్చతెలుగు పదాలు ప్రయోగించారు జానపదకవులు.

ఈ కాటమరాజుకథలలో వ్యక్తులపేర్లుకూడా అచ్చతెనుగు పదాలే! వలరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, అయితమరాజు, ముమ్మయ్య, పోచయ్య, సిరిగిరమ్మ, అగుమంచి, పాపనూక, ఎఱన్న, నలనన్న, ఆవులన్న, బీరినీడు, పిన్నమనీడు, పల్లికొండ, పుత్తమరాజు, ఎఱప్ప మొ॥

## 12. తాళపత్ర గ్రంథాలు – పరిష్కరణ:–

కాటమరాజుకథలన్నీ కొమ్మలవారివద్ద, గొల్లసుద్దులవారి దగ్గర తాళపత్ర గ్రంథరూపంలో మాత్రమే లభిస్తాయి. ఈ జానపద గాయకులు పాడుతూ ఉంటే సేకరించాలంటే చాలా కష్టం. పంబజోడు వాయిస్తూ ఉంటే ఆ ధ్వనిలో వారి మాటలు స్పష్టంగా వినపడవు. మొత్తం కథ అంతా వారు యథాతథంగా పాడలేరు. ఎన్నో పాదాలు సంఘటనలు వారిస్మృతిపథంలో నిలబడవు. అందువల్ల మనం తాళపత్ర గ్రంథాలమీదనే ఆధారపడాలి. అవి తరతరాలుగా వస్తున్న యాదవ సంస్కృతికి నిధులు.

ఈ కాటమరాజుకథల తాళపత్రగ్రంథాలు రచించిన జానపదకవులు గొప్ప

ప్రతిభావంతులు. వారు వీటిని నిర్దుష్టంగానే వ్రాసి వుంటారు. కాని తరువాత వీటికి పుత్రికలు వ్రాసినవారు అంతగా విద్యావంతులు కాకపోవడంవల్ల ఎన్నో తప్పులు దొర్లాయి. జానపద గాయకుల ఉచ్చారణ దోషాలు కూడా ఈ గ్రంథాల్లో చేరాయి. ఈ తాటాకు పుస్తకాలలో ఉన్న కథలను మనం యథాతథంగా ముద్రిస్తే పాఠకులు చదవలేరు. అర్థం చేసుకోలేరు. అందువల్ల కొంత పరిష్కరించి తీరాలి. అరసున్నలు, శకటరేఫలు చేర్చి ఎక్కువగా పరిష్కరిస్తే జానపదత్వం దెబ్బతింటుంది. జానపద భాషాసౌందర్యం లోపిస్తుంది. కాబట్టి ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటూ ఈ తాటాకు పుస్తకాలను పరిష్కరించుకోవాలి. నేను, నా మిత్రులు కీ.శే. చన్నాప్రగడ తిరుపతిరావు గారితో కలిసి సుమారు 25 తాళపత్ర గ్రంథాలను పరిష్కరించి, 1976-78 సంవత్సరాలలో కాటమరాజుకథలు రెండు సంపుటాలుగా తీసికొనివచ్చాను. ఆ అనుభవంతో పరిష్కర్తలకు కొన్ని ముఖ్యసూచనలు చేస్తున్నాను:-

1) కాటమరాజు కథాచక్రంలోని ఇతివృత్తమంతా (స్థూలంగానైనా) తెలిసి ఉండాలి. కనీసం తాము పరిష్కరిస్తున్న కథలలోని ఇతివృత్తమైనా గ్రహించి వుండాలి. (ఈ పరిజ్ఞానం కలిగించడంకోసమే నా పీఠిక ప్రారంభంలో "కాటమరాజు వంశవృక్షం - బంధువుల పరస్పర సంబంధాలు" తెలియజేశాను.)

2) కాటమరాజు కథలలోని పాత్రలపేర్లు, వారి పరస్పర సంబంధాలు తెలిసి ఉండాలి.

3) తాళపత్రగ్రంథ లేఖనవిధానాలు తెలిసి ఉండాలి. ఉదాహరణానికి - అరసున్నను సూచించడానికి నిండుసున్న ఉంటుంది (వాండు, వీండు). నిండుసున్నను సూచించడానికి తరువాతి హల్లును ద్విత్వం చేస్తారు (శాంత్తి, గంగ్గ)

4) ద్విపద, మంజరీ ద్విపదల ఛందస్సు తెలిసి ఉండాలి; యతిప్రాసలు తెలిసి ఉండాలి. ఒక్కొక్కసారి జానపదుల ఉచ్చారణను ఆధారంగా చేసికొని యతిమైత్రి పాటిస్తాడు కవి - దీనిని గమనించాలి.

5) "వలపల గిలక" (ౕ) ను గుర్తించాలి. ఉదా।। "వార్తౕలు" (వార్తలు), "గుడార్లౕ" (గుడార్లు).

6) కవి ప్రయోగించిన అచ్చతెనుగు పదాలను, వాటి అర్థాలను (సాధ్యమైనంతవరకు) తెలుసుకోవాలి. ఆ అర్థాలు పాదసూచికలలో ఇవ్వాలి.

ప్రాచీన తాళపత్రగ్రంథాలలోని లేఖనవిధానం ఒక ప్రత్యేక పద్ధతిలో ఉంటుంది. సాంప్రదాయిక కవిత్వంలో అరసున్నలు, నిండుసున్నలు ఉంటాయి. వాడియైన ఇనుప గంటంతో తాటాకు పుస్తకం మీద అరసున్న వ్రాస్తే తాటాకు

చిరిగిపోతుంది. అందువల్ల అరసున్నను నిండుసున్నతోనే సూచిస్తారు. వాండు (వాcడు) వీండు (వీcడు) గోంగు (గోcగు), గోంచి (గోcచి) ఇత్యాతి. నిండుసున్నను స్ఫురింపజేయాలంటే దాని తరువాతి హల్లును దిత్వం చేస్తారు. శాంత్తి, గంగ్గ, అగుమంచ్చి, పల్లికొండ్డ, మొ॥ "బొంగరాలకథ"లో "పైండికంట్టి" అని వ్రాశాడు లేఖకుడు. దీనిని "పైcడికంటి"గా అర్థం చేసుకోవాలి. అలాగే "జన్నివాడకథ" (పుల్లరికథ)లో "గంగ్గకు జాతర కావించ్చిరంత్త" అనే పాదాన్ని "గంగకు జాతర కావించి రంత"గా మార్చుకోవాలి. కాటమరాజుకథలు ఎత్తివ్రాసిన జానపద లేఖకులు అరసున్న నిండుసున్నలు వ్రాసే పద్ధతిని తప్పుగా అనుకరించి ఎన్నో అపశబ్దాలను సృష్టించారు. ఉదాహరణానికి ఈ సంపుటిలోని "బొంగరాలకథ" తాళపత్రప్రతిలో లేఖకుడు తప్పుగా వ్రాసిన కొన్ని పదాలు:-

"ముంమ్మయ్య" - "మంన్నీలు" - "రొంమ్ము" - "సొంమ్ములు" - "నలనంన్న" - "ఆవులంన" - "అయితంన" - "అంనలు తంములు" - మొ॥వి.

అలాగే సాధురేఫ (రకారం) వేరొక హల్లుతో కూడి సంయుక్తాక్షరమైనప్పుడు, దానిని "ర్త-ర్ల-ర్మ-ర్భ" అనే నేటిపద్ధతిలో కాకుండా, రేఫతరువాత వచ్చే హల్లును ముందుగా వ్రాసి, దాని ప్రక్కన "వలపలగిలక" (౯) పెట్టి రేఫ సంయుక్తాక్షరాన్ని సూచిస్తారు. ఉదా॥ "వార్తలు" - "గుడార్రు" - ధర్మము" - "గర్భము" ఇత్యాది. సుమారు నూరు సంవత్సరాల క్రితం వరకూ ఈ పద్ధతి మన ఆధునిక లేఖనంలో ఉండేది. కన్యాశుల్కం నాటకం మొదటి ముద్రణలో గురజాడ అప్పారావుగారు ఈ వలపల గిలకను ప్రయోగించారు.

ఈ తాటాకు పుస్తకాలలో "స" కారం వ్రాయవలసినచోట "శ" కారం వ్రాస్తారు. ఉదా॥ చేశి, వేశి, శలవు, వాశి, శిరిదేవి, నరశింహ్వా- మొ॥వి.

ఇటువంటి శబ్దాలన్నింటినీ నేటి వ్రాతలోకి మార్చుకోవాలి. లేకపోతే పాఠకులు చాలా ఇబ్బంది పడతారు. వలపలగిలక నిన్నమొన్నటివరకూ (100 ఏళ్ళక్రితం వరకూ) ఉంది కాబట్టి దానిని అలా ఉంచేసినా ఫరవాలేదు. కాని, నేను పాఠకులకు క్లేశం కలిగించడం ఇష్టంలేక దానిని తీసివేశాను. సారాంశం ఏమిటంటే - కాటమరాజు కథల తాళపత్ర గ్రంథాలను పాఠకుల సౌలభ్యంకోసం కొంతవరకూ పరిష్కరించాలి. పూర్తిగా పరిష్కరిస్తే జానపదభాష, జానపదత్వం దెబ్బతింటాయి. కాబట్టి తగుమాత్రం సవరించాలి.



# పీఠిక-II

# ఈ సంపుటిలోని వీరగాథలు

## 1. కటియావులరాజుకథ ("గంగదొనకొండ" ప్రతి)

దీనికి సంబంధించిన రెండు తాళపత్ర గ్రంథాలను నేను 1966లోనే సేకరించాను. అవి:-

**(1) "పెదకంటిపల్లె" ప్రతి:-**

చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకా, "పెదకంటిపల్లె"లో 01-03-1966నాడు శ్రీ తోడేటి సుబ్రహ్మణ్యం ఇచ్చిన తాళపత్ర గ్రంథం. ఇది సుదీర్ఘమైన కథ. రెండు వరుసల ముద్రణలో 98 పుటలు వచ్చింది. (ఒకే వరుసలో ముద్రిస్తే 196 పుటలు వస్తుంది). సుమారుగా 3890 పాదాలున్నాయి. కాని దీనిలో అవతారికా భాగం నష్టమైపోయింది. అందువల్ల కవి ఎవరో తెలియలేదు. ఛందస్సు "మంజరీ ద్విపద." కాని పాడటంలో అదికూడా సాగిపోయి కొన్నిచోట్ల "ఖండగతి"గాను, మరికొన్నిచోట్ల లయాత్మక వచనకవిత్వంలాగ మారిపోయింది. దీనిని 1976లో ప్రకటింపబడిన నా "కాటమరాజుకథలు" మొదటి సంపుటంలో అనుబంధంగా ఇచ్చాను. అవతారిక లేదు కాబట్టి అలా చేశాను.

**2) "గామాలపాడు" ప్రతి:-**

గుంటూరుజిల్లా, పల్నాడు తాలూకాలోని "గామాలపాడు" (నాయకురాలు నాగమ్మగారి ఊరు) లో 31-08-1966నాడు శ్రీ దమ్మాలపాటి లింగప్ప ఇచ్చిన తాళపత్రగ్రంథం. ఈ గ్రంథసేకరణలో ఆ గామాలపాడులో ఉన్న ప్రముఖ కవిమిత్రులు శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు నాకు ఎంతో సహాయం చేశారు. ఇది పై కథకన్నా చిన్నది. అవతారికతో సహా సంపూర్ణంగా ఉంది. కవిపేరు గంగుల పినయెల్లయ. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట వ్రాసినది ఇతడే. దీనిని నా "కామటరాజుకథలు" మొదటి

సంపుటంలో ప్రధానకథ (Main Text)గా ఇచ్చాను. రెండువరుసల ముద్రణలో 46 పుటలు వచ్చింది. సుమారుగా 1800 పాదాలున్నాయి.

**3) "గంగదొనకొండ" ప్రతి:-**

ఈ "కాటమరాజుకథలు-మూడవ సంపుటం"లో నేను మొదటికథగా ఇచ్చినది పై రెండు ప్రతులకన్నా భిన్నమైనది. దీనిని కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్యగారు 1972-73 ప్రాంతంలో గంగదొనకొండలో సేకరించారు.

నేను వీరగాథలనుగురించి పరిశోధన చేస్తున్న రోజుల్లో (1963-1968 మధ్య) సంయుక్త ఆంధ్రప్రదేశ్ యాదవసంఘానికి శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు కార్యదర్శిగా ఉండేవారు. వీరు ఎంతో కష్టపడి కాటమరాజుకథలకు సంబంధించిన ఎన్నో తాళపత్ర గ్రంథాలను 1915 నుండీ సేకరిస్తూ, చిన్న చిన్న పుస్తకాలుగా ముద్రించారు. వీరు 20-05-1976లో "శ్రీకటియావులరాజు చరిత్ర" అనే పేరుతో ఈ వీరగాథను ప్రచురించారు. ఇది సంపూర్ణమైన కథే కాని చివర ఒక సంఘటన లోపించింది. చక్కటి ద్విపదలో వ్రాయబడింది. దీనిలో అవతారిక ఉంది కాని అందులో కవిపేరులేదు; ఇష్టదేవతాప్రార్థన మాత్రమే ఉంది. ఈ కథను పిచ్చయ్యగారు కొంత సంస్కరించారు.[1] మరికొంత నేను పరిష్కరించాను. కథను తెలియజేసే ఉపశీర్షికలను చాలాభాగం పిచ్చయ్యగారే వ్రాశారు.[2] అయితే ముద్రణ స్ఖాలిత్యాలు మిక్కిలి ఎక్కువగా ఉన్నాయి. ముఖ్యంగా ఒక పదానికి మరొక పదానికి మధ్య ఖాళీ (Spacing) ఏమాత్రమూ

1. కాని పిచ్చయ్యగారి పరిష్కరణ, మిక్కిలి లోపభూయిష్ఠంగా ఉంది. ద్విపద ఛందస్సు కిట్టించడంకోసం పదాలను ఇష్టం వచ్చినట్టు మార్చివేశారు. వింతసంధులు, దుష్టసంధులు చేశారు. "బిర్దు, బేతాల్డు, వామ్నావతార, రవితేజ్జు, కర్చిన, అందర్కి, భాగీర్థి, పుర్హ్వరుడు, మందార్డు" మొదలైనవి వింతపదాలు. "క్త్వార్థంబయిన ఇత్తునకు సంధిలేదు" అని బాలవ్యాకరణసూత్రం. కాని పిచ్చయ్యగారు సంధిచేశారు (చచ్చిపడుండె, పొరలేడ్చి, కొట్టిలమీద మొదలైనవి.) జానపద ద్విపద మూడు ఇంద్రగణాలు + ఒక సూర్యగణంగానే కాకుండా, 5+5+5+3 మాత్రలుగా కూడా నడుస్తుంది. "భ"గణము, "నల" గణము> "భల"గాను, "నలల"గాను (చంద్రగణములుగా) మారిపోతాయి. ఈ సంగతి పిచ్చయ్యగారు గుర్తించలేదు. ద్విపద ఛందస్సును కాపాడటంకోసం "భావజసంహర్డు భక్తమందార్డు" (భావజ సంహరుడు భక్త మందారుడు)అని మార్చిన పాదం వీరి వింత పరిష్కరణకు మంచి ఉదాహరణం. దీనిని "భావజ సంహార! భక్తమందార!" అంటే గణాలు సరిపోతాయి. కాని పల్లికొండ చెపుతున్న మాటలలో ఇది ఇమడదు. అందువల్ల "భావజసంహారుడు! భక్తమందారుడు!"గా ఉంచడమే మంచిది.

2. కథాకథనంలోని అన్ని సంఘటనలకు పిచ్చయ్యగారు ఉపశీర్షికలు ఉంచలేదు. నాలుగైదు సంఘటనలకు కలిపి ఒకే ఉపశీర్షిక ఉంచారు. దీనిని నేను సరిచేసి కొత్త ఉపశీర్షికలు పెట్టాను.

లేదు. నేను కష్టపడి సరిచేసుకున్నాను. రెండు ద్విపదపాదాలు కలిపి ఒకే పాదంగా ముద్రించడం వలన ఈ ముద్రణలో ఈ కథ 64 పుటలు వచ్చింది (నిజానికి 128 పుటలు రావాలి). సుమారుగా 3,116 పాదాలున్నాయి. పిచ్చయ్యగారు ఈ తాళపత్ర గ్రంథాన్ని 1972–73 ప్రాంతంలో గంగదొనకొండలోని శ్రీగంగాభవాని పూజారులలో ఒకరైన శ్రీ వోడి గురవయ్యయాదవుగారినుండి సేకరించినట్లుగా ఈ కథ పీఠికలో వ్రాసుకున్నారు. తాళపత్రంలో కొన్ని పదాలు పాదాలు శిథిలమైతే వాటిని పిచ్చయ్యగారు పూరించినట్లుగా చెప్పుకున్నారు. ఇలా పూరించిన వాక్యాలకు కుండలీకరణములు పెట్టినట్లుగా కూడా తెలియజేశారు.

కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్యగారు చాలా గొప్పవ్యక్తి. వారిని గురించి రెండు మాటలు చెప్పితీరాలి. వీరు గుంటూరుజిల్లా, తెనాలితాలూకా, "ఎడవూరు" గ్రామంలో ఉండేవారు. విద్యావంతులు, సంస్కారవంతులు. నాకు వీరగాథల పరిశోధనలో ఎంతో సహాయం చేశారు. ఎన్నో కాటమరాజుకథల తాళపత్ర గ్రంథాలను, తాను ముద్రించిన గ్రంథాలను నాకు ఇచ్చారు. యాదవసంఘం కార్యదర్శిగా సంయుక్త ఆంధ్రప్రదేశ్‌లోని యాదవులకు ఎంతో సేవచేశారు. ఎన్నో మంచి గ్రంథాలను రచించారు, సేకరించారు, ప్రచురించారు. వారి ప్రచురణలు కొన్ని:–

(1) రాజవంశ ప్రదీపిక

(2) యాదవదీపిక (మొదటి భాగము)

(3) వలురాజు చరిత్ర (ద్విపద కావ్యము) మే 1967

(4) బల్లికురువ యుద్ధము (ద్విపద కావ్యము) జూలై 1967

(5) పోలురాజు చరిత్ర (ద్విపద కావ్యము) 1970

(6) కాటమరాజు చరిత్ర (పద్యప్రబంధము)

(7) కఠియావులరాజు చరిత్ర (ద్విపద కావ్యము), మే 1976

(8) పెద్దిరాజుకథ (ద్విపద), 1976

(9) యావద దీపిక (రెండవ భాగము)

1976లో ప్రచురించిన ఈ "కఠియావులరాజుచరిత్ర"ను, శ్రీ ఆలా వెంకటేశ్వర్లు యాదవరాజుగారు తమ తండ్రి పెదపున్నయ్య యాదవరాజుగారి జ్ఞాపకార్థము ఇచ్చిన ధనసహాయంతో పిచ్చయ్యగారు ముద్రించారు. ఇంత కష్టపడి, వారిని వీరిని అభ్యర్థించి, యాదవుల సంస్కృతియొక్క గొప్పతనాన్ని తెలియజేసే గ్రంథాలను వెలుగులోకి తెచ్చారు పిచ్చయ్యగారు.

**ఆరాధ్యుల పిచ్చయ్యగారిని గురించి మరికొన్ని విశేషాలు:-**

పిచ్చయ్యగారు ఏ సంవత్సరంలో పుట్టారు? ఏ సంవత్సరంలో స్వర్గస్థులయ్యారు? అనే విషయాలు నాకు తెలియలేదు. కాని వారి రచనలనుబట్టి కొంత ఊహ చేస్తున్నాను. 20-05-1976 నాడు వీరు ప్రచురించిన ''కఱియావులరాజు చరిత్ర'' (ద్విపదకావ్యము) పీఠిక ప్రారంభంలో ఇలా వ్రాశారు:-

"క్రీ.శ. 1915-1916 సంవత్సరములలో యాదవరాజుల చరిత్ర. త్రాటియాకు పుస్తకములు యీ కథలు చెప్పువారివద్దనుండి అడిగి తీసుకొనునప్పుడు యీ కఱియావులరాజు చరిత్ర లభ్యపడలేదు. ఇప్పటికి (1976 నాటికి) 3-4 సంవత్సరముల క్రిందట వినుకొండ తాలూకా కుర్చేడుకు కొంత దూరములో నున్న ధనకొండలో వెలసియున్న శ్రీగంగాభవాని పూజారులలో నొకరగు వోడి గురువయ్యయాదవుగారు యీ కఱియావులరాజు చరిత్ర తాటియాకుల పుస్తకమును తెచ్చియిచ్చిరి. తాటియాకుల పుస్తకములో అచ్చటచ్చట కొన్నివాక్యములు శిథిలములైనవి. ఆయా చోటుల నేను పూరించిన వాక్యములకు (....) యీపై కామాగుర్తులుంచితిని"

దీనిని బట్టి పిచ్చయ్యగారు 1915-1916 సంవత్సరములనాటికే యాదవుల చరిత్రకు సంబంధించిన తాళపత్ర గ్రంథాల సేకరణ మొదలుపెట్టారని తెలుస్తోంది. అప్పటికి వీరి వయస్సు 20-25 సంవత్సరముల మధ్య ఉండవచ్చును. కాబట్టి వీరు క్రీ.శ. 1890-95 మధ్య జన్మించి ఉంటారు. ఈ కఱియావులరాజుకథను 1976లో ప్రచురించారు. ఆ తరువాత 3-4 సంవత్సరములు బ్రతికి ఉంటారు. 1980 ప్రాంతంలో స్వర్గస్థులై ఉంటారు. దీనినిబట్టి పిచ్చయ్యగారి కాలం 1890-1980 కావచ్చును. కాని యిక్కడ ఒక చిత్రం జరిగింది.

ఇటీవల, 25.12.2020నాడు, అంటే ముక్కోటి ఏకాదశి లేక వైకుంఠ ఏకాదశి పర్వదినంనాడు దైవవశాత్తు నేను కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్యగారి వంశస్థులను గుర్తించగలిగాను. దీనికి ముఖ్య కారణం నా ప్రియమైన శిష్యురాలు శ్రీమతి నూకవరపు రాజేశ్వరి. ఈమె మా బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో 1991-93 సంవత్సరాలలో ఎం.ఏ. చదివి 1993-94 సంవత్సరంలో ఎం.ఫిల్. కూడా చేసింది. రాజేశ్వరి స్వగ్రామం తెనాలి ప్రక్కనే ఉన్న "పెదరావూరు". అక్కడి హైస్కూలులో తెలుగు పండిట్‌గా పనిచేస్తోంది. ఈమెకు నేనంటే అమితమైన గురుభక్తి. ఆరాధ్యుల

పిచ్చయ్యగారి "ఎడవూరు" గ్రామం కూడా తెనాలి సమీపంలోనే ఉంది కదా అనే ఉద్దేశంతో ఆమెకు చెప్పాను. వెంటనే 24 గంటల్లో పిచ్చయ్యగారి కుటుంబ సభ్యుల ఆచూకీ తెలియజేసింది. పిచ్చయ్యగారి ఏకైక పుత్రుడు, పెద్ద మనుమడు కూడా చనిపోయారనీ, మునిమనుమడు శ్రీ ఆరాధ్యుల ఉపేంద్ర వరప్రసాదరావుగారు మాత్రం ఉన్నారని తెలియజేస్తూ, ఆయన సెల్ నెంబరు నాకు పంపించింది. నేను ఆయనతో మాట్లాడి పిచ్చయ్యగారి కుటుంబ విషయాలు తెలుసుకోగలిగాను. ఈ పరిశోధనలో నాకు ఎంతగానో తోడ్పడిన నా అనుంగు శిష్యురాలు శ్రీమతి నూకవరపు రాజేశ్వరికి నా అనంతమైన ఆశీస్సులు...

ఎడవూరు పూర్తిగా యాదవుల గ్రామం. పిచ్చయ్యగారు ఇక్కడ పెద్ద మోతుబరి రైతు; 30 ఎకరాల మాగాణి భూమికి యజమాని. వీరి భార్య పేరు "పున్నమ్మ"గారు. ఈ దంపతులకు ఒకే ఒక కొడుకు. ఆయన పేరు: "బసవశంకరయ్య", కోడలు: "కామమ్మ". వీరికి నలుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు. జ్యేష్ఠానుక్రమంగా వారి పేర్లు: "హరప్రసాదరావు, లక్ష్మణరావు, బుచ్చిరామయ్య, భ్రమరాంబ, కోటమ్మ, కామేశ్వరరావు, వైష్ణవీదేవి." వీరిలో పెద్దవారైన హరప్రసాదరావుగారి భార్యపేరు: "అంజనీ కమలమ్మ". ఈ దంపతులకు ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. వారు వరుసగా: "ఉపేంద్రవరప్రసాదరావు, భానుమతి, చలపతిరావు, ఝాన్సీవాణి." పిచ్చయ్యగారి కొడుకు, మనుమలు, మునిమనుమలు – అందరూ విద్యావంతులు, మంచి ఉద్యోగాలు చేశారు; చేస్తున్నారు.

ఆరాధ్యుల పిచ్చయ్యగారు 1982 డిసెంబరు నెలలో స్వర్గస్థులయ్యారు. వీరిని పొలంలో ఖననంచేసి, అక్కడ సమాధి కట్టించారు. ఆ సమాధిమీద చనిపోయిన సంవత్సరం నెల ఉన్నాయి కాని, తేదీ లేదు. జన్మించిన సంవత్సరం నెల తేదీలు అసలే లేవు. కాని పిచ్చయ్యగారు చనిపోయినప్పుడు మునిమనుమడైన ఉపేంద్ర వరప్రసాదరావుగారు మిలిటరీలో పనిచేస్తున్నారు. ముత్తాతగారి మరణవార్త విని యింటికి వచ్చారు. అప్పుడు వీరి తాతగారైన బసవశంకరయ్యగారు "మానాన్న 92 సంవత్సరాలు బ్రతికాడు" అని ఉపేంద్రతో చెప్పారట. దీనినిబట్టి పిచ్చయ్యగారు 1890లో పుట్టారని స్పష్టమవుతోంది. కాబట్టి పిచ్చయ్యగారి కాలం క్రీ.శ.1890–1982. పిచ్చయ్యగారు 92 సంవత్సరాల పరిపూర్ణ జీవితాన్ని ఆస్వాదించిన ధన్యజీవి!

పిచ్చయ్యగారు తమ పేరు క్రింద "సంఘసేవకుడు" అని వ్రాసుకొనేవారు. నిజంగా వీరు సంఘానికి – ముఖ్యంగా యాదవసంఘానికి ఎంతో సేవ చేశారు.

యాదవులు చంద్రవంశ క్షత్రియులని, అందువల్ల యజ్ఞోపవీత ధారణకు అర్హులని వీరు వాదించేవారు. ప్రతి యాదవుడు తన పేరు చివర "యాదవరాజు" అని వ్రాసుకోవాలని చెప్పేవారు. చెప్పినట్లుగానే తాను "ఆరాధ్యుల పిచ్చయ్య యాదవరాజు" అని వ్రాసుకొనేవారు.

నేను 1963-1968 మధ్య తెలుగు వీరగాథలనుగురించి పరిశోధన చేసేటప్పుడు నా వయస్సు 28-32 మధ్య ఉండేది. అప్పటికి పిచ్చయ్యగారి వయస్సు సుమారు 70 సంవత్సరాలు. నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారు. నాకు ఎన్నో తాళపత్ర గ్రంథాలను, తాను ముద్రించిన పుస్తకాలను పంపుతూ ఉండేవారు. ఒకసారి నేను నా లేఖలో "మహారాజశ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారికి నమస్కారములు" అని వ్రాశాను. దానికి వారు చాలా నొచ్చుకొని, వెంటనే నాకు "స్వామీ! మీరు బ్రాహ్మణులు. నాకు నమస్కరించకూడదు. మా యాదవులకు తరతరాలుగా బ్రాహ్మణులు పూజనీయులు. వారి రక్షణకోసం ప్రాణాలర్పించారు మావారు" అని లేఖ వ్రాశారు.

పిచ్చయ్యగారి కృషి లేకపోతే ఎన్నో కాటమరాజుకథలు కాలగర్భంలో కలిసిపోయేవి.

**కటియావులరాజుకథ చారిత్రక వీరగాథ:-**

నల్లనిరంగు (కృష్ణవర్ణము)ను తెలియజేయడానికి అచ్చతెనుగులో ఆరుపదాలున్నాయి: "కట్టి-కటి, కట్టె-కటె, కట్టియ-కటియ". కటియ + ఆవు =కటియావు=నల్లని ఆవు. నల్లని ఆలమందల అధిపతికాబట్టి "కటియావులరాజు", ఇతడు కాటమరాజు పెదతండ్రియైన సింహాద్రిరాజు కుమారుడు. మహావీరుడు. పల్నాటివీరకథలలో అలరాజు (అలరాచమల్లు) ఎంతటి మహావీరుడో, కాటమరాజు కథలలో కటియావులరాజు అంతటి మహావీరుడు. ఇతడు కాకతీయ సామ్రాజ్యాన్ని పాలించిన ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షుడైన "బేతాళరెడ్డి"ని ద్వంద్వయుద్ధంలో చంపివేశాడు. ఆ బేతాళరెడ్డియే ఈ కథలో "కలియుగ బేతాళుడు"గా పేర్కొనబడ్డాడు. ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1289 నుండి 1323 వరకూ పాలించాడు. కాని యితడు క్రీ.శ. 1280 నుండి 1289 వరకూ యువరాజుగా ఉండి తన మాతామహి (అమ్మమ్మ) అయిన రుద్రమదేవికి సహాయపడుతూ, తిరుగుబాటు దారులను అణచివేస్తూ ఉన్నాడు. ఇతడు యువరాజుగా ఉన్న కాలంలోనే (క్రీ.శ. 1280-1289 మధ్య) కాటమరాజు యుద్ధం జరిగిఉంటుందని నేను భావిస్తున్నాను. కటియావులరాజుకథలో

ప్రతాపరుద్రుడు ప్రత్యక్షంగా ఉన్నాడు కాబట్టి ఇది చారిత్రక వీరగాథ. నేను సేకరించిన "గామాలపాడు" ప్రతిలో (గంగుల పినయెల్లయ రచన) కటియావుల రాజు–కలియుగ బేతాళుడు ప్రతాపరుద్రుని సమక్షంలోనే ద్వంద్వయుద్ధం చేసినట్లుగా ఉంది.

**రెండు రకాల కథ:–**

కటియావులరాజుకథ రెండు రకాలుగా ఉంటుందని దీనిని పాడే గాథాకారులు (కొమ్ములవారు, గొల్లసుద్దులవారు) చెపుతూ ఉంటారు: (1) "ముగ్గురు మాస్టీల కథ", (2) "ఒంటి మాస్టీని కథ" – "మాసటి" అనే పదానికి రెండు అర్థాలున్నాయి: (1) "శూరుడు", (2) "మల్లుడు". మాసటి + ఈఁడు = "మాసటీఁడు" అన్నా ఇవే అర్థాలు. "మాసటీఁడు" రూపాంతరమే "మాస్టీఁడు". దీనినే జానపదులు "మాష్టీడు"గా ఉచ్చరిస్తున్నారు. ఇది సరియైన శబ్దం కాదు.

ప్రతాతపరుద్రుని సైన్యాధ్యక్షుడైన "బేతాళరెడ్డి"యే ఈ కథలో "కలియుగ బేతాళు డు" గా పేర్కొనబడ్డాడని ఇంతకు ముందుగానే తెలియజేశాను. అతడు మహావీరుడు. అంటే "మాస్టీఁడు". అతనికి ఇద్దరు తమ్ముళ్ళున్నారు: "కన్నమాధీరుడు", "రంపాల కేశవుడు". వీరిద్దరూ కూడా మాస్టీలే! ఈ విధంగా ఓరుగల్లులో "ముగ్గురు మాస్టీలు" ఉన్నారు. వీరి ముగ్గురినీ కటియావులరాజు ద్వంద్వయుద్ధంలో చంపాడు. అందువల్ల ఈ కథకు "ముగ్గురు మాస్టీల కథ" అనే పేరు వచ్చింది.

కటియావులరాజుకథకు నేను సేకరించిన "గామాలపాడు" ప్రతిలోను, ఆరాధ్యుల పిచ్చయ్యగారు సేకరించిన "గంగదొనకొండ" ప్రతిలోను, ఓరుగంటి బేతాళుని, అతని మొదటి తమ్ముడు "కన్నమాధీరుణ్ణి" కటియావులరాజు చంపుతాడు. బేతాళుని రెండవ తమ్ముడైన "రంపాల కేశవుణ్ణి", కటియావులరాజు తమ్ముడైన "బట్టావులరాజు" (ఎఱనూకరాజు కొడుకు) చంపుతాడు. కాని నేను సేకరించిన మరియొక ప్రతి – "పెదకంటి పల్లె" ప్రతిలో ఓరుగల్లులో ఉన్న ముగ్గురు మాస్టీలనూ కటియావులరాజు ఒక్కడే చంపుతాడు.

పైన తెల్పిన మూడు కథలూ ఓరుగల్లులోని ముగ్గురు మాస్టీలను గురించీ చెపుతున్నాయి. కాబట్టి ఈ మూడూ కూడా "ముగ్గురు మాస్టీల కథ"లే అవుతాయి. కటియావులరాజు కేవలం ఓరుగంటి బేతాళుని ఒక్కణ్ణి మాత్రమే చంపినట్లుగా వేరొక కవివ్రాసిన కథ ఒకటి ఉండవచ్చును. దానిని గాథాకారులు "ఒంటిమాస్టీని కథ"గా పేర్కొనేవారు కాబోలు. ఆ కథ నాకు లభించలేదు. లేదా ముగ్గురు మాస్టీలనూ

కటియావులరాజు ఒక్కడే చంపిన కథనే "ఒంటిమాస్టీనికథ"గా పరిగణిస్తున్నారేమో తెలియదు. కటియావులరాజుకూడా గొప్ప మాస్టీదే (శూరుడే) కదా!

ఇక్కడ పాఠకులు ఒక ముఖ్యవిషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఆవుల వలురాజు (కాటమరాజు తాత) యలమంచిని పాలించాడు. (ఇది నేటి విశాఖ జిల్లాలో ఉంది). అతని తరువాత పెద్దిరాజు (కాటమరాజు తండ్రి) పదేళ్ళు పాలించి, పంపాద్రికి వెళ్ళిపోయాడు. పిమ్మట చల్ల పిన్నమనీడు (కాటమరాజు పినతల్లి కుమారుడు) యలమంచిని పాలిస్తున్నాడు. పోలురాజు చెరుకూరులో మరణించిన తరువాత పల్లికొండ అయితమరాజును తీసికొనివచ్చి, పిన్నమనీడును వోసగించి, అయితమరాజును సింహాసనమెక్కిస్తాడు. అతడు యలమంచిని కొన్నాళ్ళు పాలించి, తరువాత దానిని సింహాద్రిరాజు కుమారులకు ఇచ్చివేసి, ఓరుగల్లు సమీపంలో ఉర్లకొండ దగ్గర ఒక నగరాన్ని నిర్మించుకొని, దానికి "యలమంచి" అని పేరు పెట్టుకున్నాడు. నాకు లభించిన ఒక కటియావులరాజు కథలో ("గామాలపాడు" ప్రతిలో) కవి గంగుల పినయెల్లయ దీనిని "వుర్లకొండ యలమంచి" అని స్పష్టంగా పేర్కొన్నాడు. అయితమరాజాదులు ఇక్కడి నుండియే ఓరుగల్లు శంభుని సేవించడానికి వెడతారు. ("ఉర్లకొండ"నే కొందరు "ఉర్లుకొండ"గా ఉచ్చరిస్తున్నారు.)

**కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్యగారు సేకరించిన కటియావులరాజుకథ (గంగదొనకొండ ప్రతి) లోని ఇతివృత్తం:-**

అయితమరాజు "వుర్లకొండ యలమంచి"ని పరిపాలిస్తున్నాడు. అప్పుడు కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుడు పరిపాలిస్తున్న ఓరుగల్లునుండి "బాచన్న" అనే బ్రాహ్మణుడు "వుర్లకొండ యలమంచి"కి వచ్చి, ఆ నగర వైభవాన్ని, యాదవుల పరాక్రమాన్ని చూచి ఆశ్చర్యపోతాడు. తమ ఓరుగల్లు మొగసాలలో "కలియుగ బేతాళుడు" అనే మాస్టీడు తన బిరుదులు వ్రేలాడగట్టాడని, ఎంతటి వీరుడైనా సరే తన బిరుదుల క్రిందనుండి దూరి రాలవసిందేనని, అలా రావడానికి ఇష్టంలేనివారు తనతో ద్వంద్వయుద్ధం చేయాలని తీర్మానించాడని బాచన యలమంచి పౌరులతో చెపుతాడు. పౌరుల ద్వారా ఆవార్త కటియావులరాజు చెవిని పడింది. అతడు బేతాళుని గర్వమణచడానికి నిశ్చయించుకున్నాడు. వెంటనే అయితమరాజు దగ్గరకువెళ్ళి, ఓరుగంటి శంభుడు తన కలలో కనపడ్డాడనీ, ఆ పరమేశ్వరుని సేవించడానికి ఓరుగల్లు వెడదామని అయితమరాజును ప్రోత్సహిస్తాడు. అయితమరాజు మంత్రి పల్లికొండతో

చర్చించి, తన బంధుమిత్రులతో, అంతఃపురకాంతలతో, ఆలమందలతో, సేనలతో శంభుని సేవించడానికి వెడతాడు. ఓరుగల్లు నగరం బయట గుడార్లు వేయిస్తాడు. ప్రతాపరుద్రుడు అతనిని తన కొలువునకు ఆహ్వానిస్తాడు. తమ సంపదలకు, సేనలకు, గోగణానికి కఠియావులరాజును కాపలాగా ఉండమని చెప్పి, అయితమరాజు మంత్రి పల్లికొండతో కలిసి ప్రతాపరుద్రుని ఆస్థానానికి వెడతాడు.

కఠియావులరాజు డేరాలదగ్గర ఏడుగడియలు మాత్రమే ఉంటానని పల్లికొండకు ముందుగానే చెపుతాడు. ఏడుగడియలు దాటిపోతాయి. అందువల్ల కఠియావులరాజు తన ఉత్తమజాతి అశ్వం "గండకత్తెర" నెక్కి ఓరుగల్లు నగరంలోనికి బయలుదేరుతాడు. నగరివాకిట (మొగసాల దగ్గర) గుఱ్ఱం "గండకత్తెర" ఆగిపోతుంది. కఠియావులరాజు గుఱ్ఱం దిగి ఏమిటా అని పరిశీలిస్తాడు. కోటగుమ్మానికి బేతాళుని బిరుదులు వ్రేలాడుతూ ఉంటాయి. ఆ బిరుదుల క్రిందినుండి దూరిపోవడం మహావీరునికే కాదు, అతని గుఱ్ఱానికి కూడా అవమానమే అన్నమాట! (వీరగాథలలో వీరుడు ఎంత స్వాభిమానంతో ఉంటాడో, వీరుని గుఱ్ఱం కూడా అంతే స్వాభిమానంతో ఉంటుంది. పల్నాటి వీరచరిత్రలో అలరాచుమల్లుగారి గుఱ్ఱం "సవరాల జిమ్మడు", కాటమరాజు చరిత్రలో కఠియావులరాజు గుఱ్ఱం "గండకత్తెర" దీనికి మంచి ఉదాహరణములు.) ఆ బిరుదుల్ని తొలగించమని అక్కడున్న బేతాళుని భటుల ద్వారా వార్తనంపుతాడు. బేతాళుడు గర్వంతో ఆ వార్తను లెక్కింపడు. తన బిరుదుల క్రింద నుండి నక్కలాగ, ఈగలాగ దూరిరమ్మని పొగరుగా సమాధానం చెప్పి పంపుతాడు. కఠియావులరాజు, బేతాళుని భటులకు "నక్కచాటువ" – "ఈగచాటువ" చెపుతాడు (చాటువ = సాటువ = సాటవ = సామెత. అంటే మన పురాణాలలోను, ఇతిహాసాలలోను వచ్చే ఉపాఖ్యానం లాంటిది.) మహోగ్రుడైన కఠియావులరాజు తన ఎడమకాలితో భేతాళుని బిరుదుల్ని తన్ని పడగొట్టి నగరంలో ప్రవేశించి హనుమంతుని దేవాలయం దగ్గర శత్రువు రాకకోసం వేచి చూస్తూ ఉంటాడు.

కఠియావులరాజు ఎడమకాలితో తన బిరుదుల్ని ఊడదన్నిన విషయం తెలిసిన బేతాళుడు మండిపడి, అతనితో ద్వంద్వయుద్ధానికి సిద్ధమౌతాడు. తల్లి లింగమదేవి, భార్య చిటిగోపు యాదవులు మహాపరాక్రమవంతులని, వారితో యుద్ధం ప్రమాదకరమని ఎన్నో విధాలుగా వారిస్తారు. గర్విష్ఠియైన అతడు వారిని లెక్కింపడు. కఠియావుల రాజుతో ఎక్కటి కయ్యానికి సిద్ధమై వస్తాడు. హనుమంతుని గుడిదగ్గర ఉన్న

కటియావులరాజును తాను నిర్మించిన "కత్తులగరిడి" లోనికి రమ్మని ఆహ్వానిస్తాడు. ఇద్దరూ అక్కడికి వెడతారు.

బేతాళుడు వయసులో పెద్దవాడు (మధ్యవయస్కుడు); కటియావులరాజు యువకుడు. బేతాళుని కటారి ఐదు జేనల పొడవుంది. కటియావులరాజుకు తన తండ్రి సింహాద్రిరాజు ఇచ్చిన కటారి నాలుగు జేనల పొడవుంది. "పెద్దవాడవు కాబట్టి ముందుగా నువ్వే దెబ్బకొట్టు" అంటాడు కటియావులరాజు. బేతాళుడు తనవి రెండు హస్తాలు, తన గురువుది ఒక హస్తం, మొత్తం మూడు హస్తాలు చూపుతానంటాడు. (అంటే మూడుసార్లు తాను దెబ్బకొడతాను – attack చేస్తాను – అని అర్థం.) కటియావులరాజు అంగీకరిస్తాడు. బేతాళుడు కొట్టిన మూడు దెబ్బలను కటియావులరాజు సులభంగా తప్పించుకుంటాడు. బేతాళుడు ఆశ్చర్యపోతాడు!

కటియావులరాజు "నాకు తండ్రినాటినుండీ వస్తున్నది ఒకటేహస్తం! (అంటే "ఒక్క దెబ్బతో నువ్వు ఛస్తావు" అని హెచ్చరిక). "యాదవులు శత్రువుల్ని కూడా క్షమిస్తారు. నేను నిన్ను క్షమిస్తున్నాను. వెళ్ళిపో!" అని బేతాళునికి ప్రాణదానం చేయబోయాడు. అయినా పరమక్రూరుడు, గర్విష్ఠి అయిన బేతాళుడు ద్వంద్వ యుద్ధంనుండి వెనుదిరిగిపోవడం తనకు అవమానంగా భావిస్తాడు. అందువల్ల తప్పనిసరియై కటియావులరాజు వీరావేశంతో తన కటారి ఝళిపించి, ఒక్క దెబ్బతో బేతాళుని గుండెల్లో పొడిచాడు. అది వీపునుండి బెత్తెడుమేర బయటకు వచ్చింది. బేతాళుడు కోపంగా మీదికి రాబోయాడు. కటియావులరాజు ఎడమ చేతితో ఒక్కతోపు తోశాడు. బేతాళుడు నేలమీద పడి ప్రాణం విడిచాడు. "ఇంకా ఎవరైనా ఉంటే రండి!" అని సవాలు చేస్తాడు కటియావులాజు!

బేతాళుడు చనిపోవడం చూసి, అతని తమ్ముడు ''కన్నమాధీరుడు'' కటియావులరాజును ఎదిరిస్తాడు. అతనిని కూడా కటియావులరాజు ద్వంద్వ యుద్ధంలో చంపివేస్తాడు. తన "గండకత్తెర" గుఱ్ఱాన్ని ఎక్కి విడిదికి వెళ్ళబోతూ ఉంటే, వీథిలో బేతాళుని మరియొక తమ్ముడు "రంపాల కేశవుడు" కటియావుల రాజును ఎదిరిస్తాడు. అప్పుడే అక్కడికి వచ్చిన బట్టావులరాజు (యఅనూకరాజు కొడుకు) రంపాలకేశవునితో ఒంటిపోరు జరిపి అతనిని సంహరిస్తాడు.

బేతాళుని శిష్యులు (బోడికలు) మాస్టీల నెత్తుటి బట్టలను తెచ్చి సభలోనున్న ప్రతాపరుద్రునికి చూపుతారు. ఆ రాజు తనను నమ్మించి మోసగించినందుకు

అయితమరాజును నిందిస్తాడు. నిజానికి కటియావులరాజు గుడారాలు విడిచి నగరంలోకి వెళ్ళి ద్వంద్వయుద్ధం చేసి మాస్టీలను చంపిన సంగతి అయితమరాజుకు తెలియదు. అతని అనుమతి లేకుండా ఓరుగల్లు నగరంలోనికి వెళ్ళి బేతాళుని చంపినందులకు అయితమరాజుకు కటియావులరాజుపై చెప్పలేనంత కోపం వచ్చింది. దీనికితోడు ప్రతాపుని నింద అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. వెంటనే ప్రక్కనున్న పల్లికొండతో "కటియావులరాజును చంపి, ఆ నెత్తుటి వస్త్రాలు తెచ్చి ప్రతాపరుద్రుని కొలువులో పెట్టు. అంతవరకూ నేను సభనుండి లేవను!" అని ఆజ్ఞాపిస్తాడు. ఆపని చేయవద్దని పల్లికొండ ఎంతగానో నచ్చచెపుతాడు. కాని అయితమరాజు వినడు. ముందుచూపులేని అయితమరాజు నిర్ణయానికి మనసులోనే బాధపడి, పల్లికొండ మహాశూరుడైన కటియావులరాజును "పుల్లావులవారి మైనపుదిడ్డి(జిడ్డు) గుడారంలో రహస్యంగా దాచిపెట్టి, ఒక పునుగుపిల్లిని చంపి, దాని రక్తంతో తడిసిన కటియావులరాజు బట్టలను తెచ్చి సభలోనున్న ప్రతాపరుద్రునికి చూపుతాడు. అతడు ఆశ్చర్యపోతాడు!

ప్రతాపరుద్రుడు బలవంతులైన ఆ యాదవవీరులను ఎలాగైనా మట్టుపెట్టాలని ఆలోచిస్తాడు. పైకి అయితమరాజును ప్రశంసిస్తాడు. పగడసాలాటకు (సొగటాలాటకు – పాచికలతో జూదమాడు ఆటకు) అయితమరాజును ఆహ్వానిస్తాడు. బంగారు సింహాసనం మీద అలుగులు (కత్తులు) పాతించి, అవి కనబడకుండా వాటిమీద పీతాంబరం కప్పి, అయితమరాజును దానిపై కూర్చోమంటాడు. మోసం గమనించిన పల్లికొండ ముందుగా ఆ సింహాసనం మీద తన చేయిపెడతాడు. అలుగులన్నీ ఒక అరుగుగా మారిపోతాయి. తరువాత అయితమరాజు ఆ పసిడిగద్దెపై కూర్చుండి, ప్రతాపరుద్రునితో పాచికలాడి గెలుస్తాడు.

అప్పుడు ప్రతాపరుద్రుడు ఒక పెంకి గుఱ్ఱాన్ని తెప్పించి, అయితమరాజుకు బహూకరించి, దాని మీద స్వారీ చేయమంటాడు. అయితమరాజు తన చెల్లెలు అగుమంచి భర్తయైన పుత్తమరాజుతో "ఈ గుఱ్ఱం సంగతేమిటో కొంచెం చూడు!" అంటాడు. వెంటనే పుత్తమరాజు ఆ గుఱ్ఱంమీద చాకచక్యంగా స్వారిచేసి, దానిని అదుపులోకి తెస్తాడు (లొంగదీస్తాడు).

తరువాత ప్రతాపరుద్రుడు యాదవవీరులను తన యింట విందుకు పిలుస్తాడు. పంచభక్ష్య పరమాన్నాలతో విషం కలిపి అయితమరాజుకు వడ్డిస్తాడు. ముందుగా ఆ విస్తరిని పల్లికొండ తన చేతితో తాకుతాడు. వెంటనే "పచ్చివిషంబెల్ల భస్మమైపోయె!"

భోజనానంతరం యాదవవీరులు తమ గుణ్టాలపై విడిదికి వెళ్ళి, ఆ రాత్రి అక్కడ విశ్రాంతి తీసుకుంటారు. మర్నాడు ఉదయమే లేచి, అయితమరాజు బంధుమిత్రులతోను, అంతఃపురస్త్రీలతోను ఓరుగంటి శంభుని పూజిస్తాడు. ఎంతో భక్తితో ఆ శివుని ప్రార్థిస్తాడు. సర్వకైంకర్యములు చేయిస్తాడు. పేదసాదలకు, బ్రాహ్మణులకు కానుకలు ఇస్తాడు. తరువాత అందరూ కలిసి యలమంచికి బయలుదేరుతారు. అయితమరాజు ఎక్కిన పల్లకి ప్రక్కనే ఓరుగంటి శంభుడు లింగరూపంలో దొర్లుకుంటూ వస్తాడు. పల్లికొండ సూచనపై అయితమరాజు అతిభక్తితో ఆ శివలింగాన్ని తన పల్లకిలో ఉంచి, యలమంచికి తీసికొనివెళ్ళి అక్కడ గుడికట్టించి పూజిస్తాడు. ఇక్కడితో పిచ్చయ్యగారు సేకరించిన కథ పూర్తి అయింది. అయితే పల్లికొండ రహస్యంగా పుల్లావులవారి గుడారంలో దాచిపెట్టిన కటియావులరాజు సంగతి ఏమయిందో ఈ కథలో లేదు. (బహుశః తాళపత్ర గ్రంథంనుండి ఎత్తి వ్రాసుకొనడంలో పిచ్చయ్యగారు ఈ ఘట్టాన్ని విస్మరించి ఉండవచ్చు.)

రహస్యంగా దాచిపెట్టబడిన కటియావులరాజు సంగతి ఏమయిందో నాకు లభించిన "పెడకంటిపల్లె" ప్రతిలో వివరంగా ఉంది. దీంట్లోని కథకూడా కొన్ని అందమైన భేదాలతో పై విధంగానే సాగుతుంది. ఇందులో పల్లికొండ కటియావులరాజును గుడారంలో కాకుండా "కావుపాతర" లో దాచిపెడతాడు. ("కావుపాతర" అంటే భూమిలోపల ఏర్పరచిన రహస్యగృహం – భూగృహం – నేలమాళిగ.) శంభుని పూజించి యాదవులు తిరిగి యలమంచికి ప్రయాణమై దారిలో "గవిలికొండ" దగ్గర మజిలీ చేస్తారు. అప్పుడు ప్రతాపరుద్రుడు యాదవులను తుదముట్టించాలనే దుష్టబుద్ధితో "గవిలికొండ" మజిలీ మీదికి సేనలను పంపుతాడు. చుట్టుముట్టిన శత్రుసైన్యాన్ని చూచి అయితమరాజు దిగులు చెందుతాడు. మంత్రి పల్లికొండతో ఇలా సంభాషిస్తాడు:

అయితమరాజు:– "ఈదినం యుద్ధం ఎవరిపేరుతో ఉంది చెప్పు?"

పల్లికొండ:– "కటియావులరాజుపేరుతో ఉంది"

అయితమరాజు:– "అయితే, వెంటనే కటియావుల రాజును పిలు!"

పల్లికొండ:– "ఇంకెక్కడి కటియావులరాజు? అతనిని చంపి నెత్తుటి కోకలు చూపమన్నావు కదా! చంపి దహనం చేసివేశాను!"

అయితమరాజు మిక్కిలిగా దుఃఖిస్తాడు. యాదవులలో కటియావులరాజు మహావీరుడు. మహాభారతంలో అర్జునుని వంటివాడు. అందువల్ల ఐతమరాజు

పల్లికొండతో – "కటియావులరాజును దహనం చేసిన చోటునుండి పిడికెడు బూడిదన్నా తెచ్చి మన సేనలమీద చల్లు బావా!" అంటాడు. అలా చేస్తే తన సైన్యమంతా కటియావులరాజులాగే ధైర్యసాహసాలతో యుద్ధంచేస్తుందని అతని భావన! అంటే కటియావులరాజులోనే కాదు అతనిని దహనం చేసిన బూడిదలో కూడా అతని శౌర్యసాహసాలు చెక్కుచెదరకుండా ఉంటాయని జానపదకవి ఇక్కడ మహాద్భుతమైన కల్పన చేశాడు! (ఇటువంటి కల్పనే ఖడ్గతిక్కన కథలో కూడా వస్తుంది. తాను రణరంగంలో చనిపోయినా సరే, తెగిపడిన తన కండలు పౌరుషంతో ఎగిరెగిరి పడుతూ ఉంటాయని ఖడ్గతిక్కన తన తండ్రితో చెపుతాడు!)

"దహనం చేసిన చోట బూడిద సుడిగాలికి ఎగిరిపోయింది మరిదీ!" – పల్లికొండ

"పోనీ ఆ శ్మశానంలోని పిడికెడు మట్టన్నా తెచ్చి మన సేనలమీద చల్లు బావా!" – ఐతమరాజు

"గాలివానకు మట్టి కొట్టుకు పోయింది మరిదీ?" – పల్లికొండ

దీనితో మొదలు నరికిన చెట్టులాగ కూలిపోతాడు ఐతమరాజు. మహావీరుడైన కటియావులరాజును చేతులారా చంపుకున్నందుకు కన్నీరు మున్నీరుగా ఏడుస్తాడు. ఆ పరిస్థితి చూచి పల్లికొండ: "మరిదీ! దుఃఖించకు! కటియావులరాజును తిరిగి బ్రతికించలేకపోయినా, సరిగ్గా అటువంటి ప్రతివీరుణ్ణి ఒకణ్ణి భూమిలోంచి మొలిపిస్తాను, చూడు!" అంటాడు. అయితమరాజు సంతోషిస్తాడు.

పల్లికొండ కావుపాతర దగ్గరకు వెడతాడు. పైనున్న మూత తీస్తాడు. శత్రువుల ముట్టడిని గురించి అతనితో చెపుతాడు. అది విని కటియావులరాజు మహోగ్రుడై మండిపడి, ఖడ్గాన్ని ధరించి, తన రెక్కలగుఱ్ఱం మీద ఎక్కి, పెద్దశబ్దంచేస్తూ ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరి, గవిలికొండ రణరంగంలోకి ధుముకుతాడు. ఆ మహావీరుని చూసి శత్రుసేనలు భయంతో కకావికలై చెదిరిపోతాయి.

కటియావులరాజు ఐతమరాజును దర్శిస్తాడు. అతడు తమ్ముణ్ణి గాఢంగా కౌగిలించుకొని, అనేక విధాల గౌరవించి, వీరతాంబూలమిచ్చి, రణరంగానికి పంపుతాడు. కటియావులరాజు వీరభద్రుడిలా విజృంభించి, శత్రువుల్ని చీల్చి చెండాడుతూ, ఏడుగడియలు భయంకర యుద్ధం చేస్తాడు. ఓరుగంటివారు, పానుగంటివారు. గవిలికొండవారు, గవిచెర్లవారు మొదలైన ప్రతాపరుద్రుని సైన్యమంతా తుక్కుతుక్కుగా ఓడిపోయి, కాలికి బుద్ధిచెపుతారు. ఒంటి నిండా నెత్తుటి గాయాలతో కటియావులరాజు అయితమరాజు దగ్గరకు వస్తాడు. పల్లికొండ అతనిపై మంత్రించిన విభూతి చల్లుతాడు. అతని గాయాలన్నీ మాయమైపోతాయి!

ఐతమరాజు తన బంధుగణంతోను, సేనలతోను "గవిలికొండ" మజిలీ నుండి బయలు దేరి, "వెంకటాపురం"తో మజిలీ చేసి, అక్కడి శ్రీ వేంకటేశ్వరుని సేవిస్తాడు. అక్కడినుండి బయలుదేరి "మర్కాపురం"లో మజిలీ చేస్తాడు. అందరూ కలిసి అక్కడి చెన్నరాయలను సేవించి, ఆ రాత్రికి అక్కడ నిద్రిస్తారు. మర్నాడు బయలుదేరి యలమంచి సమీపంలోని "దర్గాలమిట్ట" దగ్గర మజిలీ చేస్తారు. అక్కడ ఐతమరాజు బ్రాహ్మణులకు, భట్టులకు దానధర్మాలు చేస్తారు. దర్గామిట్ట దగ్గర పూజలు చేసి, ఆ రాత్రి నిద్రిస్తారు. మర్నాడు ఐతమరాజు మంచి ముహూర్తం లగ్నం చూసుకొని యలమంచి నగరాన్ని ప్రవేశిస్తాడు.

ఈ కథను ఎంతో అందంగా కవితాత్మకంగా ముగిస్తాడు–దీనిని వ్రాసిన అజ్ఞాత జానపదకవి (అవతారిక లేదు కాబట్టి "అజ్ఞాతకవి" అనవలసి వస్తోంది):–

**"ఆస్తులు బాలలు ఆడశ్రీలతోను**
**పసిబిడ్డ బాలాది బంధువర్గముతోను**
**ఆవగింజంతముల్లు అరికాల నాటకుండాను**
**క్షేమాన యలమంచి చేరిరివారు!"**

ఆరాధ్యుల పిచ్చయ్యగారు సేకరించిన "గంగదొనకొండ" తాళపత్రప్రతిలోను, నేను సేకరించిన "పెదకంటిపల్లె" తాళపత్రప్రతిలోను కథాప్రణాళికలో కొంత పోలిక ఉన్నా, రచనా విధానం పూర్తిగా భిన్నంగా ఉంది. రెండూ ఇద్దరు భిన్న కవుల రచనలు అనడంలో ఏమాత్రం సందేహంలేదు. గంగదొనకొండప్రతికన్న పెదకంటిపల్లె ప్రతిలో వీరరసం, రౌద్రరసం, అద్భుతరసం ఎంతో రసవంతంగా చాకచక్యంతో పోషింపబడ్డాయి.

పల్లికొండ రహస్యంగా దాచిపెట్టిన కటియావులరాజు ఏమయ్యాడో పిచ్చయ్యగారి ప్రతిలో లేదు. అందువల్ల నా ప్రతిలోని చివరి భాగాన్ని (ముగింపును) ఈ సంపుటిలోని కటియావులరాజుకథకు అనుబంధంగా చేర్చాను. దీనిని కూడా చదివితే పాఠకులకు ఒక సమగ్రమైన అవగాహన వస్తుంది.

**2) "పుల్లరికథ లేక జన్నివాదకథ" (ముష్టిబండ ప్రతి)**

ఈ కాటమరాజుకథకు మొత్తం ఏడు పేర్లున్నాయి. పై రెండూ కాకుండా మిగిలిన ఐదుపేర్లు: ''దక్షిణాది ఆవులమేపు" – ''కాటమరాజు దక్షిణాది ఆవులమేపు'' – "దక్షిణకాండము" – "ఆవులమేపులు: దక్షిణకాండము" – ''చదరంగంకథ''. ఈ

ఏడు పేర్లలో "జన్నివాడకథ" - "కాటమరాజు దక్షిణాది ఆవులమేపు" అను రెండు పేర్లకే ప్రచారం ఎక్కువ.

ఈ తాళపత్రగ్రంథాన్ని సేకరించిన వారు డా॥ కనకబండి మోహనరావుగారు. నేటి తెలంగాణాలోని ఖమ్మంజిల్లా, దమ్మపేట మండలం, ముష్టిబండ గ్రామంలో శ్రీ దాసూరి దశరథం అనే అతడు ఈ ప్రతిని 1991లో మోహనరావుగారికి ఇచ్చాడు. ఇది మిక్కిలి అసమగ్రమైన ప్రతి. అవతారికలో ఈ కథపేరు "దక్షిణ కాండము" అని ఉంది. ఈ ప్రతిలోని మొత్తం పాదాలు 1184 మాత్రమే.

నేను ఈ జన్నివాడకథను 09-09-1964 నాడు, కృష్ణాజిల్లా, కైకలూరు తాలూకా, పెరికగూడెంలో, శ్రీ గుజ్జర్లపూడి చింతాలు అనే కొమ్ములవాడి దగ్గరనుండి సేకరించాను. దీనిని నా కాటమరాజు కథలు- రెండవ సంపుటం (1978)లో ముద్రించాను (చూ. 94-187 పుటలు). ఇది 94 పుటలతో సుమారు 3,500 పాదాలలో సాగింది. దీనిలో, అవతారికాభాగం, పుల్లరిఒప్పందంభాగం తప్ప, మిగిలిన కథంతా చాలా వివరంగా ఉంది. ఇది మోహనరావుగారు సేకరించిన ప్రతికన్నా మూడు రెట్లు పెద్దది.

డా॥ కనకబండి మోహనరావుగారు 1997లో "కాటమరాజు చరిత్ర" (క్రీ.శ. 1217-1282) అనే పుస్తకాన్ని ప్రచురించారు. ఇది వారు ఇంగ్లీషులో వ్రాసిన Ph.D. Thesis కు తెలుగు అనువాదమట - ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి చరిత్రశాఖలో దీనికి డాక్టరేటు డిగ్రీ వచ్చింది (1991). ఈ గ్రంథం అనుబంధం-IV లో "జన్నివాడకథ" (అముద్రితము) అనే పేరుతో ఈ "దక్షిణకాండము" కథను లేక "పుల్లరికథ"ను ఇచ్చారు. ఈ అముద్రితకథ "శ్రీనీలకంఠుని శిత్తమున దలచి - భ్రమరాంభకు మదిని ప్రబారినం జేశి (ప్రార్థన జేసి)" అనే పాదాలతో ప్రారంభమై, "మంతనాల రామశిలక మరిది పద్మరాఘవ - విన్నపము చేసేను యినవోయి" అనే పాదాల వరకూ 16 పుటలలో ఉంది. ఒక్కొక్క పుటలో మంజరీద్విపద రెండు పాదాలు కలిపి ఒకేపాదంగా ముద్రించారు. ఒక్కొక్క పుటలో 64 పాదాల చొప్పున 16 పుటలలో 1016 పాదాలున్నాయి. ఇంతవరకు "అముద్రితము"గా వారు సూచించారు. అంటే ఈ భాగం నేను సేకరించినకథలో లేదని వారి భావం. ఈ "అముద్రిత భాగం"లో ఇష్టదేవతా ప్రార్థన, కవి వంశాదికంతో కూడిన అవతారిక, పుల్లరి ఒప్పందం వర్ణింపబడ్డాయి. ఈ జన్నివాడకథ (దక్షిణకాండము) రచించినకవిపేరు కనకబండి గట్టయ (ఘట్టయ్య) అని అవతారికనుబట్టి తెలుస్తోంది. ఈ "అముద్రిత భాగం"

తరువాత కూడా మోహనరావుగారు మరో $2\frac{1}{2}$ పుటలలో 168 పాదాలు ముద్రించారు. కాని ఈ పుటలలోని పాదాలు నేను సేకరించిన ప్రతిలో కూడా ఇంచుమించుగా ఉన్నాయి. కాబట్టి ఈ భాగాన్ని వారు "అముద్రితము"గా పరిగణించలేదు. అయితే ఈ భాగంలో నా ప్రతిలో లేని ఒక కొత్త విషయం ఉంది. "నందివాడ చెరువు" దగ్గర కాటమరాజుగారి ఆలమందలు నీళ్ళు త్రాగకుండా "నన్నూరు మూకతో" అడ్డుకున్న "నందివాడ బేతినీడు" అనే వీరుని, యాదవవీరుడు చట్టువారి యఱ్ఱయ్య– "నడుముకు రెండు తునియలుగా నరికి పడద్రోసెను." అంతేకాదు, ఆ బేతినీడి నెత్తుటి వస్త్రాలను నెల్లూరికి పంపించాడు యఱ్ఱయ్య! ఇది పుల్లరి ఒప్పందం అతిక్రమిస్తే సంభవించే పరిణామమని నల్లసిద్ధిరాజుకు ఒక హెచ్చరిక! నెల్లూరిసీమ పచ్చికబీళ్ళలో కడుపునిండుగా మేతలు మేసిన కాటమరాజుగారి ఆలమందలను అక్కడి చెరువులో నీళ్ళు త్రాగకుండా అడ్డుకోవటం మిక్కిలి అన్యాయం కదా!

జన్నివాడకథ నాలుగు భాగాలుగా మనం అనుకుంటే, అందులో మొదటిభాగం (1184 పాదాలు) డా॥ మోహనరావుగారి ప్రతిలో ఉంది. మిగిలన మూడుభాగాలు (సుమారు 3,500 పాదాలు) నేను సేకరించిన ప్రతిలో ఉన్నాయి. అంటే జన్నివాడకథ ఆద్యంతమూ సుమారు 4,600 పాదాలతో సుదీర్ఘంగా సాగిందని గ్రహించాలి.

**మోహనరావుగారి ముష్టిబండ ప్రతిలోని "పుల్లరికథ" (స్థూలంగా):–**

ఇష్టదేవతాప్రార్థన – కవివంశాదికము – కాటమరాజు తన అపారమైన ఆలమందలతో పాలేటిని దాటుతాడు. తన పినతండ్రి పోలురాజు లింగరూపుడై వెలసిన పంచలింగాలకొండను దర్శించి పూజిస్తాడు. పోలురాజు వీరస్వర్గ మలంకరించిన చిలకలమట్టిని చెరుకూరును దర్శించి, అక్కడివారి ఆశీస్సులు తీసికొని వచ్చి, నెల్లూరుకు తూర్పు దక్షిణ దిక్కులలో గుడారాలు వేయిస్తాడు. తన మిత్రుడు పద్మరాఘవుని నల్లసిద్ధిరాజు దగ్గరకు పంపి పుల్లరిఒప్పందం చేసుకుంటాడు. నల్లసిద్ధిరాజు దురాశతో ఎన్నో షరతులు పెడతాడు. ఎంతో ధనాన్ని గుంజుతాడు. అన్నింటికీ అంగీకరిస్తారు యాదవులు. ("నీరుకు పుట్టిన పూరెల్ల మాది – ఆవుకు పుట్టిన కోడెల్ల మీది" అని పుల్లరి ఒప్పందమని కొమ్ములవారు, గొల్లసుద్దులవారు పాడుతూ ఉంటారు.) ఖడ్గతిక్కనచేత పుల్లరి కమ్మలు వ్రాయించి, మానవ సాక్షులను కాకుండా దైవసాక్షులను ఏర్పాటు చేసుకుంటారు. కాటమరాజు, నల్లసిద్ధిరాజుమీద పోలురాజుపగలు తీర్చుకోవాలని నిర్ణయించుకుంటాడు. యాదవులు నెల్లూరు భూములలో తమ ఆలమందలను యథేచ్ఛగా మేపుకుంటూ ఉంటారు. "నందివాడ చెరువు" దగ్గర

"నందివాడ బేతినీడు" అనే వీరుడు కాటమరాజుగారి ఆలమందలు నీళ్ళు త్రాగకుండా అడ్డుకుంటాడు. చట్టువారి ఎఱ్ఱయ్య అతనిని చంపివేస్తాడు.

**నేను సేకరించిన పెరికగూడెం ప్రతిలో ఉన్న మిగిలిన కథ (స్థూలంగా):–**

కాటమరాజు తాను సాధించిన పగలను గురించి బంధువులకు తెలిపి, నల్లసిద్ధిరాజుపై పోలురాజుపగలు తీర్చుకుంటానంటాడు. యాదవులు నెల్లూరు భూములలో తమ ఆలమందల్ని మేపుకుంటూఉంటారు. పల్లికొండ పెరుమాళ్ళు (నెల్లూరులోని శ్రీరంగనాథుడు) బ్రాహ్మణవేషంలో కాటమరాజు దగ్గరకు వచ్చి యాదవవంశక్రమం, జన్నివాడ గుంటి చరిత్ర చెప్పి, కాటమరాజుకు నల్లసిద్ధిరాజుతో ఏడుతరాల పగలున్నాయంటాడు. ఆలమందలు పాకనాటిలోని వరిచేలను ధ్వంసం చేస్తాయి. కాపులు (రైతులు) నల్లసిద్ధిరాజు రెండవ భార్యయైన కుందమాదేవితో మొరపెట్టుకుంటారు. ఆమె తన పెంపుడు చిలుకను పంపి, ఆలమందలను బెదిరిస్తుంది. పద్మరాఘవుడు ఆ చిలుకను చంపివేస్తాడు. కుందమాదేవి కోపించి, బోయలను పంపించి, ఆలమందలను పొడిపిస్తుంది. గాయపడిన ఆవులరక్తం వరదలై పారుతుంది. యాదవులు ఆలమందకు తగిలిన బాణాలుతీసి భద్రపరుస్తారు. చనిపోయిన ఆవులను ఎద్దులను చూచి కాటమరాజు దుఃఖిస్తాడు. వాటిని ఖననంచేసి కైలాసానికి పంపుతారు. సిద్ధిరాజును తోడితెమ్మని కాటమరాజు కంపటీలను పంపిస్తాడు. అతడు బయలుదేరబోతూంటే, కుందమాదేవి వెళ్ళవద్దని అడ్డుకుంటుంది. సిద్ధిరాజు తన పరివారాన్ని పంపిస్తాడు. ఆవుల్ని చంపలేదని ప్రమాణం చేయమంటారు యాదవులు. ఆ పరివారంలోని కుందమాదేవి పెంపుడు కొడుకు "పిన్నయ్య" ప్రమాణం చేసి చనిపోతాడు. ఖడ్గతిక్కన ఆ పిన్నయ్యను తిరిగి బ్రతికిస్తాడు. బోయలు ఆవులను వేసిన బాణాలను తెచ్చి యాదవులు తిక్కనమంత్రికి చూపుతారు. ఆయన వారిమాటలు నమ్మడు. గోసంగి వీరులు బోయల తలలు నరికితెచ్చి సత్యం పలికిస్తారు. అప్పుడు సిద్ధిరాజు పరివారం పారిపోతుంది. యాదవులు నెల్లూరికోటను ముట్టడించి ధ్వంసం చేస్తారు. పాకనాటిని ధ్వంసం చేసిన కాటమరాజు ఎఱ్ఱగడ్డపాడులో గుడారెలెత్తిస్తాడు. ఇది సుమారు 3,500 పాదాలలో సుదీర్ఘంగా సాగిన కథ. మధ్యలో కొన్ని మంచి మంచి వర్ణనలున్నాయి: వడ్లజాతులు, సిద్ధిరాజుగారి కొలువుకూటపు వర్ణన, కుందమాదేవి – ఆమె అన్న భావరాజు సంవాదం, కుందమాదేవి అలక, ఆమె దుఃస్వప్నము, సిద్ధిరాజు తల్లి గుణమతిదేవి పెద్దభార్యను ఏలుకొమ్మని కుమారునకు బుద్ధిచెప్పుట, సిద్ధిరాజు మొదటిభార్య (పట్టపురాణి) త్రిభువనదేవి సౌందర్య వర్ణన,

ఆమె పోలేరమ్మను పూజించి వరములు పొందుట – ఇత్యాది వర్ణనలు అద్భుతంగా ఉన్నాయి.

డా॥ కనకబండి మోహనరావుగారు "జన్నివాడకథ" అనే పేరుతో ప్రచురించిన "పుల్లరికథ"లో 1184 మంజరీ ద్విపద పాదాలలో ఉన్న ఇతివృత్త విశేషాలను గురించి నా సిద్ధాంత గ్రంథంలో ఈ క్రింది విధంగా విశ్లేషించాను:–

**'జన్నివాడకథ'లో 'పుల్లరికథ'**

"పుల్లరికథ/పుల్లరి ఒప్పందము/కౌలుకథ/కౌలు ఒప్పందము" – అను పేర్లతో ఒక ప్రత్యేక వీరగాథలేదు అని నేను భావించుచున్నాను. 'జన్నివాడకథ' అను 'కాటమరాజు దక్షిణాది ఆవులమేపు' కథకే 'పుల్లరికథ' అని కూడా పేరు. పుల్లరి ఒప్పంద వివరములు జన్నివాడకథాప్రారంభములోనే ఉండును. కాని నేను సేకరించిన కథలో మాత్రము అవి నష్టమైపోయినవి. ఇష్టదేవతాస్తుతి, కవివంశాదికము కూడా లేవు. 1997లో డా॥ కనకబండి మోహనరావుగారు తమ 'కాటమరాజు చరిత్ర' అను గ్రంథములో ప్రచురించిన కథకు కూడ 'పుల్లరికథ' అను పేరు లేదు; 'దక్షిణకాండము' అని మాత్రమే ఉన్నది. కాని మోహనరావుగారి దానిని 'జన్నివాడకథ' అను పేరుతో ముద్రించినారు. దీనిలో ఇష్టదేవతా ప్రార్థన, కవి వంశాదికము, పుల్లరి ఒప్పంద వివరములు 1016 మంజరీ ద్విపద పాదాలలో (16 పుటలలో) స్పష్టముగా నున్నవి. కావ్యము పేరు "దక్షిణకాండము" – అనగా "కాటమరాజు దక్షిణాది ఆవులమేపు" దీని రచయిత – "కన్నెసిరుల గోత్రుదు, యదువంశ తిలకుడు, కనకబండి కొండయ్య నందనుడు అయిన గట్టయ్య (ఘట్టయ్య)". (ఇతడు 'పోలురాజుకథ'ను, 'కంసుడు కథ' లేక 'విష్ణుభాగవతము'ను కూడ రచించినాడు.) ఈ కథలో పుల్లరి ఒప్పంద వివరములిట్లున్నవి:–

కాటమరాజు గంగతో పాలేటి ఒడ్డున తర్కవాదము చేసిన తరువాత, ఆమెకు చేయెత్తి మ్రొక్కి, గంగజాతర జరిపించి, తన విస్తారమైన ఆలమందలతో పాలేఱుదాటి, తన పినతండ్రి పోలురాజు లింగరూపుడై వెలసిన పంచలింగాల కొండను దర్శించి పూజించినాడు. తన తండ్రిపగ తీర్చినట్లుగనే పినతండ్రిపగ కూడ తీర్చెదనని ప్రతిజ్ఞ చేసినాడు. అక్కడనుండి చిలకలమట్టి దగ్గరనున్న చెఱకూరుకు వెళ్ళి, అక్కడివారి ఆశీస్సులందుకొనెను. తరువాత పాకనాటికి వచ్చి, నెల్లూరునకు తూర్పు దక్షిణ దిక్కులలో గుడారములెత్తించి, భేరీలు మ్రోగించినాడు. అది విని అదిరిపడిన నల్లసిద్ధిరాజు తన మంత్రి భీమినీడును పన్నిద్దఱు దళములతో పంపును. భీమినీడు

పద్మరాఘవుని (పద్మనాయని) బాల్యమిత్రుడు. ఇరువురును ఆప్యాయముగా పలుకరించు కొందురు. తన తండ్రి చేసిన గోహత్యా దోషమును తొలగించుకొనుటకై తాను కాటమరాజుగారి ఆలమందలతో నుంటినని పద్మనాయడు చెప్పును. కాటమరాజు భీమినీని సత్కరించును. నల్లసిద్ధిరాజునకు ఎంత ధనమైనను ఇచ్చి పుల్లరి ఒప్పందము చేసికొనిరమ్మని కాటమరాజు పద్మరాఘవుని భీమినీనితో నెల్లూరునకు పంపును.

నల్లసిద్ధిరాజు దురాశతో నెన్నియో షరతులు పెట్టును; ఎన్నియో కోర్కెలు కోరును. తన నగరములో నీలకంఠుడు, పల్లికొండ, సంగమేశ్వరుడు మున్నగు దేవతలకును; కస్తూరిసిద్ధిరాజు, ఎఱ్ఱసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, గోపాల సిద్ధిరాజు, కుమారసిద్ధిరాజు – మొదలైన తన తమ్ములకును పుత్రులకును వేలకొలది వరహాలను పుల్లరిగా చెల్లింపగోరును.

తన అక్క చెల్లెండ్రకు అరణముగా పదివేల వరహాలడుగును. "ఆకురాసే కరణానికి ఆరులక్షల వరహాలు" అడుగును. పద్మరాఘవుడు ప్రతినియమమును మిక్కిలి ఓర్పుతో అంగీకరించి, నల్లసిద్ధిరాజుతో "మీరు ధర్మము తప్పరాదు. ఆడినమాట తప్పరాదు. మా ఆలమందలకు ఏ విధమగు హాని జరిగినను, ఏ కొంచెము హాని జరిగినను పుల్లరినీయము" అని నిష్కర్షగా చెప్పును:–

**"తనువునా ధర్మంబు తప్పక మీరు**
**ఆడిన మాటలు ఆడి తప్పకుడి**
**కోడెల ఆవులకు కటకొర్రు దిగినాగాని**
**కోరిన పుల్లరి కొంచపోలేరు**
**ఆవుకాలు ఎద్దుకాలు అతిభారమైతేను**
**మీరు అడిగిన పుల్లరి మేము యిచ్చేది లేదు**
**ధరణీశ! మీ వల్ల ధర్మంబు దప్పిన**
**చాకవిండ్లవారు చెణికినాగాని**
**ధరపతీ! పుల్లరి యడుగ ధర్మంబు గాదు"**

– కాటమరాజు చరిత్ర (జన్నివాడకథ), పు. 138.

తమ పుల్లరి ఒప్పందమునకు మానవసాక్షులు లేకుండ సకల దేవతలను, నదులను, నిధులను, పారేటి పెన్నను, భూమ్యాకాశములను, సూర్యచంద్రులను సాక్షులుగా చెప్పెను పద్మరాఘవుడు. నల్లసిద్ధిరాజు ఈ షరతులకు సాక్ష్యములకు అంగీకరించి, మంత్రి ఖడ్గతిక్కనచేత పుల్లరికమ్మలు వ్రాయించి, దేవుని సన్నిధిలోనుంచి,

పద్మరాఘవునకిచ్చును.

**"పారేటి పెన్న (సాక్షి) భైరవుని సాక్షి**
**సంగమేశ్వరుండు సదాశివుని సాక్షి**
**భూమి ఆకాశంబు బొంకని సాక్షి**
**హరిహరాదులు దేవతలు అయిసాక్షిగాను**
**కమ్మలు వ్రాసిరి ధరసాక్షిగాను**
**దేవుని ముందరకు తెచ్చిరి కమ్మలు**
**తీర్థప్రసాదముల్ తెలగొప్ప నందిరి"**

– కాటమరాజు చరిత్ర (జన్నివాడకథ), పు. 139

ఈ పుల్లరి ఒప్పందము తరువాత నల్లసిద్ధిరాజు, కాటమరాజుగారి ఆలమందలకు ఏ విధమగు హానియు చేయరాదని తన వారిని హెచ్చరించెను.

ఇంతవరకునుగల కథ 1016 పాదములలో చెప్పబడినది. 1017 నుండి 1062వ పాదము వరకునుగల 46 పాదములలో కాటమరాజు నల్లసిద్ధిరాజుపై పోలురాజుపగను తీర్చుకొనగోరుట, యాదవులు నెల్లూరిభూములలో తమ కవులావులను మేపుట వర్ణింపబడినది. "వాదు దగ్గరకు వొచ్చింది శిద్ధిరాజులవారికి మనకు, పొందులు చేసినకొనిపోరాదు మనము" నుండి – ''ఆదూరి పెంట్రాల అన్నెబోయినవల్లి మేరగాను, యగవిడిసిరి కవులావుల యారాళముగను" వరకును గల 46 పాదములు నేను సేకరించిన జన్నివాడకథతో సంవదించుచున్నవి. కాబట్టి నేను సంపాదించిన కథారచయిత కూడ కనకబండి ఘట్టయ్యయే అని తేలుచున్నది.

దీని తరువాత మోహనరావుగారి కథలో 122 పాదములలో నందివాడ బేతినీడును, చట్టువారి ఎఱ్ఱయ్య చంపుట అను సంఘటన చెప్పబడినది. ఇది నా కథలో లేదు. కాటమరాజులవారి ఆలమందలు యథేచ్ఛగా కడుపునిండుగా పచ్చిక మేసి, నీళ్ళు త్రాగుటకు 'నందివాడ చెఱువు' దగ్గఱకు వెళ్ళెను. అక్కడ "నన్నూరు మూకతో నందివాడ బేతినీడు" ఆలమందలను నీళ్ళు త్రాగకుండ నడ్డగించెను. చట్టువారి ఎఱ్ఱయ్య ఆగ్రహించి, కాటమరాజుగారి అనుజ్ఞ పొంది, ఆ బేతినీడును అడ్డముగా నఱికెను. పిమ్మట. ''ఆ నెత్తురు వస్త్రములు నెల్లూరు కంపిరి''. ఇక్కడితో మోహనరావుగారి కథ ముగిసినది. ఇది అసంపూర్ణము. మిగిన కథ అంతయు నేను సేకరించిన జన్నివాడకథలో మిక్కిలి విస్తారముగా, సుమారు 3,500 పాదములలో

(94 పుటలలో) వర్ణింపబడినది. కాబట్టి పుల్లరి ఒప్పందముతో కూడిన సంపూర్ణమైన కథకే 'జన్నివాడకథ' లేక 'కాటమరాజు దక్షిణాది ఆవులమేపు' అని పేరు. దీనిని 'పుల్లరికథ' అని కూడ పిలిచెదరు.

(–తెలుగు వీరగాథాకవిత్వము, పుటలు 340–341)

డా. మోహన్‌రావుగారి పుస్తకంలో సుమారు 50 వరకు నలుపు–తెలుపు ఛాయాచిత్రాలు ఇచ్చారు. వీటిలో వీరు పాలేటిగంగ గుడిలో ఉన్న 'భక్తిరన్న' విగ్రహాన్ని 'ఓరుగంటి బేతాలుడు'గాను, గంగదొనకొండ గుడిలో ఉన్న 'అగుమంచి' విగ్రహాన్ని 'సిరిదేవి' విగ్రహంగాను పొరపాటుపడ్డారు.

**ఆ కాలంలో నెల్లూరు రాజులు:–**

కాటమరాజుకథలు మూడుతరాలకు చెందిన (క్రీ.శ' 12, 13 శతాబ్దాలకు చెందిన) యాదవవీరుల కథలు. ఆవుల వలురాజు మొదటి తరం; పెద్దిరాజు రెండవ తరం; కాటమరాజు మూడవతరం. ఆ కాలంలో నెల్లూరును తెలుగు చోడవంశానికి చెందిన ముగ్గురు రాజులు పరిపాలించారు. (1) "చోడతిక్క" లేక "మొదటి తిక్క" (క్రీ.శ. 1209–1248). ఇతనికి "ముక్కంటి" అనే బిరుదు ఉన్నట్లుగా తెలుస్తోంది. కాబట్టి "చెరుకూరు" సమీపంలో ఉన్న "చిలకలమట్టి" దగ్గర ఆలమందలతో నున్న పోలురాజుతో యుద్ధం చేసింది ఇతడే! (2) మనుమసిద్ధి (క్రీ.శ. 1248–1267). ఇతడు చోడతిక్క కొడుకు. ఇతని ఆస్థానంలో "సిద్ధనామాత్యుడు, కొమ్మనామాత్యుడు" మంత్రులుగా ఉన్నారు. వీరిద్దరూ అన్నదమ్ములు. సిద్ధనామాత్యుని కుమారుడు "ఖడ్గతిక్కన" లేక "రణతిక్కన". కొమ్మనామాత్యుని కుమారుడు "కవితిక్కన" లేక "తిక్కన సోమయాజి". తిక్కన సోమయాజిగారు కూడా మనుమసిద్ధి ఆస్థానంలోనే మంత్రిగా పనిచేశారు. (సిద్ధనామాత్యుడు మనుమసిద్ధికి దండనాథుడు. కొమ్మనామాత్యుడు, తిక్కన సోమయాజి మంత్రులు). (3) నల్లసిద్ధి (క్రీ.శ. 1270–1283). ఇతడు మనుమసిద్ధి కుమారుడు, చోడతిక్క మనుమడు. ఇతని ఆస్థానంలో ఖడ్గతిక్కన మంత్రిగాను దండనాథుడుగానూ రెండు పాత్రలు నిర్వహించాడు.

కాని డా॥ కనకబండి మోహనరావుగారు సేకరించిన "పుల్లరికథ (జన్నివాడకథ)" లో దాని రచయిత కనకబండి ఘట్టయ్య "నల్లసిద్ధిరాజు"నే కొన్నిచోట్ల "మనుమ సిద్ధిరాజు"గా పేర్కొన్నాడు. పైగా ఒకచోట నల్లసిద్ధిరాజు తన "తండ్రి"యైన "ముక్కంటి"ని ("చోడతిక్క"ని) పోలురాజు చంపివేశాడని కూడా అంటాడు. దీనిని

గురించి చరిత్రకారులలోనూ ఏకాభిప్రాయం లేదు. మధ్యయుగంలో ఆంధ్రదేశపు సామంతరాజులను గురించి పరిశోధన చేసిన డా॥ వారణాసి యశోదాదేవిగారు "చోడతిక్క" కొడుకు "మూడవ మనుమసిద్ధి" అనీ, ఇతనికే "నల్లసిద్ధి" అనే పేరుకూడా ఉందని వ్రాశారు. కాని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మాత్రం "చోడతిక్క" కొడుకు "మనుమసిద్ధి" అనీ, మనుమసిద్ధి కొడుకు "నల్లసిద్ధి" అనీ వ్రాశారు. (నేను ఈ శర్మగారినే అనుసరించాను). "మనుమసిద్ధి"–"నల్లసిద్ధి"అనేవారు ఒక్కరేనా? లేక తండ్రీ కొడుకులా? అనే విషయం చరిత్రలోనూ స్పష్టంగా తెలియడంలేదు.

**"పోలురాజు పగలు":–**

జన్నివాడకథ మొదటిభాగంలో, పుల్లరిఒప్పందం అయిన తరువాత, కాటమరాజు తన సోదరులతో ఇలా అంటాడు:–

**"పోలురాజు పగవచ్చె తమ్ములార! పోరాదు మనము**
**వాడు దగ్గరకు వచ్చెను సిద్ధిరాజులవారికి మనకు**
**పొందులు చేసికొని పోరాదు మనము"**

(– కాటమరాజుకథలు, రెండవ సంపుటం, పు. 95)

కాటమరాజు, సిద్ధిరాజు దగ్గరకు వచ్చి పుల్లరి ఒప్పందం చేసుకొనడానికి ముందు, పంచలింగాల కొండమీద లింగరూపంలో ఉన్న పోలురాజును, పోలురాజు చనిపోయిన చెరుకూరును చిలకలమట్టిని భక్తితో దర్శించి వస్తాడు. దీనినిబట్టి చూస్తే కాటమరాజు నల్లసిద్ధిరాజుతో కావాలనే తగవు పెట్టుకున్నాడనే అనుమానం మనకు కలుగుతుంది. నల్లసిద్ధిరాజు పితామహుడైన "ముక్కంటి" (చోడతిక్క) పోలురాజును చంపాడు కాబట్టి ఈ పగ. పోలురాజు భార్య సిరిదేవి కూడా కాటమరాజును ఆలమందలతో దక్షిణాదికి వెళ్ళవద్దని హెచ్చరిస్తుంది (పోలురాజు వెళ్ళి చనిపోయాడు కాబట్టి). అయినా అతడు వినడు. పోలురాజుపగ సాధించాలనే పట్టుదలతో నెల్లూరుసీమకు వస్తాడు.

**కవితిక్కన – ఖడ్గతిక్కన:–**

మహాకవియైన తిక్కన సోమయాజిగారు ఎక్కడా కూడా మహావీరుడైన తన సోదరుని గురించి చాటువుగానైనా ఒక్క పద్యం చెప్పలేదు. ఇది మనకు ఆశ్చర్యాన్ని కలిగించే విషయం! దీనికి సమాధానంగా నేనొక ఊహ చేస్తున్నాను. కవితిక్కన కన్నా ఖడ్గతిక్కన వయస్సులో చాలా చిన్నవాడై ఉంటాడు. అందువల్లనే కవితిక్కన

మనుమసిద్ధి ఆస్థానంలో ఉంటే, ఖడ్గతిక్కన మనుమసిద్ధి కుమారుడైన నల్లసిద్ధి ఆస్థానంలో ఉన్నాడు. తిక్కన సోమయాజి చనిపోయిన తరువాత ఖడ్గతిక్కన యుద్ధం జరిగి ఉంటుంది. అందువల్ల సోమయాజిగారు తన తమ్మునిపై పద్యం చెప్పలేక పోయారని నా భావన. చాటుకవులు ఖడ్గతిక్కనపై ఎన్నో పద్యాలు చెప్పారు. "పట్టపురాణి కైఫీయత్"లో ఖడ్గతిక్కనను గురించి ఒక భట్రాజు చెప్పిన అత్యద్భుతమైన సీసపద్యం ఉంది. (చూ.నా కాటమరాజుకథలు, రెండవ సంపుటం, పుటలు 748-752)

**"జన్నివాద" పేరు:-**

కవిబ్రహ్మ, ఉభయకవిమిత్రుడు అయిన తిక్కనగారు మహాభారతం తెనిగించే ముందు యజ్ఞంచేసి "సోమయాజి" అయ్యారు. నెల్లూరికి సమీపంలో పెన్నానదీ తీరంలో ఒకచోట యజ్ఞంచేశారు. అక్కడ ఒకగ్రామం ఏర్పడింది. దానికి "జన్నివాడ" అనే పేరు వచ్చింది. "యజ్ఞం" అనే తత్సమ పదానికి "జన్నం" వికృతి. "జన్నవాడ" అంటే "యజ్ఞం జరిగిన చోటు" అని అర్థం. ఆ ప్రాంతంలోనే కాటమరాజు తన ఆలమందలను మేపుకొన్నాడు. "జన్నవాడ"యే జానపద కవుల ఉచ్చారణలో "జన్నివాడ" అయింది. కాలక్రమంలో ఇది "జొన్నవాడ" అయి, ఇప్పుడు "జొన్నాడ"గా పిలువబడుతోంది. ఇక్కడ ప్రసిద్ధమైన కామాక్షీ దేవాలయం ఉంది. ఈ ఊరు నెల్లూరుకు సుమారు పది కిలోమీటర్ల దూరంలో ఉంది.

**3) బొంగరాలకథ (ఒంగోలు ప్రతి):-**

ఈ తాళపత్రగ్రంథాన్ని సేకరించినవారు నా మిత్రులు శ్రీమట్టి గురవయ్యగారు (ఒంగోలు). వీరు ప్రకాశంజిల్లా యాదవసంఘు కార్యదర్శి. ఒంగోలులో సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసువారి ఆఫీసులో ఉద్యోగం చేసి, ఇటీవలనే పదవీ విరమణ పొందారు. అనేకమైన కాటమరాజుకథలను సేకరించి ప్రచురించిన నేనంటే వీరికి చెప్పలేనంత అభిమానం. తమ యాదవసంఘం వారిచే నాకు ఒంగోలులో ఘనసన్మానం చేయించారు. వీరు ఈ తాళపత్ర గ్రంథాన్ని 2014లో సేకరించి నాకు ఇచ్చారు. దీనిని యథాతథంగా కాపీచేసి, ఆ కాగితం ప్రతిని నాకు పంపమని మిత్రులు విద్వాన్ జ్యోతి చంద్రమౌళిగారిని (అద్దంకి) కోరాను. వారు ఎంతో శ్రద్ధతో ఈ పనిని పూర్తిచేశారు. చంద్రమౌళిగారు జానపదం, చరిత్ర, పురావస్తుశాఖ, శాసనాలు - అనే నాలుగు రంగాలలో కృషి చేస్తున్నవారు.

నేను చంద్రమౌళిగారు పంపిన వ్రాతప్రతిని ఆమూలాగ్రం పరిశీలించి, పూర్తిగా పరిష్కరించాను. జానపద లేఖక దోషాలను సరిదిద్దాను. కొన్ని అచ్చతెనుగు పదాలకు

అర్థాలు ఇచ్చాను. ఈ ప్రతిలో లేని కొన్ని పాదాలను 1966లో నేను సేకరించిన తాళపత్రగ్రంథం "వేదుకబొంగరాలకథ"లో నుండి స్వీకరించాను. నాకథా ఈకథా కలిపిన మొత్తంకథకు ఉపశీర్షికలు ఉంచాను. వివరంగా పీఠిక వ్రాశాను.

ముమ్మయ్య-పోచయ్య ఆడిన బొంగరాలకథకు సంబంధించి నేను 1966లోనే మూడు తాళపత్ర గ్రంథాలు సేకరించాను:-

(1) "వేదుక బొంగరాలకథ" - దీనిని గుంటూరు జిల్లా, తెనాలి తాలూకా, ఎడవూరు గ్రామంలోని ఉన్న శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు (ఆనాటి ఆంధ్రప్రదేశ్ యాదవసంఘం కార్యదర్శి) 16-03-1966 నాడు నాకు ఇచ్చారు. ఇది యించు మించుగా సమగ్రంగానే 1500 పాదాలలో ఉంది. (ముద్రణలో 36 పుటలు వచ్చింది.) బొంగరాలాటనుండి శకునములవరకు కథ ఉంది.

(2) "అలుగులపోలు"-కడపజిల్లా, ప్రొద్దుటూరులోని శ్రీ శూలం నారాయణ అనే సుద్దులవాడు 30-04-1966నాడు నాకు ఇచ్చాడు. ఇది పై కథలో సగం ఉంది. (ముద్రణలో 18 పుటలు వచ్చింది.) బొంగరాలాటనుండి బాలురు సిరిదేవిని నిందించుటవరకు కథ వుంది.

(3) "ముమ్మయ్య-పోచయ్య బొంగరాలు" - మిక్కిలి అసమగ్రమైన ప్రతి. మొదటి పత్రం లేదు. 2 నుండి 7 పత్రాలు మాత్రమే ఉన్నాయి. దీనిని చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, పెడకంటిపల్లెలో 01-03-1966 నాడు శ్రీ తోడేటి సుబ్రహ్మణ్యం అనే కొమ్ములవాడు ఇచ్చాడు.

పై మూడు కథలు 1978లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు ప్రచురించిన, నా సంపాదకత్వంలో వెలువడిన "కాటమరాజుకథలు" రెండవ సంపుటంలో ఉన్నాయి. ఈగ్రంథాన్నే 1998లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు పునర్ముద్రణ కావించారు.

నేను సేకరించిన "వేదుక బొంగరాలకథ", శ్రీ మట్టి గురవయ్యగారు సేకరించిన "బొంగరాలకథ" భిన్నమైనవి కావు; ఒకే కవి రచించిన కథలు. అయితే రెండింటికీ రెండు ముఖ్యమైన భేదాలున్నాయి. (ఎ) నా కథలో అవతారిక ఉంది; కాని అందులో ఇష్టదేవతాప్రార్థన మాత్రమే ఉంది. కవివంశాదికం లేదు. ఈ గురవయ్యగారి ప్రతిలోని అవతారికలో ఇష్టదేవతాప్రార్థనతోపాటు కవివంశాదికం కూడా స్పష్టంగా ఉంది. ఈ "బొంగరాలకథ" రచించిన కవి పేరు "గొట్టెపాటి మల్లయ్య". ఇతని తల్లిదండ్రులు "లింగమాంబ-లింగయ్య" - ఇతని గోత్రం "పన్నీరు గోత్రం". ఈ మల్లయ్య,

"అగుమంచికథ" వ్రాసిన జరుగుపల్లె చెన్నయ్యకు శిష్యుడనని ("పాదసేవకుడ"నని) చెప్పుకున్నాడు. ఈ గొట్టిపాటి మల్లయ్యయు, నేను సేకరించిన "పంపాద్రికథ"ను రచించిన "మల్లయ్య"యు ఒక్కరే కావచ్చును. కాని వీరి తల్లిదండ్రుల పేర్లు కొంచెం భిన్నంగా ఉన్నాయి. "బొంగారల కథ" వ్రాసిన మల్లయ్య తండ్రిపేరు "లింగమయ్య" కాగా, పంపాద్రి కథారచయిత తండ్రిపేరు "జంగమయ్య". రెండు పేర్లలోనూ కొంత సామ్యమున్నది. ఈ రెండు పేర్లూ అభిన్నములనుకుంటే, ఈ యిద్దరు కవులూ ఒక్కరే అవుతారు. పంపాద్రి కథా రచయిత తన తల్లిపేరు చెప్పుకోలేదు.

**నా "వేడుక బొంగరాలకథ"లోని ఇతివృత్తం:-**

ధనముకొండలో బాలరాజులైన ముమ్మయ్య–పోచయ్యలు కొన్నాళ్ళు వేడుక బొంగరాలాడుతారు. తరువాత దేవతాబొంగరాలిమ్మని సిరిదేవిని కొమరక్కను నిర్బంధిస్తారు. వారు వలదని వారించినా, అవి తీసికొని పందెముల చవికెకు వెళ్ళి పందెములొడ్డి బొంగరాలాడుతారు. పురప్రజలు ఎందరో వచ్చి చూస్తూ వుంటారు. ఆ సమయంలో పోచయ్య తన మేనమామ ముమ్మయ్యతో వలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, యరనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, కల్లందుల పోలినేడు వీరమరణము పొందుట, వారికి తులసి తీర్థము పోయుట ప్రసక్తిని తెస్తాడు. వేగంగా వేసిన ముమ్మయ్య బొంగరం కోమటి అచ్చమ్మ కాలికి తగిలి ఆమె మూర్ఛపోతుంది. సేవలు చేశాక తెలివివచ్చి బాలరాజులను దూషిస్తుంది. వారు యింటికి వెళ్ళి సిరిదేవి ద్వారా తమ అన్నలు కాటమరాజు, అయితమరాజు మొదలైన యాదవవీరులు పాలేటి ఒడ్డున ఎఱ్ఱగడ్డపాడులో యుద్ధసన్నద్ధులై ఉన్న సంగతి తెలుసుకుంటారు. తమ్ముకూడా యుద్ధానికి పంపుమని సిరిదేవిని బలవంతం చేస్తారు. ఆమె వారిని పంపడానికి భయపడి నిరాకరిస్తుంది. చివరకు అగుమంచి ప్రోద్బలంతో వారిని ఆశీర్వదించి పంపుతుంది. ముమ్మయ్య – పోచయ్యలు ఉత్సాహంతో ససైన్యంగా యుద్ధభూమికి బయలుదేరుతారు. దారిలో వారికి కొన్ని శకునములు కలుగుతాయి. ఆశకున ఫలితాలు ఏమిటని మేనమామ ముమ్మయ్య ప్రశ్నిస్తూ ఉంటే, మేనల్లుడైన పోచయ్య వాటిని వివరించి చెపుతూ ఉంటాడు. ఇంతటితో నా ప్రతిలోని కథ ఆగిపోతుంది. ఇంతవరకూ వివిధ ఘట్టాలు చాలా వివరంగా సుమారు 1260 పాదాలలో వర్ణింపబడ్డాయి. "పాలగరుడులు రెండు పర్వకట్టి నందుకు / అరుషించి ఆవులన్న..." అనే పాదం వరకూ నేను సేకరించిన ప్రతిలో ఉంది. దీని తరువాత బాలరాజులు ప్రయాణం

చేసి ఎఱ్ఱగడ్డపాడుకు వెళ్ళటం, కాటమరాజును కలవడం, యుద్ధంచేయటానికి అనుజ్ఞ పొంది రణరంగంలో దూకటం – అనే కథాభాగం లోపించిందని నేను భావిస్తున్నాను.

ఈ "ముమ్మయ్య–పోచయ్య బొంగరాలకథ" పల్నాటివీరచరిత్రలోని "బాలచంద్రునియుద్ధం"లో వచ్చే "బొంగరాలకథ"కు మక్కికి మక్కిగా అనుకరణ. ఇదేకాదు, ఎల్లమ్మ కథాచక్రంలోని "పరశురాముని బొంగరాలు", అంకమ్మ కథాచక్రంలోని "రవద్దేవిరాజు బొంగరాలు" కూడా బాలచంద్రుని బొంగరాలకథకు ప్రతిబింబాలే!

**"శకునములు" తరువాత శ్రీమట్టి గురవయ్యగారి ప్రతిలో కొనసాగిన ఇతివృత్తం:–**

మరికొన్ని శకునములు– వాటి ఫలితములు వివరింపబడ్డాయి. బాలరాజులు చాలా దూరం ప్రయాణం చేసి, పాలేటిని సమీపిస్తూ ఉంటారు. బాలరాజులు వస్తూన్న వార్తలు విని కాటమరాజు యరణన్నను కొందరు పెద్దలను ఎదురు పంపుతాడు. ముమ్మయ్య–పోచయ్యలు వచ్చి కాటమరాజుకు, ఇతర పెద్దలకు నమస్కరిస్తారు. యుద్ధం సమీపించిన వేళ, ఏమి చేయవలెనో చెప్పుమని కాటమరాజు మంత్రి పల్లికొండను అడుగుతాడు. యుద్ధంలో యాదవులకు విజయం చేకూరుస్తానని పల్లికొండ అభయమిస్తాడు. మర్నాడు అందరూ కలిసి మాఘస్నానాలు చేస్తారు. పల్లికొండ యాదవవీరులతో కలిసి పంచలింగాలకొండ మీదికి వెళ్ళి, లింగరూపంలో ఉన్న పోలురాజును, ఇతర వీరశిలలను (వీరగల్లులను) పూజిస్తాడు.

పోలురాజు ఆజ్ఞప్రకారం, తాను బాలురైన అయితమరాజాదులను, ఆలమందలను, అంతఃపుర స్త్రీలను రక్షించి భద్రంగా యలమంచికి చేర్చిన విధమంతా ఎంతో వివరంగా పల్లికొండ లింగరూపియైన పోలురాజుకు వివరిస్తాడు. పలుకుమని అతనిని ప్రార్థిస్తాడు. ఎంత ప్రార్థించినా శిలలు పలుకవు. పల్లికొండ ఆత్మహత్యకు సిద్ధపడతాడు. అప్పుడు దేవతలు పుష్పవర్షం కురిపిస్తారు. అక్కడి చెట్లన్నీ కనువిందుగా పుష్పిస్తాయి. శిలలకు కళ వస్తుంది. ఈ మార్పునకు సంతోషించిన పల్లికొండ పోలురాజులింగానికి భక్తితో నమస్కరిస్తాడు. శిలలు పలుకుతాయి. వెంటనే కొన్ని విపరీతమైన ఉత్పాతాలు సంభవిస్తాయి. ఆకాశం మండుతుంది; ఉరుములు ఉరిమి, పిడుగులు పడతాయి. శిలలనుండి కన్నీరు కారి పానవట్టంమీద పారుతుంది. భయంకరమైన యుద్ధం జరుగబోతోందని, అది యాదవులకు కీడు తెస్తుందని పల్లికొండ చెపుతాడు. యాదవవీరులు రణోత్సాహం చూపుతారు. ఇక్కడితో కథ

ముగుస్తుంది. ఇంతవరకు అధికంగా ఉన్న కథ సుమారు 700 పాదాలలో సాగింది. ఇది సమగ్రమో, అసమగ్రమో నేను ఖచ్చితంగా చెప్పలేకపోతున్నాను. బాలరాజులు కాటమరాజు అనుమతి తీసికొని రణరంగంలోకి దూకడం ఈ బొంగరాలకథలో లేదు. ఉండవలసిన అవసరం లేదనిపిస్తోంది. అసలు ఇంకా యుద్ధమే ప్రారంభం కాలేదు కదా! యుద్ధం ప్రారంభమై కొన్ని రోజులు గడిచాక బాలరాజులు యుద్ధంలో ప్రవేశించినట్లు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో ఉంది. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట ఏడుకాండలుగా సాగింది. వీటిలో ఐదవకాండ "బాలరాజుల యుద్ధం". ఇది పది పుటలలో సుమారు 400 పాదాలలో ఉంది. ఈ భాగంలో ముమ్మయ్య– పోచయ్యల శౌర్యపరాక్రమాలు చక్కగా వర్ణింపబడ్డాయి. కాబట్టి బాలరాజులు కాటమరాజును కలవడం, పల్లికొండ లింగరూపుడైన పోలురాజును పూజించి శిలలను పలికించడం, అప్పుడు భయంకరమైన ఉత్పాతాలు సంభవించడం, పల్లికొండ వాటికి భాష్యంచెప్పడంతో ఈ బొంగరాలకథ ముగిసినట్టుగానే మనం భావించవచ్చును. శ్రీ మట్టి గురవయ్యగారి ప్రతిలోని బొంగరాల కథ మొత్తం 1924 పాదాలలో సాగింది.

ఈ కథ చివర్లో పల్లికొండ యాదవవీరులతో కలిసి పంచలింగాలకొండ మీద లింగరూపుడైన పోలురాజును పూజించే సందర్భంలో అతడు పోలురాజు శౌర్య ప్రతాపాలను, తాను బాలరాజులను రక్షించిన తీరును, సుదీర్ఘంగా వర్ణించి చెపుతాడు. అందువల్ల పాఠకులు పోలురాజుకథను సంక్షిప్తంగానైనా తెలుసుకోవడం మంచిది:-

**పోలురాజుకథ**

విశాఖజిల్లాలోని యలమంచిని పాలించిన ఆవుల వలురాజు తర్వాత, ఆతని రెండవ కుమారుడు పెద్దిరాజు సింహాసన మెక్కి, యలమంచిని పదేళ్ళు పాలిస్తాడు. తరువాత అన్నదమ్ములందరూ కలిసి ఆ సమీపంలోనే ఉన్న పంపాద్రికి వస్తారు. (నేటి తూర్పుగోదావరి జిల్లాలోని అన్నవరంకొండయే నాటి పంపాద్రి. ఇది పంపానదీ తీరంలో ఉంది.) పంపాద్రిని ఏడేళ్ళు పాలిస్తాడు పెద్దిరాజు. అందరికీ సంతానం కలుగుతుంది, ఒక్క పెద్దిరాజుకు తప్ప. అందువల్ల అతడు ఆలమందలను అన్నదమ్ములతో పంచుకొని, శివాంశసంభూతుడైన పోలురాజును ఆలమంద లన్నింటికి రాజుగా పట్టాభిషిక్తుని చేసి, సంతానంకోసం భార్య పెద్దమ్మతో కలిసి కర్ణాటకలోని కల్యాణనగరానికి వెళ్ళిపోతాడు. అక్కడ ఆ దంపతులకు కల్యాణ సోమేశ్వరునివరంచేత కాటమరాజు, పాపనూక పుడతారు.

పోలురాజు తన విస్తారమైన గోగణంతో దక్షిణాన తమిళదేశంలో ఉన్న శ్రీరంగం పుణ్యక్షేత్రానికి వెళ్ళి ఆ స్వామిని భక్తితో సేవిస్తాడు. అప్పుడు శ్రీరంగాన్ని "చోడాని" అనే రాజు పాలిస్తూ ఉంటాడు. అతడు కావేరీనదికి ఆనకట్ట కట్టిస్తూ అందరినీ వెట్టిపని చేయమని బలవంతం చేస్తూ ఉంటాడు. (బహుశః ఈ "చోడాని" యే "కరికాలచోళుడు" కావచ్చు. అతడే కదా కావేరికి ఆనకట్ట కట్టించింది!). పోలురాజును కూడా వెట్టి చేయమంటాడు. అతడు పౌరుషంతో ఎదురు తిరుగుతాడు. అక్కడినుండి పోలురాజు తన ఆలమందలతో "చెరుకూరు" సమీపంలో ఉన్న చిలకలమట్టి దగ్గర ఉంటాడు. ఆ కాలంలో నెల్లూరును "ముక్కంటి" పాలిస్తూ ఉంటాడు. (నెల్లూరును పాలించిన "చోడతిక్క" లేక "మొదటితిక్క" కు "ముక్కంటి" అనే బిరుదు ఉంది.) అతడు చోడానికి భయపడి, కావేరి వెట్టిపని చేసి, అతనికి సామంతుడయిపోతాడు.

చోడాని "చెరుకూరు"లో నున్న జంగాలను వెట్టిచేయమని ఆజ్ఞాపిస్తాడు. వారు భయపడిపోయి పోలురాజును శరణువేడుతారు. అతడు వారికి అభయమిచ్చి, కొంత సైన్యాన్ని కొందరు యాదవవీరులను వారికి సహాయంగా ఇచ్చి ఆ జంగాలను శ్రీశైలం పంపివేస్తాడు. ఈ విషయం చోడానికి తెలిసి మండిపడతాడు. పోలురాజును శిక్షించుమని తన సామంతుడైన ముక్కంటిని పంపుతాడు. ఇద్దరికీ "చెరుకూరు" సమీపంలో నున్న "చిలకలమట్టి ఠాణ్యము" దగ్గర ఘోరయుద్ధం జరుగుతుంది. ద్వంద్వయుద్ధంలో పోలురాజు ముక్కంటిని చంపుతాడు. తనకు తగిలిన గాయాలతో పోలురాజుకూడా మరణిస్తాడు. చనిపోయేముందు తన పిల్లలను పల్లికొండకు అప్పగించి కాపాడమంటాడు. అయితమరాజును యలమంచికి ప్రభువుగా చేయమంటాడు. తన భార్య సిరిదేవిని సహగమనం చేయవద్దనీ, పిల్లలను జాగ్రత్తగా పెంచమని చెపుతాడు. పల్లికొండ బాలరాజులను, అంతఃపురకాంతలను, ఆలమందలను, సైన్యాన్ని వెంటబెట్టుకొని చెరుకూరునుండి యలమంచికి బయలుదేరుతాడు. దారిలో "బల్లికురువ" దగ్గర చోడానికుమారుడు "ఇమ్మధక్కుమరాజు" ("ఇమ్మడి అక్కమరాజు" కాబోలు) వీరిని ఎదిరిస్తాడు. పల్లికొండ బొల్లావును ప్రార్థన చేయగా అది వచ్చి శత్రువులను తరిమివేస్తుంది. పల్లికొండ తన పరివారంతో క్షేమంగా యలమంచి చేరుతాడు. అప్పుడు ఆ యలమంచిని కాటమరాజు పినతల్లి కుమారుడైన చల్ల పిన్నమనీడు పాలిస్తూ ఉంటాడు. పల్లికొండ చిన్న మోసంచేసి, పిల్లమనీడును తప్పించి, అయితమరాజును సింహాసనమెక్కిస్తాడు. ఈ విధంగా పోలురాజు సంతానానికి తాను చేసిన సహాయాన్ని పల్లికొండ ఈ "బొంగరాల కథ" చివర్లో, లింగరూపంలో ఉన్న పోలురాజుకు సుదీర్ఘంగా వివరించి చెపుతాడు.

ఆవుల వలురాజు కొడుకులు ఐదుగురూ (సింహాద్రిరాజు, పెద్దిరాజు, యఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు) ఒకే సమయంలో వివిధ ప్రదేశాలలో తమ్ము శరణుజొచ్చినవారిని రక్షించడంకోసం, యుద్ధాలుచేసి చనిపోతారు. ఈ అయిదుగురూ పాలేటితీరంలో ఉన్న ఒక కొండపై లింగాలుగా వెలుస్తారు. ఐదు లింగాలు అక్కడ వెలిశాయి కాబట్టి దానికి "పంచలింగాలకొండ" అని పేరువచ్చింది. ఆ కొండ దిగువనే కాటమరాజుకోట, "తమకముచింత", రణరంగమైన ఎఱ్ఱగడ్డపాడు ఉన్నాయి.

పోలురాజు విగ్రహం కర్నూలుజిల్లా, కంభం తాలూకా, అర్ధవీడులో ఉందని తెలుస్తోంది. పంచలింగాలకొండమీద దిగంబరుడైన శివునిరూపంలో (ఇది వీరభద్రుని రూపంకూడా కావచ్చు) ఒక విగ్రహం ఉంది. దీనిని "పోలురాజు అవతారం" అని పిలుస్తారు. పోలురాజు శివుని అవతారమని యాదవులు భావిస్తారు.

ఈ కాటమరాజుకథలలో రాజ్యాలు ఏలే రాజులు వేరుగానూ, ఆలమందలను ఏలే రాజులు వేరుగానూ ఉన్నట్లుగా కనబడుతోంది. వలురాజు, పెద్దిరాజు, అయితమరాజులు – యలమంచి, పంపాద్రి, ఉర్లుకొండ యలమంచి, ధనముకొండ రాజ్యాలను పాలించారు. మొదట పోలురాజు, తరువాత కాటమరాజు ఆలమంద లన్నింటికీ రాజులుగా ఉన్నారు.

**4) పాపనూక వలపోత (గజపతినగరం ప్రతి):–**

ఈ వ్రాతప్రతిని సేకరించినవారు ఆచార్య మట్టెబోయిన జయదేవ్‌గారు. వీరు ప్రసిద్ధ జానపద సాహిత్యవేత్త. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో ఆచార్యులు గాను, శాఖాధ్యక్షులుగాను పనిచేశారు. మధ్యకోస్తా, దక్షిణకోస్తా, రాయలసీమలలో కాటమరాజుకథలను "కొమ్ములవారు గొల్లసుద్దులవారు (సుద్దులగొల్లలు)" పాడుతారు; తెలంగాణలో "మందెచ్చులవారు" "బైకానివారు" పాడుతారు; ఉత్తరకోస్తా జిల్లాలలో "పొడపోతులవారు", "తెరచీరలవారు" పాడుతారు. నాకు లభించని ఈ కథను మిత్రులు ప్రొ॥ జయదేవ్‌గారు సేకరించడం నాకు ఎంతో సంతోషాన్ని కలిగించింది.

"పాపనూక వలపోత" కథను విజయనగరం జిల్లాలోని గజపతినగరం మండలంలో పొడపోతులవారు పాడుతున్నారు. వీరి దగ్గర తమ పూర్వుల వద్ద నున్న ఒక తాళపత్రగ్రంథంనుండి ఎత్తివ్రాసుకున్న ఒక కాగితంప్రతి ఉంది. దీనిని కాపీచేసుకున్నారు ప్రొ॥ జయదేవ్‌గారు. ఈ కథను తమ D.Litt. సిద్ధాంతగ్రంథం "యాదవుల జానపద ప్రదర్శన కళలు" (2010)లో అనుబంధంగా ఇచ్చారు: (పుటలు,

513–525). ఆ వ్రాతప్రతిని తాను ఏమీ పరిష్కరించలేదనీ, యథాతథంగా ఇచ్చాననీ జయదేవ్‌గారు నాతో చెప్పారు. ఇలా ఉంటే పాఠకులకు సరిగా బోధపడదు. అందువల్ల నేను దీనిని పూర్తిగా పరిష్కరించాను. జానపదోచ్చారణతో ఉన్న కొన్ని పదాలకు పాదసూచికలలో సరియైన పదం వ్రాసి చూపించాను. కథ ఏకధాటిగా వెళ్ళిపోతూ ఉంటే పాఠకులకు సంఘటనలు తెలియవు. అందువల్ల మధ్య మధ్య ఉపశీర్షికలు ఉంచాను.

నా సిద్ధాంతగ్రంథం "తెలుగు వీరగాథాకవిత్వము"లో ఈ "పాపనూక వలపోత"ను గురించి ఈ క్రింది విధంగా వివరించాను:–

**పాపనూక వలపోత:–**

దుష్టనక్షత్రమున పుట్టినదను భయముచే, జ్యోతిషులు చెప్పిన ప్రకారము, సిరిదేవియు, అయితమరాజును, కాటమరాజు చెల్లెలగు ఈ పాపనూకను (ఆతని అనుమతితోనే) ధనముకొండ బయట ఏడంతస్తుల మేడ కట్టి అందుంచిరి. కాశికి పోయిన భక్తిరన్నకు ఈ విషయము తెలియదు. తరువాత ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో కాటమరాజాది యాదవవీరులందరును మరణించినట్లు కాశిలోనున్న భక్తిరన్నకు తెలియును. అతడు ఆఘమేఘాలమీద ధనుముకొండకు వచ్చును. అక్కడ అంతఃపురములో నందఱును కనిపింతురు కాని, పాపనూక కనిపించదు. భక్తిరన్న "పాపనూక ఏది?" అని తల్లి సిరిదేవిని ప్రశ్నించును. ఆమె ముఖము వెలవెలపోవును. పల్లికొండ భార్య 'పందుముల ఎరినప్ప' భక్తిరన్నతో పాపనూకను ఊరిబయట ఒంటిస్తంభపు మేడలో నుంచిన విషయము చెప్పును. తన తల్లి చేసిన పనికి భక్తిరన్న మిక్కిలిగా దుఃఖించును. తల్లిని నిందించును. పాపనూకను చూచిన కాని అన్నము ముట్టననును. అప్పుడు పల్లికొండ భార్య 'పందుముల ఎరినప్ప', వెలమ పద్మరాఘవుని భార్య 'పైడి ఎల్లప్ప' – ఇద్దఱును కలిసి, పాపనూక చెలికత్తెలను కూడ వెంటబెట్టుకొని, పాపనూకను పిలుచుకొని వచ్చుటకై వెడలుదురు. వారు ఏడంతస్తుల పాపనూక యొంటిస్తంభపు మేడలో నాఱవ యంతస్తు చేరగనే, అచ్చటి చిలుకలు, పావురాలు మొదలైన పక్షలు విపరీతముగా రొదచేయును. ఆ రొదనుబట్టి పందుముల ఎరినప్ప – ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో యాదవులు, పద్మరాఘవుడు గాయాలతో నొఱిగిపోయిరని 'పైడి ఎల్లప్ప' తో చెప్పును. వారు ఏడవ అంతస్తులోని పాపనూకను చేరి, కాశినుండి భక్తిరన్న వచ్చెననియు, ఆమెను తోడి తెమ్మని చెప్పెననియు, తెలియజేసిరి. కల్యాణములో 'కలబోతుల గంగమ్మ' దగ్గఱ హాయిగా నున్న తన్ను దాయాదుల దగ్గఱకు చేర్చి, తన

దురదృష్టమునకు మూలకారకుడైన భక్తిరన్నపై పాపనూకకు మిక్కిలి కోపము వచ్చెను. తరువాత కోపము నణచుకొని, తన ఒంటరి జీవితమును, తనకు జరిగిన అన్యాయమును తలచుకొని, తనకెవ్వరును బంధువులు లేరనియు, తాను మేడదిగి రాజాలననియు తెలుపును. ఈ సందర్భమున పాపనూక వలపోత మహాద్భుతముగా వర్ణింపబడినది:–

**“అన్న లనకె ఎరినప్ప ఆరదు మంట**
**నన్ను కిన్నడ జేసిన అన్నలింకెవరు? తమ్ములింకెవరు?**
**నమ్మించి తెచ్చిన నాకేటి అన్నలు?**
**అన్నలు నాకెవరు? ఆసపడ నేటికి?**
**కన్నవారికి నేను కడుద్రోహి నైతి!**
**చిలుకలు నా తోడు, జింకలు నా తోడు**
**పావురములు నాతోడు, బత్తుడన్న ఎవరు?**
**జీవిలేని ప్రతిమను నేను అయితి**
**వేటగాని పక్షి వెగసిన రీతి**
**గూట వేసిన పుణ్యగురువు వారెవరు నాకు?**
**తమ్ములకు చెల్లెలు అగుమంచి గాక**
**నన్ను సొదజేసిన నాకేటి అన్నలు?**
**పున్నెము గలవారికి అన్నలుగాని**
**అన్నెకారిని నేను అన్నలింకెవరు?**
**అగుపడ్డ పులికి ఆవు వెగసిన రీతి**
**పరవాని బాలలకు బత్తుడన్న ఎవరు?**
**చెరవుంచిన చెల్లెలుకు అన్నలింకెవరు?**
**బత్తుడన్నకు నా మీద బక్తియున్నదో లేదో**
**ఆకాశమే తండ్రి భూకాంతయే తల్లి**
**ఎక్కడ కన్నవారు ఎరినప్ప నీవు**
**కడమేడ పుట్నిల్లు, కంబమే అన్నలు!**
**కడమేడ పుట్నిల్లు కంబమే నా తోడు!**
**కర్రలే పుట్నిల్లు నిప్పులే బంధువులు!**

**మేడమీది దూలాలు మేనత్తలు నాకు!**
**నేనెట్లు వస్తునే అప్ప ఎరినప్ప?**
**అన్నదమ్ములు లేక ఆత్మబంధువులు లేక**
**బావమరుదులు లేక బంధువులు లేక**
**శివుడు నా బతుకు ఒంటి జేసె నోయమ్మ!**
**కటకట!" యనుచు కన్నీరు కార్చె.**

అక్కడ సిరిదేవిమేడలోనున్న భక్తిరన్న తన దివ్యదృష్టితో జూచి, పాపనూక మేడదిగిరాదని తెలిసికొని, ధనుముకొండతోపాటు పాపనూకమేడకూడ నగ్గిపాలగునని శపించి, ఎఱ్ఱగడ్డపాటికి పోవును. అతని శాపము ప్రకారము అగ్నిజ్వాలలు చెలరేగి, ధనుముకొండను పాపనూకమేడను దహించివేయును. ఆ మంటలలో యాదవస్త్రీలతోపాటు పాపనూక కూడ కాలిపోవును. కాటమరాజు కథలలో "పాపనూక కథ – పాపనూక వలపోత" ఈ రెండునూ మిక్కిలి హృదయ విదారకమైన కథలు. (–తెలుగు వీరగాథాకవిత్వము, పుటలు 353–354)

కాటమరాజుకథలలో "పాపనూక కథ – అగుమంచి కథ – పాపనూక వలపోత" చదువుతూ ఉంటే గురజాడవారి గేయంలోని – "వెనుక చూచిన నేమి ఫలమోయ్, మంచి గతమున కొంచెమేనోయ్" అనే మాటలు జ్ఞప్తికి వస్తాయి. స్వప్నాలను, శకునాలను, జ్యోతిషాన్ని గాఢంగా నమ్మడం మనకు అతిప్రాచీన కాలంనుండీ ఉంది. (రామాయణంలో 'త్రిజటాస్వప్నం'). రాజులు చనిపోతే రాణులు సహగమనం చేయడం మహాభారతంలో "మాద్రి" నుండీ నిన్న మొన్నటి రాజస్థాన్ యువతి "రూప్‌కన్వర్" వరకూ ఉంది. కాటమరాజుకథాకాలంలో చిన్న చిన్న రాజులు, చిన్నచిన్న రాజ్యాలు, చీటికీ మాటికీ కలహించడం, వీరులు చనిపోతే వీరపత్నులు సహగమనం చేయడం–వీటిని గురించి అభ్యుదయ ధోరణిలో ఆలోచిస్తే ఎంతో బాధ కలుగుతుంది.

క్రీ.శ. 12, 13 శతాబ్దాలలో యలమంచి, పంపాద్రి, ధనముకొండలను పాలించిన యాదవరాజులకు స్వప్నాలు, శకునాలు, జ్యోతిషం – వీటిమీద ఎంతో నమ్మకం ఉంది. ఫలితంగా ఆ రాజకుటుంబాలలోని స్త్రీలు పురుషులు ఎన్నో బాధలకు గురిఅయ్యారు. ఆవుల వలురాజు తరువాత అతని పెద్దకొడుకు సింహాద్రిరాజు రాజు కావాలి. కాని జ్యోతిషుల మాటలు నమ్మి, రెండవ కొడుకు పెద్దిరాజును రాజుచేశారు. పోలురాజు పెద్దకొడుకు భక్తిరన్నకాకుండా, రెండవ కొడుకు అయితమరాజు రాజయ్యాడు. పాపనూక దుష్టనక్షత్రంలో పుట్టడంవల్ల, ఆమె పుట్టిన ఏడవనాడే తండ్రి

పెద్దిరాజు, మారాసపువారి పగలు తీర్చడంకోసం, వాలికేతువరాజు మీదికి యుద్ధానికి వెళ్ళి, ఆర్లపెంట రణరంగంలో చనిపోయాడట! పాపనూకకు పెండ్లిచేసి అత్తవారింటికి పంపితే, పుట్టింటివారి సిరిసంపదలు నాశనమైపోతాయని జ్యోతిషులు చెపుతారు. అందువల్ల కొమరక్క కుమారుడు నాచకూళ్ళనాయుడిని ఇల్లరికం తీసుకురావాలని ప్రయత్నిస్తారు. కాని కొమరక్క తన కొడుకును ఇల్లరికం పంపడానికి ఒప్పుకోదు. దీనితో పెండ్లి పేరంటాలకు దూరమవుతుంది పాపనూక. అన్నిటికన్నా దారుణం, ఈ పాపనూకను అయితమరాజు తల్లి సిరిదేవి, దుష్టనక్షత్రంలో పుట్టిందనే కారణంతో, పెండ్లి చేయకుండా, ధనముకొండలో ఊరిబయట ఒంటిస్తంభం మేడ కట్టించి, అందులో ఒంటరిగా ఉంచడానికి నిశ్చయిస్తుంది. ఈ వార్తను ఆలమందలకడనున్న కాటమరాజుకు తెలియజేస్తుంది. ఇది తెలిసి కాటమరాజు చెల్లెలిదుస్థితికి ఎంతగానో దుఃఖించి మూర్ఛపోతాడు. కాని జ్యోతిషులమీద – వారి జ్యోతిషం మీద నమ్మకంతో చెల్లెలిని ఊరిబయట ఒంటిస్తంభంమేడలో ఉంచడానికి అంగీకరిస్తాడు. పెండ్లి కాకుండా, ఒంటరిగా, ఊరిబయట నున్న ఒక నవయౌవన యువతి మనస్సు ఎంతగా క్షోభిస్తుందో జానపదకవులు ఎంతో హృదయ విదారకంగా ఈ పాటలో వర్ణించారు.

కాటమరాజుకథలలో ఆయాకవులు ఒక కథను వ్రాస్తున్నప్పుడు ఆ కథాకథనంలో ఒక చిత్రమైన పద్ధతిని పాటిస్తూ ఉంటారు. సందర్భాన్నిబట్టి ఆయాపాత్రలచేత జరిగిపోయిన కథల ఇతివృత్తాన్ని సంక్షిప్తంగా చెప్పిస్తూ ఉంటారు. ఈ సంపుటిలోని "బొంగరాలకథ" లో పూర్వకాలంలో ఆవుల వలురాజు ఆతని కుమారులు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజులు, కల్లందుల పోలినీడు అనే మంత్రి (చిట్టినూక భర్త), యుద్ధభూమిలో చనిపోయినప్పుడు తులసి తీర్థము పోసిన విషయాన్ని పోచయ్యచేత చెప్పిస్తాడు కవి. అలాగే ఈ కథ చివర్లో పల్లికొండచేత పోలురాజుకథ అంతా చెప్పిస్తాడు. "పాపనూక వలపోత" కథలో పాపనూక తన తండ్రి "పెద్దిరాజుకథ" అంతా చెపుతుంది. ఈ విధంగా గడచిపోయిన వీరుల కథలను చెప్పడం ఇంచుమించు ప్రతికథలోను మనకు కనబడుతుంది. ఇదొక కథాకథన పద్ధతి.

**నా కాటమరాజుకథల కృతిస్వీకర్త శ్రీ టి.వి.కె. సోమయాజులుగారిని గురించి రెండు మాటలు:–**

1964–67 సంవత్సరాల మధ్య నేను ఆంధ్రదేశంలో పర్యటించి సుమారు 30 తాళపత్ర గ్రంథాలను సేకరించాను. వీటిలో ఎక్కువ భాగం కాటమరాజుకథలకు

సంబంధించినవే! 1974-75 సంవత్సరాలలో ఈ కథలనుండి 19 ప్రధాన కథలను ఆరు అనుబంధ కథలను పరిష్కరించాను. ఈ పనిలో ప్రియమిత్రులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు నాకు ఎంతగానో సహకరించారు. ఈ కాటమరాజు కథలను అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు రెండు పెద్ద పెద్ద సంపుటాలుగా ప్రచురించారు. ఒక్కొక్కటి సుమారు వేయిపుటలు ఉంది. మొదటి సంపుటం 1976 లోను, రెండవ సంపుటం 1978లోను వెలువడ్డాయి. ఈ గ్రంథాలను మా అన్నయ్య శ్రీ టి.వి.కె. సోమయాజులుగారికి (శ్రీ తంగిరాల వేంకట కృష్ణసోమయాజులు గారికి) అంకితం చేశాను. దీనికి ముఖ్యంగా మూడు కారణాలున్నాయి:-

(1) నన్ను తెలుగు సాహిత్యంవైపు మళ్ళించిన నా మొట్టమొదటి గురువు మా అన్నయ్యే!

(2) నేను 1963-64 సంవత్సరాలలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు వీరగాథలను గురించి పరిశోధన మొదలు పెట్టాను. అప్పుడు మా అన్నయ్య కృష్ణాజిల్లా "కోడూరు" గ్రామంలో తెలుగు పండితుడుగా పనిచేస్తున్నాడు. ఆ ఊరికి సమీపంలో ఉన్న "కుచ్చికాయలపూడి"లో "కొమ్ములవారు" ఉన్నారని తెలిసి, మా అన్నయ్య నన్ను అక్కడికి తీసికొని వెళ్ళాడు. శ్రీ కొడాలి సీతారామాంజనేయులు అనే కొమ్ములవాడి దగ్గరనుండి నాకు సుమారు పది తాటాకు పుస్తకాలు ఇప్పించాడు. వీటితోనే నా వీరగాథల పరిశోధనకు శ్రీకారం చుట్టాను.

(3) మూడవ కారణమూ - ముఖ్యమైన కారణమూ ఏమిటంటే:-

మా స్వగ్రామం: పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా, "కాకుల ఇల్లిందల పఱ్ఱు". మా తాతగారు తంగిరాల జగన్నశాస్త్రిగారు - వేదపండితుడు, సంస్కృత విద్వాంసుడు; 30 ఎకరాల మాగాణిపొలం కలిగిన భూస్వామి. (కాని చదువుకున్న మూర్ఖుడు, కోపిష్ఠి, మొండివాడు, పరమదుర్మార్గుడు. సొంత కొడుకును, కోడలిని, మనుమల్ని అష్టకష్టాలపాలుచేసిన నీచుడు!) ఆయనకు మా నాన్నగారు ఒక్కడే కొడుకు; తరువాత ముగ్గురు కూతుళ్ళు. (వీళ్ళ తర్వాత ఒక తెలివైన కొడుకు, ఒక అమాయకురాలైన కూతురు పుట్టారుకాని, వాళ్ళు బాల్యంలోనే చనిపోయారు.) మా నాన్నగారు - తంగిరాల వెంకట సుబ్బావధానులు గారు కూడా గొప్ప వేదపండితుడే! ఎత్తుగా, మంచి బలంగా ఉండేవాడు. కాని లోకజ్ఞానం బొత్తిగా లేనివాడు, శుద్ధ అమాయకుడు. ఊళ్ళో అందరూ ఆయన్ని "వెఱ్ఱి సుబ్బన్నగారు" అని పిలిచేవారు; తరచుగా గేలిచేసేవారు. అటువంటి పెండ్లి కొడుక్కి పిల్లనిచ్చాడు మా మాతామహుడు.

"ఒక్కడే కొడుకు; 30 ఎకరాల ఆస్తి, అంతా మాగాణి భూమి!" అని మనసులో సంతోషపడి, గారాబంగా పెంచుకున్న తన పెద్దకూతుర్నిచ్చి, మూడెకరాల ఆస్తి కట్నంగా ఇచ్చి, అతి వైభవంగా పెండ్లి చేశాడు. పెళ్ళి కొడుకు అమాయకంగా ఉన్నాడేమిటా? అని ఆలోచించలేదు. మా జగ్గన్న తాత కూడా చెప్పలేదు; దాచిపెట్టాడు. తన వెఱ్ఱిబాగులకొడుక్కి పెళ్ళి అయితే చాలురా దేవుడా! అని మనసులో అనుకున్నాడు. తరువాత క్రమంగా పుట్టిన పిల్లలమైన మాకు, పుట్టగానే "వెఱ్ఱి సుబ్బన్నగారి పిల్లలు" అని ముద్రపడిపోయింది. సంఘంలో అందరూ మమ్మల్ని చాలా చులకనగా చూసేవారు. మా తల్లిదండ్రులకు మొదట ఇద్దరు ఆడపిల్లలు, తరువాత నలుగురు మగపిల్లలు (మూడవ కాన్పులో పుట్టిన 'సోదులు' అనే ఆడపిల్ల, చిట్టచివర పుట్టిన 'జగన్నాథం' అనే మగపిల్లవాడు బాల్యంలోనే చనిపోయారు).

మా అష్టకష్టాలకూ, అవమానాలకూ అన్నింటికీ ముఖ్యకారకుడు పరమదుర్మార్గుడైన మా జగ్గన్నతాత! మా అమ్మను నరకయాతనలకు గురిచేశాడు. తరచుగా కోపంతో కొడుతూ ఉండేవాడు. "కొడుకు అమాయకుడు; కోడల్ని కొడితే దిక్కెవ్వరు?" అని ఆ నీచ నికృష్ట మానవుని ఆలోచన. అమాయకుడైన మా నాన్నను మోసంచేసి, ఆయనచేత సంతకాలు పెట్టించుకొని, మొత్తం 30 ఎకరాల మాగాణి భూమిని, ఒక ఎకరం విస్తీర్ణంలో కట్టిన రెండు పెద్ద పెద్ద పెంకుటిళ్ళను (అందులో ఒకటి మండువా లోగిలి) మా మేనత్తలు ముగ్గురికీ పంచివేశాడు. ఇద్దరు అల్లుళ్ళను ఇల్లరికం తెచ్చుకొని ఇంట్లో పెట్టుకున్నాడు. మా అమ్మనీ నాన్ననీ ఇంట్లోంచి గెంటివేశాడు.

ఆ ఊళ్లోనే ఉన్న, తన వాళ్ళకు చెందిన ఒక దిక్కుమాలిన తాటాకు కొంపలో ఉండమన్నాడు. నెలకి బస్తాబియ్యం, పదిరూపాయలు ఇవ్వడానికి ఊరిపెద్దల దగ్గర, ప్రెసిడెంటు రెడ్డి వెంకటస్వామి దగ్గర ఒప్పుకున్నాడు మా తాత. అది కూడా సరిగ్గా యివ్వకుండా మా అమ్మను ఏడిపించేవాడు. ఆ తాటాకు కొంపను నేయించేవాడు కాదు. వానకాలంలో ఇల్లంతా వాన కురిసేది. చంటీవెంటా సంతానంతో నానా అవస్థలూ పడేది మా అమ్మ. కన్న కొడుకునీ, కోడలినీ ఆగర్భశత్రువులుగా చూసే పరమ కర్కోటకుడు, హృదయంలేని కిరాతకుడు మా తాత! అటువంటి దుష్టుడు ఈ ప్రపంచంలో ఎవ్వడూ ఉండడు!

ఆ తాటాకు కొంపలో కొన్నాళ్ళు ఉండి తరువాత 1939లో మా ఊరికి దగ్గరలో, పేద రైతుకూలీలు కాపురముండే ఒక మిక్కిలి అనాగరికమైన కుగ్రామం (పేరు:

"గోపాలపురం") చేరాము. అక్కడ మా తాత కట్టించిన ఒక సత్రంలో తలదాచుకున్నాం. మా అమ్మ స్వతంత్రంగా బ్రతకడం మొదలుపెట్టింది. కాని, పాపిష్ఠివాడైన మా తాత అక్కడికి కూడా వచ్చి ఒకసారి మా అమ్మను కొట్టాడు. నేపాళం కొమ్మవిరిచి క్రూరంగా కొడుతూ వుంటే మా అమ్మ నేలమీదపడి పొర్లి పొర్లి ఏడ్చింది. అప్పుడు నాకు ఐదేళ్ళు; మా అన్నయ్యకు తొమ్మిదేళ్ళు! చిన్నపిల్లలం ఏం చెయ్యగలం? మేము కూడా ఏడుస్తూ చూస్తూ ఉండిపోయాం! ఆదృశ్యం ఇప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తూ ఉంటుంది. అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆ నీచుడైన మా తాతను మనసులో బండబూతులు తిట్టుకుంటూ ఉంటాను. ఒక పరమదుర్మార్గుణ్ణి గురించి తిట్టడానికి మనభాషలో ఎన్నితిట్లు ఉన్నాయో, వర్ణించడానికి ఎన్ని విశేషణాలు ఉన్నాయో, అవన్నీ మా జగ్గన్న తాతకు సరిగ్గా సరిపోతాయి! మా నాన్నకు ఒక తెలివైన మంచి చురుకైన తమ్ముడు ఉండేవాడని చెప్పాను కదా! అతడు 15 ఏళ్ళు పెరిగి గుండెజబ్బుతో చనిపోయాడు. ఆయన్ని "అబ్బిగాడు"అని పిలిచేవారు. అసలు పేరు "సూర్యనారాయణ". ఆయన చనిపోయినప్పుడు మా తాత–మా నాయనమ్మ "అయినవాడు పోయాడు; కాని వాడు బ్రతికాడు!" అన్నారు. మా నాన్న ఎంత అమాయకుడైనా ఆ మాటకి అర్థం తెలుసు. "మా అమ్మా నాన్నా ఇలా అన్నారు!" అని కనపడిన ప్రతివాడి దగ్గరా చెప్పుకొని ఎంతో బాధపడేవాడు.

మా మాతామహుడు భళ్ళమూడి కృష్ణమూర్తిగారు (ప్లీడరుగుమాస్తాగా పనిచేసేవాడు) కోర్టులో కేసువేసి పోరాడితే, మా జగ్గన్న తాత, మసిపూసి మారేడుకాయ చేసి, తనకున్న 30 ఎకరాలు దాచిపెట్టి, 12 ఎకరాలు చూపించి, దానిని మూడు వాటాలుగా వేసి, మాకు 4 ఎకరాలు ఇచ్చాడు. దానితో మా అమ్మగారు అష్టకష్టాలుపడి మమ్మల్ని పెంచి పెద్దచేసింది. ఒక ఎకరం పొలం అమ్మివేసి మా చిన్నక్కయ్య పెళ్ళిచేసింది. తనకు పుట్టింటివారు ఇచ్చిన మూడు ఎకరాల భూమిని అమ్మివేసి, మాకు చదువులు చెప్పించింది. తన నడుముకు ఉన్న వడ్డాణం అమ్మివేసి తణుకులో 618 చదరపు గజాల ఇంటిస్థలం కొన్నది. (ఇప్పుడు దాని ఖరీదు రెండు కోట్లరూపాయలు). మేము 1939 నుండి 1948 వరకు తొమ్మిదేళ్ళు గోపాలపురంలోనే ఉండి, తరువాత చదువుల నిమిత్తం తణుకు వచ్చి స్థిరపడ్డాం. 1948 నుండి తణుకే మా స్వగ్రామం అయింది.

ఇంతలో (1951లో) మా అన్నయ్య చేతికి ఎదిగివచ్చాడు. 20 సంవత్సరాలు నిండగానే భాషాప్రవీణలో ఉత్తీర్ణుడై, తెలుగు పండితుడుగా ఉద్యోగంలో చేరి, మా

అమ్మకు కొండంత అండగా నిలిచాడు. తిక్కనగారు చెప్పినట్టుగా "పెట్టనికోట నీకు హరి" అన్నట్టుగా ఉండి రక్షించాడు. ఈ విధంగా మా అమ్మ – మా అన్నయ్య – ఇద్దరూ కలిసి, మా సంసారనౌక కష్టాల తుఫానుగాలుల్లో మునిగిపోకుండా కాపాడి, సురక్షితంగా ఒడ్డుకు చేర్చారు. అందుకే మొట్టమొదట (1976–78లో) ముద్రితమైన నా రచన "కాటమరాజుకథలు" (ఒకటి – రెండు సంపుటాలు) మా అన్నయ్యకు అంకితం ఇచ్చాను. ఈ మూడవ సంపుటం కూడా ఆయనకే అంకితం!

గత డిసెంబరులో 90 శరత్తులు నిండిన మా అన్నయ్య ఇటీవల నాతో ఒక మాట అన్నాడు: "ఒరేయ్! సుబ్బారావ్! మన జగ్గన్నతాత వంటి పరమదుర్మార్గుణ్ణి నా జీవితంలో ఇంకొకణ్ణి చూడలేదురా! కొడుకు అమాయకుడైతే, వాడిని ఎంతో ప్రేమతో చూడాలి; కోడల్ని ఆదరించాలి; మనుమల్ని జాగ్రత్తగా బాధ్యతగా పెంచి పెద్దచేయాలి. ఇది 'మనిషి' అన్నవాడి కనీస కర్తవ్యం; సత్పురుషునికిది రక్తగత లక్షణం. మన తాత అసలు మనిషేకాడు! ఇంక సత్పురుషుడెలా అవుతాడు? అంతటి పాపిష్ఠి ముండాకొడుకు ఈ భూప్రపంచంలో మరొకడు ఉండడురా!"

అటువంటి మహాక్రూరుడి కోరల్లో నుండి ఎంతో నేర్పుతో మమ్మల్ని తప్పించి, అభ్యుదయపథంలో నడిపించిన అగ్రశ్రేణి నాయకుడు మా అన్నయ్య! దీనికి దైవకృప కూడా తోడయిందనుకోండి. అది వేరే విషయం. సత్యంకోసం, ధర్మంకోసం చేసే ఉత్తమ పురుష ప్రయత్నానికి దైవం తోడ్పాటు ఎప్పుడూ ఉంటుంది కదా!

చివరికి ఆ భగవంతుడు తన తీర్పును ఇలా ఇచ్చాడు:– మా అమ్మనీ, ఆమె పిల్లల్ని సర్వనాశనం చేసి, అడుక్కుతినేలా చెయ్యాలని కంకణం కట్టుకున్న మా జగ్గన్న తాత అన్ని విధాలా ఓడిపోయాడు. మా అమ్మ తన నలుగురు పిల్లల్నీ బాగా చదివించి, ఉన్నత స్థితిలో ఉండి, కీర్తి ప్రతిష్ఠలు గడిచేలా చేసింది. మా అభ్యుదయాన్ని కళ్ళారా చూసి ఆనందించి 84 సంవత్సరాల నిండు జీవితాన్ని జీవించింది. మా తాత రకరకాల అనారోగ్యాలతో దుర్భర జీవితాన్ని గడిపి 72 ఏళ్ళకే చనిపోయాడు. మా ఆస్తిని ఇంటిని అన్నీ దిగమ్రింగిన మా ముగ్గురు మేనత్తల కొడుకుల్లోనూ ఎవ్వడూ పైకి రాలేదు; అంతంతమాత్రంగానే బ్రతికారు. పైగా అందరూ అల్పాయుష్కులుగా వెళ్ళిపోయారు. మా నలుగురు అన్నదమ్ములం ఇప్పుడు మంచి ఉన్నత స్థితిలో సుఖంగా ఉన్నాం; 90–86–84–82 సంవత్సరాల వయస్సులో ఆరోగ్యంగా బ్రతుకుతున్నాం. ఇదంతా ఏమిటి? ఏడేడు పధ్నాలుగు లోకాల అధినాథుడైన ఆ పరమేశ్వరుని తీర్పు! ఇది సర్వోన్నత న్యాయస్థానంలో ముఖ్యన్యాయాధీశుడు (Chief Justice) ఇచ్చే తీర్పుకన్నా విశిష్టమైనది. దీనికి తిరుగు లేదు!

## ఈ సంపుటిలోని వీరగాథలు

నేను ప్రచురిస్తున్న ఈ కాటమరాజుకథలు - మూడవ సంపుటానికి ముఖచిత్రంగా కటియావులరాజు తన "గండకత్తెర" గుఱ్ఱంమీద ఎక్కి ఓరుగల్లు కోటగుమ్మం దగ్గర ఉన్నట్టుగా ఒక చిత్రం వేయించాను. దీనికి ఆధారం "మిసిమి" మాసపత్రికవారు ప్రచురించిన "చిత్రకళానీరాజనం". దీనిలో దేవిడ్ (క్రీ.శ. 1748-1824) అనే ప్రముఖ ఫ్రెంచి చిత్రకారుడు వేసిన ప్రపంచ మహావీరుడు "నెపోలియన్ బొనాపార్టి" చిత్రం ఉంది; మహాద్భుతమైన చిత్రం! దీనిని అనుకరిస్తూ కటియావులరాజు చిత్రం వేయమని బెజవాడలోని చిత్రకారుడు శ్రీ అరసవల్లి గిరిధర్‌గారిని కోరాను. 'మిసిమి' సంపాదకులు శ్రీ వల్లభనేని అశ్వినీ కుమార్‌గారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను...

పాలేటి గంగగుడిలోని ఫోటోలు తీసి పంపిన మిత్రులు శ్రీ పావళ్ళ మహేష్‌గారికి, ముఖచిత్ర రచన చేసిన శ్రీ అరసవల్లి గిరిధర్‌గారికి, శ్రద్ధతో డి.టి.పి. చేసిన ప్రియశిష్యుడు డా. తోట వెంకటస్వామికి, ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీ పి.ఎస్. వెంకటేశ్ బాబుగారికి నా అనంతమైన ఆశీస్సులు...



# క్రీ.శ. 1750 లో యాదవగాథాకారుల వర్ణన

క్రీ.శ. 1750 ప్రాంతమునకు చెందిన అయ్యలరాజు నారాయణామాత్యుడను కవి తన "హంసవింశతి" కావ్యములో కాటమరాజుకథలు పాడెడి గొల్లసుద్దులవారిని అతివిపులముగా వర్ణించెను. ద్వితీయాశ్వాసమున 87వ పద్యము నుండి 91వ పద్యము వఱకును ఇది కొనసాగినది. అందు సుద్దులగొల్లల ప్రసక్తి యిట్లుండును:

**ఉ॥ కొమ్ములు, వీరణాలు, జిగి గుల్కెడు వ్రాఁతల కృష్ణలీలలం**
**గ్రమ్ము గుడార్లు, వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్**
**బమ్మిన పుస్తకాలు, ముఖపట్టిక కట్టు రుమాలలున్, నెఱా**
**సొమ్ములు, నామముల్ వెలయు, సుద్దులగొల్లలు వచ్చి రెంతయున్.**
(2-87)

**సీ॥ ఫెళఫెళ వీరణాల్ ఖలిపెళి వాయించి,**
**పోటుచో కొమ్ములు నాట నూఁది;**
**దొనగొండ గంగను దొలుత సన్నుతి చేసి,**
**కృష్ణున కతిభక్తిఁ గేలు మోడ్చి;**
**యాదికాలపు గౌండ్ర నందఱఁ గొనియాడి,**
**తాతతండ్రుల పేళ్ళు దలఁచి పొగడి;**
**బిరుదుల నరుదుగాఁ బేర్కొని మొఱయించి,**
**దీవించి వీరుల త్రోవ లెన్ని;**

**తే॥ కులముపెద్దల కథ లామికొనఁగఁ జెప్పి,**
**సివము పుట్టించి, పుత్రులఁ జెందఁగలరు,**
**వీరులను గొల్వుఁడని తెల్పి, వీడుకొల్పఁ,**
**జనిరి సుద్దులగొల్లలు సంతసిల్లి.** (2-89)

కాటమరాజును గంగను కొలుచుటచే సంతానప్రాప్తి యగునని చెప్పబడినది (2-91).

# కటియావులరాజుకథ

## (ద్విపద)

శ్రీరంగశాయి యాశ్రితఫలదాయి
కారుణ్యమూర్తి శ్రీకరుణాకటాక్షు
పక్షీంద్రవాహను ఫణిరాజశయను
రాక్షససంహారు రమణీయగాత్రు
వేదాంతవేద్యుని వేదగోచరుని
సాధుజనానందు సద్గురుస్వామి
కందర్పజనకుని కలుషసంహారు
ఇందిరాలోలుని యిభరాజవరదు
నవనీతచోరుండు నారాయణుండు
భువనరక్షకు డాదిపురుషోత్తముండు
ముజ్జగము భువనములు పదునాల్గు
బొజ్జలో నిడుకొన్న భుజగేంద్రశయను
గొనియాడి పదివేల గుణములచేత
ఘనమైన శ్రీలక్ష్మిగని కొనియాడి
పశుపతి గీర్తించి పార్వతీరమణు
విశదము కొనియాడి విఖ్యాతితోడ
వనజాసనుని వేడి వాణి ప్రార్థించి
వినుతి జేసెద సర్వవిద్యల గురువు
గణనకు మిక్కిలి గణనాయకుండు
గణుతించి మిగుల సత్కవులను వేడి
రంగైన కటియావురాజు పోట్లాట
శృంగారమును వాని శూరత్వమహిమ

వినవేడుకగు మీకు విశదంబుగాను
వినిపింతు వినరయ్య వివరమంతయును

**–: *ఎలమంచిపురవర్ణన :–**

ఇలయందు కీర్తులు వెలసి పెంపొందు
యెలమంచిపట్టణం బెరిగింతు వినుడు
(మలయుచు)తోరణ మంటపంబులును
వలయమౌ కోటలు వన తటాకములు
మేడలు వాడలు మిగుల వీథులును
గోడల(బలమగు గొప్ప లోగిళు)లు
బంగారు గోడలు పరుపైన యిండ్లు
రంగైన వీథులు రచ్చపందిళ్లు
వేదవిద్వాంసులౌ విప్రబజార్లు
మదగజంబులబట్టి మట్టిమల్లాడు
క్షత్రియవరులుండు చాలబజార్లు
ధనపతినోడించు ధనవంతులైన
(గణు) తింపవైశ్యులు గలుగుబజార్లు
ధనధాన్యములచేత ధరణి శోభిల్లు
వనర చక్కని శూద్రవాడలు వుండు
అటువంటి పట్టణం అయితమరాజు
కుటిలకుంతలగంగ కృప చాల గలిగి
అన్నలు దమ్ములు అనుమతిచేత

* ఇది నేటి విశాఖజిల్లాలోని “ఎలమంచిలి” కాదు; నల్లగొండజిల్లాలోని “ఉర్లుకొండ యలమంచి”గా గుర్తింపవలెను. విశాఖజిల్లాలోని ఎలమంచిని మొదట ఆవుల వలురాజు, తరువాత అతని కుమారుడు పెద్దిరాజు పరిపాలించారు. పెద్దిరాజు తరువాత చల్ల పిన్నమనీడు కొంతకాలము, పిమ్మట అయితమరాజు కొంతకాలము పాలించారు. అనంతరము దానిని సింహాద్రిరాజు పిల్లలకు ఇచ్చివేసి, నేటి నల్లగొండజిల్లాలో ఒక నగరాన్ని నిర్మించుకొని, దానికి “యలమంచి” అని పేరుపెట్టుకున్నాడు ఐతమరాజు. ఈ నగరమునుండియే యాదవులు ఓరుగంటిశంభుని తిరునాళ్ళకు వెళ్ళారు.

పన్నుగా ఎలమంచి పాలించు నతడు
(యరయంగ నా యే) డు యలమంచి గంగ
తిరుణాళ్ళ సాగించ ధీరుడైతన్న
దిక్కుదిక్కులవారు దేవితీర్థముకు
గ్రక్కున నేగిరి గంగను (కొలువ
బాచన) యనువాడు బ్రాహ్మణోత్తముడు
యాచకవృత్తిచే యడతిర్గి భూమి
ఎలమంచి గంగాంబయాత్ర చూచుటకు
(పొలుపొందు) ఓర్గంటిపురినుండి వెడలి
దినదినం బొకతావు దిగి లేచి నడచి
చనుదెంచె గంగాంబ జాతర జూడ
కోటచక్కదనంబు కొమ్మల (తీరు)
సాటిలేట కవాటచల్వంబు జూచి
కళగన్లు బంగారు కలశముల్ జూచి
ఓడుబిల్లనగరు ఉన్నతం జూచి
చక్కని గంగాంబ జాత(ర విధము)
(చొక్కుచు) జూచి భూసుర కులోత్తముడు
వలురాజు మనుమలు వార్తమన్నీలు
కలయ సాధనజేయు గరిడీలు జూచి
ఐతన్న (గరిడిపై హను)మంతు పడగ
పైతట్టుగా నున్న బాచన్న జూచి
బట్టాలరాజు భూపతి గర్డిమీద
కట్టిన బసవశంకర బిర్దు (జూచి)
కతియావులాన్వయు గరిడిమీదటను
బిరుదైన పరగండభేరుండ పడగ
చయ్యన ధరణిపై జనపాలవరులు
కయ్య(ము గోరి తా) కట్టిన బిరుదు

ముమ్మన్న గరిడిపై ముమ్మరంబైన
సమ్మతి సింహధ్వజంబును జూచి
పుత్తన్న గరిడిపై భూచక్రగొడుగు
(యెత్తియు నుం)డగ విప్రుడు జూచె
పోచన్న గరిడిపై పులితోలు పడగ
బాచన్న కన్నులపండుగ జూచె
నేతి ముద్దయ గరిడి నెరియ (మిన్నంది
ఖ్యాతి) నున్న పడగకాంతి తాజూచె
వాచకూళ్లనాయ్ను నడిగర్డిమీద
కాశ్మీర గండర గండర బిరుదు
లన్నియు నంద(ందు నందముగొలు) పు
ఎన్న శక్యము గాదు యిటునటు వున్న
కనికని బాచన్న కలకల నవ్వె

**–: బాచన్న తన ప్రక్కనున్న జనులతో ఓరుగంటికోట మొగసాల గట్టిన బిరుదులను గురించి చెప్పుట :–**

తన చెంత జనులను తాజూచి పలికె:
"విసర(య్య మీరలు) వెక్కసంబనక
ఘనమైన బిరుదులు కట్టియున్నవిగ
ఎంత బలాఢ్యులు యెంత విక్రములు
ఎంత సాహసపరు లెంతటి మేటి
కనిపించలేదని కట్టించినారు
పనికిమాలినబిర్దు బడుగులవారు
కాకుంటె యిటువలె కట్టునా బిరుదు
చేకొనచెల్లు (నా చెల్ల బో వీం)డ్లు
గడియైన మా ఓరుగంటి పురమున
పుడమి కశక్యమై పొదలుచు నుండు
అగ్గలంబుగ వారు అతిపరాక్రములు

ముగ్గురు మాష్టీలు మురియుచు నుండె
కరిమారు బేతాళు కన్నమవరుడు
కరిమారు రంపాల కేశవాన్వయుడు
వారి(కి మించిన వార్త)గలట్టి
పేరైన మొనగాడు బేతాలుడొకడు
ముత్తూము బిరుదులు మొగసాలవద్ద
కత్తులబోను(గా కట్టించినాడు
చూడగ రాజుల చొచ్చి రమ్మనుచు
గాడిశ మేకులు కట్టించినాడు
వచ్చిరి రాజులు వంచింపబడదు
మచ్చర ముడిగించి మగిడించినాడు,
విడుమని రాజులు యేతెంతురనుచు
పుడమిని బిరుదులు పొడిగించినాడు
చంపుదామని వచ్చి సకలభూపతులు
చెంపలు తగిలియు చెల్లియున్నారు
కదిలిందతుమని వచ్చి ఘనమన్నెవారు
మొదలూడి కొందఱు ముగిసిపోయిరిగ
బంటుకు తగు (గాని బాగుగా బి)రుదు
తుంటవారికి యేల దొరకొను బిరుదు"
అనియిట్లు బాచన్న ఆడు వాక్యములు
వినువారు వార్తలు వేగమె పోయి
కటియావులన్నకు కడువిన్నవింప
కటియాలరాజు తా కలకలనవ్వి
"సాటిలేదని వుంటి జగమున బంటు
నేటికి గలిపించె నెలత గం(గాంబ"
అని మనమున) పొంగి యమితసాహసుడు
గొనకొని ఐత(న్న కొలువున్న) కడకు

చనుదెంచి ఐతన్న సరస కూర్చుండి
"వినవయ్య! ఐతన్న! యీ రేయి కలలొ
కనుగొంటి యా ఓరుగంటి లిం(గమును)
ఎలమితో యిలు తీర్థ మేతెంచ తనకు
చెలగి సంతోషము సేవించు మనెను
తరువాత దీనికేదారి నడచెదవొ
తెఱగును దో(పదే తెఱగెటొ) దెలుపు"
అనవిని పందుముల హరిని వీక్షించి
వినుమని ఐతన్న యిట్లుగ బలికె:
"నీరజదళనేత్ర! నీలవర్ణుండ!
చారుజ(నానంద! జగతీ)ధరేంద్ర!
వసుధ యాదవపక్ష! వరజగద్రక్ష!
వెసగ శ్రీహరి దేవ! విను విను బావ!
కరకంఠుడగు ఓరుగంటి పుర్హరుడు
(కఱియావుల)న్నకు కలలోన వచ్చి
సేవించుమని చాల చెప్పి పోయెనట
బావరో! దీనికి భవితవ్యమెటులొ?"
అనవిని పందుము హరిపల్లికొండ
(అనువుగ దె) ల్పె జయాపజయంబు:
"కలగన్న విధమును కనుపించలేదు
కలహంబు గోరియు కఱియాలరాజు
ఎలమంచి రాజుకు యిల(యందు కీర్తి)
తలపగ యొకమేలు తలపెట్టినాడు
అన్ని ప్రయోజన మనుకూల పడును
సన్నుత వరగుణశాలి ఐతన్న
ఇది శుభముహూర్త మిది కార్యసిద్ధి
కదిలించు శ్రీ ఓరుగంటి పైనంబు!"

**-: పల్లికొండ తెలిపిన శుభవార్త విని ఐతమరాజు బంధువులను ఓరగంటికి బయలుదేరుడని చారులతో చాటింపు వేయించుట :-**

అనవిని ఐతన్న ఆనందమొంది
పనులవారిని బిల్చి బంధుగణముల
(కొదుకక)[1] యెలమంచి గోకులావళుల
కదలించుమనె యోరుగంటి తిర్ణాళ
సెలవిచ్చి ఐతన్న చెప్పినందులకు
కులబంధు(లెల్లఋ కూ)డిరమ్మనుచు
వలనొప్ప యెలమంచి వాడవాడలను
పిలిచిరి యింటింట పేరుపేరులను:
"పంచనందులవార! భా(గీర్థి వార!
చెంచు) కరునివార! సెలతీగెవార!
పచ్చిపువ్వులవార! ఫలరసంవార!
నిచ్చకయ్యమువార! నిధికి పదండి!
(రచ్చటావుల) వార! రామగిరివార!
పచ్చగొడ్డులవార! పసిగొడ్డువార!
చందమామలవార! జాబిల్లివార!
నందివాహనుజూడ నడుడి యీ వేళ!
విజ(యముగల)వార! విభవమువార!
గజచర్మధరుజూడ కదిలిరండయ్య!
పంపాద్రిపురివార! బడుగులవార!
తెంపుతో పదరయ్య దేవునిజూడ!
శూలమువార! ఓశోభనమువార!
నీలకంఠుని జూడ నిలువక రండి!
పందుములవార! బండారువార!
ఇందుశేఖరు (జూడ యిపుడె పద)రయ్య!
చల్లగరిగెలవార! సజ్జనివార!

1. కొదుకు కొతుకు = సంకోచించు, భయపడు.

చల్లని ఓర్గల్లు శంభుతిర్ణాల
రామకులమువార!" రండని బిలిచి
భూమీశ్రునకు దెల్ప భు) వనవిక్రముడు

**–: ఐతమరాజు ప్రయాణమునకు మంచి గుఱ్ఱములను సిద్ధపరచుడని అశ్వశాల అధికారితో చెప్పుట :–**

మద్దిమాడుగెవాడు మహరౌతునొకని
నొద్దికతో బిల్చి నుర్వీశుడనియె:
"వంచన లేనట్టి ఓరుగంటికిని
వేంచేయవలసిన విధమునుండుటను
చొక్కమౌ తేజీలు సుళ్లను చూచి
మక్కువ నడిపించ మంచిగుఱ్ఱములు
నడినెత్తిలో సుళ్లు, నాలికె సుళ్లు,
వడిబొడ్డు సుళ్ళును, వాలము సుళ్ళు,
బరిపక్కలో సుళ్లు, పాదము సుళ్లు,
కుడియెడమ నుండిన గురుతులు జూచి
ముఖమందు బూడిదెముక్కు గాకుండ
గజ్జబీదయు ఊచకాళ్ళు గాకుండ
బొజ్జ మబ్బురము లద్భుతము గాకుండ
బిక్కది బీదది పిరికి గాకుండ
దేవమణి గలుగు తేజుల జూచి
భావింపగా కంఠభరణము గలిగి
కోలచెవుల తెల్లగురుతుండవలెను
తెలిపి నాలుగు కాళ్ళు తెరపి గావలెను
పొసగ ముఖము తెల్ల బొల్లి గావలెను
పసగల చాయతో పరగ చూపట్టి
పక్క తెలుపు మీద బలము గావలెను
గ్రక్కున యూథము గదిలించు" మనెను.
మనుజేశు మాటకు మరి రౌతు వెడలి

పనిబూని యశ్వాల పజ్జను నిలిపి
పరిపరి విధముల పొరంగజూచి
తీరగు నశ్వాల తెమ్మనె భటుల:
“కలని కెదురు నడిచే గడుసుల దెండి!
చిలుక రౌతు మోర చిక్కను దెండి!
మేడల లంఘించు మెరుపును దెండి!
చూడ వేడుకయగు జోగిని దెండి!
కలికిచిలుక దెండి! కక్కెర దెండి!
ములికి బాణము దెండి! ముత్యము దెండి!
ఇంద్రనీలము దెండి! యమునిటు దెండి!
చంద్రకాంతిని దెండి! సెలగోల దెండి!
బిచ్చుకత్తిని దెండి! బిరుసును దెండి!
మత్స్య రేఖను దెండి! మణినిటు దెండి!
ఐతన్న లంఘించు అపరూపు దెండి!
మితి నాచకూళ్ళన్న మెరుపును దెండి
కతియాలభూపతి గవలించుచుందు
తీరగు గండకత్తెర నిటు దెండు!
రవళి బట్టావుల రాజెక్కునట్టి
జవగల మేలు వజ్రాయుధం దెండు!
ముద్దన్న సాధించు ముత్యము దెండు!
హద్దుగ పోచయ్య కతివేడుకైన
తెల్లమల్లెలబొందు తేజిని దెండు!
పుల్లావు కేశవ్వ పొసగ లంఘించు
వొల్లెల్ల పూవుల వన్నెను దెండు!
కొమనాల పుత్తన్న ఘోటకంబైన
రమణీయ కాంతుల రత్నము దెండు!”
అవి యిట్లు వేర్వేరు నశ్వములెల్ల
అనువంద బట్టించి యారౌతు దెచ్చి

రమణతో ఐతమరాజుకంపించ
క్రమమొప్ప యదురాజు కంపటమెల్ల
నిమిషమాత్రంబున నిలువక వెడలి
సముదయంబున దండు సాగించు మనిన-
పొన్న పువ్వులవారు, బోడాలవారు,
సన్నబియ్యము వెంట సాగె సంపదలు;
పాయసందారు, హరిపాలునివారు,
కాయకూరల వెంట కదిలిరి వేగ;
పూతగంధమువారు, భూపతివారు,
నేతికావళ్ళతో నెలకొని నడువ;
దండెబోయినవారు, దాదులవారు,
పిండిబేడల వెంట పెనగొని నడువ;
మట్టెబోయనివారు, మాధవువారు,
గుఱ్ఱాల దాణతో గొనగొని నడువ;
బహుబలమువారు, బడుగులవారు,
కాహళధ్వనులతో కదిలి తారేగ;
శీలమువారు, జడదేవివారు,
ఆలమందలు పెట్టె లరిగిరందంద;
ధవళచొక్కమువారు, తరిముత్తవారు,
దివిటి చమురు వెంట ధీరులై నడువ;
జడివానవా, రమృతసాగరంవారు,
గుడిగుడారుల వెంట గొనకొని నడువ;
కొండెబోయినవారు, కొమనాలవారు,
గండుజోదుల గూడి గమకించి నడువ;
పరమ మహేశ్వర భక్తుడైతన్న
సరస మజ్జనమాడి షడ్రసాన్నములు
పొలుపొంద భుజియించి భూపతియంత
సలలిత భూషలు సవరించి మేన

పరిమళ కస్తూరి పంకంబు నలది
పరగంగ నవరత్న పదకంబు వేసి
దక్షుడు ఐతమధరణీశ్వరుండు

**-: పల్లికొండ అనుమతితో ఐతమరాజు ప్రయాణభేరి మ్రోగింపజేయుట :-**

పక్షీంద్రవాహన్డు పల్లికొండయ్య
అనుమతి భేరిని అందఱు వినగ
జనపాల్డు వేయించె జనపతుల్ మెచ్చ
సరసుడు కతియాల సాహసోత్తముడు
పరగ జలకమాడి భర్గుపూజించి
క్రమమొప్ప భుజియించి కలభూషణములు
విమలమౌ మెయినిండ వెలయంగ దాల్చి
ఎలమంచి గంగాంబ కెలమితో మ్రొక్కి
పలుపలు విధముల ప్రార్థన జేసి
కఠినచిత్తుల మది కంపంబునొంద
పటు గండకత్తెర ప్రబలుడై యెక్కి
ఉత్సాహముగ మదినుప్పొంగి కదలి
ప్రోత్సాహ మెచ్చగ పుణ్యుడైతన్న
బడిబడి బంధుల బలగము గూడి
నడిచెను మదకరి నడలను వెడలి
అంతట బట్టాపులాన్వ(యవరుడు)
సంతస మందియు సదనము జేరి
విలసితముగ స్నానవిధి నేరవేర్చి
అలర శంభుని పూజ లాదిగ దీర్చి
సరసాన్నములు గూర్చి సైంధవమెక్కి
బిరుదైన పడిగెలు భేరీలు మ్రోయ
పదినూర్ల వీరులు బలసి కొలువంగ
కదియు సర్పముబోలు కత్తిని బూని
కడువేగ నైతన్న గలసియు నడచె

వడిగల భేరి వాహ్యాళి నాదించ
నతిమెరుపుపై నెక్కి నాచకూళ్ళన్న
యతివేగమున నడిచె నైతన్నముందు
బొండుమల్లియ నెక్కి పోచయ్యమంత్రి
అండబాయక మామయంచున నరిగె
ఎలమంచిరాజులు యెలమి సంపదలు
పలుదెఱంగులు ఐతపాలుని ముందు
మదగజయూథముల్ మరియు నశ్వములు
కదిలెను ఆవుల కదుపులతోడ
తరువాత పందుము దానవాంతకుడు
మరివేగ తనయింట మజ్జనంబాడి
తిరుమణి పెట్టియు తిరుచూర్ణమలది
ప్రార్థించి శ్రీహరి భావమందుంచి
సకల పదార్థముల్ సహపంక్తి గుడిచి
అకలంక భూషమాల్యాదులు వైచి
పచ్చలపాలకి పరగంగ యెక్కి
అచ్యుతుడు నడిచె ఐతన్నవెంట
లలిత శుభకరుడు పుల్లావు కేశవులు
తెలియ పువ్వులచాయ తేజిపై నెక్కి
పందుముల గురువు పరగ దాపటను
మందరగిరి బోలి మరి వేగ నడిచె
పోత్రాజు పుత్రుడు పుణ్యచారిత్రు
శూలధరుని భక్త సోమవంశజుడు
కుసుమబాణుని బోలు కోమలాకార్డు
వసుధలో రవితేజ్జు వల్లవరాజు
సిరిగల ఓర్గల్లు శివుని పూజించ
మరివేగమే యెలమంచిపురినుండి
ఆరుగురుండుట వానిననుసరించియును

కక్కసరాజుల కంటిలో సురియ
ఉక్కుగుండెలవాడు ఉరుమని పిడుగు
ఐతన్న కుడిన కర్యావులరాజు
కైతప్పు లేకుండ ఘనుడు యేతెంచ
పట్టుగా కుడియెడమ భటులు గొలువ
బట్టావులన్నెడమ పార్శ్వన గదిలె
వీపున ముమ్మన్న వింజామరముగ
దాపట పుత్తన్న దరిన ముద్దన్న
నాచకూళ్ళ నాయ్డు నతనికి జోడు
పోచయ్య గుమిగూడి బోరున నడువ
తిరుమందు లెల్లఋ దివ్యవైఖరుల
పరగంగ వల్లవుల్ పైనయై నడువ
మించిన పడిగెలు మీరి పట్టించి
కంచెవంటి కులము గమనింప నడిచె
ధన్యుడైతమరాజు తర్లి రాగాను
కన్నెయొక తెదురుగా నాయె వీథి
మలయుచు కొందఋ మగువలజోడు
ఫలముగంపలు యెదురు పడియెను రాగ
ఆరుదేర కనుగొని ఐతమరాజు
పరికించి పందుము బావకిట్లనియె:
"మందరనగధర! మదనగోపాల!
ఇందిరావర! వేదవేదాంతవేద్య!
కేశవ! మాధవ! కృష్ణపరమాత్మ!
వాసవాది వినుత! వైకుంఠవాస!
బాల యెదురు వచ్చె ఫలము విధము
ఏలాగు? యేవిధి? యేమి కారణము?
కావలసినయట్టి గలుగు హేష్యంబు
భావింప దీనికి భావంబు దెలుపు?"

అని తను ప్రార్థించు ఐతభూవరుని
కనుగొని పందుముల ఘనుడిట్టులనియె:

**–: పల్లికొండ శకునఫలములను ఐతమరాజున కెఱిగించుట :–**

“వినవయ్య! యాకన్నె యెదురైన ఫలము
ఘతనకెక్కిన యోరుగంటి పట్టణమున
మొనగల మాష్టీలు ముగ్గురున్నారు
బెబ్బులులకు వైరి బేతాళుడొకడు
గబ్బిరిపుల వైరి కన్నమ ధీర్డు
వెంపరలాడును వెదికి శత్రువుల
రంపాల కేశవ రణగరిష్ఠుండు
చాణూరమల్లుని సరిసాటియైన
త్రాణగలిగిన బేతాళవిక్రముడు
వర ముష్టికాసురువంటి సాహసుడు
తెరగున కన్నమధీరుండతండు
ధరణిపై వీరినిద్దరిని గూల్చుటకు
కఱియాల శూరుండు కదలుచున్నాడు
పంపులేర్పఱుచుక బట్టాలరాజు
రంపాల కేశవు రణమందు గూల్చు
ఘనరాజ తరయిది కన్యఫలంబు
విను ఫలములెదురౌ విధము దెల్పెదను
గజచర్మధరుడు వోర్గంటి శంభుండు
నిజముగ మీభక్తి నెద నమ్మినాడు
పరమభక్తుని జూడ పరమేశ్వరుండు
అరుదెంచుచున్నాడు ఐతభూపాల
అన్నిట తమ పనులనుకూలపఱచి
వెన్నంటి వచ్చును యెలమంచిపురము
ఈ రెండు ఫలములు యీ శకునాలకు
కారణమున్నది కాగలదయ్య!”

త్రాత చెప్పుపలుకు తన మదినుంచి
క్షితినాథుడు నడిపించె సేనలముందు
నెలకొని అందందు నిలుపుచు దండు
బలమైన ఓరుగల్లు పట్టణము జేరి
ఓరుగంటి బయల నూరిముంగలను
బారుబారులు సాగి బలములు దించెను

**-: ఓగరుంటి వెలుపలి బయలున గుడారులెత్తించుమని**
**పల్లికొండతో ఐతమరాజు చెప్పుట :-**

ఆవేళ వల్లవ ఐతమరాజు
బావను పిలిపించి బంధుల బిలిచి
"పంపాద్రి యలమంచి ప్రఖ్యాతి తెలియ
సొంపుతో నెత్తించు సొరిది గుడార్లు"
అనియిట్లు ఐతన్న ఆనతి దెలుప
విని పందుముల హరి విమల వాక్యముల
కులబంధువుల కెల్ల గురుతులు చెప్పి
ఎలమితోడ గుడార్లు నెత్తించుడనిన
పొన్నపువ్వులవారు పుల్లావువారు
చెన్నొంద వొకవంక సేనలతో దిగిరి
ముజ్జగంబుల కీర్తి మొగి చల్లవారు
వజ్రాల చెరగుల వరుస గుడార్లు
సంతస తోడుత చల్ల పిన్నయ్య
వంతుకెక్కిన బలవంతుడెత్తించె
చంద్రకావి గుడార్లు సిరులుల్లసిల్ల
అందమౌ నేతి ముద్దయ్య యెత్తించె
పచ్చబట్టు గుడార్లు ప్రఖ్యాతిగాను
మత్స్యరేఖ గుడార్లు మాధవువారు
పచ్చవన్నె గుడార్లు పందుములవారు
అంచు బంగారు గుడార లచ్యుతవారు

తరిముత్తవారు చిత్తర్వు గుడార్లు
బిరుదువన్నెల గుడార్లు బిరుదాంకవారు
పల్లెబోయనివారు పంజు గుడార్లు
కల్లందులవారు చిత్కళల గుడార్లు
మెరుపు గుడార్లు తిర్మందులవారు
కరమర్థిసంపదల్ కరము విలసిల్ల
వరుస వరుస గుడార్లు వాడలేర్పరచి
పరిపరి విధముల ప్రజ్వరిల్లంగ
బంగారు కలశముల్ ప్రబలు టెక్కెములు
రంగైన వేడుక రవళి గుడార్లు
సూర్యవీథి గుడార్లు సొరిది నెత్తించి
ధైర్య ప్రతాపు లుద్దండతోన్నతులు
చుట్టును నవరత్న చూరులు దీర్చి
పట్టు జమకాణముల్ పరగ పర్పించ
వల్లవ ఐతభూవరుడు పందుముల
పల్లెకొండయుతము బంధులగూడి
కులబంధువులనెల్ల కోరిపిల్పించి
బలశౌర్యుడైతభూపాలచంద్రుండు
తడయక కొలువుండె తదనంతరమున
కడు వేట్కమీరంగ కన్నె సింహముల
గతినున్న బట్టాల కటియావురాజులు
మతిమంతులిద్దరు మరి చిత్రముగను
పాలకావి గుడార్లు, పట్టుగుడార్లు
కోలాహలంబుగ గురుతు లేర్పరచి
చక్కగా యెత్తించి సరస టెక్కములు
చుక్క వెల్గులకాంతి సొరిదిగా నిలిపి
కాంతి చంద్రుని బోలు కటియాలరాజు
శాంతుడు బట్టాల సార్వభౌముండు

యింపైన మెయిగొడుగు యిందినట్లుండె
సంపాద్రి యలమంచి బలగము గూడి

**-: ఓరుగల్లు చక్రవర్తి ప్రతాపరుద్రుడు తన నగరము ముందరి గుడారము లెవరివో తెలిసికొని రండని తన వీరులను పంపుట :-**

అంతట ఓర్గల్లు అవనిపాలకుడు
వంతు కెక్కిన శౌర్యవంతుడౌ రాజు
ధరణీశ వీరప్రతాపరుద్రుండు
వరవిలాసపుదండు వైనంబు దెలిసి
వింతవింత గుడార్ల విభవము జూచి
అంతట వీరప్రతాపరుద్రుండు
వినుమని తన మంత్రి హితుల కిట్లనియె:
"వినరయ్య! యాదళ మెనరిదో యెరుగ
పగవారు వచ్చి నాపట్టణము ముందు
దిగినిల్చుటకు యెంత ధీరుడు గలడు?
కనుక వారెవ్వరో కనిరమ్మ"టంచు
ఎనసి తెల్పుమటన్న వీరులేతెంచి
గొనకొని ఐతన్న కొలువులో నిలచి
వినయమున కరములు వే ముకుళించి:
"ఓ రాజ! రాజేంద్ర! ఓ నరపాల!
మీరు యెవ్వరో కాని మీ విధంబులను
తెలిసి రమ్మని మమ్ము తీవరంబుగను
తలకొని పంపె ప్రతాపరుద్రుండు
యిందుకానతి యేమి వివరింపు"దనిన

**-: యాదవప్రభువు ఐతమరాజు ఓరుగంటి శంభుని తిరునాళ్ళకు వచ్చినాడని పల్లికొండ చెప్పుట :-**

పొందిక విని రాజభోజుడైతన్న
వీరులు పలుకంగ వెసగుర్వువంక
పారంగ జూచిన పల్లెకొండనియె:

"భటజనవరులార! పలికెద వినుడు!
పంపాద్రి యెలమంచి పరిపాలనముగ
సొంపుతో నే విన సురుచిరమూర్తి
వలురాజు తనయుడౌ వరపోలురాజు
కులపావకుని ద్వితీయ కూర్మిపుత్రుండు
చల్లని యదువంశ సంపూర్ణ శశియు
వల్లవుదైతమ వరబలాఢ్యుండు
ఆడితప్పనివారు ఐతమరాజు
పాడిమీరనివారు బడుగులరాజు
ఇందఱు అరుదెంచు విధమేమి యనిన
కందువతో ఓరుగంటి శంభుండు
మదిగోరి నిచ్చయం మమ్ము సేవింప
పదిలముగ రమ్మని పలుకాలకించె"
చలగి రఘుపతి తా చెప్పినందులకు
తలవంచి యాభటుల్ దండమర్పించి
ధరణీతలేశు ప్రతాపరుద్రునకు
సరగున వివరించి చారులు యేగి

**–: ప్రతాపరుద్రుడు తనమంత్రులతో ఆలోచించి, సేనలను తప్పించి యాదవులను నగరములోనికి ఆహ్వానించుట :–**

వినిపింప విని యంత వీరప్రతాపుడు
అనియె మంత్రుల జూచి యవనిపాలకుడు:
"వినరయ్య! బుధులార! విద్వాంసులార !
వనరంగ యాదవుల్ వనగూడి దళము
పరమేశ్వరుని గొల్వ భక్తిమార్గమున
వరసతో తమ బంధువర్గముగూడి
అరుదెంచియున్నారమని పల్కినాడు
శంకరు గొలిచితే సంతోషమౌను
ఇంక యేమైనను యితరమౌ ఘాత

తలతురోయని మది తట్టుచునుండె
తెలియంగ పెద్దలు దీని భావంబు
వివరింపు" మనినంత విబుధజనంబు
అవనీశ్వరునితోడ నప్పుడిట్లనిరి:
"ధరణీతలేశ! ప్రతాపరుద్రేశ!
పరశివపూజని పలుకుచుండిరి
మీమీద దండెత్తి మిగులుగ బూన
యే మానవునకైన యిలను శోభించునా?
సహకారసిద్ధియౌ సర్వేశ్వరుండు
మహదేవపూజను మాన్పంగ తగదు
నీలకంఠుని పూజ నిల్కడజేయ
చాల పాపమటంచు సకలశాస్త్రములు
మొరపెట్టుచుండును ముజ్జగంబులను
వరపుణ్యగుణశీల వద్దనరాదు
పిలిపించు యాదవుల ప్రియపూర్వకముగ
వలసి పల్కాడంగవచ్చు మనస్సు"
అనిన సంతమంది ఆ రాజవరుడు
అనియె మంత్రులజూచి యవనివల్లభుడు:
"ఘనులార! మీరు వేగము యీవేళ
పనిబూని ఐతమభూపాలుని కడకు
అరిగి వారల దళమచ్చోట నిలిపి
మరివేగ ఐతభూమండలాధిపుని
తగువారితో గూడి తర్లి యిచ్చుటకు
తగ నరుదెంచ యిద్దరము గలసి
ముచ్చటాడిన వెనుక మూకలగూడి
వచ్చి శంకరుగాంచి వనరపూజించి
అక్షయ తీర్థప్రసాదమందను
దక్షత గైకోని తర్లి పొయ్యెదరు

కాన మాసభకును గదలిరమ్మనుడు
సేనల కేటికి సెలవు లేదనుడు''
అని చెప్పి పంపిన ఆప్తులౌవారు
చనివేగ యదురాజు చదురున నిలచి
వినుతింపుచు ప్రతాపు విమల వాక్యములు

**–: అయితమరాజు పల్లికొండతో ఆలోచించుట :–**

వినిపింపగా ధారుణీశ్వరుడాత్మ
కృత్యంబులై జ్ఞానఖిన్నుడై తలచె
మృత్యంజయుని జూడ మిగుల యిందనుక
వచ్చిన వారలు ఓరుగంటికిని
చొచ్చి రావలెగాక స్రుక్కి యుండెదర?
కాని మంచిదిగాక కల బంధుజనులు
మానక తనదళం మందినందుంచి
ఎలమి తమ్ములు దాను హితులు మంత్రులు
కల బంధుజనులతో కదలి రమ్మనెను
అనుమాట మదినుంచి ఐతభూవరుడు
అనె వారలతో ముందు నరుగుడటంచు
తరువాత బావను దగ్గఱ బిలచి
సిరిముద్దుపలుకులు చెవిలోన జెప్పె:
“బావరో! దీనికి భావంబు దెలుపు?
యే వర్తమానంబు యేలాగు గలదొ?
అదిగాక ఓర్గల్లు అని దీనిపేరు
పదిలమౌ మొనవరుల్ పలువురున్నారు
ఘల్లునను కఠారి కరము జారినను
మల్లుమల్లనియెడి మల్లులున్నారు
పశులగాపరులైన పసిబాలురైన
పశిపట్టు మొనగాండ్ల వరుగల్లుపురము

అని పెక్కుభంగుల నఖిల లోకముల
కనినెన్నుచున్నారు కలియుగమందు
మనమందరము పైనమై పోవలయు
ఘనగండకత్తెర గమకించిమించి
ఓర్గల్లు బట్టణం వైఖరిజూడ
కఠియావు మాయన్న గలడు యిచ్చోట
నరసి వచ్చినజోట ఓరుగల్లునను
పరగ కోరలు దీటు పాముకు వెరదు
మాటవచ్చిన చోట మరణము కెరువదు
నోట బేళుకుచోట నూటికొక్కండు
నన్ను మీరినవాడు నాకన్న ఘనుడు
యెన్ని చెప్పిన వినడెటువలె బావ?”
అని దెల్పు ఐతన్న ఆత్మభావంబు
విని పందుముల హరి వీనుల నిండ
తగిలి వచ్చుట మది తనకు తా దెలిసి
మిగుల సంతోషించి మీద చైవేసి
చెలగుచు ఐతన్న చెట్టబట్టుకొని
అలరంగ కఠియావులన్న గుడారు
తడయక బావ నైతన్నయు గూడి
విడివిడి రాగాంచి వెస కఠియావు
భూపతి కెదురేగి పుణ్యాత్ము లిచట
కేపని కేతెంచు క్రియ దెల్పుడనిన
కలసి అందఱు చొచ్చి కావిగుడారు
కొలువున గూర్చుండి “కొదువ విచార
మహిమ దెలుపుదును మరది! నామనవి
వహికెక్కి నటువంటి వరగల్లుపురము
వీరప్రతాప డీ వేళను మనల
కోరి రమ్మన్నాడు కొలువు లోపలికి

**–: ఆలమందలు సంపదలు పరివారము వద్ద నుందుమని కటియావులరాజును పల్లికొండ ఐతమరాజులు కోరుట–అతడు నిరుత్సాహపడి, ఒక జాము గడియలు వేచిచూచి, తరువాత నగరములో ప్రవేశింతుననుట :–**

ఆలమందలు చాల అధికసంపదలు
వేలంబు లేర్పడి యిందు నుండినవి
యిందరిపై కరుణిప్పుడు మీరు
పొందుగా మమ్ముల పొమ్మురమ్మనుము
మరి యెన్నరిందుంచు మనసు రాదింక
కటియాల భూపతి గడి నిల్చెనేని
ధరణిలో చూసినంతట సాటిరాదు”
హరిగురు విటువలె నాడినందులకు
కటియాల భూపతి కలకలనవ్వి:
“గడి ఓరుగంటిలో కయ్యంబు కొఅకు
ఆడ నేనెంతయు ఆశించియుంటి
కడవానిగా జూచి కలిసి రాకుండ
విడిది దగ్గఅనుంచ విహితమా బావ?
మరుదులందరిమీద మనసు నామీద
గురుడు చూచుట మీకు గుణము లేదాయె
గండకత్తెర హెూయల్ కన్నులనిండ
నిండుగ ఐతన్న నెఱిచూడలేక
నిలుపుమనియు మమ్ము నిందుండు మనెను
తలపులోపల ప్రతాపుని కొల్వు
కలసినప్పుడు నేను గండకత్తెరను
చెలగి చబుకమున చెకపిక గతుల
నడిపించి కొల్వులో నాట్యమాడింతు
గడి ఓరుగంటిలో కనుగొను ప్రజలు
తేజి యున్నతమును తేజితీరెల్ల
తేజినేలినవారి తేజుమార్గంబు

ఓరుగంటిలో యాదవులరాజు బిరుదు
పేరు నిల్పుదునని పేరాసనుంటి
ఉండినందుకు యిందునుండుమటంచు
కొండంత మాటను గురిచెప్పినారు
తగదు మారుత్తరం తగదు వో! బావ!
మిగుల సంతోషము మీబుద్ధి వింటి
చెప్పినంతటి మాట చేకొంటి గాక
వొప్పితి సంపదల్ వద్దను నిలువ
ఒకఝాము గడియలు ఓర్చుక నుందు
అప్పటికిని మీరు అరుదెంచకున్న
సేనాధిపతి నౌదు చెల్లగ ఝాము
కాని మంచిదిగాక కదలిపొ"మ్మనెను.
అలుకతో కతియావులన్నిటువలెను
పలుకగ పందుముల బావ యిట్లనియె:
"భూపాల! కతియావుభోజ! యీవేళ
కోపంబు చేయకు కువలయాధీశ!
సింహాద్రివరపుత్ర! సిరిముద్దుకొడుక!
సింహవిక్రమరూప! చెప్పెద వినుము!
ఓరుగంటికిపుడు వచ్చినందులకు
కారణం నీచేత గలుగ జేయింతు
అనుమానపడకుము అనుమతిచేత
కనివుండు రవితేజ! కతియాలరాజ!
తడవేల వీరప్రతాప కొల్వునకు
కదువేగ సెలవిమ్ము కదలిపొయ్యెదము"

**-: ఐతమరాజు, పల్లికొండ, బంధువర్గముతో కలసి ప్రతాపరుద్రుని కొలువునకు బయలుదేరి వెళ్ళుట :-**

కతియావులన్నతో కవులంది లేచి
హరిగుర్వు ఐతన్న నచ్చోటు కదలి

అనువైన (తన) బంధువర్గాల నెల్ల
పైనముల్ గమ్మని పలికిరావేళ
దిగ్గజంబులబోలు తిరుమందులెల్ల
అగ్గలంబుగ వచ్చి అశ్వాలనెక్కి
వలనొప్ప ఐతన్న వామభాగమున
చెలువంబుతో నడ్వ చెలగుచు వారు
వనరంగ కుడివైపు వల్లవులవారు
ఎనయ తురంగముల్ యెక్కి దుమికించి
కొందఱు యాదవుల్ కుడియడమందు
అందలంబుల నెక్కి అరిగిరావేళ
సురుచిరాకారుండు సోమకులుండు
మరివేగ అయిత భూమండలాన్వయుడు
ప్రభగల ముత్యాలపాలకి యెక్కి
విభవము నైతన్న విభుడు తా గదలె
పోచన్న ముద్దన్న పుత్తమరాజు
నాచకూళ్ళమ నాయుడు నమితవిక్రముడు
బట్టావుభూపతి పరగ ముమ్మన్న
చుట్టు వింజామర సురటీల నీడ
బసవశంకరబిరుదు వరహనుమంతు
పొసగ సింహపుటెక్కి భూచక్రబిరుదు
ఆదినారాయణ అవతారబిరుదు
విదితమౌ గడిగండభేరుండ బిరుదు
తగిన నిశానీలు తరచు వల్లవులు
నగధరధీరు డైతన్న యిరుమేర
పాలకి యిరుమేర భట్లు చేయెత్తి
చాలగ బిరుదులు సరదిలి పొడ
పడమర ద్వారంబు బలములతోడ
నడిపించ యాదవ నరకుంజరుండు

ఇంపైన ఓర్గల్లు ఈశ్వరువలెను
పెంపుతో జొచ్చియు ప్రియబంధువులతొ
వలయ ముఖద్వార వాకిండ్లు గడచి
పలికె ఐతమరాజు భటులను బిలిచి
తలపగ వీరప్రతాపరుద్రునితో
చెలువుగ బలుకుడి చెప్పినయటుల:
"పంపాద్రి యెలమంచి పాలింపుచెపుడు
పెంపుదీయగరాని పెద్దలనడక
శిరమును ఓర్గల్లు శివునికె గాక
మరి వంచమెవరికి మా పూర్వవిధము
కుటిలము గాదు మా కులధర్మరీతి
యిటువంటి విధము మాయింటి మర్యాద
సందేహమందక చయ్యన మమ్ము
మందిరమునకు రమ్మనుడి యీవేళ
అదిగాక మాకొల్వు నటుకూడదనిన
పదిలము మీరు మీపజ్జను నిలుడు
ఇందుశేఖరుగాంచి యెలమి పూజించి
కందువ యలమంచి కరగుదు"మంచు
పంపిన భటవరుల్ పరువడిసాగి
కంపింప రుద్రునిగని దెల్పిరంత
విని "మంచిది వారివిధమెట్లొ యట్లె
మానక మెలగుట మంచిదిగాన
సమ్మతి నైతన్న చక్కదనంబు
నెమ్మది జూచెద నిందురమ్మనుడి!"
వలనొప్ప చారులు వడి నేగుదెంచి
దెలుపగ నైతమ ధీరపుంగవుడు
దివ్య ప్రతాపరుద్రేశు కొల్వునకు

వయ్యన ఆవుల వంశాబ్ధి విధుడు
అంగవైభోగము లలర నైతన్న
చంగున బటవంది జనులతో వేడ్క
అశ్వముల్ పాలకీలందలంబులును
విశ్వము నడయాడు యీశ్వరుబోలి
అరుదేర వీరప్రతాపరుద్రుండు
మరి వేగమున తన మంత్రులతోడ
వరగల్లు రాజులు వరశిఖామణులు
విరివైన బలములు వీరప్రతాపు
అబ్బురంబుగ నేగి అయితన్న కెదురు
గొబ్బున చనుదెంచి (కువలయా) ధిపుడు
తగువాహనంబులు తగుభూషణములు
అగణితమైన చిత్రంబు వస్త్రములు
క్రమమొప్ప యొసగిన గైకొని రాజు
గనుకమౌ భూషలు కనకాంబరములు
చొక్కమౌనటువంటి జోడుగుఱ్ఱములు
గ్రక్కున యదురాజు ఘనతలో నొసగె
యిక్కరణి ఓర్గంటి వీరప్రతాపు
మక్కు (వ గొలిచెడి) మండలాధిపులు
మహిపాలు డైతన్న మన్మథరేఖ
సహితంబుగా జూచి సంతోషపడుదు
కొదకక కొలువులో కూర్చుండనుంచి
మదినిల్పి చక్కని మాటలాడుచును
ఓరుగంటీశ్వరుడు వచ్చి మాపాల
కారణం దెలిపిన క్రమములన్నియును
చాల చెప్పగ వించు, సంతోషపడుచు

**-: రాజసభకు వెళ్ళివచ్చుటకు ఒక జాము గడియలు గడువగా కటియావులరాజు ఓరుగంటిలోనికి వెళ్ళుటకు బయలుదేరుట :-**

కాలంబు నొకర్ఝాము ఘడిచె గడియలు
రమణతో సింహాద్రిరాజకుమార్డు
విమలచారిత్రుండు విక్రమార్కుండు
పలికి(బొంకనివాడు) పట్టినపట్టు
బెళుక నియ్యని కడు బిరుదు సాహసుడు
వలపట దాపట వంకినివాడు
కలిత భాస్కరతేజు కరియాలరాజు
కాలము మీరిన కైవడి దెలిసి
చాల రోషము బెంచి చలము రెట్టించి
ఆ సమయము మరిదైన పుల్లావు
కేశవుతో నొక క్రియగూర్చి పలికె:
"వినవయ్య కేశవ! విమలప్రతాప!
ఘనతతో మాబావగారు ఐతన్న
పిన్నలు పెద్దలు ప్రియబంధుజనులు
వన్నెకెక్కినవారు వరగల్లుపురము
కోటలోపల జొచ్చి కొనదానికేమి
మాటయైనది వినమైతి మింకొక్క
మాటవినుము బావమఅది! యీవేళ
ఘాటమౌ యీ ఓరుగంటి ప్రతాపు
గడియైన కొలువులో గండకత్తెరను
వడివేగ దుమికింతు వాయువేగమున
బలములు నీవు సంపదలు చూపట్టి
నిలచి వుండు"మటంచు నృపతి తా లేచి
నిటలాక్షు హృదయము నిలిపి వేవేగ
కటహారి చేపట్టి కటియావులన్న
దాటించ అశ్వము ధరణిపై క్రుంగ

వాటమౌ వరగల్లు వాడమేడలును
రాజాధిరాజులు రాజమన్నీలు
తేజము భావము దివ్యవైఖరులు
చూచి యెవ్వరటంచు చోద్యవేద్యముగ
వాసికెక్కిన తేజిహొాయలు వర్ణింప
ఓరుగంటి తూర్పు వాహ్యాళి బయలు
ధీరుండు గండకత్తెర హొాయల్ జూప
కుకుధ కుకుధ యంచు కొంత నడ్పించి
నికర ధిమిధిమని నిలిచి నడ్పించ
ప్రకట ఝణంఝణం పాటనడ్పించ
చకచక ధ్వనులను చలగి నడ్పించు
సకలవిద్య భరతసంగతులెల్ల
రకముగ పక్కెర రమ్యత జూపి
యిమ్మారు ముమ్మారు యీవలావలను
దమ్మువప్పున దీర్ప తగ కుస్తరించి
ఓరుగంటిని కోట వడి మొగసాల
కారుమేఘమువంటి గండకత్తెరను
గమకింతునికి తలచిరి కఱియాలరాజు
సమరప్రతాపుడై, సడలి కళ్ళెంబు
ముఖదృష్టి మొగసాల మొనమీద నిల్పి
ప్రకటము పందుముల బావను దల్చి
ప్రముఖుడై యదుకుల పట్టభద్రుండు
ధుమికించె సింహాద్రిదొర కుమారుండు
దేవమణీ జక్కి దేవత గనుక
కావరం బేతాళు కట్టిన బిరుదు
భావింప కన్నుల పడగను జూచి

**–:కోట మొగసాల కట్టివున్న బిరుదులుచూచి గుఱ్ఱము మెడవంచి నడవకుండుట:–**

ఎచట ఓటమి లేని యదుకులాధిపుని

యిచట దూరింతునా హీనుని బిరుదు
నన్నేలు రాజుకు నవమాన బిరుదు
వన్నె తెప్పింతని వాజి యెఱింగి
లంఘించు సమయాన లావు వొంచించి
క్రుంగి ధరణి తేజి గిర్రున కినిసి
చిందర కొట్టుచు చెవులను వంచి
క్రింద జూచుచునున్న ఖిన్నుడై రాజు
"యీ విచిత్రంబేమి! యీ తురంగంబు
నా విచారము నెరిగి నడువక నిలిచె
ఎన్నడు యిటువలె నెరుగ నశ్వంబు
చిన్ని గోడిగరీతి శిరమొంచి నిలిచె
సాకితి యిన్నాళ్ళు, చబుకు చేనుంచి
ఊకియు సోకించి ఉత్తమముగను
కళ్ళెంబు చల్లిచ్చి కాలూదితేను
బిల్లజిమ్మినరీతి బెగ్గడిల ధరణి
వాగె సడలజేయ వారిధుల్ దాటు
చౌకుగదల కొండచరియలు బ్రాకు
అటుగాన నన్నిట హతముగావింప
మటుమాయబన్ను యేమనవచ్చు విధిని?"
అనుచు భూపాలుండు అవనిపై ధుమికి
కనలి రోషముమీరి కటహారి బెరికి
చలగి కటారున జంపుదు దీని
వలపట బాకుచే వరుగుదు నేను
బిగబట్టి కళ్లెంబు బెడిద కఠారి
పగవానివలె రొమ్ముపట్టి దా పొడువ-
బోవ, తురంగంబు పుడమిపై లేచి
పావురంబాడిన ఫక్కి పాదములు
నాట్యమాడిన భంగి నాడి తలెత్తి

చూడ్కులు విరింప చూపెను బిరుదు
దాని వెంబడి జూచె ధారుణీశ్వరుదు
జానెడు మూరెడు జానబెతేళ్లు
బండి బొమ్మనలవంటి పౌంజుకటార్లు
ఎండగట్టిన చేప వేలాడుమాడ్కి
తెరగున్న గండకత్తెర జూప, యపుడు
కఱియాలభూపాలు కలకల నవ్వి
పడెవాగె తేజిని బంటుకు నొసగి
నడిచె అంజనిదేవినందను కడకు
నయవినయోక్తుల నాంజనేయులకు
ప్రియభక్తి దండ మర్పించి యెదురుగ
నిలిచి ప్రార్థన జేసె నృపకుంజరుండు:
"అలనాడు శ్రీరామునాజ్ఞను బొంది
పొంకమౌ వారిధి భోరున దాటి
లంఖిణి ద్రుంచియు లాఘవంబునను
చని యుంగరంబును జానకికొసగి
జననిచే మణియంది చెట్లెల్ల విరిచి
విశదమౌ రాక్షసవీరుల ద్రుంచి
దశకంఠుని గదిసి తగ మాటలాడి
ఆక్షణంబున లంక నవలీల గాల్చి
దక్షత సాగరం దాటి శ్రీరాము
పాదముకడకేగి పణతిక్షేమంబు
మదిమెచ్చ జెప్పిన మర్కటోత్తముడ!
సాగరం దాటిన సర్వసాహసము
వేగ కరుణజూచి యీ వరమివ్వ
తడయ కొసగు"మని దండమర్పింప
కుడియడం పార్శ్వము గుబ్బటిలె మిగుల
కన్నులు నలుముక కరములు పాద–

సన్నిధినుంచియు సరగ గూర్చుండె.
నెలకొని తనభటుల్ నెమకుచందందు
కలియనేతెంచిరి ఘనులు నల్వురును
అడపవారరుదెంచి యవనీశ్వరునకు
మడుపులాకులు జుట్టి మరి భక్తినొసగె.
ఊరువాకిటచెంత నుండిన భటులు
ధారుణీశ్వరు జూచి తగనిట్టులనిరి:
"వచ్చినపనియేమొ వనగూర్చుకొనియు
విచ్చేయు నీవున్న విడిది దగ్గరకు
చుక్కలలో గల సోముని మీరి
చక్కని మా తండ్రి జరిగిపోవయ్య!"
అన్న పలుకు విని యా వీరవరుడు
యిన్ని బిరుదులు గట్టు వీరుదెవడనిన

**–: బిరుదులు కట్టిన బేతాళవరుని పరాక్రమమును భటులు చెప్పుట :–**

"బిరుదు లెవ్వరివని పేరడిగేవు
బిరుదులు మాగుర్వు బేతాళర్జుట్టి
ఘనులార యీ బిరుదు గట్టినవాడు
మనుజాధినాథుడు మరి పోరగాడు
సరదారుడు మిగుల సాహసపరుడు
పరులకు అపజయంపడు పందెకాడు
సంతోషపడుచును జగడము కొఱకు
వింతవింతగ కట్టె యీ బిరుదులెల్ల
తిన్నగ పలుకాడి దీర్చుక పనులు
మున్ను వచ్చినదారి పొమ్ము మాతండ్రి
అరుదెంచు" మనినంత నాత్మచే గోపించి
కఠియాలభూపతి క్రమముతో బలికె:

**–: బిరుదులు ఒక ప్రక్కకు దీయించమని భటులతో బేతాళునికి జెప్పిపంపుట :–**

"కులమేమి యిటు గట్ట? గుణమేమి దీని?

ఫలమేమి యిటువంటి పనులొనరించ?
మనుజరూపము దాల్చి మహిలోన బుధులు
వినుతిపొందినవారు విఖ్యాతపరులు
వనచరచేష్టల వర్తించ దగవ?
పనికిమాలిన చెడ్డపను లొనరింతురు
కాని మంచిది మీరు ఘనులార! యిపుడు
పూని మీగురువున్న పొంతకు బోయి
తెలుపగదగును యీతీరు మీ దొరకు
ఎలమంచి పంపాద్రి నెలమి పాలించు
లావైన కీర్తివిలాసుడ, వలురాజు-
భూవిభు సుతుడు సింహభూపుని సుతుడ,
చండవైరులమిండ! సమరప్రచండ!
గండకత్తెర తేజి కటియాలరాజు!
గంభీరుడౌ యదుకంఠీరవుండు
శంభుని సేవించ సరగున వచ్చె
కట్టిన బిరుదులు కడకు దీయించి
నెట్టన దారి కల్పించెనేనియు
సంతసమున మేము సర్వేశు గొలిచి
సంతోషమున తర్లిజనువార" మనుచు
చెప్పిన భటవరుల్ చెలగి కోపించి
చెప్పసాగిరి వారు చిడిముడిపడుచు:
"బిరుదు లేమనువారి ప్రేవులు దీసి
గరిమతో ద్వారమున కట్టించినాడు!
బెట్టుగా యెవరైన బిరుదు దీయుడన
పట్టి కంఠము కోసి పాలించినాడు!
తగదని బిరుదులు ధరణివల్లభులు
మగతనములు బల్కి మడిసియున్నారు!
పట్టివిడుపుమంచు పడిచచ్చినారు!

గట్టిగా నెవ్వరును కదలిపోలేదు!
మీకన్న సాహసం మీరినవారు
కూకటి వేళ్ళతో కూలియున్నారు!
కుంజరంవంటి మా గురువు బేతాళ్డు
రంజిల్ల చేసిన రాలు చుక్కలును!
కనువిప్పి మా గుర్వు కక్కసించినను
ఘనమైన గిరులన్ని కదలును ధరణి!
ముష్టితో బేతాళ్డు ముంజేయి యెత్తి
చట్టుపై గుద్దితే చట్టు బద్దలగు!
కాలూది బేతాళ్డు గద్దించెనేని
ఫాలక్షుడైన కోపము నెదుర్పండు!
ఒళ్ళెల్ల ఆయుధావళి విసిరినను
పెళ్ళుగా మునుపటి బేతాళుడితడు!
అనిపల్కి బలవంతుడై యున్నవాడు
మనుజేశ! మాటలు మాని పోవయ్య!"
అన భటులతో కఠియావులరాజు
వినుడని నీతులు వెసదెల్ప బూనె:
"తగని బిరుదులు గట్టి దారిలోపలను
జగమందు నపకీర్తి జెందంగవలెను
పుణ్యాత్ము లరుదెంచు పురివాకిటికిని
అన్యాయమౌ బిర్దులమరించ దగున?
చన్ని కర్యావుల చిన్నతమ్ముండు
అన్న బేతాళుని అడిగితిననుడి!"
పనిభటులెల్లరు పకపక నవ్వి
"వినువిను రాజేంద్ర! వెఱ్ఱి నీకేల?
భువిలోన నీకన్న బుద్ధిమంతులును
అవిదితంబుగ నడగి హతమైనారు
బిరుదులు కడదీయ బేతాళు నెదుట

వెరువక అడుగువారు పృథివిలో లేరు!
తెలియక మాగుర్వు ధీరత్వమహిమ
పలికెదు మాగుర్వు బలమెఱుంగకను
బాలుడనని యెంచి పాపముకు వెఱచి
తాళితింగాక బేతాళునితోడ
చెప్పితే నప్పుడే శిక్షించు నిన్ను
తప్పక నీవున్న తావుకు సాగు
అరుదెంచు" మనినంత అవనిపాలునికి
గరగర నలుగులు గాడినట్లాయె
కన్నులురిమిచూచి కఱియాలరాజు
తిన్నగ భటుల కీతీరున బల్కె:
"అన్న బేతాళున కతిప్రియంబునను
చెన్నొంద నొకవార్త చెప్పు డీవేళ
విడుమను బిరుదులు, విడువక యున్న
వెండి తెలుపు"దన వే భటుల్ చనియు
సరగున బేతాళు సన్నిధి నిలిచి:
"శరణు బేతాళుడా! శరణార్థి మీకు!
ఎవ్వడో కర్యాల యాదవరాజు
దవ్వున నొక్క యశ్వంబుపై నెక్కి
వచ్చి ద్వారము చెంత వనర కూర్చుండి
పిచ్చివానివిధంబు పెడబొబ్బలిడుచు
బెడిదమైనటువంటి బిరుదులు జూచి
విడువరా బిరుదులు విడువుమటంచు
బిరుదులు కట్టినవాని పేరేమి యనుచు
పరువడి మొనచూప పలుకుచున్నాడు
పంతమె యనవచ్చు పట్టినపట్టు
ఎంత చెప్పిన వినడు యాదవరాజు
బిరుదులు విడిచితే పెంపవు గాక

బిరుదులు విడుమనుడు బేతాళ అన్నను
సెలవిమ్ము బేతాళ సేవకులకాజ్ఞ
వలనొప్ప యెటువంటి వార్తను మాకు''
అనవిని బేతాళుడగ్నియై మండి
"ఎనసి రోషము ప్రతిబేతాళుడనగ
కలిగెనా కయ్యము కఠియాలరాజు
తలచెనా నాజికి తనకెదురించి
బిరుదులు విడుమని ప్రేలిననోరు
విరుగ మొత్తినగాని విడువడాపలుకు
చక్కని నాచేతి చాయకటారి
ఒక్క ప్రొద్దుండుట వాడియున్నాది
కసిదీర యీప్రొద్దు కటహారిమేత
విశదముగ గల్పించె ఈశ్వరుండిపుడు

**-: నక్కవలెను నక్కి, ఈగవలెను దూరి, రమ్మని బేతాళుడు భటులతో జెప్పిపంపుట :-**

త్రొక్కులాడక తాను దొరబిడ్డడనక
నక్కవలెను క్రింద నడిగి రమ్మనుడి!
సాగదు తనకున్న సాహసమిపుడు
యీగవలెను క్రింద యీగి రమ్మనుడి!''
అనుచు కోపించి బేతాళుండు ప్రతిభ
మిణుగురుల్ వడిరాల మీసంబు దీటి
కఠియాలరాజుకు కలక బేతాళుడా
వరపరాక్రముడిట్టు వర్తమానంబు
విప్పైన తన మహావీరశౌర్యంబు
చెప్పి పంపించె నా జనవరేణ్యునకు.
అంతట భటులు కర్యాల భూవిభుని
చెంతకు నేతెంచి శరణార్థి చేసి
"యాదవకులచంద్ర! యతిగుణసాంద్ర!

మోదంబుతో నీకు మ్రొక్కెదమయ్య!
చెప్పవలసినది చెప్పియు మిమ్ము
గొప్పగ నెన్నితిం గోకులాధీశ!
బిరుదులు తలచితే పీల్చి రక్తంబు
గరగరనమిలి మ్రింగక విడననెను
తనకు మీరినవారు తలచి యీబిరుదు
మానక చెడిపోయె మళ్ళిపొమ్మనెను
అక్కర కోటలో కరిగెదననిన
నక్కవలెను క్రింద నడిగి రమ్మనెను
సాగదు తనకున్న సాహసమిపుడు
యీగవలెను దూరి యీగి రమ్మనెను
ఈగవలెను రాక వెక్కసంబైన
ఈగ నణంచెడి విధ మణతుననె”

**–: కటియావులరాజు భటులతో చెప్పిన “నక్కచాటువ” :–**

విని గోకులాధీశ్వ వీరుడై పలికె:
“ఘనులార! మీగుర్వు ఘనుడు బేతాళ్డు
నన్ను నక్కను జేసి నారసింహంబు
ఎన్నంగ తానాయె యెంతవాడతడు
నక్కను నేనౌట నరసింహుడతడు
ఒక్క సామ్యము గల దొనర వినుండు
ప్రణుతింప నీలగిరి పర్వతమనగ
వనరంగ ధరణిపై నొకచోట గలదు
వర పర్వతము చెంత ఒక తటాకంబు
చెఱువు క్రిందట నొక చెఱుకుతోటయును
ఆ తోట నొక నక్క ఆశ్రయించుకొని
ప్రాతరరీతిని బ్రతుకుచునుండె
మరికొన్ని దినములు మరిగడువంగ
చెరుకుతోట రసంబు చెడ మ్రింగియును

కలిగి దేహము కన్నుకానక బలిసె
వలనొప్ప నొకనాడు వనభూమి తిరిగి
చెరుకుతోటకు తిర్గి చోరబోదాము
అని తలపోసియు ఆ నక్కపోతు
పనిబూని తోటలోపలనుండి వెడలి
బయకు వచ్చియు పొఱాడుకొఱకు
హెూయలుగ పారుచు వాలలాడుచును
చినచిన్న చెట్లన్ని చివ్వనెగురుచు
ఘనమైన గుంతల గంతులాడుచును
ధర కుప్పళించుచు దాట్లు దాటుచును
నీడలు గనుగొని నెలమి బెదురుచు
పోడిమి యిటు కొంత ప్రొద్దు గడపగ
ఆ నీలగిరి పర్వతంబున నొక్క
కోనలోపల దొడ్డగుహలోన నుండు
బెబ్బులి సింహము పెనగి బెబ్బులిని
అబ్బుగ భక్షించి అలసి సింహంబు
గుహవెళ్ళి రాకుంట గొన్నినాళ్ళైన
తహతహ పొందియు తానుపవాస
మాప్రొద్దు గుహనుండి అడవికి నేగి
యేపుతో కొండలు యెక్కి వెదకిన
దారిన మృగమేది దగులకపోయె
మారు మొగమై తిరిగి మరియు సింహంబు
అలసి ఆకలిగొని నంతట వెదుక
కలవలపడి చెర్వుగనియు దాహంబు
దగచేత త్రాగంగ తామదినెంచి
మృగమెడతెగి నడిచె ముందెనుక గనక
మార్గమందానక్క మఱచి దేహంబు
జాగ్రత్త లేకున్న సమయమునందు

వెనుకతట్టున కొండ విఱిగి పడ్డట్టు
పనుకుగ్రాకులు చెదరిపడ త్రొక్కుకొనుచు
పటపటమని పిడుగుభంగిన రాగ
చిటినక్కకును బారె సింహంబుగాలి
మళ్ళిచూచిన సింహ మాకారరేఖ
తెల్లని దేహంబు దివ్యవర్ణంబు
బారెడు కోరలు పట్టెడు గ్రుడ్లు
మూరెడు నాలుక మొనసాగుచుండు
పర్వతమునుండి యీ బాలసింహమును
యుర్విపై బంపెనో యుల్లాసమునకు
కశ్యపు జంపిన గాథరూపంబు
విశ్వము కరుదెంచు విధము తా జూచి
పగిలె గుండెలు పంచప్రాణము లెగసె
చెడగొట్టిన నిధి నిలమీద వ్రాలె
వనర కన్నుల జూచి వదిగెను నక్క
వినయమార్గంబున యికిలించి నక్క
'దాసుడన్నయ్య త్వద్దాసి నత్యంత
నీచుండ చండాల నే గుణహీనుడ
స్వాములంతట నిల్చి చండాలు మనవి
ప్రేమతో నాలించి వినుడు నాస్వామి!
యిన్నాళ్ళు బ్రతికితి విశ్వంబులోను
యెన్నడు కన్నార యెరుగను గురుడ!
సురలు మునులుండు చోటులయందు
చరియుంచుచుండు నర్సింహులు మీరు!
పొలుపొంద నేజేయు పుణ్యముచేత
చెలిమితో మిము జూడ సిద్ధించె నాకు
మిగుల పిచ్చుగగుంట మీద గంగాంబు
గగనమార్గమునుండి గ్రమ్మినవిధము

నక్కకు ఎక్కడ నర్సింహురూపు
నిక్కము గన్పించు నీవిధమెచట
కాచి రక్షించితే కడతేరుమనుచు
దాసున కొక బుద్ధి దయసేయకున్న
పంచభూతలంబులు పొదులు చెదిరి
చంచలమును జెంది చిక్కివున్న తగు'
వెతపడి యిటువలె వేడుకలుడిగి
బ్రతిమాలినంతనే పరగ సింహంబు
'రావయ్య! నక్కనారాయణ! యిచట
యే వర్తమానంబు? ఎందు నీతావు?
కులబంధువులు యెందు కుదిరియున్నారు?
తెలుపు మృగముజాడ దిగులేల రమ్ము!
దవ్వుల నిలుచుండి తరచుగ మాతొ
క్రొవ్విన కూతలు కూయుచున్నావు
యెదురుగ నిలుచుండి యేకాంత మొకటి
వదలక దెల్ప రావయ్య! యిందనుక'
భీకరాకృతి గని బెదరి యా నక్క
తోక లోనికిబెట్టి దోసిలియొగ్గి
'అడ్డ మాజ్ఞయు లేని యధికులు మీరు
చెడ్డ నీచుండను చెంతకు యేల?
తల్లిదండ్రియు నన్నదమ్ములు లేరు
యెల్లెడ బంధుల నెవ్వరి నెరుగ
కులబంధువుల నెర్గి కూడి తిర్గెరుగ
తలపగ కులసతి తనయులు లేరు
యెవ్వరు లేనట్టి యేకాంగినౌట
దవ్వులుండుట తెలియదా స్వామి మీకు?
అలరుచు యేకాంత మాడుట తెలియ
నిలిచి యొక్కెడచోట నిలుచుట యెరుగ

నను జంపి మేతగా నమలదలంచి
మనసున యెంచి రమ్మనుచునున్నారు
చక్క యేకాదశి సాధించలేక
ముక్కకొఱ్ఱలగింజ ముట్టినట్లగును
చందమౌటనుగాక చాలను మేత
యెందుకు సందేహ మెందుకు గురుడ?
నన్నేలి రక్షించు నరసింహదేవ!
కొన్ని రోజుల మేత కోరినట్లుగను
కావింతు మీకది కలయంత యిపుడు
కావరంబున కన్ను కానదా మృగము
దేవతా మృగమును దివిరి భక్షింప
పావనంబైనట్టి పరము జెందెదరు
చూచివుంటి నిపుడు చూడాలి తిరుగ
దాసున్కి సెలవిమ్ము తడయకీక్షణమె
నిలిచి యిచ్చటనుండు నేనటుబోయి
తెలిసి వేగమె వచ్చి దేవరవార్ని
అందు దోడుకపోదు హతముగావించ
సందేహమందక సాగి పొమ్మనుము'
అనవిని సింహము ఆకలి కొఱకు
కని నక్కతో పల్కె కంఠీరవంబు:
'యిప్పుడు చెప్పిన యీ మృగంజాడ
యెప్పుడు చూచితి వెచ్చోట గలదు?
నీవు దెల్పు మృగంబు నెలకొను తావు
వేవేగ చూపితే వెలయు సంతసము
కాకున్న నీగొంతు కరకర నమలి
ఆకొని భక్షింతు అరుగు వేగంబె!'
వారితో సెలవంది వందనం జేసి
దారిసాగెను నక్క తహతహపడుచు

'నేను దెల్పు మృగంబు యెందున గలదు?
లేనియాశను యిటులేల గొల్పితిని?
చక్కని చెర్కులు చవిగొనలేక
యెక్కడ దోచె నాకిట్టి దుర్బుద్ధి?
చేపలపై యాశ చేటుకై పుట్టె
యేపుతో తోటలనుం దేల వెళ్లితిని?
ఉల్లాసమున మర్చి యుండంగనేల?
అల్లన సింహము అరికట్టనేల?
ప్రాణము వెఱచి నేపలికితి యిటుల
దీనికి ఉపమేమి తెఱగు జేయుదును'
అనుచు తలంచుచు ఆ నక్కపోతు
మనమున భయమంది మార్గము నడువ
బలువైన ఒక దొడ్డబావి కన్పించ
వలనొప్ప నతివేగ వచ్చె నక్కడికి
బావితాపల నిల్చి పాదముల్ రెండు
తావంగి నీళ్ళున్న తావుపై నునిచె
ధిక్కరించెను చెవుల్ దీటించె కండ్లు
చక్కగ నాలుగు చరణముల్ వూది
ఉబ్బి దేహము బెంచి వూగి తోకెత్తి
రబ్బుగ గర్జించి రభసంబు జేసి
బలుబావిని యొక్క పలుకును బలుక
పలికెను నీటిలో పార యా పలుకు
విలసిల్లి తనకన్న విస్తారముగను
కళలుల్క బావిలో గన్పడె నక్క
అంతకంతకు నాలుగంతలై పాప
వింతయై కన్పింప విరివి దేహంబు
జలములో పాపను జాడ తా జూచి
మలయుచు సంతోషమంది యా నక్క

ఇక్కడ సింహము నీ బావిలోను
గ్రక్కున ముంతునని గంతులువేసె
తాపలపై నెక్కి తనలో తాను
ఆపద సింహము నటుడాయ వెఱచి
చనుదెంచుచున్న యా సమయమునందు
ఎనయ సూర్యుని ప్రొద్దు యిక ఝాము ఉండె
నక్కపై కోపించి నారసింహంబు
యెక్కడ బోయెనో యిలను శోధించి
పట్టి చంపుదునని పాదున నిలిచి
'వట్టిమాటలు చాల వందనంబులును
పలుకుచు మృగమును పట్టిత్తుననుచు
కాలము జరుపుక కదిలెను నక్క
కొండల సెలలను గుహలయందున్న
గుండెలు తీయుదు గోరులచేత
కండలు బెరుకుదు కదిసి గోరులను
బొండలు బెట్టుచు భుజియింతు' ననుచు
కోపించి యిటువలె కొదమ సింహంబు
తాపమునున్నంత తరుణమున నక్క
చనుదెంచి యెదురుగ సైగలుచేసి
కనుసైగచే ముందు గడిదారి జూపి
'మిగుల చప్పుడుగాక మెల్లన నడువు
సగము దేహము మర్చి చలమున బేర్చి
మాటున ఒక చోట మత్తుగొన్నట్టు
పాటున యామృగం పండుకొనుండె'
అంతటంతట మాటలాడుచు బావి
చెంతకు నేతెంచి సింహమునకనె:
'దాపుకు రావయ్య! దండంబు మీకు!
తాపల దిగవయ్య! తగదేహమొంచి

నీటిలో పాదముల్ నిలుపు శీఘ్రమున
పాటించి కన్నులు బరపి కోపాన
ధిక్కరించు చెవులు నిక్కి దేహంబు
మక్కువ కోరలు మరి వెళ్ళబెట్టు
తోకెత్తి ముమ్మారు తూగొకమారు
యేకము రోమముల్ యెత్తి సడలించు
గద్దించు మిక్కిలి కడుకోపముసను
వుద్దికావల జూడు వురురూపమునను'
నక్క జెప్పినటుల నారసింహంబు
ఒక్కటి పోకుండ వరుసతో జూడ
నిండారు బావిలో నీటిలో పాప
కొండగా కనిపించ కొదమ సింహంబు
'బలుమృగమున్నది బావిలోపలను
తొలగక పట్టుదు త్రుంతును గాక!
బలుమృగమునుబట్టి బయటికి దెచ్చు
నెలవు దెలుపు నక్క నెట్టులో త్రోవ'
అన విని నక్క తా ననియె సింహముకు:
'కనుగొన వినవయ్య ఘనసింహరాజ!
చాలమృగముబట్టి చంపిన వెనుక
నీలావు మృగమును నిన్నొకతట్టు
వెళ్ళదీతును పైకి యీ తాపలముల
ఝల్లడ మృగమును జంపుము దేవ!'
అన విని కోపించి ఆ సింహరాజు
'పెనసి మృగముబట్టి పీల్తు రక్తంబు'
అని మది రెట్టించు ఆగ్రహంబునను
వెనుకబారున బోయి వెనుక ముందనక
ఉరువడి లంఘించి వుద్దిపై కెగసి
దరిలేని బావిలో దప్పున ధుమికె

పాటున సింహము పాతాళమంటె
బైటికి నరుదెంచు పరియంతమునను
దగతోటి జలమును ద్రాగె సింహంబు
దిగులున వణకుచు దిక్కు తెలియక
మిడిగ్రుడ్లు వడిదిప్పి మెడపైకి యెత్తి
నడువ పొందిక లేక నక్కను జూచి:
'నమ్మితి నిను నక్క! నడువలేకుంటి
నమ్మించి చంపితి నన్ను నీ'వనిన
'నన్నేల చంపెదు నరసింహదేవ!
నన్ను చంపదలంచి నట్టడ్విలోన
చిక్కించికొంటివి సింహనాథుండ!
నక్కపై దయవుంచె నారాయణుండు
దిక్కు నాకు గలిగె దీనుడననుచు
ఆ కమలాక్షుడు ఆదరం చేసె!'
ప్రభలేక బావిలో పాతాళమంటి
గుభగుభ నోటను గ్రుక్కుచు నీళ్లు
బుడబుడమని అడ్గు బురద మట్టునను
పడియుండి మరునాడు పైతేలి యుండె
నక్కలన్నిటి బిల్చి నరమృగం జూపి
చక్కగా తాపల జాడకు తీసి
యిల బంధువులకెల్ల విందు గావించె!
తెలియుడి భటులార! దీని సామ్యంబు
చిక్కించుకొనునంటె సింహము నక్కను
నక్కను నేనై తె' నారసింహంబు
అన్న బేతాళుండు అనుకొనుడయ్యా
చెన్నొంద వింటిరి సింహవిక్రమము!

**–: కతియావులరాజు భటులతో చెప్పిన "ఈగచాటువ"* :–**

ఈగలాగున నన్ను యీగి రమ్మనెను
ఒక్క కీకారణ్యమున చెంచువాడు
సఖియతో యిద్దరు సంచరింపుచును
బలు మృగంబుల మంచి పండ్లు ఫలములు
కలిగిన వస్తువుల్ కాంతయు తాను
ఖ్యాతిగా భుజియించి కాంతయు తాను
పోతినేడను పేరు పోతాంబ పేరు
బహుదినంబునల నుండి బాలలు లేక
విహితమార్గంబున వెతజెంది వారు
కోనల నుండిన కొన్ని దేవుళ్ళ
తనియ నోములు నోయ తనయుండు గలిగె
కలిగినవారల కతిసంభ్రమమున
చెలగి పురుడు పూజ జేసి దేవతల
కొనియాడి సేవించి కోమలి తాను
వనర యిటులనున్న వారితనయునకు
పలుమారు యేప్రొద్దు పసిబాలునకును
తలకు అంటుడు తేనె, త్రాగించ తేనె
తేనెతో బాలుడు తేలాడుచుండు
దానికొంఅకై వారు తల్లడవడుచు
'తేనెతో తలయంటి, తేనె త్రాగించ
మానక రోగము మరియు రాగలదు
క్రమమొప్ప యీ తేనె కడివెడు గొంచు
దుముదారు పట్టము తొరగ నీవేగి
తేవయ్య చమురు యీతేనెకు బదులు
పోవయ్య! నాపాలి పుణ్యపురుషుండ!'

---

*ఈ "యీగచాటున" పల్నాటి వీరకథలలోకూడ వచ్చును–తంగిరాల

అని విన్నవించిన ఆ పోతినేడు
వనజాక్షి తెలిపిన వర్తమానమున
గైకొని చక్కని కడివెడు తేనె
జోకతోడుత దెచ్చి సుదతి పల్కులను
జతనమౌ తన రెండు జాగిలంబులను
పతివెంబడిని రాగ పైనమై కదలి
పరువడి దుముదారు పట్టణంబునకు
అరిగి బజారుల నలయక తిరుగు:
'బుధజనులార! ఓ పుణ్యాత్ములార!
మధువును కొనరయ్య! మా తండ్రులార!
పరగ చక్కెరకన్న పాలకు మిగిలి
సరస తీపౌమధువు సరగ కొనరయ్య!
అరటి ఫలము ద్రాక్ష అతిమధురంకంటె
మరియు నెక్కువ తీపి మధువు గొనుండు!
మదిరాక్షులైనట్టి మాతల్లులార!
సదయ గొనరోయమ్మ! చక్కని మధువు
బాలల గన్నట్టి పద్మాక్షులార!
చాల పనసఫల చవికన్న తీపి
గొనరమ్మ మధువును కోమలులార!'
అని మధు మధు మధు వనుచచ్చోట తర్లె
అంగళ్ళ వీథికి నరుదెంచి వచ్చె
అంగళ్ళవారికి నందరికి దెలిపె
'చక్కని కొండలు సాధించి మధువు
యిక్కడ తెచ్చితి యిది గొనరయ్య!
చీమలు చొరరాని సెలకోనలందు
ఆముక తెచ్చియున్నాడ కొనుండు
మునులుండు కోనలో మొనసిన మధువు
కొనరయ్య! చక్కని కోమటులార!'

అని పేదు బాడుచు ఆ పోతినేడు
కొనుమని నిటువలె కొసరి పలుకంగ
అందులో నొక వైశ్యుడగు పోలిశెట్టి
కందువ మధువను క్రమమెల్ల దెలిసి
మధువు తెమ్మని బిల్చె మాటిమాటికిని
మధువు గైకొని వాని మందిరంబునకు
చనుదెంచి మధుకుండ చయ్యన దించి
ఎనయ తా నిలుచున్న యిరు భాగములను
జోడు జాగిలములు జోకతో నిలిచె
కడిమి యినుపగొలుసుగల పట్టెడలతొ
చెంచుల పోతున్న చిటిజాగిలములు
అంచున నిలుచున్న ఆ సమయమున
కడవలో చెయిపెట్టి గజవర్తకుండు
నడుమ గిర్రున ద్రిప్పి నాణ్యంబు దెలిసి
గట్టిగా యీ తేనె కడవలోపలను
అట్టుగట్టినవిధ మటువలె నుండె
హస్తమెత్తిన గోటికంటుకున్నట్టి
ముత్యమంతయు వచ్చి మునిగోటివెంట
చిమ్మిన గోడకు చివ్వున నాటి
కమ్ముక నున్నపు గచ్చుపై నిలిచె
నిలిచిన కని యీగ నెనయ భక్షించ
వాలిన యీగెకు వడి పొంచె పులియు[1]
యీగతి పులికి బరిటె[2] వేగమె కదిసె
బాగొప్ప బరిటెకు బల్లి తా పొంచె
బల్లికి మూషకం పైకొని యుండె
భళ్ళున మూషకం పసిగట్టి పునుగు–
పిల్లి పొంచుకయుండె బెబ్బులిరీతి

---

1. ఈంగపులి = సాలెపురుగు; 2. బరిడె పురుగు/బరిణెపురుగు = బొద్దింక.

పిల్లిపై చెంచుల బిరుదు పోతన్న
కూనయేపులు రెండు కోరలుదీటె
తేనెను భక్షించె తియ్యగా యీగ
ఈగెను బట్టుక వేగ పులి మ్రింగె
వీగక బరిటె తా వే మ్రింగె పులిని
బరిటెపై లంఘింటి బల్లి తా మెసలె
పరికించి మూషకం బల్లిని దినియె
అల్లన మూషక మాసించి పునుగు-
పిల్లి గొబ్బున బట్టి పీచంబణంచె
పిల్లిని కుక్కలు పీకి విదళించె
రొల్లున పోల్చెట్టి రోషించి మూల-
యున్న రోకలిబూని యోర్వంగలేక
క్రన్నన కుక్కల కణతలపైన
మొత్తిన కుక్కలు ముట్టెలు పగిలి
వత్తుకై ధరమీద వ్రాలె నావేళ
పుడమిపై పడజూచి పోతినేయుండు
బెడిదమౌ జముజాళి బెతికి ఝళిపించి
మడియుడ నీవెంత మార్జాలమెంత
కడిగినా కుక్కలు గల్గియుండినను
పది యిరువది నూరు పట్టి తెప్పింతు
క్రోధించి చంపితి కుటిల మానసుడ
యేపుల విడువక యే నరణ్యముకు
మోపున పాదంబు ముందఱ నడదు
చక్కని కుక్కల చంపితివిపుడు
కుక్కల చంపిన కోపంబుచేత
కడుపులోపల గుండె కరిగి నీరయ్యె
కడగి కండలుజేయ కడకు లంఘించి
పట్టుగా జుట్టునుపట్టి చేయెత్తి

పొట్టపై జముజాళి పొడిచి పడద్రోచె
మగడు చచ్చుటజూచి మగువ యిల్వెడలి
వగ నేగుదెంచి తా వలపోసి కొనుచు
'మాతండ్రులార! ఓ మాయన్నలార!
నాతోడునీడల నాతమ్ములార!
పాపాత్ము డెవ్వరో పతినిల గూల్చె
యేపుమీరియు నుండె యిందు దిక్కెవరు?
కలిగియుండినవారు కానరారయ్య!'
కలకంఠి యిటువలె కలవలపడుచు
వాపోవుచున్నంత వరబలాధిపులు
కోపాగ్నులై మూకగూడి యచ్చటికి
చేరిరాగను జూచి చెంచుపోతున్న
వారి వాకిలి వీడి బారున నిలిచె
క్రోధించి పొడువగ కోమటుల్ రాగ
వీథివీథుల జొచ్చి వీరుల గూల్చె
పగబట్టి పట్టము బలము నల్దిశల
తగు మన్నెవారల దళములు గ్రమ్మె
దయదప్పె శ్రీహరి దగదట్టి చెంచు
బయలు కొంచెము సందు బాజారు నొదిగె
మిద్దెలపై నెక్కి మెలగి కోమట్లు
అడ్డల సోలలు అరగిద్ద చిటులు
శిలలును రెండగు శేర్లగుండులను
పొలిపిరి కోమట్లు పొడిపొడిగాను
వెక్కసంబుగ వాని విడిబడి చంపి
కుక్కల చెంచునుకూడ జోడుగను
కాలికి వరియెంటు కట్టి యీడ్చుచును
మాలల తీసిరి మరి దూరముగను
అతడు చచ్చినచావు అతివెరుగకను

వెత మూడుదినములు వెదురుజూచియును
పురుషుడు రాడాయె ప్రొద్దు ప్రొద్దాయె
దరిలేని పక్షిని తానైతి ననుచు
అప్పుడు వలపోసి అతివ పోతాంబ
యిప్పపువ్వుల గోసి యింటికి దెచ్చి
మృగములు పక్షులు మెలగనిచోట
వగచేత సుతుపాన్పు వనర యేర్పఱచి
బాలునికి పూదేనె పడగ సూత్రమున
గలిపించె కాలము గడపుటకొఱకు
ఆకలిగొని బాల అరచితె తేనె
ఆకలి దీర్చును అమ్మకైవడిని
తలుపులు గట్టిగా తగమూసిలోన
యున్నచందంబున యువిద తా గూర్చె
బందాని కన్నిట భద్రముజేసి
పొందిక దాసాని పూవులగంప
అమరంగ శిరముపై నతివ తా నునిచి
దుముదారుపట్టము తొయ్యలేతెంచి
'మానినీమణులార! మాయమ్మలార!
పూని యీదాసాని పూవులు గొనుడు!
కుముదలోచనులార! కోమలులార!
విమలమౌ దాసాని విరులు గొనుండు!
పంకజముఖులార! భామినులార!
పొంకమౌ దాసాని పూవులోయమ్మ!'
పాటించి యిటువలె పలుకుచు బోవ
నీటికడవ స్త్రీలు నెదురుగా వచ్చి
'వినవె చెంచులపాప యీ పట్టణమున
అనువంద పూవులు అమ్మ వచ్చితివి
ఫలమీక ఆశించి పట్టి చంపుదురు

తెలియ జెప్పెద విను తెరవరో! నీకు
ఒడిసి చుట్టుక మున్ను ఒక చెంచువాని
సుడిబడ వడి రాళ్ళ సోలగిద్దలను
కుక్కల చెంచునుకూడి జోరుగను
గ్రక్కున పడగొట్టి కడకీడ్చినారు
వామభాగంబున వాగులోపలికి
భామ యిట్టిపనులు పారిపో'మ్మనిన
ఆన విని పోతాంబ అవనిపై నొరిగె
ఘనశోకవారాశి కన్నుల నిండ
యిలబడి దుఃఖించి యింతి తా లేచి
పొలతి వేగమె జనె పురుషుని కడకు
వాగులో పడియుండె వామభాగమున
జాగిలంబులు రెండు చచ్చిపడుండె
ఉన్న పురుషుజూచి యుర్విపై వరిగె
పన్నుగా పాదాలపై పొరలేడ్చి
పురుషుని గుణములు పొలతి తా నెన్ని
గరిమ వీపున విభు కట్టుక రెండు–
చంకల జేర్చుక జాగిలంబులను
కొంకక తెచ్చెను ఘోరారణ్యముకు
కావలసినయంత కాష్ఠంబు పేర్చి
జీవితేశుని పరంజెందించె నపుడు
కోమలి పిలిపించి కులబంధుజనుల
భామ వారలకెల్ల పంక్తిభోజనము–
కావించి వారికి కరములు మొగిచి
జీవితేశుని కథ జెప్పి వాపోవ
చాలభిమానించి సకలబంధులును
'ధూళిగావించుడి దుముదాళిపురము'
ఆన యెల్లచెంచులు అమితవిక్రములు

గొనకొని చెంచుల గూర్చి లక్షలను
పట్టపగలు వచ్చి పట్ణము చొచ్చి
పొట్టలు శిరసులు పొడిచి శిరసుల
పంచపదార్థముల్ పట్టించుకొనియు
చెంచులు యేగిరి చెల్లపాలుగను
సాగి, యీ విధమగు సామ్యము గలదు
యీగ ప్రాణమునకు యిందరు చనిరి
చక్కగా రెండు సామ్యముల్ మీరు
నిక్కము విన్నటు నిజమగు గనుడు
కాని మంచిదిగాక ఘనభటులార!
పూని మీ బేతాళపుణ్యాత్మవరుడు
కట్టరానివిగూడ కట్టియున్నాడు
గట్టిగ యెన్నాళ్ళకైనను గాని
తన వ్రపణహానియే తనకన్న ఘనులు
గనుగొన ధరణిలో గలరు కొల్లలుగ
చూడగ రాజులు చూడని బిరుదు(లు)
ఊదదన్నెద రందు నుండనిచ్చెదర?
ఘనులు యీ బిరుదులు కన్నుల జూచి
వెనుకదియ్యరు వాని విరుగ దన్నెదరు!
గట్టిగా యీ బిర్దు కట్టినవాని
మట్టిమల్లాడేరు మరి యిందు వచ్చి

**–: బిరుదులు ప్రక్కకు దీయని యెడల ఎడమకాలితో బిరుదు లూడదన్నుదునని కఠియావులరాజు భటులతో జెప్పి పంపుట :–**

తగవని బిరుదులు తప్పించుమనుడి
తగదని బిరుదులు తప్పించకున్న
పన్నుగా నా వామపాదముతోను
తన్నుదు బిరుదులు తప్పను నిజము
స్థిరముగ మాతండ్రి సింహాద్రిరాజు–

చరణంబులాన! వేచని దెల్పుటకు
పొ"మ్మని కఱియాల భూపాలుడనిన
క్రమ్మర మెదలక కడకు వైదొలగి
కరమగు నాశ్చర్యకలితులై వచ్చి
గురువు బేతాళుని కొలువులో నిలిచి
"జనవర్య బేతాళ! శరణార్థి మీకు!
పెనగెను కయ్యంబు బిరుదులకొఱకు
వెంపరలాడుచు వెదకి శత్రువుల
చంపితివిగ బహు శత్రుభూపతుల
నుతికెక్కు నరసింహు నుగ్రరూపమున
ప్రతివిక్రమార్కు డేర్పడి వచ్చినాడు
కథలు పద్నాల్గు లోకములున్న విధము
అతడు చెప్పగ వింటిమయ్య యిందనుక
అతనితో నీదు సాహస మీడుగాదు
ఇతర మనసు వీడి విడువు నీబిరుదు
తీసితే మేకొను తీయక యున్న
మోసంబు నౌనయ్య ముందఱిపనులు
పలికినాడతడొక్క పంతము మాతొ
'కలియుగ బేతాళ్డు కట్టిన బిరుదు
తడయక భటులచే ధర్మము నెంచి
కడకు తీయించితే గౌరవమగును
ఎనయ బిరుదు మీరు వే తీయకున్న
వెనువెంట కుప్పించి యెడమపాదమున
తలకొని వెడలంగ తన్నుదు' ననెను
యిందుకొఱకు వాని కేమి యుత్తరము?
పొందిక సెలవిమ్ము పోయెద" మనిన
అనలుడై బేతాళు డాకాశ మంటె
తన బలాటోపము దనర యిట్లనియె:

"క్రమ్మి మీదికి రానుగా యంచు దలచి
యిమ్మెయి బలికేన యాదవరాజు
మరిమరి యేమేమి మాటలునాడె?
ధర నిడివిగ బెరుగు విఱుగు కొఱకె
పరగ గద్దించేది భ్రష్టవుట కొఱకె
పొరలి పొంగిన పాలు పొయిపాలు గావె!
పుట్టగొడు గెన్నాళ్ళు భువి మీదనుండు
అట్టి కోసౌబంటు అతిబలాధికుడ
ఓరుగంటి శివుని కొద్దులే పూజ
పారిపొమ్మనుడు యాపంద మానవుని
యితడు వచ్చుకొఱకు యిందుశేఖరుడు
బ్రతిమాలెనా యింత పరమభక్తుణ్ణి?

**-: ఆంజనేయ దేవాలయమునుండి లేచి వెళ్ళని యెడల, కీళ్ళు విఱిచి, శరీరము బ్రద్దలుగా చీల్చుదునని బేతాళుడు భటులతో జెప్పిపంపుట :-**

హనుమంతు దేవాలయము నుండి లేచి
వెనుక తీసెనటన్న విని కాతు వాని
అందు నున్నాడను నతివిక్రమమున
బంధనంబులు విఱిచి బ్రద్దలుగాను
స్పష్టము దేహము పగులును ననుడు
పుష్టిగలుగువాడ పృథివిలోపలను
వరగల్లు యేలెడి వసుధేశ్వరుండు
వీరప్రతాపునకు విరితగు బంటు
రంగమధ్యంబున రాసభయందు
సింగము బేతాళు చెలగెను పేరు
నాపేరు సింగము నతడును గజము
యీపట్ల పులి నేను యిల గొఱ్ఱె యతడు
గరుడుడ నేను తా కాలసర్పంబు
ఉరగంబు నేను తా ఉరుగోంద్రుకప్ప

అంత పర్యంతము నతనికి తెలిపి
గంతులు చాలించి కతియాలపతిని
పొమ్మని చెప్పుడు బుద్ధిగాదనుడు
సమ్మతి తెలుపుడు చక్కపొమ్మనుడు
బిరుదు విడుచుకటు బేతాళుడనుచు
ధరణిలో నాపేరు తగ లేకయున్న
అప్పుడు బిరుదులు నవనిపై వ్రాలు
యిప్పుడు బిరుదులు విడుమనువాని
తప్పింతు నాలుక తనముక్కు గోతు
నొప్పింతు తనప్రాణి నొదిగి పొమ్మనుడు!"
అనవిని భటులెల్ల నతి వేగమునను
ఘనుని సన్నిధికేగి "కతియావురాజ!
నీవు మాయింటిలో నిలిచినయట్టి
దేవుడవని నీకు తెల్పితిమెంతొ
మాతోను దెలిపిన మాటలన్నియును
బేతాళునకు చాల భీతి జెప్పితిమి
చెప్పిన విని లేచి శౌర్యంబు మెఱసి
నిప్పువలె మండెను నిను తలచినపుడె
సాగిపొమ్మనె లేచి సాగకయున్న
సాగరంజొచ్చిన చంపుదుననెను
వాయునందనుని దేవాలయంబునను
పాయకుండిన నీకు ప్రాణాంతమౌను
కందర్పు బోలిన కతియావురాజ!
పొందుగా యిపుడైన పోవయ్య! సాగి
మింటి చంద్రునికన్న మీఱియున్నావు
కంటకం చాలించి కదలిపోవయ్య!
చూచినంతట మిమ్ము చోద్యమయ్యెడిని
లేచిపోగదవయ్య! లేని కార్యంబు

పాపిష్ఠి బేతాళ్డు పట్టినపట్టు
రూపు దప్పించను రుద్రుని వశమె?
బేతాళుశౌర్యంబు బెగ్గడిలునపుడు
భీతిగల్పించును బెబ్బులియటుల
జడివానవలె గుర్వు సాహసంబేర్చు
పుడమి నిట్టులబంటు పుట్టడటంచు
నట్టుల దో"చన నా రాజవరుడు

**-: ఓరుగంటి శంభుని ప్రార్థించి కటియావులరాజు బిరుదులూదదన్నుట :-**

మెట్టి కోపము నూగుమీసము దీటి
గాంభీర్యముగ లేచి కటియాలరాజు
శంభులింగనివంక చెలగి వీక్షించి
"కరుణించు శ్రీ ఓరుగంటి గిరీశ!
కరుణించు శ్రీవ్యోమకేశ! యుమేశ!
కరుణించు పశుపతి! గంగాధరుండ!
కరుణించు శ్రీహరికన్ను గైకొన్న
ఇందుశేఖర! పార్వతీశ భూతేశ!
నందివాహన! అర్ధనారీశ! లింగ!
అంధకాసుర గర్వహర! నిర్వికార!
మందరకోదండ! మదనమర్దనుడ!
ఎలమంచి పట్టణం వెడలి మీకృపను
తిలకింప మేమిల్లు తీర్థమొచ్చితిమి
వచ్చినవారిని ఒక్క ప్రొద్దులతొ
యిచ్చోట నిలిపిన విధమేమి దేవ!
కైలాసమని మిమ్ము కన్నులజూడ
బైల అడ్డము బెట్టి మఱచియున్నావు
రౌద్రుడవై త్రిపురరాక్షసుల చెండి
రుద్రుడ! నాటి నిరూఢత్వ మహిమ

తప్పక యీ(ప్రొద్దు దయచేయు నాకు
తప్పులు క్షమియించు దండము స్వామి!"
అని కఠియాల భూపాలచంద్రుండు
వెనుకబారున బోయి వేగమె మళ్ళి
పొంచి బిర్దులవంక పోలించి చూచి
అంచువంచుక నడ్చి అవని కుప్పించి
మించి పై కెగసియు మిగుల రౌద్రమున
తన్నెను యెడమపాదంబున బిరుదు
తన్నంగ వాలి మతంగాద్రిపైకి
క్రన్నన వడి దున్నకైవడి దోప
ఉక్కుముప్పురి వీడి యోజనంబెగసి
ఫక్కున వ్రక్కలై పడెను యాడాడ
ఓరుగంటికి పూర్వవాకిట నున్న
ఘోరమౌ బిరుదులు కూలంగ బడెను
బండిబొమ్మలవంటి పరుజు కటార్లు
మొండి పొరకలు కొన్ని మొద్దుపొరకలు
బొమ్మల వరియెంటు పుణుక కాలెముక
క్రమ్ముక మ్రోగెడి గజ్జలజోళ్లు
ఫళ్లున తెగి పటాపంచలై వీడె
ఘల్లున వరగల్లు గప్పెను మ్రోత
అంతట కఠియావు లవనిపాలకుడు
పంతము బిరుదులు పడదన్ని ధుమికి
చక్కని గోపాలస్వామి యాలయము
గ్రక్కున తాజూచి కఠియాలరాజు
హస్తముల్ ముకుళించి యతిభక్తితోడ
ప్రస్తుతించెను శేషపానుపువాని:
"వసుధ యాదవవంశ వర్ధనుండైన
వసుదేవనందన! వాణీశజనక!

మరి వేదములకునై మత్స్యావతార!
గురుమందరము మోయు కూర్మావతార!
వధియించితివి దైత్యు వరహావతార!
చిదిమిని దైత్యు నృసింహావతార!
వటుడవై బలినణచ వామ్నావతార!
జటియాగము గాచి చని విల్లు విఱిచి
వీక్షించు జనకజ వెసగూడి నేలు
రక్షించు దశరథరామావతార!
పురసతుల్ మదిజెరుచు బుద్ధావతార!
కరుణించి మముబ్రోవు కలికావతార!
వసుదేవనందనా! వరదయాలోల!
అసమాన కోదండ! అఖిల లోకేశ!
యెన్నితి మీనామమెన్ని మీకృపను
తన్నితి బేతాళుద్వారము బిరుదు
కడతేర్చి రక్షించు కలికిగోపాల!
అడియుడ"నని దండమలర సాష్టాంగ–
ములు సమర్పించి కరములు మొగిచియున్న
చలగుచు యా రాజచంద్రుని మెచ్చి
కురిసెను కుసుమముల్ కుడియెడమందు
వరవీర శూరుండు వల్లవరాజు.
ఆనందమునను గోపాలదేవునకు
దానధర్మంబులు దాసులకొసగి
నంతట తనభటుల్ నచటికేతెంచి
సంతసంబున పరుపు చక్కగా బరువ
ఆపదోద్ధారకుండౌ వరగల్లు
గోపాలనుకి మ్రొక్కి కూర్చెండె రాజు.
అడపవారరుదెంచి అంచున నిలిచి
పుడమీశ్వరునకు తాంబూల మందివ్వ,

వింజామరల భటుల్ యిరువైపునుండి
రంజిల్లు యాదవరాజుకు విసర,
గండకత్తెర తేజి కనుదృష్టి కెదుట
అండదియ్యక బంటు అందున నిలుప
యదుకులావళిబిరుదు యాదనభట్టు
యెదురుగ నిలిచి చేయెత్తి వర్ణింప
"పంపాద్రి-యలమంచి పట్టణాధీశ!
సొంపుగ యదుకుల శూరుండ ధీర!
కమనీయగాత్ర! సింహాద్రిపుత్రుండ!
విమలసద్గుణజాల! యిలకీర్తిశీల!
కాదని బేతాళు కట్టిన బిరుదు
పాదాన దన్నిన బడుగులరాజ!
మునుకొని తెగనరుకు మూర్ఖునీప్రొద్దు!
కను విజైభవ!" యంచు కొనియాడుచున్న
ఒరుగంటిలోనున్న వరజను లెల్ల
ఛోరుకొట్టుచు బిర్దుపొగడంగ వినిరి
కట్టిన బిరుదులు కాలదన్నంగ
గట్టిగా చూచిరి కన్నులనిండ
పురజనులెల్లరు పొసగ నేతెంచి
కఠియాలరాజును కన్నుల జూచి:
"శూరుడ! ధీరుడ! సోముడవన్న
కారుమించిన శత్రు గండరగండ!
నీవైన బేతాళు నిలగూల్చుమన్న!
కావరమణగించు కఠియావులన్న!"
అని పిన్నపెద్దలు నవనిపాలకుని
అనియేక విధముల నతనిని బొగడ

**-: భటులు బేతాళుని వద్దకు వెళ్ళి బిరుదులూడదన్నిన విషయము చెప్పుట :-**

యింతలో బేతాళవీరుని భటులు

గంతులు చాలించు కనలి కోపించి
గొల్లరాజుకు యింత గోపంబు యుండె
చెల్లంబు యిటువచ్చె చేటుకాలంబు
కనలుచు తమ గుర్వుకడకు నేతెంచి
వినదెల్పె బిరుదులు వీడిన విధము:
"దేవర! బేతాళ! దీనుల మనవి
భావించి వినవయ్య! పలుకుచున్నాము
కొందఱు నీచేత కూలిరి గాక!
అందరితో వాని ననరాదు సాటి
భళభళ యదురాజు బంటుతనంబు
మెళుకువ గంటిమి మీ పాదమాన!
చెలువంబు జూచితే చిన్నతనంబు
పలుకులు వినబూన ప్రౌఢవాక్యములు
ధర్మంబు వివరింప దానకర్ణుడు
నిర్మల చిత్తుండు నీతిమంతుడు
సకల శాస్త్రంబులు చదివియున్నాడు
ప్రకటము తెలియజెప్పగ నెవరిందు
సవరదనము మరుసాటియౌవాడు
రవితేజ్జు యదుకుల రాజచంద్రుండు
వినవయ్య బేతాళ! విన్నవించెదము
ఘనుడు బేతాళుడు కలియుగమందు
వార్తకెక్కిన బంటువని లోకమందు
మూర్తీభవించిన మొనవీరుడంచు
ప్రతిలేనివాడవన్నలుమలు గలవు
ధరణిలోపల భూపతతి బలాధికులు
వొరిగిరి నీచేత నోడిరి గాక!
అతని కొంచెముజేసి యల్పుడటంచు
మదియందు దలచక పలుకాలకించు

యదురాజు బిరుదులు విడలగ దన్నె
మది జంకులేకను మార్కొనియుండె
కదనరంగంబున కడుధైర్యమునను
ఎదిరించ బేతాళ నెంచి తా నుండె
భండనం యా రాజవరునిపై జేయ
నిండు వేడుక గదలు మిపుడె బేతాళ!"

**-: బేతాళుడు మిక్కిలి కోపించి, కటియావులరాజు పారిపోకుండ చూడుడని తన భటులను పంపుట - వారు కటియావులరాజుకు నచ్చజెప్పుట- అతడు వారి మాటలు లెక్కింపక బేతాళుని చంప నిశ్చయించుట :-**

భటు లిటువలె బల్క బడబాగ్ని బోలి
కటువాక్యములు మది గాలమై నాటె
కుములి ముప్పదిమూడుకోట్ల రోమములు
కమిలి నిప్పులతోడ కాలినట్లయ్యె
విప్పి కన్నులు రెండు వీరుడై లేచి
అప్పుడు బేతాళుడాగ్రుడై పలికె:
"తానుకట్టిన బిరుదు తన్నిన గొల్ల-
వాని కాలముదీరె ఓరుగంటికిని
పట్టకవచ్చె నా పద్మభవుండు
గట్టిగా నాచేతి కటహార్కి మేత
కలిగెను యీ ప్రొద్దు కటియాలరాజు
చలముకొనియు వచ్చె జడియ కిచ్చటికి
మొనగాడనని చాల మురియుచు వచ్చి
తన యెడమపాదమున తన్నెను బిరుదు
తన్నిన పాదమున తగ బిరుదులన్ని
పన్నుగ కట్టించి పడయాడిపింతు
ఊడదన్నినవాని ఓడించుదనుక
పోడిమి నామది పొగులుచునుండు
తడవాయె గొల్లడు తర్లిపొయ్యెడిని

కడువేగ బిరుదులు కట్టుడు మరల
తెగిపడ్డ బిరుదులు తిరుగ తెప్పించి
తగ తోరణంబున దాల్చి కట్టుండు
అంతట నిలుమను డాగొల్లవాని
రంతుచేయకు మనుదు రవ్వంతసేపు"
పంపిన సెలవున పనివారలరిగి
కంపించు మనసున కఱియాలకడకు
చనుదెంచి కఱియాల సాహసోత్తముని
కనుదృష్టి యెడముగ కరములు మొగిచి:
"వినవయ్య! యదురాజ! యినసమతేజ!
పెనగొని బేతాళు బిరుదులు నీవు
తన్నిందుకు వారు తఱచు గోపించి
కన్నెర్రజేసియు కార్యముజేయ
పరితెంచుచున్నాడు పట్టభద్రుండ!
వెఱవక నిలిచెదో! వెళ్లిపొయ్యెదవొ!
పోరాట మతనితో పోరంగగలవొ!
దారిపట్టుక తిర్గి తర్లిపొయ్యెదవొ!
చూడు బిరుదులు నీవు ఊడదన్నుటను
దీడుచునున్నాడు తిమురుచు పంద్లు
వాలాయమున నీవు వరగంటిపురము
యాల వచ్చితివయ్య యదుకులచంద్ర!
బిరుదుల కొఱకుగా పేరుగలవారు
ధరణిపాలయ్యారు తఱుచు యీ వఱకు
నీ పట్టణం బేడ? నీవు రానేల?
కోపమున బిరుదు కూల్చుట యేల?
కాన మంచిదిగాక కఱియావురాజ!
మానక తమయందు మగతనంబున్న
దాయక నీబంటు దళముతో గూడి

ఆయతంబై యుండు అతడేగుదెంచు"
విని నవ్వి కతియావు వీరశూరుండు
పరిచారకులతోడ పలికె నిట్లనుచు:
"విడిపించితిని బిరుదు, విడుచు ప్రాణంబు
నడచి రమ్మనరయ్య! నామీది కతని
లేచి రమ్మనుడయ్య! లేశమాత్రమున
కాచుక యున్నాడ కడతేర్చిపోదు"
అని రాజు కోపాగ్నుడైయున్న యంత
విని వారలందఱు విస్మయంబందిరి.

**-: బేతాళుడు తల్లి లింగమదేవి దీవెనలకై వెడలుట :-**

అంతట బేతాళు డచ్చోటు వెడలి
పంతము యదురాజుపై దృష్టి నిల్పి
తగినవారలగూడి తల్లి వద్దకును
పగటున[1] నేతెంచి పడిసాగి మ్రొక్కి
వరుస తల్లికి తాను వచ్చిన పనియు
తెరగెల్ల తల్లికి దెలుపంగ బూనె
"తిరముగ లింగమదేవి వినమ్మ!
మరియెవ్వడో నొక్క మానవాధిపుడు
యలమంచి పంపాద్రి యాదవుడనుచు
మలయుచు గర్వము(న) మన ఓరుగంటి
శంభులింగము జూడ సైన్యముతోడ
జృంభణంబున వచ్చి చూచి నాబిరుదు
విడుమని పలికితే విడవకుండుటను
ఎడమపాదముతోను యెగిసి నా బిరుదు
పడదన్ని నామీద బవరము కెదిరి
కడ నిల్చియున్నాడు కనుక యిందనుక
చనుదెంచి నీతోడ సెలవంది వాని

1. సగటు = గర్వము, మురిపెము (నడకయందలి కులుకు)

ఘనపరాక్రమమడచి కంఠంబు తఱిగి
కత్తులగరిడికి కట్టంగ దలచి
అత్తుక[2] నీ కొల్వు కరుదెంచినాడ
సెలవిమ్ము నాతల్లి! శీఘ్రమే నీవు
కలనికి పంపించు కదలిపొయ్యెదను"
అని యిట్లు బేతాళుడడిగినందులకు
వినియు లింగమదేవి యిబ్బంగి బలికె:

**-:లింగమదేవి యలమంచి యాదవుల సాహసధైర్యములను విస్తరించి చెప్పుట - అతడు లెక్కించకుండుట :-**

గొల్లవాడనినంత గుండెలు పగిలి
ఝల్లడ్సి తనయుని సరస మూర్ఛిల్లి
తెలివంది లింగమదేవి కుమారు-
తిలకించి "యీపనుల్ తీరవు కొడుక!
యలమంచి-పంపాద్రి యాదవులతోను
వలదు పోరాటము వద్దు నాకొడుక!
పగకు వెఱువనివారు పంపాద్రివారు
జగడము(న) సరిలేని సాహసోత్తములు
బేతాళ మునుపు నా పెద్దసుతుండు
ప్రతియెఱుగని నిజబేతాళుడతడు
పిడికిట రాళ్ళను పిండిగా నలుచు
బుడబుడ నదులెల్ల బురదగా ద్రొక్కు
అధిక శౌర్యముచేత నవని పెంపొంది
ప్రతిలేని మేటి సంపన్నుడై మిగుల
సేనల గూడుక శృంగారముగను
పానుగంటి పురము పాలింపుచుండె
*కందువ నా పానుగంటి పురమున

2. అత్తు = కలియు, కూడు, తగు, అత్తుక = కలియుటకై, తగినవిధముగా.

పొందికైనది కోడిపుంజొకటుండె
ఆ కోడిపుంజుకై అన్ని దేశములు
జోక జోధులగూర్చి సొరిది పంపించె
పానుగంటిలో నున్న పందెముపుంజు
నాణెము తెలిపిరి నాయునితోడ
చాల సంతోషించి చంగట నున్న
గొల్లవంశంబున గోపన్న ఘనుని
అల్లన పిలిపించి ఆ కోడిపుంజు
పట్టుకరమ్మని పానుగంటికిని
అట్టహాసంబున నంపె నాయుండు
శీలమునాయుని చేతికుంతంబు
కోలాహలంబుగ గోపన్న కిచ్చి
పానుగంటికి వచ్చి పట్టుక పుంజు
జాణతనంబున చనుదెంచుచున్న
కోపించి మీయన్న గోపన్న మీద
చూపుదునని తన శూరత్వమహిమ
పోవద్దు నాకోడిపుంజును విడువు
త్రోవకడ్డముదాకి తొలగక నిలిచె
నాయునికుంతాన ననిజేసి వీని
పాయక చంపుట భావ్యంబుగాదు
అనుచు కోపము జేసి యాగోపవరుడు
గొనకొని కుంతము కోటకానించి
కీళ్ళుకీళ్ళు విఱిచి కెరలి మాంసమును
వాలారు గోళ్ళచే వలిచి పోవైచె*
వర కఠినులు యాదవాన్వయుల్ కొడుక!
కరుణయింతయులేని కంటులు కొడుక!

*–* ఈ పూలగుర్తుల మధ్యనున్న కథ పల్నాటియుద్ధములోనిది.

యిట్టి బలాఢ్యులు యెలమంచివారు
చట్టునైనను[1] బట్టి సాధించగలరు
బవరము(న) నెటువంటి బలవంతునైన
అవలీల ధరణీపై నణచగల్గుదురు
నెరసాహసుల తోడ నీకు పోరేల?
బిరుదుల మొనగాండ్లు పేరైనవారు
బేతాళ యాదవు పెనకువలేల
చాతుర్యపరు"లని చెప్పుచునున్న
విని రోషచిత్తుడై వీరబేతాళ–
తనయు డెదుర నిల్చి తల్లికిట్లనియె:
"మాటికి యాదవు(ల) మరి బంటుతనము
సాటిలేరని చాల చదువగ నేల?
వెట్టివాడై వార్కి వెఱచి మాయన్న
గొట్టిగ వానిచే కూలెను గాక!
అటువంటివాని నాఅరిచేతనణచి
గటగట రక్తము గావుపట్టెదను
గొల్లముండనికింత కుటిలుపాయంబు–
చెల్లదు, దీవించి సెలవియ్యవమ్మ!
మడియ గొల్లనిజేసి మాటమాత్రమున
తడయక నేతెంతు తల్లి యిచ్చుటకు
తాను కట్టిన బిరుదు తన్నిన గొల్ల–
వాని చంపుదు సెలవు పాటించి యిమ్ము!"
బేతాళపడిటువలె భీకరంబుగను
ఘాతచేసిన తల్లి గడగడ వణకి
"నోచిన వారికి నోచినంతయును
డాచి బుద్ధులు సెప్ప దండించదగును
పెంచి పేరంటము పెండ్లి చేసినను

1. చట్టు = పర్వతము.

నంచి(తంబుగ వినడటుల)నె పొమ్ము!
అనవిన్న పెద్ద సభాంతరావళులు
కని తెల్సియున్నాము కదిలిపోవన్న!
ఒకరు చెప్పిన హితనొప్పదు మదిని
సఖియ చెప్పెడి మాట జాడగా బొమ్ము!"

**-: బేతాళుడు తన భార్య చిటిగోపు వద్దకు వచ్చి బిరుదులూడదన్నిన వానితో యుద్ధము జేయుటకు సెలవివ్వుమని యడుగుట - భయముతో ఆమె ఎంత వారించినను అతడు వినకుండుట :-**

అంతట బేతాళు డచ్చోటు తర్లి
యింతియుండిన తనయింటికేతెంచె
నాటకశాలలో నాతి చిటిగోపు
బోటులతో గూడి (బుధ) కథల్ వినుచు
నున్న కాలంబున నుగ్రబేతాళ్డు
కన్నియ చిటిగోపుకలికి కిట్లనియె:
"వినువిను చిటిగోపు విక్రమంబునను
మును గూలిరెందరో ముదితరో వినవె!
యలమంచిపురమేలు యాదవరాజు
కలవారితో ఓరుగంటి లింగమును
కనుగొనవచ్చి నాకట్టిన బిరుదు
అను(మానమున) దూర కంతట నిలిచి
అదివిడుమని నాకు అంపించె కబురు
అది విడుమనువాని హతమణతునంటి
దానికై కోపించి తన్నె నాబిరుదు
కాని రమ్మనుచును కఠియాలరాజు
మదమెక్కి తానొక్క మగవాడననుచు
ఎదిరించి యున్నాడు విను చిటిగోపు!
దీవించి పంపవే తీవరంబునను

కావరమణగింతు కఱియావువరుని!"
అనవిని చిటిగోపు అవనిపై వొరిగి
వనిత విభుని జూచి వాపోవుకొనుచు:
"నాపుణ్య పురుషుడా! నాప్రాణ ప్రియుడ!
కోపంబు చాలించు గొల్లని మీద
గొల్లవారికి మనకు కులపగల్ గలవు
తొల్లి మాబావను దురమణచినారు
కాకను యాదవుల్ కక్కసులనుచు
లోకములో కీర్తిలోలురై నెగడు
బిరుదులు మనకేల? భీకరంబేల?
కరకులాడుటయేల? కావరంబేల?
కదిసి భూపతులపై కార్యంబు దలచి
కదనమునకు జూచు కారణంబేమి?
తలచగ ఫలము ప్రతాపరుద్రునకు-
కలుగును మిక్కిలి గావించియుంటె
ఘనతరంబుగ రుచుల్ కమ్మగ గుడిచి
ఎనయ భూషణములు వెస ధరియించి
శృంగారమైన వస్త్రములు ధరించి
చంద్రాననలగూడి చెలగి యే ప్రొద్దు
ఇంద్రభోగంబున విహరించు నాథ!
బ్రహ్మరుద్రాదుల భావమందుంచి
బ్రహ్మలోకము జెందు భక్తిమార్గమున"
ఇటువలె విభునితో యింతియు బలుక
చిటిగోపు మాటకు చిర్రున మండి
తోరమౌ కోపముతో పండ్లు కొఱికి
కోరమీసము దిద్ది గుడ్లెర్రజేసి:
"మొదట బిరుదు(లు)గట్టి ముచ్చటదీఱ
తుదను చావుకు వెఱచి తొలగించనగున?

కట్టితి బిరుదులు గడియైన రిపుల–
కొట్టితి తలలూడ గుట్టలుగాను
గొల్లవానికి బిర్దు కోలుపోనిచ్చి
ఝుల్లడ్సి ఒక వంక జరిగి వేవేగ
పంతము విడనాడి బ్రతుకు మటంచు
ఎంత మాటాడితి యింతి చిటిగోపు!
తడవాయ నాబిర్దు తన్నినవాని
విడువక చంపుదు విను చిటిగోపు!
ప్రతిమాట మోమెత్తి పలుకక యిపుడె
జతనము దీవించి సాగనంపియును
కలవారిని గూడి కనకమేడెక్కు
ఎలమంచి గొల్లని యెదురొమ్ము గాడి
పడి వెడలి వీపున వజ్రము నిలువ
కదువేడుకలు జూడు కన్నుల నిండ!"

**–: బేతాళుడు స్నానము చేయబోవ దుశ్శకున మగుట – భార్య వారించినను లెక్కసేయక భోజనము చేసి వెడలుట :–**

పురుషుని పలుకులు పొలతి యాలించి
మురిపెము దక్కియు మోహనాకారి
శుభలక్షణంబుల సుదతి తా లేచి
విభుని రమ్మని పిల్చి వేడిజలంబు–
పట్టగ, ఆపాత్ర పడి నేలదొరిలె!
అట్టి చిత్రము జూచి ఆ చిటిగోపు
"వలదు నావిభుడ! యీవైరమీవేళ
తెలియజెప్పిన వినవు దేవ పరాక
అవిసెను ఉదకము అవి చూడరాద!
చెవినిల్లుగట్టుక చెప్పిన వినవు
తోచినంతయు నాకు దొరకొన మీకు

మోసమౌనని చాల మున్ను చెప్పితిని
వైరము చాలించు వద్దు నావిభుద!"
తరుణి యిటుల బల్క ధవుడిట్టులనియె:
"విను చిటిగోపు! యీ వేడిపాత్రయును
వనర దొరలి నీరు వరదలౌ విధము
గొల్లడు నా చేత గూలితె వాని-
నల్ల యిటుల పారు నా రంగభూమి!"
అనుచిటువలె స్నానమాడిన పిదప
చనుదెంచు విభునికి సన్నబియ్యంపు
సరసమౌ నన్నము షడ్రసరుచులు
వర పిండివంటలు వనిత వడ్డింప
తనివార భుజియించి తాంబూలమంది
ఘనుడు పైనంబాయె కయ్యము చేయ.

**-: బేతాళుడు యుద్ధముచేయ సర్వసన్నద్ధుడై బయలుదేరుట:-**

కావి చల్లడమును క్రమమున దొడిగి
ఠీవియై మొలదట్టి టిక్కుగా బిగిచి
లాగుపై గట్టెను రామంతముళ్ళ
సోగుతో జుట్టెను సురియల తీగె
జంట నసురమాయజల్లి జీరాడ
గంటలన్నియు మీద ఖంగున మ్రోయ
పాదము వ్రేళ్ళకు పరుజు లేర్పఱచి
క్రోధంబునను గ్రద్దగోళ్ళు బిగించి
బొడ్డుగంటల మీద పోటునారసము
దొడ్డవైరులమింద దోర్దండసురియ
కట్టి బేతాళ భీకరముష్టి జెట్టి
అట్టివేషంబున నమరియు నపుడు
కటహారి కుడితట్టు కరమున నంది

కుటిలుడై బల్లాల కోరుదెడంచేత
గద్దించె బేతాళఘనుడు పాదంబు
రద్దించె తన కార్యరభసంబు మెరయ
కుప్పించె ముమ్మారు కూర్చుండి లేచి
రప్పించె భటులను రణరంగమేగ
వీరపెండ్లికొడుకు వీథులంగళ్ళ
దారి భటుల్ జేయ దారిని నడచి
మత్తగజముబోలి మారు మొసలుచు
అత్తుక సకలమౌ నలుగులతోడ
భోరున బేతాళభూతమో యనగ
వీరులవాడల వేడుకల్ మీర
సాధులు పెద్దలు సకలమౌ జనులు
బేతాళు నటుజూచి భీతిచే గుంద
పలుపలు విధముల పట్టణ ప్రజలు
కలయక్రమ్ముక వాని కదనరంగంబు
ఎనయ జూచెదమంచు యిరుగడలందు
ఘనసమూహము చుట్టు క్రమ్ముక రాగ
కతియావురాజుతో కార్యముచేయ
వెరవున బేతాళ వీరుదేతెంచ

**-: బాచన్నయను ఒంటి బ్రాహ్మణుడు శకునము వచ్చి, బేతాళుని ఓటమిని సూచించుట. అతడు లెక్కచేయక తన కటారి ఐదుజేనలున్నదనియు, కతియావులరాజు కటారి ఎంత పొడవున్నదో తెలిసికొని రమ్మని తన భటులను పంపుట :-**

ఒనర స్నానము చేసి ఒక్క బ్రాహ్మణుడు
ఎనసి బేతాళున కెదురేగుదెంచ
తగని సూచనయని దారికడ్డంబు
అగుపడె భూసురు డపజయమంచు
చూచియు బేతాళశూరు డావేళ

"బాచన్న! శుభమని పలుకుమటంచు
కటియావురాజనే కల్కి వచ్చింది
కోరికతో పెండ్లికొడుకు నేనైతి
యిరువురి పేరిట నెరిగి ఫలంబు
పరువడి నెబ్బంగి పల్కు"మటన్న
బాచన్న బేతాళ్డు పలికినందులకు
చూచి లగ్నము వానిచూచి యిట్లనియె:
"రమణిని కటియావురాజును జేసి
కొమరొందగా పెండ్లికొడుకు వీవైతి
మగువకు పురుషుడు మహిలోన గలడు
మగనికి పురుషుడు మహిలోన గలడ?
కటియావురాజును కదిసి పెండ్లాడి
మరియాదతో నీవు మరలి రాలేవు!"
అనుచు బల్కిన వాడు "అవనిలోపలను
గణుతింప పురుషుండుగాడు నేనౌదు
కటియావురాజును కల్లిలో జంపి
తిరిగివచ్చు వెనుక తెలుసును నీకు!
గెలిచి వచ్చిన వెన్క కెరలి నిన్బట్టి
తలక్రిందు చేయింతు తలగు బాచన్న!"
అనుచు కోపముజేసి యచ్చోట తర్లి
గణనచేయక నడిచె కదన రంగముకు
సాగి బేతాళుడు చావడిన్ నిలిచి
బాగుగ కూర్చుండి బలువు కఠారి
పట్టుదారముతోడ పట్టి కొల్పించి
గట్టిజేనలు ఐదు కటహారి తనది
యదురాజుకటహారి యెన్ని జేనలదొ?
అది తెల్సి రమ్మని యంపెను భటుల.

**–: గోపాలస్వామిగుడి దగ్గఱనున్న ప్రజలు కటియావులరాజు విజయమునకై దేవుని ప్రార్థించుట :–**

గోవర్ధనుండైన గోపాలస్వామి
దేవాలయమునందు ధీరుడై రాజు
ఆవూరి పెద్దలు నటులె పిన్నలును
దేవాలయము నిరుదెసల నిల్చుండి
పాపపుణ్య మెరింగి బాలుని జూచి
గోపాలకృష్ణ! చేకొనుమనువారు
"భూమిలోపల గల్గు భూపతులకెల్ల
పాముకర్చిన భంగి ప్రాణాపహారి
తప్పుడు బిరుదులు దారిన గట్టి
ముప్పెముండడి నిందు ముంచు గోపాల!"
అనుచు పెద్దలు కొంత అతివలు కొంత
కనికరంబున జూచి కటకట పడుచు:
"మాయన్న! కటియాల మండలాధీశ!
సాయమౌ గోపాలస్వామి నీపాల
ఎందు పైనముగల్గె? యేల వచ్చితివి?
చందమామనుబోలు చక్కని తండ్రి
యెందు నీ తలిదండ్రి యెక్కడున్నారు?
కందు బాలమయూఖ కార్యమొప్పితివి
ఒప్పిన వారెల్ల వానికెదిర్చి
చప్పుడుగాకుండ చచ్చియున్నారు
మడియనితో కదిసి మార్కొని నీవు
కడతేరిపోదువ కటియాలరాజ!
పరమపావని తల్లి పంపాద్రిగంగ!
కటియాలరాజును కాపాడవమ్మ!"
చిటిమొటిపడువారు చిరకొట్టువారు
మెటికెలిరిచెడివారు మెలతలు తారు

"కఠియావురాజును కాచిరక్షించు!
గర్విని బేతాళు కల్లిలో గూల్చు!
గోపాలకృష్ణమ్మ కోరితిమి దిక్కు
ఆపదోద్ధార శ్రీహరి! కావు"మనుచు
సొలసి జనములాడుచున్న సమయమున

**-: బేతాళుని భటులు వచ్చి, కఠియావులరాజు కటారి ఎంత పొడవున్నదో చెప్పుమని అడుగుట - బేతాళునితో ద్వంద్వయుద్ధము వలదని అతనిని నిరుత్సాహపరచుట :-**

కలియుగ బేతాళఘను భటులెల్ల
పరువున నేతెంచి ప్రణతులు చేసి
కఠియావురాజుకు కరములు మొగిచి
"రమణీయ కఠియావు రాజశేఖరుడ!
క్రమమొప్ప నీ చేతి కటహారి కొల్త
ఐదు జేనలకన్న నధికము వద్దు
నయమున కొల్త నిర్ణయము పట్టించి
మారుత్తరంబిచ్చి మమ్ము పంపించు
బిరుదులకొఱకింత భీకరం జేసి
అతని గెల్చిడివారు అవనిలో గలర?
మతిమంతులకును దుర్మరణంబదేల?
వానితో పోరాడవలదు ఓ రాజ!
జ్ఞానుండవై తిరిగి జరిగిపోవయ్య!
కదనమందుటకయి కట్టాయితముగ
అదెవచ్చె బేతాళ అసహాయవరుడు
మదమెక్కినటువంటి మత్తేభమతడు
కదిసి వృక్షమురీతి ఖండించు నిన్ను
యీ బిరుదులకయి యితనిచే చావ
లాభము యేమి మేలని తలంచెదవు?
ఒకరు చెప్పిన హితము వసుధీశ్వరుండ!

వికలమైతోచును విశ్వంబులోను
ఎన్ని జేనలుగల దెందు నీసురియ?
పన్నుగ దెప్పించు పారజూచెదము"

**-: తన "నందుల సురియ" నాలుగు జేనలని, అది కాలసర్పమని కటియావులరాజు చెప్పుట :-**

పనులవారలు యిట్లు పలుకు భావంబు
విని కటియావులయీశు డిట్లనియె:
"భటులార! బేతాళ్డు పైనమై వచ్చి
యిటువలె జేనలు యెంచుకో తగున?
నిర్ణయమౌ సురియ నిపుడు నీడనుచు
వర్ణింపవచ్చునా వరవీరవరులు?
పందమానవునకు పన్నెండుమూళ్ళు
అందె యీటెలు చెల్లు నంతకు మిగుల
పదహారు మూరలు పట్టిన జెల్లు
వొదుగక మామీద వైరము హెచ్చి
తడవేల మీ గుర్వు తర్లి రమ్మనుడి!
పొడవైన సురియల పొడిచి పొమ్మనుడి!
సింహాద్రి మాతండ్రి సింధుభళ్లాణు
సంహరించిన కాలసర్పమైనట్టి
నాలుగు జేనల 'నందుల సురియ'
వాలాయమంతకు వరిముల్లుయంత
ములికి యెక్కువ చేత ముట్టితేనైన
చెలువగు మాతండ్రి సింహాద్రిరాజు-
తనయుడ గానింక తర్లి పొ"మ్మనిన

**-: బేతాళుడు తనకు దుశ్శకునములగుచుండగా లెక్కింపక గోపాలస్వామి దేవాలయమునకు వచ్చుట :-**

వినివిని వారలు వే యరుదెంచి
జెట్టికి వివరింప చిరునవ్వు నవ్వి

బెట్టుమీసము వడిబెట్టి తొడగొట్టి
చనుదెంచు పురవీథి సమయమునందు
వనిత యొక్కతెదురవైపున తుమ్మె
తరువాత యొకసతి తలవీడి వచ్చె
పురవీథి నొక దున్నపోతెదురాయె
పిల్లితంబిని నంబి పిలిపించినట్లు
అల్లనల్లన నిల్చి రంతటంతటను
వొద్దొద్దు పోవద్దు వైరము కనుచు
పెద్దలు పిన్నలు బేతాళునకును
పట్టి చెప్పిన చెవిబెట్టకావార్త
గొట్టుకాడుచు వచ్చి గోపాలస్వామి
దేవాళయమునకు ధీరత నడిచె

**-: అతివైభవముతో నున్న కటియావులరాజుతో బేతాళుడు వాదించుట - తాను పోరుకు సిద్ధమని కటియావులరాజు చెప్పుట :-**

ఆవేళ బాలకర్యావులరాజు
మంటపంబున నడిమధ్యరంగమున
అంటి యాదవరాజు యతి పరాక్రమము
శోధించి బోధించి చోద్యవేద్యముగ
ఆది యాదవబిర్దు లవి చదువంగ
యిరుభాగమందుల వింజామరములు
కరమర్థి వేయంగ కటియావురాజు
పిన్నలు పెద్దలు ప్రియపూర్వకముగ
కన్నెకుమారుని కప్పుకయున్న
సమయమున బేతాళ సాహసోత్తముడు
క్రమమొప్ప యదురాజు కాంతినున్నతము
బాలచంద్రునివంటి బాలుని జూచి
సిలుగుచు బేతాళసింగము దనియె:
“యెవ్వడు నాబిరుదు యెడమపాదమున

త్రవ్వగా తన్నిన ధీరుడు యిపుడు?"
"బిట్టుగా తప్పుడు బిరుదులాలాగు
కట్టిన దెవ్వడు ఘనుడ బేతాళ?"
"యెవరనుకొన్నావు యాదవకులుడ!
సవరైన బిరుదులు సరగ గట్టితిని!"
"గ్రన్నన బిరుదులు కానివటంచు
తన్నితి నేను బేతాళ నాయకుడ!"
"మంచిది తన్నితే మరణముకొఱకు
కొంచెపు వాడవు కూడివచ్చితివి
నీ కులగోత్రము నీ పేరు యేమొ?
మాకును వినిపించు మరి యూరుపేరు"
"యాదవరాజులం యలమంచిపురము
కాదన్న విను పేరు కఠియావురాజు
గోత్రము ఆత్రేయ గోత్రముదైన
మాతృక యలమంచి భాగీర్థిగంగ
కలుములు బలములు కల్గించుతల్లి!
చలకొని పగరాగ సాధించు తల్లి!
ఆవులవారింట ఆదిముల్లోక-
పావని! యెలమంచి పరమకల్యాణి!
ఇలవేల్పు మాయింట యెడతెగకుండు
కలిగియుండగ మాకు కడు భయంలేదు
శంభులింగని జూడ సరవి బంధులతొ
అంబవరంబున నరుదెంచినాను
వచ్చి నీబిరుదులు వైనముజూచి
చొచ్చి రాజాలకచూవె తన్నితిని
తన్నినందుకు నీవు తనకెదిరించి
ఎన్నగ కదనము కెదిరించినావు

వచ్చిన పదివేలు వచ్చినట్లాయె
మచ్చరం బిచ్చమై మలసి పోరుదము!
కావుపాతరలోన కసిబిసిగాను
దేవతాబాకుల దీటుకొందాము!
కణజము చక్కని కటహోరిమొనల
చెణుకు చెణుకుగాను చేసికొందాము!
భీతుగొలుసువైచి పెనగ పాదమున
రామరామాయంచు రణమందుదాము!
ఎడమ హస్తము నిల్పి యేకహస్తమున
కుడిచేత అలుగులు గ్రుచ్చుకొందాము!
తగుగాక వీరప్రతాపుకొల్వునను
బిగిబిగి గుండెలు పీకుకొందాము!
పలుకు దీనికి యేమి ప్రత్యుత్తరంబు
కలగ దెల్పు”మటన్న ఘనుడు బేతాళ
వరుడు కర్యావుల వసుధేశుకనియె:

**–: యుద్ధము చేయుటకు తన కత్తుల గరిడిలోనికి వెళ్లుదమని బేతాళుడు చెప్పుట – కటియావులరాజు అంగీకరించి ఎగిరి గరిడిలో దుముకుట :–**

“కావుపాతర వద్దు, కణజము వద్దు
యీవూరి దొర వద్దు, యీవీథివద్దు
కరచరణము లంటకట్టంగ వద్దు
గుత్తము బాకుల గుద్దులాడుటకు
కత్తులగరిడి నే కట్టించినాను
చొచ్చియు గరిడిలో శూరత్వమహిమ
యిచ్చగ నామీద విడిబడ లెమ్ము!
బయలున పోరాడి పారిపోదలచి
మయము గప్పగనేల మానక కదులు
తన ముఖాముఖి కెదురు తాకక మునుపె

వెనుక దీసినవాడు విమలపరుండు
ముఖమైన పిమ్మట మూడు లోకములు
వికటించి దాటిన వెదకి చంపుదును!"
అనవుడు యదురాజు ఆలించి వినియు:
"ఘనుడ బేతాళ! నీ కత్తుల గరిడి
కోరితిగాన నీకోర్కె యున్నట్టు
దారి సాగు"మటన్న తర్లె బేతాళ్డు
గండకత్తెరనెక్కి గరిడిముందఱను
దండాయమానుడై ధరణి క్రుంగంగ
కుప్పించి ధుమికించ కుంభిణి యదలె
అప్పుడా బేతాళు డాసమయమున
కటియావురాజును గరిడి చొరుమనెను
వరగల్లు తోరణవాకిటివలెను
తఱుచు బిరుదులున్న దానిని జూచి
"హరుషమాయెనుగాన అన్న బేతాళ!
పెద్దవాడవు నీవు పిన్నను నేను
పద్ధతిగాదు లోపల ముందు చొరుమ-
కదులు" మన్నంతనే ఘనుడు బేతాళ్డు
అది తానుగట్టిన దగుట కాదనక
కేరుచు బేతాళ్డు కిలకిలార్భటుల
మారెమ్మదున్నలా మరిజొచ్చె గరిడి
అతిశౌర్య సంపన్ను డశ్వంబు డిగి
కొతకక కోపించి గురుబలాఢ్యుండు
నీచుని బిరుదుల నీడ దూరకను
వాసిగా యదువంశవర్ధనుం డపుడు
వరశక్తిచే గరిడి వాకిట చొఱక
కటియావురాజు తా గరిడిలో ధుమికె

నడిగరిడి ధుముకు నారాజు జూచి
బెడిదమైనటువంటి బిరుదు బంటనుచు
కనుకనే బిరుదులు కాలనుదన్నె
అనిమొన బలవంతుడని మదినెంచె
తొడచఱచియును దోఃశక్తిని మెఱసి
"తడవేల నన్నడుగు తర్లించు" మనెను
అని యిట్లు బేతాళుడాడినందులకు
విని గోకులాధీశు డిట్టుల బలికె:

**-: బేతాళుడు తాను మూడుహస్తములతో (మూడు దెబ్బలతో) కతియావులరాజును చంపుదుననుట-కతియావులరాజు బేతాళుని ఒక్క హస్తముతో (ఒక్క దెబ్బతో) చంపుదునని ప్రతిజ్ఞ చేయుట :-**

"కలనికి నొప్పుక కార్యంబు చేయ
వలవొప్ప యిద్ధఱం వచ్చియున్నాము
ఎన్ని చేతలచేత యెదిరించి యిపుడు
నన్ను చంపగలవు నాజిలో" ననిన
"హస్తముల్ రెండును అమరె నరునకును
వస్తాదు యిచ్చింది ఒక్క హస్తంబు
మొనవరుండను నిట మూడు హస్తముల
అనిలోన చంపుదు నవలీలగాను
ఎన్నితి నీచేత లెన్నని నన్ను
చెన్నొంద నీకెన్ని చేతులుగలవు?
చెప్పు"మనెడి మాట చెవిబడ ననియె:
"కుప్పలై వైరులు కూడివచ్చినను
ఒప్పక బేతాళ! ఒక్క హస్తమున
తప్పితే తాకము తనవంశమందు
కొండంత వాడైన కొట్టిలమీద
పండింతు వరగల్లు పరమేశునాన!

తప్పక యెలమంచి తల్లి గంగమ్మ
వొప్పి యొసంగిన వరము నిజంబు
నీ మూడుహస్తముల నిప్పుడు ముందు
మామీద చూపు సామాన్య మెంతనక"

**–: బేతాళుడు తన కటారితో మూడుసార్లు దాడి చేయగా, కఠియావులరాజు ఆ మూడు దెబ్బలను తప్పించుకొనుట :–**

అనిన బేతాళుడు కటారి తానంది
పెనగొను కఠియావు భీముని మీద
దండి బేతాళుండు దండికోపమున
చెండుబెండు గెగసి చెణుకులు చూపె
గరిడి వెడల్పున కఠియావువరుని
దురుసుగా వడిద్రిప్పి ధుమికి పైకెగసి
ముష్టిగ యెదురొమ్ము మొనజూపి అలుగు
జెట్టి యాదవుని తా చేయెత్తి గ్రుద్ద
పందుము(ల)బావను ప్రణుతించి రాజు
పొందిక కటహారిపోటు తప్పించి
"సుళ్లరానిది పోటు చూడు బేతాళ!"
అట్లు లేదనుచట పడదుమికె
మోసమౌటను గని ముందు తా పోటు
యీసారి నాచేయి విషము జూపింతు
దరకలు తుళ్ళి బేతాళుడుగ్రమున
చరకొట్టి సముదగ్ర శక్తిరూపముల
ఘన భుజబలశక్తి గల సాధనముల
ఘనసింగములబోలి ఘనగిరుల్ బోలి
పైకెగచి లంఘించి బాకుల చెలగి
చేకత్తి ఝుళిపించి చెండుచెండాడి
ఇల కత్తుల మొనకు నేచిరి కొంత

జముదాళి[1] మొనవది సల్పిరి కొంత
త్రొక్కిరి గరిడి తా తొలగక మొనల
యెక్కి యిద్దరు చేప యేటికెదిర్చి
ఘాతచేసి కటారి కసిబిసి త్రిప్పి
బేతాళ్డు యాదవు పేర్కొని పొడిచె
కటహారి చిఱుతను[2] గడిమిపో తట్టి
పటుగతి కరియాలపతి యిట్లు పలికె:
"చూపితి నీపోటు సూటితప్పినది
బాపురే" యని పల్కి పకపకనవ్వె.
చెదిరెను రెండు చేతలటంచు
మది బెగ్గడిలి జెట్టి మార్కొని నిలిచె
"వినుము మాయల రణవీర బేతాళ!
కనుగొంటి నీచేత కరములు రెండు
గురువు యిచ్చిన చేత కొదువయున్నదిగ
మరిచూపు మిప్పుడు మార్కొని నాకు
మెదలక కదలక మేలుకీడనక
కదలిపోగలిగితే కదలు బేతాళ!"
"యేలపొయ్యెద నేను యాదవకులుడ!
బేలగ పలుకకు పిరికి మాటలను
యెదిరించియు తిరిగి వెనుకపోవుదున
చెదరకు కనుదృష్టి చెప్పితి నిజము"
అని బెంకికటారి అటు చౌకళించి
పెనగ బేతాళుడు పెడబొబ్బలిడుచు
కటహారి యొకచేత కత్తొకచేత
కటహారిమొన జూపి కత్తి ఝళ్పించి[3]
కసిబిసి చేకత్తి కటహారితోడ

1. జముదాళి = నిడుపు పిడిగల కత్తి; 2. చిఱుత = సాముచేసెడివారు త్రిప్పు చిన్నకోల. 1. ఝళిపించు = భయపెట్టు, ఆడించు, త్రిప్పు, ఏయు. ('జళిపించు' రూపాంతరము).

విసురుగ దాటులు విడుచుచు తఱచు
కటియావు శూరుడు ఘనుడు బేతాళ్డు
ధరణిపై క్రిందుమీదై లేచి నిలిచి
పొడిచిన పోటెల్ల పొడువలేదనుచు
తడయక చిఱుతను తట్టుచు రాజు
చొచ్చి చేయిని ముందు చూపక నిలిచి
లక్ష్యపెట్టక వాని రభసంబులకును
మొనమొన జూపుచు మొట్టి తట్టుచును
కనురెప్ప నిక్కించి కత్తికటారి
ఆహుతి తప్పించి అంతకంతకును
బాహుబలము చూపి పైబడకుండ
ఓర్చుచున్నంత వరగురువుచేత
ఆర్చుచు బేతాళు డటునిటుచెలగి
గజిబిడి పడజేసి కటియావువరుని
భుజబలమ్మున ఔమ్ము పొడిచె దృష్టించి
అన్న భక్తుని తన యాత్మను వేడి
కన్నెకుమారుడై కటియావురాజు
ఆవులసింహాసనాధీశ్వరుండు
ఆవల పడదూకె అంటలేదనుచు
గురువు హస్తము దప్పె గుండెలు పగిలె
"పరమాత్మకృప దప్పె బాపురే! యనుచు
ఓరుగంటి శంభు డోర్వంగలేక
కారణం నా గురువు కరము తప్పించె!"
అనుకొని బేతాళ అసహాయవరుడు
మనమున శంకించి మార్కొని నిలిచె.

**-: ఆశ్చర్య చకితుడై నిలిచిన బేతాళుని క్షమించి కరుణతో విడిచి పెట్టుటకు కటియావులరాజు సిద్ధపడుట - దురహంకారముతో బేతాళుడు అతని క్షమను తిరస్కరించుట :-**

ఖ్యాతి మీరిన యదు కఱియావురాజు
బేతాళు జూచుచు పేర్కొని పలికె:
"ఓరుగంటి మనుజవరులార! వినుడు!
పేర్కొని చెప్పెద బేతాళవరుని
సమ్మతి మనసును చక్కబఱచియు
పొమ్మని గొనిపొండు! బుధజనులార!
అతను జెప్పిన మూడు హస్తంబులిపుడు
మితిదప్పి వ్యర్థమయె మీరలు చూడ
ధరనెన్న మేము యాదవవంశజులము
పెరవారి కరుణించు ప్రియమగు జాతి
కట్టిన బిరుదులు కాల దన్నితిని
గట్టిగా యిప్పుడు గరిడిలోపలను
మట్టియు యీరూపు మాయింతునయ్య!
మాటలేలను లేచి మఱలిపొమ్మనుడు!"
పాటించి పలికిన పలుకులు వినియు
చూచి బేతాళుడు శూరతననియె:
"కాచితినని పల్క కారణమేమి?
పసులను గాచెడి భావంబుచేత
వెసనిటు బలికితి వేమి లాంభంబు?
బంటుతనము మాని ప్రజ్ఞలు మాని
యింటికి పొమ్మను టెంతటి మాట!"
అనుచు బేతాళుడు అగ్నియై మండి
జనులందఱు వినగ శౌర్యుడై పలికె:
"సభలోన నావంటి సాహసోత్తముని
అభిమానపరుడవై అనిమొనయందు
భళిరె! యాదవ! నన్ను పారిపొమ్మనుచు
కలగ దెల్పితి వింత గలద యీ భువిని?
తన మూడు హస్తముల్ తప్పించుకొంటి

వనువంద నీ ఒక్క హస్తము జూపు
తప్పించుకొనియద తరువాత కాని
కాన నీచేయి చూపు కఠియావురాజ!"
బేతాళుడిటువలె బెడిదముల్ పల్కి
ఘాతచే గజ్జెల కటహారి బట్టి
పిల్లల కొ్రెడమ పిడికిట బట్టి
"ఫెళ్లుగా చెయి నాపై విడు"మని పల్కె

**-: విధిలేక కఠియావులరాజు ఒక్క దెబ్బతో బేతాళుని వధించుట - అతని అన్నదమ్ములున్నచో పోరుకు రమ్మని సవాలు విసరుట :-**

"మంచిది బేతాళ మరుగు దెల్పెదను
పొంచి యెడమ చనుమొన క్రింద దక్క
ఇంకొక తావున యే నిన్ను బొడువ!
అంకితముగ కన్నులందు గాపాడు
ఓరుగంటి ప్రజల నొప్పించ రాజు
బారు కదలె గర్ది పలువైపులందు
గదుముక గదుముక కఠియావులన్న
ఉదిరించి బేతాళు నుగ్రరూపమున
చిరుమండిన నిలిచి చివ్వున లెగిచి
మారుమండిన నిల్చి మార్కొని పూన్కి
బారుమండిన నిల్చి భ్రమగన పలికి
ధీరుడై యాదవాధీశ్వరుడపుడు
కోపించి యదుకులగోత్ర చంద్రుండు
దాపటి చిరుతన తట్టి కటారి
పిల్లలకొట్టును వెనసిపో నూకి
ఘల్లున కటహారి కఠియావురాజు
విడిబడి బేతాళ వీరపుంగవుని
యెడమచను దిగువ యెగసి తా బొడిచె
ఆపోటు బేతాళు నాయంబు దగిలి

వీపున బెత్తెడు వెలికొచ్చె అలుగు
అతిభారమై జట్టి కమిత రోషమున
కొతకక కంఠము కొరుకుదు ననుచు
దోచుక రాజూచి దొరకుమారుండు
డాచేతితో గొట్టి ధరమీద నూకె
పాటున బేతాళ్డు పర్వతంబోలి
మేటి యా బంటిలమీదను గూలె
కుటిలాత్ము డిలమీద గూలంగ జూచి
కటహారి బెరికెను కఠియావురాజు
అంతట ఓరుగంటాపురజనులు
సంతోషమందిరి సకలమౌవారు
తరువాత రక్తంబు ధట్టిన దుడిచి
కఠియావుభూపాల్డు కడువేగ బలికె:
"కట్టుక బిరుదులు కంటికి నిదుర
పట్టకయుంటి నీ పరియంతరంబు
మచ్చరం చాలించు మాయన్న! యింక
నిశ్చయమ్ముగ నీవు నిదురపోవన్న!
ఓరుగంటినున్న ఓపుణ్యులార!
క్రూరుదు బేతాళ్డు కూలెను, యితని–
తమ్ములు యన్నలు తనయులు నున్న
రమ్మనగదరయ్య రణరంగమునకు
కట్టిన మొలదట్టి కటహారి చేత
పట్టియుండగ నిత్తు బవరమిచ్చటను
బంటు యెవ్వరు నన్ను మార్కొను"మన్న

**–: బేతాళుని తమ్ముదు కన్నమాధీరుదు కఠియావులరాజు నెదిరించి చనిపోవుట :–**

కంటిమటంచును కన్నమా జెట్టి
వివరంబు తెలియక వీరుడై పలికె!
"యెవడురా మాయన్న నిలమీద గూల–

చంపి, యిక్కడ నుండి సాగిపోగలడు?
తెంపున నాచేతి దివ్యఖడ్గమున
పోనిత్తునా యిందు పుటమార్తుగాని
హాని వచ్చుట ముందు అది తెలియలేక
మాయన్న నిటువలె మహిమీద గూల్చి
కాయంబుతో నీవు కడకెళ్ళగలవ?
తన ఖడ్గధారచే తడయక నిన్ను
తునియలు గావింతు తొలగక నిలువు!"
కన్నమవీరుని కఱుకువాక్యములు
పన్నుగ విని రాజు పకపకనవ్వి:
"అన్న కన్నమధీర! అసహాయశూర !
వన్నెకెక్కదలంచి వాగుచున్నావు
యెఱుగక బంటు మీయన్న బేతాళ్డు
బిరుదుగట్టుక చాల ప్రేలుచునుండె
పటుగతి మాతండ్రి పట్టినయట్టి
కటహారిచే వాని కైవాల జేస్తి
క్రమము చాటుట వద్దు కన్నమవీర!
సమము పోట్లాడగ చయ్యన రమ్ము!"
మిగుల పల్కిన పల్కు మెలకువ తెలిసి
తెగువతో కన్నమధీరు డావేళ
పందిబల్లెము పూని పరవళ్ళుచేసి
అందికయ్యము కత్తెరడుగులమీద
అంతట కఠియావులన్న నెదిరించి
పంతాన తమతండ్రిబాకు చేయంది
ఎడమచేతను చిఱుత ఏమరకుండ
వడిదప్పి బల్లెమువాటున బడక
కదిసినయంతనె కన్నమవరుడు
ఎదనాని బల్లెము యాదవాన్వయుని

గదిమి పరాక్రమ కన్నమవరుడు
కొదకక కోపించి గుడ్లెర్రజేసి
గురువు యిచ్చిన విద్య గూడి బల్లెమున
గరిడిలో మెలగుచు గర్జనల్ హెచ్చ
కన్నమధీరుడు కటియావురాజు
పన్నుగ సాధనల్ పరిపాటి చేసి
గురిచూచి కన్నము కూలంగ పొడిచి

**-: కటియావులరాజు గుఱ్ఱమునెక్కి బోవుచు యుద్ధమునకు వచ్చువారుండిన రండని ఆహ్వానించుట - బేతాళుని మఱియొక తమ్ముడు రంపాలకేశవుడు పోరుకు సిద్ధమగుట :-**

తెరగొప్ప గండకత్తెర నెక్కి "యిచట
భండనంబునకును పైనయై రండు
అందగూడుక"యంచు నశ్వంబుమీద
విడబడ బల్కుచు వీథిని తాను
సొంపుగా వెడలియు చూచుచు రాగ
రంపాల కేశవుడు రౌద్రుడై మండి
అన్నలిద్దఱు చెల్లిరనుట లేచి
అన్నిట తెగి దేహమాశయు రోసి
నడివీథి నెదిరించి నాజి కెదిర్చి
బడబాగ్ని బోలి రంపాల కేశవుడు
"ఎవడురా యిందులో యాదవరాజు?
వివరించి పలుకుడి వీరసాహసుల
ఘనమైన కత్తులగరిడిలో చంపి
పనిబడి వూరెల్లి పారిపోగలవ?
విక్రమార్కులనెడి వీరుల జంప
యెక్కడపోదువు యాదవరాజ?
అన్నల జంపిన అమితసాహసము
కన్నుల జూ"పని కటియాలవరుని

కెరలుచు రంపాల కేశవాఖ్యుండు
పురికొల్పుచును కయ్యమునకు నిల్వుమనిన
విని రాజు సంతోష విదుడగుచచట
అనిచేయ బయల నాయత్త పరపింప

**-: బట్టావులరాజు తన చెలికాండ్రగూడి పట్టణముజూడ వచ్చుచు ప్రజలనుకొను మాటలు విని కటియావులరాజును కలియవచ్చుట - అన్న ఆజ్ఞతో రంపాలకేశవుని ఎదిరించి చంపుట:-**

అచ్చట పల్లికొండైతమరాజు
సచ్చరిత్రులు బంధుసముదయం గొలువ
సకలము తెలుపంగ సంతోషపడుచు
ప్రకటమై యున్నంత బట్టాలరాజు
చెలికాండ్లతో గూడి చెలగి పట్టణమున
వలనొప్ప మేడలు వరుస వీథులును
మరి చిత్రమైయున్న మందిరంబులను
పరికించి సంతోష భరితులై తాము
మురియుచు సంతసమున నేగుదెంచ
పురజనుల్ కటియావుభూపుని వార్త
యెదురుగ నటనట యాదవరాజు
మదమణచియు మేటిమల్లు తాను
కసిబిసి యిద్దఱ గరిడిలో జంపి
పొసగ నశ్వమునెక్కి పోవుచున్నంత
విని వారితమ్ముడు వీథిన నెదిరె
అనవిని బట్టావులన్న కోపించి
తన చెలికాండ్లును తానును వేగ
కనుగొన నేతెంచె కటియావువరుని
దండ మొప్పుగ బెట్టి దాపట నిలిచి
భండమున కెదిర్చె బట్టావులన్న
"రంపాల కేశవ! రమ్ము నామీద!

ఆంపవర్షము చూపు ఆయుధం జూపు
యిలమీద గూల్చి మాష్టీల నిద్దతిని
అలసియున్నారు మా అన్నయ్యగారు
నీశౌర్యవిస్ఫూర్తి నెరపి నామీద
కేశవ! రమ్ము! నన్గెలిచి పొ"మ్మనుడు
యితడెవ్వరనువారు విని యెఱిగింప
ఆతని తమ్ముండితడని సంతసిల్లి
పురజను లచ్చట పొంగి తలలూచి
వరశౌర్యులని చాల వర్ణింపుచున్న
బట్టావుభూపతి పగకెదిరించి
పట్టాల తొడిగిరు భాగములందు
పరువడి నడువ రంపాల కేశవుడు
కరముల కేడెము[1] కత్తి సంధించి
వరసి అంతర్లఘువు వైపుగజేసి
పురజనుల్ దనుమెచ్చ పుటములు యెగసి
అట్టహాసముజేయు నంతలోపలను
బట్టావులాఖ్యుడు పరగ వీక్షించి
కఱియావులన్నకు కరములు మొగిచి
యెఱనూక నందను దేకాంగివీర్దు
రంపాల కేశవు రంగమధ్యమున
చంపుదునని పల్కి సాహసంబేర్చి
వచ్చి బట్టావులవరు డెదిరించి
మచ్చరం బెనసియు మార్కొని నిలిచి
అతులితముగ సర్వహస్తాల పెనగి
నుతులు గొంచుచు నిర్వురోర్చుక తమను
మొనసి అల్లులు వెన్కముందు గావించి

1. కెడెము = డాలు.

కనలి బట్టావుల ఘనుడు రెట్టించి
విడిబడి కుడియెడమ వెంపరలాడి
బడిబడి జూచెడి ప్రజలరుదంద[1]
రంపాల కేశవు రణవీథియందు
త్రుంపె నడుము రెండు తునకలుగాను
యిద్దఱ గరిడిలో వీథిలో నొకని
[2]గద్దఱి జట్టీల కలనిలో నణచి
పద్దులేర్పఱిచియు భట్టు చదువుచు
ముందఱ భట్లును మునిముంద నిలువ
అన్నతో బట్టావులన్న యిట్లనియె:
"చెన్నొందు కఱియావుశేఖర! వినుము
మడిసిరి జట్టీలు మనపద్దు చెల్లె
విడిదికి నేతెంచు యెడపకయిందు
తమవారు కూర్చున్న తావుకు నేను
క్రమముగ నేతెంతు కఱియావులన్న!"
అని చెప్పి కఱియావులన్నను బంపి
కనకుండ చెలికాండ్ర కలిపి కొల్వునకు
తమవారితో నున్న తదనంతరమున

**-: జట్టీల రక్తవస్త్రములను భటులు రాజసభకు దెచ్చుట**
**- ప్రతాపుడు ఐతమరాజును నిష్ఠురోక్తులాడుట :-**

సమరంగమునందు సమసినయట్టి
రట్టడిజట్టీల[3] రక్తవస్త్రములు
పట్టుక చారులు పరువున వెడలి
తనరాజు వీరప్రతాపు కొల్వునకు
కొనితెచ్చి రుద్రునికొల్వులో నుంచి
వినదెల్పె బేతాళు వివరమంతయును

1. అరుదు = ఆశ్చర్యము; అరుదంద = ఆశ్చర్యపడగా; 2. గద్దఱి = దిట్టతనముగల, పొగరుగల; జట్టి/జట్టిగ/జెట్టి=మల్లుడు, శూరుడు; 3. రట్టడి=దుష్టుడు, రట్టడి జట్టీలు=దుష్టులైన మల్లురు.

"అనిచేసి బేతాళు నన్నదమ్ములను
గడియలో కత్తులగరిడిలో జంపి
కడకును బోయె చక్కగ ఊరువెడలి
నాదించి తనపేరు నందందు పొగడి
యాదవరాజు కర్యావులరాజు
ననుచు తేజిని నెక్కి నాయత్తమునను
వనర చాయలకత్తి వఱలోన నిడక
'రమ్మను యెవరైన రణరంగమునకు
కొమ్మను యిచ్చెద ఘోరయుద్ధంబు'
యిటువలె పలుకుచు యెగసి ఘోటకము
తటుకున మనకోట దాటించె నతడు"
యిటువలె పలుకగ వీరప్రతాపు(నకు)
పటపటమని గుండె పగిలినట్లయ్యె
చల్లగ యదుకొల్వు సభవంక జూచి
వల్లవు నైతన్న వైఖరి జూచి
విదితము బంధుల వీక్షించి చూచి
కదనవీర ప్రతాపకంఠీరవుండు
"వింటిరా సభవారు వీరి రాకళ్లు
కంటిరా వీరల క్రమము పోకిళ్ళు
గురిజూపినటువలె గుణములాడుకొని
పురహరు జూతుమని బొంకి యీలీల
చాతుర్యమును జూపి సంతోషపఱచి
నాతోను సెలవంది నడికోట జొచ్చి
మున్నూటితో కొలువ్వు ముట్టడివేసి
తన్ను చంపించి యీ ధరణి యేలుటకు
కలహము గాకుండ గారడిమాయ
తలచిరి ఐతన్న తగ పల్లికొండ
ఒకరు యిద్దఱ గూర్చి ఒక తట్టు పంపి

ప్రకటమౌ నటువంటి బంటుల జంపి
వంతు కెక్కదలచు వైఖరిగాను
ఎంతపనిని జేసి రీ యాదవులును
అదిగాక బాలుడు ఐతన్న యనుచు
మదియందు నెరనమ్మి మరియు నేనుంటి
ఆడితప్పనివారు యాదవులనుచు
పాడుచుండుట వింటి పగలౌట యెఱుగ
నమ్మించితివి ఐతనరపాలచంద్ర!
సమ్మతితో పనుల్ చక్క జేసితివి
ఓరుగంటీశ్వర్దు వైరౌలగుటను
కారణం తప్పించ కర్తలంగాము"

**-:ఐతమరాజు ఆశ్చర్యపడి, ఈ ఘటన ఎట్లు జరిగినదని పల్లికొండను ప్రశ్నించుట:-**

అనవిని ఐతన్న ఆశ్చర్యమంది
వినరాని పలుకులు వింటిగా ననుచు
"యెక్కడ జగడము! యేటిచిత్రంబు!
యెక్కడ యెవరెందు యిది తెలియదయ్యె!
దేవుని సేవించ తిరముగ వచ్చి
నీవూరు మాకేల? నిను చంపనేల?
మాభూమి కలిగుండ మామందలుండ
నీ భూమి మాకేల? నిందుండ నేల?
నీకోట మాకేల? నీకొల్వు యేల?
నీకు ముట్టడియేల? నింద మాకేల?"
అనవిని వీరప్రతాపరుద్రుండు
మనమునను విచారమగ్నుడై యున్న
ఉన్నయంతనె ఐతయుర్వీశ్వరుండు
క్రన్నన బావను కనుగొని పలికె:
"పందుము(ల) ఓ బావ! పల్లికొండయ్య!
నిందజెందుట నయ్యె, నే తెలియనైతి!

కఱియావు మాయన్న కార్యము జేసి
వరస మన్నీలను వధియించినాడు
వీరప్రతాపుడు యీవేళ నిచట
కారులు బలికెను క్రమమేమి బావ?
అక్కడ నుంచిన అన్న యిచ్చటకు
నెక్కరణిని వచ్చె? నిటులేల జేసె?
కపటమానవులంచు కలియుగమందు
అపకీర్తి పనిజేసె అన్నయు యిచట
అడితప్పనివారమని వుండు మనల
కూడని మాట్లాడె కువలయాధిపుడు
పలికి బొంకనియట్టి ప్రజ్ఞకలిగుండి
కలకపనిని జేసె కఱియావులన్న
బలుదొడ్డవారి గర్భమున జన్మించి
తలవంపుపని జేసె ధవుడు మాయన్న
భూమిలో గలదని పుణ్యతీర్థముకు
క్షేమలాభములిచ్చు శంభులింగమును
చూడ వేడుకలుగ సుదతులు మనము
ఆడుచు పాడుచు అరుదెంచి రాగ
వచ్చినందుల కపవర్తమానంబు-
వచ్చుట యెఱుగను ఓబావగారు!
నొచ్చెను నామది నుర్వీశ్వరుండు
హెచ్చుగా బలికిన దెంతటి మాట!
అతివేగమున నీవు హరిగుర్వయిపుడు
మతిమంత వివరించు మారుత్తరంబు"

**-: పల్లికొండ కఱియావులరాజు చర్యను సమర్థించుట :-**

విని పందుముల బావ వికసితముఖము-
నను తెల్పె నైతభూనాథు కిట్లనుచు:
"వల్లవ ఐతన్న! వంశాబ్ధి చంద్ర!

చెల్లించె తన పూన్కి సింహాద్రిసుతుడు
ఎలమంచి గంగాంబ యెన్నాళ్ళనుంచి
తలపెట్టి యుండెనో తనకోర్కె దీర్చ
ఓరుగంటిని జూడ నున్న వేళలకు
కారణం గల్పించె ఘనత గంగాంబ
ఓరుగంటి పురము(న) వర్తించునట్టి
సరిమీరిన గరిడి సాహసోత్తములు
ధర పుట్టరానట్టి దండిజట్టీల
వరబలాఢ్యుల జంప పంపె గంగాంబ
దీనికి చింతింప తీరునా యింత?
మానక తమకిది మది నొవ్వనేల?
కాని రావలసిన కార్యమై గూడె
గాన మంచిదెగాని కాదనరాదు
పోరువచ్చిన చోట పోరాడకున్న
ధీరుడు తానౌన దీనమందార!
అతడు చేసినపని అందర్కి మేలె!
మతిమంతు డనజెల్లు మానవులందు
ఓరుగంటిని బిర్దులూడదన్నినది
నేరమా రాజేంద్ర! నిది విచారించ?
ముగ్గురు మాష్టీలు మూగినవారి
బెగ్గడిలగ గూల్చె భీకరాకృతుల"

**–: ఐతమరాజు సంతృప్తిచెందక, కఠియావులరాజును చంపి, ఆ నెత్తుటి బట్టలు తెచ్చి ప్రతాపుని సభలో పెట్టుమని పల్లికొండను ఆజ్ఞాపించుట :–**

అని యిట్లు కులగురు వాడినందులకు
విని ఐతభూపాలు డిట్లని బలికె:
"బావ! యిటుల బల్క భావ్యమ్ము గాదు
యీ విచారము మీకు విహితంబుగాదు
అతడు చేసిన మేలు ఆధిక్యమునకు

యితర మార్గము నడవడి వద్దు బావ!
కొలువున చోటిచ్చి కూర్చుండ నునిచె
చలము చేయుట యిది సహజమె బావ?
అశ్వాల పాలకీ లందలంబులను
విశ్వాసముగ నిచ్చె యీ పనుల్ గావు
తుంటమానిసి గాదు దొడ్డవాడితడు
కంటకం గలవాడు గాదు బావయ్య!
యింతవారని వచ్చి యిలలోన కీర్తి-
మంతులం గాబోము మంచిది గాదు
కఠియావురాజు కంఠంబు తరిగి
పరుస[1] నెత్తురుతోటి వస్త్రము దెచ్చి
మరి వేగమున బెట్టు మనుజేశు నెదుట
ఉరవడి కొల్వులో నుందునుగాని
యిందుండి లేవను యిది పద్దు[2] తనది
పందుము కులగుర్వ పైనమై పొమ్ము"

**-: అట్టి తీవ్రనిర్ణయము తగదని పల్లికొండ ఐతమరాజునకు మరల నచ్చజెప్పుట :-**

అని యిట్లు ఐతన్న ఆడినందులకు
విని పందుముల బావ యిట్లుగ బలికె:
"దొడ్డవారికి యెంత తోచదు బుద్ధి
గడ్డమట్టుకు వెదకి కఠియావువరుని
పట్టి చంపుమటంచు పల్కితిగాక
గట్టిగా నిటుపల్క కారణంబేమి?
అతనితో ముందున్న అనిమొనలందు
అతడు లేకున్నను అపజయమగును
కఠియాలరాజును కంఠంబు కోసి
యిరవొంద యెలమంచి యేలంగగలవ?

1. పరుస = కఠినుడు; 2. పద్దు = పంతము, ప్రతిజ్ఞ.

యీా వర్తమానంబు విని సిరిదేవి
జీవంబుపై ఆశ సిద్ధము విడుచు!
కొమరమ్మ యీవార్త గురుతెఱింగినను
భ్రమపడి జీవంబుపై ఆశ వదలు!
చెల్లెలు అగుమంచి చిన్నిమరదండ్లు
అల్లన వినినంత నందరు గూడి
బంధువర్గము విని పడిచావగలరు!
చందమామకు జోడు చక్కనిరాజు
అపకీర్తి వచ్చును ఐతమరాజ!
కృపజూడు మతనిపై కువలయాధీశ!
అందర్కి సరదారు అతిమహారథుడు
కందువేమియులేని కఱియాలరాజు
అదిగాక ముందర ఆతడొనర్చు
పదునైన బలుదొడ్డ పగలుండియుండె
అటువంటి శత్రుల ననిచేసి గెలువ
ఘటన మృదుడు మేటి కఱియాలరాజు
కలిగియుండిన మనం కడతేరగలము
వలదు యిటువంటివానిని చంప
చాలించు మతనిపై చలమైతరాజ!
పాలించు నామాట బాలచంద్రుండ!"

**-: ఐతమరాజు తన నిర్ణయమునకు తిరుగులేదని, అది అమలుకానిచో తాను ఆత్మహత్యకు పాల్పడుదునని బెదరించుట :-**

అనవిని ఐతన్న ఆగ్రుడై మండి
మునుకొని కడుకోపమున జూచి పలికె:
"బావ!, నామాటకు ప్రతిమాట అతని-
లావు హెచ్చించి మాలావు కుంచించి
పగలున్నవని మాకు భయము కల్పించి
మగిడి నాయాజ్ఞకు మారుచెప్పుదువ?

సిరిదేవి కొమరమ్మ జీవమిడ్చినను
మరదండ్లు అగుమంచి మరణమొందినను
కులబంధువులు ధర కూలిపోయినను
యిలయందు నాయాజ్ఞ విడువను బావ!
పగలన్ని వచ్చి నాపైబడ్డగాని
మిగుల లోకములన్ని మీదికొచ్చినను
యిత్తును ప్రాణంబు విడుతును ఘటము
చిత్తంబులోపల చింత చాలించు
అంతకు మిక్కిలి అయిన వేళలను
కొంత విషము మ్రింగి కూలిపొయ్యేదను!
పరువడి వేవేగ బావయ్యగారు!
కటియావురాజును ఖండనజేసి
కోతకు గుర్తులు కొనిరమ్ము! పొమ్ము!
అతని రక్తపువస్త్ర మది గుర్తుజూచి
ధరణీశు సెలవంది తగ కొల్వు విడిచి
పరువడి వెళ్ళుదం బావరో లెమ్ము!"

**–: చేయునది లేక పల్లికొండ కటియావులరాజునొద్దకేగుట**
**– అతడు తాను చేసిన పని వివరించి చెప్పుట :–**

విని గుర్వు మదికుంది విహ్వాలుడగుచు
విననేరడయ్యె నా విన్నపంబనుచు
మితి దప్పెనని యెంచి మెల్లగ లేచి
ప్రతిమాట పలుకక పల్లికొండయ్య
రఘుపతి కటియావురాజున్న కడకు
తగరాగ తిలకించి దండమర్పించి
బావ కూర్చుండుని పద్మాసనమున
కేవలం బావకు కేల్మోగిచి పలికె:
"గురువు యేతెంచుటకును కారణంబు

యెరిగింపు బావయ్య! విందు" ననంగ
"వినవయ్య! కఠియావు వీరశూరుండ!
పనియేమి చేసితీ పట్టణంబందు?
చంపినవారెవరు? చచ్చినదెవరు?
యింపుగ నాకును వినిపించు రాజ!"
"తెలిపెద విను బావ! తేటతెల్లముగ
బలములు విడి మీరు ప్రభుకొల్వునకును
తర్లి పోయినవారు తావుకు తిరుగ
మళ్లిరాలేదని మాబుద్ధి తోచి
మీ సన్నిధానంకు మేము రాబూన
ఆ సమయమున నొక్క అసహాయవరుడు
జాతిని మాస్టీనిసంజాతుడైన
బేతాళుడనువాని బిరుదులు నగరు
వాకిటనున్న నావాజికి దెలిసి
ప్రాకకపోయె నాభావమై నిలిచి
వెనువెంట చూచితి విడువుమటంటి
వినకపోయెను బిరుదు విడువకపోయె
విడువకుండిన బిర్దు విరుగదన్నితిని
పెదబొబ్బలిడుచును బేతాళుదెదిరి
వడిమీదికఱుదెంచె వరగర్వమునను
విడిబడి గరిడిలో యిలను గూల్చితిని
తరువాత వానికి తమ్ముదేతెంచ
వరబాకునను గుద్ది వాని చంపితిని
దరిమిలా తమ్ముడు దారి నరికట్టె
పరువడి జంపెను బట్టావులన్న
మరి వేరుబుద్ధిని మదినెంచియుంటె
వర గండకత్తెరవాజి ధుమికించి
రాజనగరు జొచ్చి రాజును జూచి

భోజయాదవ బిరుదు పొగడించి నిలిచి
వీరప్రతాపుడు వినవచ్చెనాడ
ధీరుడా! యదుకులాధీశ్వరా! నేను
అదిగాక మీకు మా అయితన్న కెఱచి
వొదిగివచ్చితి బావ వందనం మీకు!"

**–: ప్రతాపుని కొలువులో జరిగిన సంఘటనలు, ఐతమరాజు ఆజ్ఞ తెలియజేసిన పల్లికొండ కటియావులరాజును రహస్యముగా నొక గుదారములో దాచి, పునుగు పిల్లిని చంపి దాని రక్తముతో కటియావులరాజు వస్త్రములు తడిపి తెచ్చి చూపుట:–**

అనవిని పలికొండ ఆనందమంది:
"ఘనమోహనాకార! కటియావుశూర!
వినవయ్య! యొకవార్త విన్నవించెదను
గొనకొని కొల్వున కూర్చున్నయంత
చచ్చినవారి వస్త్రములు సభకును
తెచ్చిచూపిరి భట్లు ధీరునిముందు
అదిచూచి వీరప్రతాపరుద్రుండు
ఉదుటను మాటాడె ఒడుపుపో సభను
అందుకు ఐతన్న ఆత్మ చింతిల్లి
ముందెనుక తోచక మోటుతలపునను
మిమ్ము ఖండనచేసి మీ వస్త్రములను
మమ్ము తెమ్మన్నాడు మానవాధీశ!
అందుకు మీరేమి ఆనతిచ్చెదరు?
పొందుగ సెలవిమ్ము భూపాలచంద్ర?"
అనవిని కటియావులధిపుడు లేచి
కనుగొని బావను కలకలనవ్వి:
"అయితన్న యిటువలె ఆడిన వెనుక
భయమేమి కానిమ్ము బావ! యీక్షణమె
నేజేసినటువంటి నేరంబుకొఱకు

తాజెప్పి పంపించ దండించవచ్చు
రాజాజ్ఞ తప్పించరాదుగా బావ!
భోజుని యాజ్ఞను పూర్తికావించు!"
అనవిని పందుములహరి పల్లికొండ
కనుగొని బలికెను కఠియావువరుని
"ధర విక్రమార్కావతార! శూరుండ!
కోరి తెల్పెద విను కువలయాధీశ!
యిపుడొక్క విన్నపం వినుపింతు వినుము
కృపయుంచి మన్నించు గోకులాధీశ!
వరపుణ్యచారిత్ర! వసుధనొక్కెడను
కఠియావు భూపాల! కానరాకుండ
పరగ పుల్లావులవారి కంపటము
తెరగొప్ప మైనపుదిడ్డి గుడారు
లోపల గూర్చుండు లోకులు గనక
కాపట్టి కనియుండు కఠియావురాజ!
మీమారుగా నొక్క మృగమును జంపి
నీ మంచి వస్త్రము నించి రక్తమున
అలర కొల్వున జూపి ఐతన్నతోడ
వలనొప్ప తావుకు వచ్చెదగాక!
మాయాజ్ఞ మీరక మనవి నేమరక
పాయక మనవిని పాలించు రాజ!"
అనవిని కఠియావు అవనివల్లభుడు:
"మనవి చేకొంటి ముమ్మాటికి బావ!"
ఆవేళ హరిగురు వానందమంది
ఆవులాన్వయుని పుల్లావులవారి
దీపించు మైనపుదిడ్డి గుడార్న
దాపించి పందుములు దామోదరుండు
పునుగుపిల్లిని జంపి పొసగ వస్త్రములు

గొనకొని నెత్తురు కూడగ జేసి
పట్టించుకొని వచ్చి పందుముల గురువు
నెట్టన కొల్వులో నిలిపినంతటనె

**-: పల్లికొండ నెత్తురు గుడ్డలు పట్టించుకొనివచ్చి సభలో పెట్టగా, వీరప్రతాపుడు చూచి చకితుడై. వీరలను మాయోపాయములతో జంపవలెనని సంకల్పించుట :-**

జొత్తుగుడ్డలు జూచి చోద్యంబు నొంది
చిత్తమును పరాయత్తముగాక
"యిదియేమి చోద్యము యిది జెప్పు" మనిన
అది వినుమని చెప్పె హరిపల్లికొండ:
"పన్నుగ ఐతభూపాలచంద్రుండు
అన్నను చంపించి అతని వస్త్రములు
తెప్పించుమని పల్కె తెగువతో మమ్ము
అప్పుడె చని వాని హతముగావించి
అతని నెత్తురుబట్టలన్ని కొల్వునకు
ప్రతిదెచ్చియున్నాము భావించి చూడు!"
అన వీరప్రతాపుడాత్మ శంకించి
"కనికరంలేని దుష్కర్మ మానవులు
ఎంతకు దొరకొనె యాదవరాజు
పంతమేమనవచ్చు బడుగులరాజు
అన్నను చంపించె అదిశౌర్యమెంత?
కన్నతండ్రిని తప్పు కావంగగలరు
యేవిధంబునైన యీ రాజవరుని
తీవరం కాయంబు తెగజూడవలెను"
అని మదినెంచియు ఐతభూవరుని
తనుజూచి వీరప్రతాపుడిట్లనియె:
"అవని జూచితిగాక ఐతభూపాల!
సవరగ మీకును సరిసాటి లేరు
కోరి చూచితిగాక కుంభినియందు

పౌరుషం నీసాటి బంటిల లేదు
పరమోపకారంకు ప్రాణదానంబు
ధరలోన మీసాటి దాతలు లేరు
పలికి బొంకనియట్టి ప్రజ్ఞగల్గియును
కులపావనుండవు గోకులాధీశ!
నీ సాహసంబును నీతెంపు పెంపు
మాసేత దీరదు మానవాధీశ!

**-: ప్రతాపరుద్రుడు ఐతమరాజునకు అలుగుల సింహాసనము ఏర్పాటుచేసి, పగడ సాలాడుటకు ఆహ్వానించగా, పల్లికొండ దానిని అరుగుగా మార్చివేయుట :-**

ఒప్పితి నామది ఒక వార్త వినుము
చెప్పెద యిర్వురం చెలగుచు వేడ్క
తగ ముంగిట సభను దనర గూర్చుండి
[1]పగడసాలాడుదం బాలచంద్రుండ!"
అనవిని సరెయన నా ప్రతాపుండు
తనవారలకు దెల్పె తాజేయు విధము
అలుగులు పాతించి అటమీద మంచి-
మెలగు పీతాంబరం మీద పర్పించి
కానరాకుండల్గు క్రమమేరుపఱచి
కనకసింహాసనం కదలకనుంచి
మనుజేశునకు దెల్ప మది సంతసించి
తాను ఐతన్నను తగగూడి వచ్చినంత
"యెక్కు సింహాసనం యదుభోజ!" యనిన
మక్కువ బావను మరి చూచినంత
"చేసె మోసము రాజశేఖరు"డనుచు
సాచె హస్తము అల్గుసానలమీద
అలుగులు ధరణిపై అరుగుగా నిలిచె

1. పగడసాలు = పాచికలు, వీటినే "సొగటాలు" అని కూడా పిలుస్తారు.

వలనొప్ప ఐతన్న వరహరిగుర్వ
ఒకతట్టు కూర్చుండి వసుధేశుకెదుర
అకలంక చదరంగమాడిరా వేళ*

**-: ప్రతాపుడు ఐతమరాజునకు పెంకి గుఱ్ఱమును బహూకరించగా, పుత్తమరాజు దానిపై స్వారిచేసి దానిని లొంగదీయుట :-**

యిది గెల్చిరని తెల్సి వీరప్రతాపు
డధిక కరాళించు[1] అశ్వమునొకటి
తెప్పించె సన్మాన మొప్పు జేయుటకు[2]
యిప్పుడీయశ్వము నిచ్చెదననుచు
కొలువున దీని గైకొనుమునటంచు
వలనొప్ప ఐతభూవరునకు నొసగి
"యింపుగా నశ్వము నిపుడు లంఘించు
సొంపుతో నైతన్న స్వారి చూచెదను"
"కొమనాల పుత్తన్న! ఘోటకం నీవు
గమికించు"[3]మని పల్కె ఘనుడైతన్న
రాజు సెల్వంది తీవ్రముగ పుత్తన్న
తేజిని లంఘింప దేవతాతేజి
వాయువేగమునేగె నొక కొంతసేపు
మాయ పేరెము[4] బాఱె మఱికొంతసేపు
అంబరంపైకెగ్సి అవనిపై దుమికి
కుంభిణి లంఘించి కోటలు దాటి
స్వారిచేయగ నోట చొంగలు వేసి
భారమై అశ్వము పాదములిడక
నిలిచియు తూలుచు నిలిచె కొల్వునను

---

* ఈ పాదము "అకలంక పగడసా లాడి రావేళ" అని ఉండాలి. ఇంతకు ముందు "పగడసాలు" అనే అన్నాడు. ఇప్పుడు "చదరంగం" అనడం సరికాదు. "చదరంగ" వేరు "పగడసాలు" వేరు.
1. కరాళించు = సకిలించు; 2. ద్విపదకు ప్రాసనియమం ఉంది. ప్రాస నియమం ఉన్న పద్యాలలో ప్రాసయతి కుదరదు. కాని యిక్కడ కవి ప్రాసయతి వేశాడు. ఇతి తప్పు; 3. గమకించు = యత్నించు; 4. పేరెము = గుఱ్ఱపుపరుగు.

**-: ప్రతాపుడు ఐతమరాజునకు విషాన్నము పెట్టగా పల్లికొండ ఆ విషమును భస్మము చేయుట :-**

నిలిచిన కనుగొని నీతిప్రతాప్డు
"అయితన్న! బంధుల నందఱ గూడి
నయముగ విందును నాయింట గుడువుడు"
"మంచిది" యని నొప్పె మండలాధిపుడు
మించిన వంటలు మేలుకూరలును
పంచభక్ష్యాన్నముల్ పాయసాన్నంబు
అంచితంబుగ బంధులకును వడ్డించి
మరిది బావకు విషం మాటినట్టివియు
వరుస వరుసగ దెచ్చి వడ్డించి వెనుక
ఆరయ ఘృతమును నమిత మొడ్డించ
మరిదివిస్తరి చేత మరియంటె గురువు
రక్షకుడు పందుముల రఘుపతి తాక
పచ్చి విషంబెల్ల భస్మమైపోయె!
ఆరగింపులు చేసి అందఱు లేచి
కోరికలన్నియు కొనసాగిమించి

**-: ఐతమరాజాదులు వాహనముల నెక్కి విడుదుల కఱుగుట :-**

యెక్కిరి పాలకీ లెక్కిరశ్వముల
గ్రక్కున కంచునగార నాదించి
కలిగిన బిరుదులు ఘనభట్లు చదువ
నలుబది నాలుగు నన్నూరు వెడలి
విడిదివద్దకు జేరి వీరశూరుండు
తడయక కులగుర్వు తమ్ములు మరుదులు
భారత భాగవత పారాయణంబు
ఆరూఢి చేయగ ఆలకించుచును
నిదురించి భేరీలు నెరయ వేకువను
నాదించ నందరు నటు మేలుకొనిరి.

తెలతెల వారెను తూర్పు దినకరరుచిని
మొల్లము నైతన్న ముందుగ లేచి
అలర స్నానంబాడి హరుని బూజించ
కలభూషణంబులు కాంచనాంబరము
ధరియించి ఐతభూతలనాథుడపుడు
మరివేగ చందనంబలది బంధువులు
వెనువెంట గుమిగూడి యేతెంచి కొలువ
సకల వైభవముల సకల సంభ్రముల
నికలము పూజించ నీలకంఠరుని
అయితన్న బట్టావులన్న యెఱణన్న
దయగల ముమ్మన్న దాపట గురువు
సిరిదేవి కొమరమ్మ చెల్లెలగుమంచి
యరణప్ప పైడమ్మ యెలమి పోతాంబ
నాగమ్మ సూరమ్మ నారాయణమ్మ
భోగవతి చినమల్లు పొలతి గంగమ్మ
చల్ల పిన్నమరాజు సరస తమ్ములును
అల్లన నాచకూళ్ళన్న ముద్దన్న
అందఱు వేర్వేర హరుని పూజించి
వందనంబులు జేసి వరుస నిల్చున్న

**-: ఐతమరాజు అతిభక్తితో శంభుని స్తుతించి పూజించుట - పేదలకు దానధర్మములు చేసి, యలమంచికి బయలుదేరుట :-**

హరున కెదురుగ నిల్చి ఐతభూవరుడు
పరిపరి విధముల బ్రస్తుతిజేసె:
"ఓరుగంటీ లింగ! వర త్రిపురభంగ!
సారస నేత్రాంగ! చారు భస్మాంగ!
కందర్ప సంహార! ఘననిర్వికార!
యిందుకళాధర! యిఱిచర్మధారి!

పొదెలలో నిమ్మవ్వ పూజ గైకొన్న
భక్తుల రక్షక! పరమకృపాల!
కరుణించు గజముఖుగన్న ఘనుండ!
కరుణించు నారదగానలోలుండ!
కరకుట్ల పూజించు కన్నమధీరు
ఇరవొంద కైలాసమిచ్చిన దేవ!
రమ్మని శానమరాజుకు తొల్లి
యిమ్ముగ మోక్షము యిచ్చిన స్వామి!
నమ్మితి నీపాదనలినద్వయంబు
నెమ్మది ధ్యానింతు నిన్ను గిరీశ!
రమ్మనినందుకు రమణులు మేము
సమ్మతి గనవచ్చి సన్నిధి జొచ్చి
మిము వేడుకొంటిమి మేటికోదండ!
కమనీయ సుమగాత్ర కాచి రక్షించు!"
అనుచు సాగిలి మ్రొక్క ఐతభూవరుడు
ప్రణమిల్లి పదినూర్ల భంగుల వేడి
వినుతి గావించియు వేడుకున్నంత
వనరంగ యిరుగడ వర్షించె విరులు
ఆనందమును బొంది ఐతమరాజు
దీనమందారుని తిరువీథులందు
కలయ నూరేగించి కాలకంఠుడిని
యెలమితో దేవాలయంబున నునిచి
పిన్నలు పెద్దలు పేదసాదులకు
ఎన్నికగా కోర్కెలీడేర్చి యచట
పేదలకన్నంబు పెట్టించి వార్ని
ఆదరించియు లేమిదైనవారలకు
పాడికావలసిన పశువుల నిచ్చి
కాడికి కావలసిన కోడెలనిచ్చి

పెండ్లికావలసిన బ్రాహ్మణాదులకు
యిండ్లుకావలసిన యిచ్చె తగినంత
కట్టవస్త్రములిచ్చి కడుసొమ్ములిచ్చి
పట్టుశాలవలిచ్చి భాగ్యములిచ్చి
పట్టెమంచములిచ్చి పరుపులు యిచ్చి
అట్టె వడుగులు పెండ్లి యాశోభనములు
గావించుకొన వేడు కాపురంబులకు
భావించి యిచ్చెను పలునాణెములను
ఆవల యెలమంచి కరుగగ భేరి
వేవేగ మందలో వేయించె రాజు
భేరిమ్రోతలు విని పిన్నపెద్దలును
వేరువేరుగ బండ్లకెత్తి గుడార్లు
కదిలెను సంపదల్ కంపటీల్ మంద
కదిలించె వరగల్లుకడనుండి రాజు
దేవుని సేవించి తిరునాళ్ళ జేసి
బావలు మరుదులు పల్లకీలెక్కి
ఉర్లించె మందలు ఉర్వీశ్వరుండు
తర్లియు యెలమంచి తావుకు వెడల

**–: ఓరుగంటి శంభుడు ఐతమరాజు భక్తికి మెచ్చి లింగరూపమున అతని పల్లకితోపాటు దొర్లుచు వచ్చుట – ఆ లింగమును పల్లకిలోనుంచి తెచ్చి యెలమంచిలో గుడికట్టి పూజించుట :–**

శివుని పూజలుచేయు చిట్టియర్చకుడు
కవ(బ)ళ మెవ్వరు యిట కావింతురనుచు
బీగెము ముద్రేసి పేరెమువాణె
సాగిపోవగ జూచి సర్వేశ్వరుండు
శిరముపై నుదకము చిందుచుండగ
తరలెను యెలమంచి తన చిట్టితోడ
గొనకొని రుబ్బుదుగుండు కైవడిని

చనుదెంచె పాలకి సరసను శివుడు
పాలకివెంబడి పరుగున రాగ
పాలించి కనుగొని పలికె ఐతన్న:
"ఆ విచిత్రంబేమి?" అనజూచి బావ
"భావజసంహర్త, భక్తమందార్త,
కరుణను నీనోము గౌరవముగూర్చి
వరగంటి ఈశ్వరుడు వచ్చెను రాజ!
పాలకి దిగవయ్య పట్టభద్రుండ!
ఫాలనేత్రుని యెత్తి పాలకినుంచు
జాజులు మల్లెలు సంపంగి విరులు
పూజించి వినుతించు భూపాలచంద్ర!"
అన పాలకీ దిగి యందుంచి శివుని
ఘనపత్రి పూజించి కరములు మొగిచి
సాష్టాంగపడి లేచి సంస్తుతుల్ జేసి
నిష్ఠను మదిలోన నిలిపి గిరీశు
కదిలెను ఐతన్న కఱకంఠు వెంట
పదపడి కదిలెను బలగములెల్ల
సంపదల్ మందలు సర్వకంపటము
పంపాద్రి యెలమంచి పట్టణం చేరె
వరగల్లుపురినుంచి వచ్చిన వార్కి
యిరవులు వసతులు యిష్టమైనటుల
అడిగిన వారికి అడిగిన యటుల
కడు వేడుకల నిచ్చె ఘనుడు ఐతన్న
వీథులు యేర్పఱచి విస్తారముగను
పాదుగ యెలమంచి పట్ణమందుంచె
అరయ దేవాలయ మపుడు గట్టించి
ఓరుగంటీశు నివాసము జేసి
చిట్టియర్చకుని పూజించుటకుంచి

నట్టె నిల్పెను వసతులన్ని నమర్చి
స్వర్గమై యలమంచి సర్వసంపదల
నిర్గుణుం డైతన్న నృపతియై యుండె.

శ్రీ కటియావులరాజు చరిత్ర సంపూర్ణము
శ్రీరామార్పణమస్తు



## అనుబంధం:-

కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్యగారు సేకరించిన ఈ కథలో, పల్లికొండ రహస్యంగా ఒక గుడారంలో (ఆవుల వంశానికి చెందిన "పుల్లావులవారి మైనపుదిడ్డి గుడారు"లో) దాచిపెట్టిన కటియావులరాజు సంగతి చివరికి ఏమయిందో తెలియలేదు. 01-03-1966నాడు నాకు లభించిన "పెదకంటిపల్లె ప్రతి"లో దీనికి సమాధానం ఉంది. ఆ కథలోని చివరి భాగాన్ని (చివరి ఏడు పుటలను) ఒక అనుబంధంగా ఇక్కడ ఇస్తున్నాను. దీనిని చదివితే పాఠకులకు పిచ్చయ్యగారి కథలో లోపించిన భాగం చక్కగా అవగాహనకు వస్తుంది. **- తంగిరాల**

**-: యాదవులు గవిలికొండ చేరుట :-**

ఆస్తులు, బాలలు ఆడశ్రీలతోను
గవిలికొండ మజిలీలు చేసిరి వారు
గవిలకొండ గంగకు మొక్కులు తీరుస్తు వుండిరి
బారిగొర్ల పొడిపించిరి బాగీర్తి[1] కపుడు
గవిలికొండ గంగకు గావులు[2] తేవలు[3]
గావులు తేవలు ఘనముగా చేయిస్తు వుండగాను

**-: ఓరుగంటి సైన్యములు యాదవులను ముట్టడించుట :-**

మిన్ను మన్ను తెలియక విరివిగా సముద్రం వెల్లివిరిసిన రీతి
వోరుగంటి దళాలు వచ్చి గవిలికొండ గెముళ్ళు ఆనెను
దళాలు అయితమరాజు కన్నుల జూచెను:

1. భాగీర్తికి = భాగీరథికి; 2. గావులు = బలులు; 3. తేవలు = ఉత్సవ విశేషములు.

"ఇది యేమి బావ! ఓ పల్లికొండ! ఈ విచిత్రంబు?"
"వోరుగంటివారి మాటలు విని
వోరుగంటికి నెత్తురు కోకలు అంపిస్తివి నీవు
నెత్తురు కోకలు చూచి వోరుగంటి దండు తర్లి వచ్చినాది
ఆడచెర, మొగచెర, చెరాచూరగా
కొల్లబెట్టవలెనని వచ్చిరి వారు"
అని యిట్లు పల్లికొండ ఆడుమాటలకు
అప్పుడు అయితమరాజు ఆడె నొకమాట:
"గవిలికొండ యుద్ధము ఎవరిపాలిట
వున్నదో చూడు బావ పల్లికొండ?"
"గవిలికొండ ఘనమైన యుద్ధము
నీతమ్ముడు కరియావులరాజు పాలిట వచ్చివున్నాది"
అని యిట్లు పల్లికొండ ఆడుమాటలకు
అప్పుడు అయితమరాజు ఆడె నొకమాట:
"కరియావులరాజుతో జెప్పి
గవిలికొండ యుద్ధము గెలిపించ"మనెను.
ఆ మాటలకు పల్లికొండ ఆడె నొకమాట:
"వల్లవుల నా మరది! వలరాచ మరది!
ఏమి చెప్పుదు నేను? ఏమందు మరిది?
కరియావులరాజును యాడతెస్తునో మరిది!
కరియావులరాజును చంపి నెత్తురుదొన్నెలు
వారిదివాణం పంపించమంటివి రాజా!
వోరుగంటివారి నెత్తురు కోకలు
మన గుడార్లు కదిలి వచ్చినవి
'దుర్మార్గుడు నా తమ్ముడు కరియావులరాజు
కరియావుల రాజును చంపిన వార్త
నా చెవుల ఎప్పుడు విందునే బావ పల్లికొండ!'

అని తెల్లని కన్నులకు తెచ్చి రక్తంబు
పోపొమ్మని సెలవిస్తివి అయితమరాజ!
కరియావులరాజు గుడారుకు తగ దర్లిపోయి
కరియావులరాజును గరీన ఖండించి
తునియలుగా మొండాలు దహనము చేస్తిని రాజా!"

**-: యుద్ధము చేయుటకు తమ్ముడు లేడయ్యెనని అయితమరాజు విచారించుట :-**

తమ్ముని వార్తలు వినగాను అన్న అయితమరాజుకు
వలవల కన్నీరు కురియంగ సాగెను
"బావ రావే! బావ పల్లికొండ!
అందరికి తల్లికొండ, మాకు పల్లికొండ!
బావరో! వినుము, బావ పల్లికొండ!
ఆ కరియావులరాజును దహనము చేసినచోట
నీవు పరుగున పోయి బావ పల్లికొండ! దండుమీద
పిడికెడు బూడిదెన్నా తెచ్చి చల్ల"మన్నాడు.
"సురగాలికి బూడిద ఎగిరిపోయినది, మరిది అయితమరాజ!"
"వలికె[1]లో మన్ను తెచ్చి దండుమీద చల్లు బావ పల్లికొండ!"
"గాలివర్షానికి సుడిగుంతలు పెట్టినది మరిదీ!"
ఆ మాటలకు అయితమరాజు దుఃఖింపసాగెను:
"పగవారి మాటలు విని తమ్ముడా! నిన్ను
పాయదెరువులు[2] చేస్తిని కరియావులరాజా!"
అని వలవల కన్నీరు అయితమరాజుకు వరదలాయెను
కుడికంటి వుతకము కుంభద్వారములాయెను
ఎడమకంటి వుతకము ఏరులైపారె
"ఓహో! తమ్ముడా!" యని అయితమరాజు అడలంగసాగె
ఆ వార్తలకు పల్లికొండ ఆడె నొకమాట:

1. వలికి = శ్మశానము; 2. పాయు = నశించు, తెరువు = మార్గము, పాయ తెరువులు = నశించు మార్గములు.

**-: ప్రతిబంటు కరియావులరాజును మొలిపించి యుద్ధము చేయింతునని పల్లికొండ అయితమరాజుతో చెప్పుట :-**

"దుఃఖము నీకేల? మరిదీ! దుగదాయ[1] మేల?
చింతింప నీకేల? శివుని దూరనేల?
ఓ మరిది అయితమరాజా!
నీ తమ్ముని కరియావులరాజుని తేలేను నేను
అంతకు ప్రతిబంటు కరియావులరాజును మొలిపించి
గవిలికొండ యుద్ధము గెలిపించగలను నా చిన్న మరిదీ"
ఆ మాటలకు అయితమరాజు సంతోషమున పొంగి
"అటువలెనే చూడు బావ పల్లికొండ!"
అయితమరాజు సెలవాయెనని పల్లికొండ సంతోషమంది
సన్నజంబుల వీరబయలుకు
పల్లికొండ పరుగున వచ్చెను
కావుపాతర పల్లికొండ కన్నుల చూచెను
కావుపాతర మూతపలకలు అటు పడ జిమ్మెను
బావ పల్లికొండ కరియావులరాజును కనుగొని
పల్లికొండ స్తోత్రము చేస్తువున్నాడు:
"సింహాద్రిరాజు కొమార! మొగసింహపు రాజ!
పిన్నమామలకు అల్లుడ! బిరుదుగల రాజ!
పెద్దమామలకు అల్లుడ! పేరుగల రాజ!
మా మనవి చేకొని మమ్ము రక్షించుమయ్య!
వోరుగంటి దళాలు వచ్చి మన గుడార్లు కమ్ముకున్నావి
పానుగంటి దండు పైకొని వచ్చినాది మరిదీ!
గవిలికొండ గమునులు[2] మూసెను దండు
నా చిన్నమరిది! కరియావులరాజ!

---

1. దుగదాయము = దుఃఖము. 2.గవను = పురద్వారము, గోపురము, సింహద్వారము; "గవనులు" అనటానికి బదులుగా జానపదకవి "గమునులు" అనినాడు. "సింహద్వారములు" అని అర్థము.

ఓహెూ యని మీయన్న అయితమరాజు
'తమ్ముడో' 'తమ్ముడో' అని ఆలాపన చేయుచున్నాడు
ఏడు గడియలనుంచి దండు యెడసందులేదు
మన గుడార్లకు చుట్టు ముట్టడిపడి వున్నాది
ఇటు కదలనియ్యలేదు అటు కదలనియ్యలేదు
ఆడచెర, మొగచెర, చెరాచూరగ కొల్లబెట్టవలెనని
ఘనుడ! కరియాలరాజ! సమయమై వున్నారు
మీయన్న అయితమరాజు ఆడె నొక మాట
గవిలికొండ యుద్ధము ఎవరిపాల వచ్చిందని
జాతకము కూడ మన్నారు; ఏళ్ళు లెక్కబెట్టి
దివ్యజ్ఞానము చూడగాను కరియావులరాజ!
నా చిన్నమరిదీ, నీపాలిట వొచ్చివున్నదయ్యా
మరిది కరియావులరాజ! నీవు ఆలస్యం చేసినట్లయితే
మన మందీ దళాలు గుడార్లుతో కూడ
ధరణి పాలవును మరి కరియావులరాజ!"
అని యిట్లు పల్లికొండ కరియావులరాజును వేడెను.

**–: కరియావులరాజు యుద్ధమునకు బయలుదేరుట :–**

ఆ వార్తలకు కరియావులరాజు ఆగ్రుడై మండెను
తెల్లని కన్నులకు తెచ్చె రక్తంబు
అంకెములో పాదమేసి అశ్వాన్ని యెక్కెను
కావుపాతర్లో నుంచి అశ్వం రెక్కలు పెటపెట నార్చి
ఎగిరెను అశ్వం ధరణందు నిలిచెను
గవిలికొండ గుడార్లు అశ్వం కన్నుల చూచెను
రెపరెప రెక్కల నార్చి కాలుజిమ్మి అశ్వం
ఖణీఖణీయని కిలారించసాగెను
తేజీ అలుకుడు వోరుగంటి గడిమన్నీలకు బాకులై నాటెను
అన్న అయితమరాజు కొలువుకు అశ్వాన్ని

దుముకు జజ్జవుకుమని అశ్వాన్ని దుమికించినాడు
అయితమరాజు కొలువుకు అశ్వంవొచ్చేటి మోతలు చూచిరి
వోరుగంటి వారు, పానుగంటివారు
గవిలికొండవారు, గవిచెర్లవారు
గర్భవిరోధులు అల్లకల్లోలమై
తోకలెత్తి కళ్ళేల తోడిగేటివారు
వెనక ముందుగా గుఱ్ఱాల ఎక్కేటివారు
కూబుకూబున నేల కూలేటివారు
వకరిచేతిని వకరందుకోని
కూబుకూబున నేల కూలేటివారు
ఈ ప్రకారంబున వోరుగంటివారు
ఎఱ్ఱని రక్తములోను దొర్లాడుచున్నారు
అన్న కొలువుకు కరియావులరాజు
దుముకుచు జజ్జవుకున అశ్వాన్ని దుమికించుకుంటు
ఆడకాడకు తేజీని ఆడించుకుంటు
కచ్చెకు కాలుదువ్వుతు వచ్చెను ఘనుడు కరియావులరాజు
అన్న మొకారబిందము[1] తమ్ముడు చూచెను
తమ్ముని మొకారబిందము అన్న చూచెను
ధర్మరాజు అయితన్న వురువారయెత్తి తమ్ముని దరిణార దించి
కవుగిలించి తమ్ముడిని తన కవుగిట జేర్చెను
చెక్కిళ్లు తానొక్కి చేర్చి ముద్దాడెను
చదురు సింహాసనం మీద తమ్ముడిని కూర్చుండనుంచి
"పగవారి దళాలు తమ్ముడా! పయికొని వచ్చినవి
గవిలికొండయుద్ధము కడతేర్చు నీవు
తమ్ముడా! కరియావుల రాజ!"
అని తాంబూల మిచ్చెను అయితమరాజు
తాంబూల మందెను ఘనుడు కరియావులరాజు తగువేడ్కతోను

1. ముఖారవిందము.

**–: కరియావులరాజు శత్రుసైన్యమును చెండాడుట :–**

పగదళము మీదికి రాజు పరుగున దుమికెను
అల్లకల్లోలము చేసెను వోరుగంటివారిని
తూర్పున మునుమంది[2] తురుమి మన్నీల
పరమటకెల్లను బాటలుగా నరికి
పరమట మునుమంది బారిగొర్లరీతి
అక్కడ దక్షిణాదికి హతముగా నరికెను
దక్షిణాన మునుమంది దామిని యాటలు నరికినట్లు
ఉత్తరం తేలెను కరియావులరాజు
వక్కడే కరియావులరాజు విడిబడి యుద్ధము సేయగాను
పగవారి దళాలు పయికొని వచ్చెననుచు
వారిలో వారు నరుకులాడంగ సాగిరి
తూర్పు పడమట వుత్తరం దక్షిణం
సూర్యసోమ వీథులు యేర్పరచినాడు
విరగబడి వోరుగంటి దళాలు వోరుగంటి బాటలు బట్టెను
వోరుగంటి కోటలో చొరబడిరి వారు
ఏడు గడియలు గవిలికొండ యుద్ధము చేసి
నెత్తురుగాయాలతో కరియావులరాజు
అయితమరాజుకొలువుకు ఆధికొని వచ్చెను
అల్లడచేసి అయితమరాజుకు మ్రొక్కెను
పల్లిదజేసి బావ పల్లికొండకు మ్రొక్కెను
గోరంత వీభూతి గోటి పెనికిన తీసి
అభయ మంత్రించి రాజుపైన విదిలించినాడు
అరవైయారు గాయాలు వీరశోభలై నిలిచె
ముప్పైమూడు గాయాలు ముద్దుశోభలై నిలిచె
ఆస్తులు బాలలు ఆడశ్రీలతోను
ఆవగింజంత ముల్లు అరికాల నాటకుండాను

గవిలికొండ దాటిరి ఘనులాదిగాను
మకట వెంకటాపురము మజిలీలుగా నిలచి
శ్రీ వేంకటేశ్వరునికి సేవలు గావించి
పందుము సెనగలు పందేరము చేసిరి
మరునాటి ప్రొద్దున దళాలు మరి వేడ్కతోను
వచ్చి మార్కాపురంముందు మజిలీలుగా నిలచె
చేరి చెన్నరాయులకు చేయెత్తి మ్రొక్కిరి
ముందర మండపాన మున్నూరు దివ్వెలు యెత్తించినారు
వెనక మండపాన ఏనూరు దివ్వెలు యెత్తించినారు
ఏప్రొద్దు శివరాత్రి వేడ్క సేవించినారు
తీర్థ ప్రసాదములు అందుకొనిరి
తిరుమందుల పల్లికొండ వల్లవుల అయితమరాజు
ఆరాత్రి మార్కాపురం వద్ద నిద్రించినారు.

**-: యాదవులు యలమంచికి క్షేమముగా చేరుట :-**

మరునాటి ప్రొద్దున మరి వేడ్కతోను
ఎలమంచి పట్నానికి యేతెంచిరి వారు
దుర్గాలమిట్టన సర్వదళాలు నిలిచెను
బ్రాహ్మలకు భట్లకు పరగ వైష్ణవులకు
దానములు ఇప్పించె ధర్మరాజు అయితన్న
వోరుగంటి శంభుని తిరుణాల వేడ్క సేవించి
తీర్థవాసులై యెలంచికి తిరిగి వచ్చినామనుచు
దానధర్మములు యిప్పించినారు
వస్త్రాలు వరహాలు కొల్లలుగా యిప్పించె
ధర్మరాజు అయితన్న ఆరాత్రి దర్గాల మిట్టన
పూజలు చేయించి పొసగ నిద్రించినారు.
మర్నాటి ప్రొద్దున దళాలు మరి వేడ్కతోను
మంచి మూర్తము మరి లగ్నము చూచుకున్నారు

ఆస్తులు బాలలు ఆడశ్రీలతోను
పసిబిడ్డ బాలాది బంధువర్గముల తోను
ఆవగింజంత ముల్లు అరికాల నాటకుండాను
క్షేమాన యెలమంచి చేరిరి వారు
వారివారి గెవుల్లో వారుండిరంత.

(సంపూర్ణం)

( –పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు 1998లో ప్రచురించిన నా "కాటమరాజు కథలు" మొదటి సంపుటం, పుటలు 770–776)



# పుల్లరికథ

## (జన్నివాడకథ – కాటమరాజు దక్షిణాది ఆవులమేపు – దక్షిణాది ఆవులమేపు–ఆవులమేపులు: దక్షిణకాండము – దక్షిణకాండము – చదరంగంకథ)

**–: ఇష్టదేవతా ప్రార్థన – కవివంశాదికము :–**

శ్రీనీలకంఠుని చిత్తమున దలచి
భ్రమరాంబకు మదిని ప్రార్థన జేసి
పేతాళ్ల గంగను ప్రస్తుతి జేసి
పరమేశ్వరుని మదిని పార్వతిని దలచి
బొబ్బల వీరన్నను మదిని దలంచి
శనగల భసువన్నకు చేయెత్తి మ్రొక్కి
కన్నెసిరుల గోత్రుండు కాంతి చంద్రుండు
యెదువమిశ[1] తిలకుండు యాదవఘనుడు
వర్ణించి కనకబండి వమిశ వర్ధనుడు
కొండయ్య నందనుడు కులపావనుండు
శెలుమోప్ప[2]గట్టయ్య చెప్పెనీ కథయు
స్థిరముగా నిలచి ప్రక్యాతినెక్కి[3]
దక్షిణకాణ్యము[4] తగ జెనులు మెచ్చ
చెప్పెద నీ కథ శ్రవణానందముగను

**–: కాటమరాజు తన అసంఖ్యాకమైన ఆలమందలతో పాలేరు దాటుట :–**

రఘురామచంద్రుండు కాటమరాజు
వార్తగల మన్నీడు వలురాజు మనుమడు

---

1. యదువంశ; 2. చెలువొప్ప; 3. ప్రఖ్యాతికెక్కి; 4. దక్షిణకాండము.

పెద్దభూపతి సుతుడు పేరుగల రాజు
నవ్య[5] తొమ్మిది కోట్ల నట్రావులు[6] గల రాజు
పన్నెండువేల భషవముద్ర[5] యెద్దులుగల రాజు
ఆరువేల గుత్తి కవ్వము అఖిల సంపదలు
యేడువేల లింగ్గముద్ర యెద్దులుగల రాజు
దక్షిణ నెల్లూరికి తర్లించె కంపుటాము[8]
వెన్నుని సంపదలు యాదవబలము
గుడార్లు అందలాలు గొప్పపల్లకీలు
రణభేరి మోయించి తర్లె నారాజు
గంగకు జాతర కావించి రంత
మరునాడు నలనన్న మంచి మూర్తమూన[9]
పంచమా వాయిద్యములు బలువడి మ్రోవంగను
బాగాదిరేవున పషుపతి[10] కదిలెను
పద్మనాయుడు దాను బలములతోను
గట్టెరేవుకి యపుడు కదిలెను దళములు
తన్నీరు దసూళ్లు[11] తముటము[12] యెద్లు
దిగువ తిరుపతివలెను తిరుమందులవారు
వెలిగొండరేవున వేగంబె దాటెను
శివపూజె కవులావులు శిముని[13] జన్నావులు
పర్వతంబుల రీతిని పాలేరు దాటెను
చంకతూత కొమ్ములు సన్నావి రాణిలు
యిరువైయారువేలు వీను గోడిగలును[14]
గూడూరురేవున పోలె(రి) గుర్రాలు దాటెను
అశ్వతురంగములు అందెలు ఘుడలు

5. నవ; 6. "నట్టు + ఆవు" = "నట్టావు" = ప్రయాసముచేత పిదుకఁదగిన యావు; 7. బసవముద్ర; 8. కంపటము = ఆలమంద; 9. ముహూర్తమున; 10. పశుపతి; 11. దసులు = బలహీనమగు, చిక్కిపోవు, పాతబడు; 12. తమటము = తప్పెట; 13. శివుని; 14 గోడిగలు = ఆడుగుఱ్ఱములు.

ఆరెమానురేవున వారి అందలాలు దాటెను
పాకనాటిరేవున పముజులు[15] గదిలెను
శిరచాన వేల్పుసిరి జన్నెఆవులు
శిలకలమ్రిరేవున శీఘ్రుంబె దాటెను
జమమారిరేవున సకలసంపదలు గదిలెను
మొత్తమై విలుమూక ముస్తీదుతోను
మొసలకోటరేవున ముదమొప్ప దాటెను
గోదావరిరేవున వారి గొడుగులు గదిలేను
చిచ్చుపిడుగుల వంటి మచ్చలపడ్డలు[16]
సల్లుటావులు మంచి జల్లులు గడలు
సాంగాపురేవున ఆవులు సయ్యన దాటెను
వినని కాట్రేని విధప సురభులును
పషుపతి[17] ధేనువలు పాలేరు దాటెను
మిన్నూమైలుకొండలు మేసినయట్లు
సముద్రము వెల్లివిరిసినయట్లు సాగె కంపటము
మిడతలు మింటివంక నెగిసినయట్లు
కోనల జొచ్చి కవులావులు మేసెను

**–: కాటమరాజు పద్మనాయుడితో చెప్పి, పంచలింగాల కొండదగ్గర గుడార్లు వేయించి, తమకముపై కొలువుదీరుట :–**

నలనన్న నాయునితో నటు విన్నవించెను:
"నాయుడా! యినవోయి నాసిన్ని మరిది!
పాయరాని సంగడము మరిది పద్మనాయుడ!
మా తండ్రి పోలురాజు ఉన్న లింగాలకొండకు
దగ్గిర వొస్తిమోయి వో పద్మనాయుడ!
శాయవలె విన్నపము చాయవలె మనము
అయ్యె లింగమై ఇక్కడ వెలసినా చోటు

15. పౌజులు = సేనలు; 16. పడ్డ = తొలిచూలి ఆవు; 17. పశుపతి.

పంచలింగాల జూసి మనము భక్తి సేవించి
అయ్యఉన్న లింగాలకొండ అచ్చోట మనము
పోపోవలె మనము నీ ప్రొద్దుటవేళను
పన్నుగా లింగాలకొండ పడమట యంచున
పట్టంచు గుడార్లు పదివేలు సాల
యెత్తించవలెనయ్య! వో పద్మనాయుడ!"
అనిన పద్మనాయుడు లెస్సయనుచు
మదగజములలాంటి మన్నీల బిలిచి
వల్లవగోత్రంబు వమిశశేకరుల[18]
సబియేడుకోట్ల సల్లుటెద్దులును
యేడుమందల బోడావులు యనభైవేల నర్రావులు
దరికొని ఇరువేల తర్లించుమనెను
మంచిదని యాదవ మన్నీలు దొరలు
నాయుని వాక్యము నటు విన్నవించిరి
పన్నిన గుడార్లు బరకాల పూనిరి
నందుల గుడార్లు నడిచెవేగంబె
తులకితముగా[19] కదిలిరి తుదిముట్టగాను
భేరిధ్వని మోతలు పెళ్లుకొని మ్రోయంగను
కంపటము భూమి కప్పుకొని రావంగను
అరిగిరి లింగాలకొండ (కడకు) యాదవులు
లింగాలకొండదగ్గిర నిలిచిరి యపుడు
ప్రాకటంబుగ లింగాలకొండ పరుమట పంచన
ఘనుడు తానెత్తించె కావిగుడార్లు
సూర్యపుటము గుడార్లు సూర్యాన్వయ వీథులేర్పరచిరి
యెత్తించె (వల్లవ) వమిశవర్ధనుండు[20]
వీణెలు దండెలు వింజామరములు
పన్నీరు వీభూతి పచ్చకర్పురము

18. వంశశేఖరుల; 19. కుతూహలముగా, ఆనందముగా; 20. వంశవర్ధనుడు.

మల్లెలు జాజులు మంచి కురువేళ్లు
మూర్తమున[21] యెత్తించె ముత్యాల పందిరి
ముత్యాల పందిరిక్రింద రత్నాల తమకము
రత్నాల తమకముమీద రాజు రాఘవుడు
కూర్చుండిరి యాదవ గుణవిశాలుండు
ఆకు సుట్టియ్యను అడప రంగేసు
పరగ పిన్నయ్యకు పొడగాపు చాయ
వచ్చిన డెబ్బదివేడు వైభో(గము) లతోను
మందకంపటీలు మరి యాదవూలు

**-: కాటమరాజాదులు సింగారించుకొని వెళ్ళి, పంచలింగాలకొండపై లింగరూపుడై వెలసిన పోలురాజును పూజించుట :-**

సురలు గోపాలులు సర్వసన్నాయములతోను[22]
సరగ భూషణంబులు సౌకట్లు పోగులు
ముంగ మురుగులు ముత్యాల సరులు
రంగైన చెంగావి..... పెదపట్లు
వుంగరంబులు మొలతాళ్లు వురపుజార్ఘూలు
బంగారు చెరుగుల పట్టుదట్టీలు
అంచితంబుగా యాదవులు ఆయితపడిరి
బసవసముద్ర పడిగెలు బంతులు గడలు
పిగిలి..... పాటకములు బిరుదు నేవళాలు
షురమై జల్లులు సోక శివగడలు
విల్లునంబులు పొదులు వీపున జల్లులు
పశల్యాణ నీమళి పరగ గుగ్గిలాలు
పుశ్వలు* గంపలు పువ్వబంతులూను
కురి (వేళ్ళు) మరవంపులు గల జామెర్లలూను
మారేడుపత్రియు మాంచి అగ్గనాలు
శివగంట శెంకులు[23] శివశివయనుచు

21. మూర్తము=మూరుతము= ముహూర్తము; 22. సన్నాహములతోను; 23. శంఖములు.
*"పుష్పాలు" కాబోలు (?)

ధర క్రక్కటిల్లంగ తర్లె నారాజు
పావలు దొడిగెను పద్మనాయుడు దాను
కాలినడకతో వచ్చి (వారు) తమ అయ్యను కనుల జూడ
పంచలింగాలకొండకు పరదక్షిణము[24] తిరిగిరి
విరుగడల పెయ్యల యర్రయ్య నపుడు
గట్టిగా చట్టువారి ఘనుడు యర్రయ్యను
లింగముద్ర జడదారు లింగము యెద్దులు
అందముగ లింగాలకొండ కేతెంచిరి
ఘనుడు కాటమరాజు కరకంతు దలచి
తండ్రి శిరసు అంటి జలంబు దీర్చి
భస్వాంగము[25] నుదుట బాగోపు బెట్టిరి
మల్లెపువ్వులు మంచి మారేదు పత్రములు
సకల పదార్థములు సమర్పణం జేసి
వారబోసి నివ్వాళి వరసతో నిచ్చి
ధూపదీపనైవేద్యములు తురుతుగా నిచ్చి
యెద్దులు వేనూరు యర్రయ్య మొదలు
సల్లుగెద్దులు మొదలు సట్టవారి వెర్రయ్య[26]
తనతోను ముగ్గురు తగ ప్రధానులును
రఘువంశతిలకుండు రాజు రాఘవుడు
సాష్టాంగదండంబు సమర్పణ జేసిరి.

**–: లింగరూపుడైన పోలురాజుతో కాటమరాజు తన వృత్తాంతమును చెప్పి, పోలురాజు పగలు ఎఱగడ్డపాడులో తీర్చెదనని ప్రతిజ్ఞచేయుట :–**

ధరణీశు నలనన్న తమ తండ్రితో ననియె:
“గంగమైలావుల కరకంతుని పూజించి
వరములు గైకొన్న వల్లమ్మసుతుడ!
మల్లప్ప కృపచేత మహిమీద నీవు

24.ప్రదక్షిణము; 25. భస్మాంగము; 26. చట్టువారి ఎఱ్ఱయ్య.

లింగమై వెలసిన నీలకంఠుండ!
జంగాలకొరకునై నీవు సమరంబు జేసి
లింగమై వెలసిన బడుగులరాజ!
తండ్రిపగవాణ్ణి ధర త్రుంచి (వేయవ) లెనని
వచ్చినాను నీకడకు వలరాజసుతుడ!
నాజన్మ పుట్టుక నా తండ్రితోను
చెప్పెదనని వచ్చినాను శంభుడా! వినుము!
తండ్రి తన జన్మంబు ధాతనామ సంవత్సర
పాల్గుణ మాసము బహుళ పంచమినాడు.
చెలగి వాలికేతువతో పోరి చెల్లెను తండ్రి
తండ్రి చెల్లిన రణభూములకు బోతిని
పదునాల్గు కుంభిళ్లు పాలించితినే తండ్రి!
ఆర్లపెంట రణములో అయ్యను జూచి
అరిటాకు పల్లకిలో అయ్యను బెట్టుకొని
దక్షిణ (రేపల్లె) కు తెస్తినే తండ్రి!
మా తల్లికి మా అయ్యను తగనొప్పగించితిని
విద్దరు[27] గుండములోను ఇలయెల్ల వెరుగ[28]
కుమిలి స్వర్గమునకు కలసి పోయిరి వారు
కళ్యాణిన ఉండంగ కరకంఠు భక్తుడు
యలమంచికి వచ్చెను యాడాది నాటికి
యాడాది దినములు వెళ్లక తొలికే[29]
పల్లికొండ మానూటగ పట్టాం గట్టెను
బసవన్న పంపున వీరకంకణము
పశువులలో గట్టిన పల్లికొండయ్య
తనతోను ముగ్గరు[30] తగ ప్రధానులును
మల్లుభూపతి సుతుడు మర్ల పిన్నయ్య
కటిల నందుల సింహము ఘనుడు పోలినీడు

27. ఇద్దరు; 28. ఎరుగ; 29. వెళ్ళకమునుపే; 30. ముగ్గురు.

తనతోని ఆగంగ తరుణి పట్టంబు
సన్నాసి పట్నముల్ మాకు గట్టినారు
ఆదివిష్ణుకు దెలిసి ఆ మరునాడు
అనంతుడిచ్చిన త్రిశూలము అందుకొని తాను
బ్రహ్మ విష్ణువు త్రిమూర్తులు పరగ సూపంగ
కాశిస్తళంబుకు కడువేగ వచ్చి
కాశిలో మోక్షములు కడువేగ జేసి
ఉత్తర దేశాన ఓ తండ్రి! వినుమ!
డెభైవేడు[31] దేవదుర్గములు ధేనువులు మేపితి
ముప్పైవేడు[32] కయ్యాలు గెలసి ముర్తాలపంపున
ఆరువైయారు కరపటాముల వార్ని అతముగా[33] జంపి
అక్కడ నతిఘోర యుద్ధంబు జేసి
మారుభాష కత్రీడు మనెరాజును మహిమీద పొగిడించి
వరములూ నైదూను వరుసతో నడిగి
సింహాద్రిరాజు పగవాణ్ణి చీరివేసినాను
పెద్దిరాజు పగవాణ్ణి బింకంబణచి
యరనూకరాజు పగవాణ్ణి యాపణంగించినాను[34]
నలనూకరాజు పగవాణ్ణి నరికివేశాను
వచ్చినాను నీకడకు వలురాజసుతుడ!
కయ్యానికి నీమీద నాడు కదిసినవార్ని
ఇక్కడ నీ పగల నీడేర్తు నాతండ్రి!
విటలుతో కలసి యుద్ధము చేసినవార్ని
పల్లవాది రాజుల పరిమార్తునే తండ్రి!
కయ్యాన నిన్ను ఎదురించి కదసి పొడిచినవార్ని
కల్లుగా జంపుదును కస్తూరి సిద్ధిరాజును
నరనాథ నీతోడు నాడు వెదిరించినవార్ని
నలసిద్ధిరాజును నడికల్లిలో ద్రుంతును

31. డెబ్బదియేడు; 32. ముప్పదియేడు; 33. హతముగా; 34. ఏపు + అణగించినాను.

బల్లాలు మొనలు నీమీదికి పంపినందులకు
పాపసిద్ధిరాజును బారున పట్టింతు నే తండ్రి!
చెదరి కత్తుల యుద్ధము చేసినందులకు
యరసిద్ధిరాజును యేపణంగితు నే తండ్రి!
కూవలశిత్తండు మందమీద అంపవర్షము కురిపించినందుకు
కొమారసిద్ధిరాజును కూల్తు రణములోను
(వురవడి) నీ రక్తంబు వుబ్బి పారినందులకు
గండగోపాలరాజు శిరస్సును రణకల్లిలో ద్రుంతు
యేగురు సిద్దిరాజుల శిరస్సులు రణకల్లులో ద్రుంచి
బాగాదిగంగకు[35] నివ్వాళి పట్టింతు నే తండ్రి!
పోరాడి తిరుమందులను పొడిచినందుకు
క్షేమాన యెద్దులావులకు సెలవిత్తు నే తండ్రి!
మూనాళ్లు శివరాత్రి ముందు ఉన్నాదనగ
మళ్లి వచ్చి యర్రగడ్డపాటను మదమణతు నాతండ్రి!
చిత్రభాను సంవత్సరము చేరి కొల్తు నాతండ్రి!
పల్లికొండతో నీవు పలికిన ప్రజ్ఞ
చేకొని యరగడ్డపాటిన చెల్లింతు నే తండ్రి!"
గుగ్గిలపు రాసులు గొబ్బున పోసి
మహిసాక్షి[36] గుగ్గిలము మరివేగ నిచ్చి
పినతండ్రితో జెప్పి ప్రియములు బలికి

**-: కాటమరాజు పద్మనాయునితో కలసి చిలకమర్తిని, చెరుకూరును దర్శించి, అచ్చటి శివభక్తుల దీవెనలు పొందుట :-**

ప్రాకటంబుగ శిలకలమర్రి పరుమట నిలసిరి[37]
పశుపతి పద్మనాయుడు పాలకీలు దిగిరి
సింహాసనము మీద పరగకల గూర్చుండిరి
అపుడు జమజమాడిరి ఒక గడియ నపుడు

35. భాగీరథిగంగకు; 36. ఒకజాతి గుగ్గిలము, మైసాక్షి; 37. నిలిచిరి.

ఆ ప్రొద్దు నిద్రించి ఆ మరునాడు
మాతండ్రి పోలురాజు మన్నెతిరుమందులు
ముక్కంటి చోడాని మూకలతోను
అడికె యుద్ధము చేసిరి అరిమారులెరుగ*
యిడువక[38] పోట్లాడి చెరుకూర వీరులైనారు
చెరుకూరికి బోయి శీలమంతుల జూచి
భక్తులున్న స్థళము బాగొప్ప జూసి
సాలపాల తరములు సమర్పణ జేసి
శ్రీమల్లికార్జుని చూచినాయట్లు
శీలమంతుల జూచి వారి దీవెనలంది
చెరుకువాడకు పదమనె రాజు నలనన్న
గొనకొని యింద్రగోపు గుడార్లు బార్లు
నాగబండ్లపు నించె నలనన్న తాను
సకల సంపదలు సమకూడినంత
బారులు పెట్టె భరణాల సొమ్ములు
వురవున కావిండ్లు వుంచిరి శెట్టెలు
కొమ్ములు సన్నాలు కో....
..... సన్నాలు తిడివిష్ణ నగ్రలు
మందను గలయట్టి మైలబోడావులు
పిక్కలు సన్నాలు బిరుదు మాగోవులు
చెరుకువాడకు గోకులం చేరె నాపొద్దు
లింగముద్ర గుడార్లు నిండు గుడార్లు యెత్తించె రాజు
తీరైన రథమల్లెతీగ గుడార్లు
అదివెరిగి ముగ్గురు ఆదిమూర్తులైన
శీలమంతుల జూచి సెలగ ప్రార్థించిరి
ముందు మీయయ్య (.................)
యేలుచు చెరుకువాడ వేగురు శీలమంతులు

* "హరిహరులెరుగ" కావచ్చును; 38. విడువక.

కలియుగ శూరుని కావేరి వెట్టికి
పంపిన శీలమంతులు బాధలకు వెరచి
వెట్టి చేయలేక వేగంబె (వచ్చి)
పోలురాజు పొరుగు చొచ్చిరి వారు
పొరుగు చొచ్చిన వారిని మళ్లి పట్టియ్యక
..........................................
ఆ మాటగా మా అయ్య అంపె శ్రీశైలము
అటుగనుక వారి సుతులు (........)మారు
కరుణతో దయవుంచి కాచి రక్షించుడ
అనిన భక్తులు మెచ్చి అతివేడ్కతోను
తలచిన మీ పనులు సంతోషమేను
చెలగి మాదివ్వె నా శ్రీవిష్ణువెరు(..........)
(ఆనా)టి పగలు అతము[39]చేయమనిరి
మేలు దీవెన లిచ్చి మెరసి విభూతి
దీవించి నొసటను ధరియించిరంత
అయ్యలకు కొట్లాట అభివృద్ధి గావించిరి.

**-: కాటమరాజు తన ఆలమందలతో పాకనాటిసీమకు వచ్చి, భేరీలు మ్రోగించుట. నెల్లూరుకు తూర్పు దక్షిణ దిక్కులలో గుదారములు వేయించుట. నల్లసిద్ధిరాజు తన ప్రధాని సింకర్ల (చింకర్ల) భీమినీడును పంపుట. అతడు ఆలమందలను చెదరగొట్టుట :-**

అంచిత (ముగ మంద) అచ్చోటనుండి
అరెమాలు శెలికె అందుగుల బైలు
పొందుగా నిలిచెను బోడావులును
శిల్లమాను మేర శిరిగల నర్రలు
యల్లావుల మందలు యంచగల కదుపులు
(.......) నలగరాజు ఘనుడు
పశుపతి కవులావుల పదమనె పాకనాడు

39. హతము.

భూనాథు కవులావులు భూములు నిండెను
తుడుములు అగాతుట చేసిరి తుదిముట్టగాను
అరవైఆరు తమటములు ఆవుల మందలో మ్రోగెను
ముప్పైమూడు భేరీలు మునిమందలో మ్రోగెను
ధర క్రక్కటిల్లంగ కదిలె నారాజు
నలుదిక్కులు భేరీలు నాదులు గప్పి
(...........) రాలు పొసగ సన్నాయమూలు
కొమ్ములు ద్వానరించి[40] కొలువులో మ్రోగెను
ఆనందమై యాడె అష్టదిక్కులూను
నాదులు వినపడెను నలసిద్ధిరాజుకు
నాయకులు ద్వారాలు (.........)
(...........) (.............)
వినెను నలసిద్ధిరాజు వీనులతోని
(........) నలమోత పేర్కొని వినెను
"అదియేమి శోధ్యము[41] శింకర్ల భీమనా!
సోదరుల బంపి తెలసి ర"మ్మనెను
పంపిన వార (లు బహువేగపోయి)
కంపింపగా కవులావుల (కనిరి) అల్లంతట
చూచి ఆవులమంద చోద్యంబుగాను
మగిడి నలసిద్ధిరాజు కొల్వుకు మరియు నేతెంచిరి
"పల్లవ నలసిద్ధి! (పట్టాభిరామ!)
వినయముగ ఒక మాట వినుము చెప్పేము
పదివేల ఆవులు మందపశువులు కదుపులు
భూమెల్ల గప్పుకొనెను భూనాథుని మంద
యన్న బ్రహ్మకునై (న యంచగా తరమె?)"
(అదివిని) సిద్ధిరాజు ఆశ్చర్యమందెను
పన్నిద్దరు దళముల ప్రధానుల బిలిచి

40. ధ్వనియించి; 41. చోద్యము.

"బొమ్మినప తిమ్మనీడ! మరియు భీమినీడ!
గోవుల గాచేటి గొల్లరాజు వకడు
కంచిబీళ్ల చెలికలకడ ఆగెను కొర్మలు
అడ్డమంతము లేక ఆవుల మేపుచూ
పరగ మీ బలములతో పయనమై పోయి
మాను మెకము[42] (..........) మరిజింక పిల్లలా
విద్రుల పందుల యారాళముగను[43]
యాటలాడుచు[44] మీరు వేగంబె పోయి
పశువుల మల్లదోలి[45] పరగ ర"మ్మనెను
అంపిన వారంత అతి బలాధికులు
కంపింపగ వారంత కటమూతపడిరి
కనకంపు కాసెలు కట్టిరి వేగ
పటాకత్తులు బల్యాలు[46] కొంత
చిల్లకోలలు మంచి చిన్ని సురియలును
వుక్కుశివగడలును కోకబెదురులును
కేకలు వ్రేయుచు కెరలి పాడుతును
మూకలు వేసూరు మొన యేరుపరసి[47]
భీమినీడు యపుడు భేరి మోయించె
పన్నిద్దరు దళములు పోట్లాట వెడలి
దరము .......... వీడు దండి పలియగాము
తుడుములు అగాతులు తుదిముట్టగాను
పెళపెళ వచ్చి పేరెములు[48] బారుచు
అడవులలో మేసేటి ఆవులేగలను
తడబడగా తరిమి తర్లదోలిరంత
పోటుకూతలకు యపుడు బోడావులు

---

42. పులి; 43. హేరాళముగను; 44. వేటలాడుచు; 45. మర్లదోలి – మళ్ళించి తోలి (మరలునట్లు తోలి); 46. బల్లెములు; 47. వేరుపరచి; 48. పేరెము = గుఱ్ఱపు పరుగు.

బోయగాలికి యావులు పోగులై నిలిచెను
ఆశిపాన యెద్దులు దిమ్మెలు గట్టెను
కడుమాంచి గోకుళము గమికూడి నిలిచెను
పొగరుబోయిన కోడెలు పో(డిమిగ నిలిచె)
నఠావులు బోడావులు నందిజల ఆవులు
కనిమాయలు వెలసి కవులావులు నిలిచె
నెల్లూరికి తూర్పు పరగ దక్షిణాన
పంచవన్నెల గుడార్లు పట్టుటెక్కములు
మరివేగ మంచి యరపట్టు గుడార్లు
బాగుగా నెత్తించిరి పశువుల నడుమ
యల్లగుడార్లు మంచి వేడ్కమీరంగ
ఇరువైఆరు స్తంభాల విష్ణుముద్ర గుడార్లు
త్రికూట గుడార్లు తిరుమందులు ఎత్తించిరి
అరువైఆరు స్తంభాల అమృతాల భారి గుడార్లు
నడిమందలో నెత్తించె రాజు నలనన్న
లక్ష కంపటము(ను) రాజు రాఘువుడు
రత్నాల తమకము మీద రాజు గూర్చుండెను
యఠయ్య, సట్టువారి వెఠయ్యను[49](వచ్చి)
(అన్న) కాటమరాజుకు వేగంబె మ్రొక్కిరి
"అన్న కాటమరాజ! అతి పరాక్రమశాలి!
సత్యలోకదీక్ష! సంపూర్ణచంద్ర!
మలప్రాంతాల యందున మనధేనువులు మేయ
(.........) భీమినీడు మొదలు
కదలివచ్చి యెద్దులావుల యేకంబు జేసిరి
బారమాకు సెలవిమ్ము మాధవునలనన్న!"

49. చట్టువారి ఎఱ్ఱయ్యను.

**-: కాటమరాజు భీమినీడును తోడ్కొనిరమ్మని పద్మనాయుణ్ణి పంపుట.**
**భీమినీడు తన బాల్యస్నేహితుడని పద్మనాయుడు గుర్తించుట.**
**ఇరువురును ముచ్చటించుకొనుట :-**

అనిన తమ్ముని మాటలకు అరుషంబు నొంది
"వినవయ్య తమ్ముడ! (విశదంబుగా) ను
పులినోటి కండ పుచ్చుకోవలెను
కాలకోటి విషము గర్భము హరించి
పాముకోరల విషము పట్టి త్రాగవలెను
కోపంబు వేలను[50] గుణవిశాలుండ!
తోడుత నేనెట్ల నీ తోడ రద్ది వద్దు
అయ్యనాటి పగలు పాలేట అతము చాయవలెను[51]
కలహపువి దొడ్డ పనులు కూడదు మీకు
తత్తరపడనేల తాళుకోవలెను
వారిని పోషించి (..........)
కర్పూర విడియమిచ్చి కస్తూరి అలది
చాల మనవిగా జెప్పి సంతోష పరచి
కదు వేడ్కతో ముందు వెస కార్యమున్నాది
పద్మనాయుడు నీవు పర్వునేతెంచి
భీమినీనికి (మంచి) బుద్దులు జెప్పి
తోడుకొని రమ్మనెను తగు వేడ్కతోను"
అనవిని పద్మనాయుడు అరుషంబు నొంది
పైడి ఆనుల[52] పాలకి పద్మనాయుడు ఎక్కెను
పాలకి విరుగడల (ప్రధా)నులు గొలవంగ
యెలమితో బలాఢ్యుల మూకలతోను
జల్లుల ఘడపలును సర్వచానలును
విండ్లు అంబుల పొదులు పూనజల్లులు
ప్రాకారితిగా నాయుడు విరాపలి యా(పరివా)రమంతయు

50. ఏలను; 51. హతము చేయవలెను; 52. ఆనులు = ఊతకఱ్ఱలు.

ముగ్గురు నాయకులు ముష్టి ముమ్మినీడు
భీమినీనిని నాయుడు ప్రియముతో జూచెను
అందలాలు పాలకీలు అచ్చట దిగిరి
ముందుజేసిన చలము మొదలంట వెలిగి
అనువర్తాకు మని(........) అపుడు మరునాడు
కలబందసాయము కలసియు డావలు
అలనాటి సంగడము అట్టె పోయెననక
"పిన్ననాటి సంగడము ప్రియము చేకొనుము"
అనిన భీమినీడు అందలము దిగె
పన్నిద్దరు దళములు పాలకీలు దిగిరి
కడనుండి నిటసూండి కడు మాందవించి
"యేనాటి సంగడము నాయుడ యెరుగుట లేదు"
విని పద్మనాయుడు అరుషంబు నొంది
"కూడియుండిన మనము గురుతు చెప్పెదను
గుత్తపు గుడివాడ కూడియున్నాము
నిత్యము గాజుమజమాడుదుము నెరిదప్పకుండ
నకెరేకల్లు మా తాత నాగినీడు వేలు[53]
చల్లగుండ్ల విప్పర్ల నాగినీడు వేలు
సాలగ్రాముతో సాలు గ్రహమూలు
మా తండ్రి పోతినీడు నయమొప్ప వేలు
కటార్ల బొల్లారము కానాచి మాది
యేలూరు బెందులూరు యేలువడిమాది
భీమినీడ! మనది శినావ పిన్ననాటి సంగడము
నిండు వెన్నెల గాయంగ నీవును నేను
పారుశిడు లాడుదుము బంతులాడుదుము
పిల్లదీపులాడుదుము పర్వులురుకుదుము
సంగడీలు మనము చాలురావుల నీడన

53. ఏలు = పాలించు.

బొంగరాలు ఆడుదుము ప్రొద్దుట వేళ
వామనగుంట లాడుదుము వొద్దు బిళ్లలును
తండ్రిగాయాడుదుము తగ వేడ్కతోను
వింతగా కూడియుంటిమి ఈ వేళ భీమన!"
అనిన భీమినీడు అరుషంబునొంది
"నాయుడా! నీ భూమి నరులెవ్వరికిని
అసాధ్యముగాదు సుమ్మీ సత్యము మాట"
గారవంబున యిద్దరు కౌగిలించుకొనిరి
వొద్దని బోయిలకు బుద్ధులు జెప్పెను
రమ్మని పిలిచెను రాజు ప్రధాని
పన్నిద్దరు దళములు ప్రధాని భీమన
యాదవులు పద్మనాయుడు పరివారమంతయు
కొలువుతీర్చి కూర్చుండిరి గొబ్బున తివాసీల మీద
భీమినీడు నాయనితో ప్రియములు పలికెను:

**-: భీమినీడు ప్రశ్నింపగా, పద్మనాయుడు తాను కాటమరాజుగారి ఆలమందలలో నుండుటకుగల కారణమును, పాకనాటికి వచ్చుటకుగల కారణంబును వివరించుట. ఇరువురును కలిసి కాటమరాజు కొలువుకు వచ్చుట. కాటమరాజు వైభవ వర్ణన:-**

"ఆవుల గాసేటి యివరమెట్లు నీకు?
విచ్చోటకు[54] రాను కారణంబు యేమి?
వచ్చెను భూములు వెలుపలా తొల్లి
తల్లిదండ్రుల విడసి* దాదుల విడసి*
సుట్టాల బంధువుల సుతులను విడసి*
ఘనుడ పశువులగాయ కారణంబేమి?
యీ వార్త నాతోని విన్నవించినయడల"
"విను భీమినీడ! వృత్తాంతమంతయు

54. ఇచ్చోటకు; * విడిచి.

తొల్లి వరించి దేవతలపుడు
అటుగనుక మాతాత ఇప్పర్ల నాగినీడు
గోహత్య ఒకకొంత కొలను చేసి ఉండెను
మా తండ్రి పోతినీడు మరియు కొన్నాళ్ళకు
గోదావరి కృష్ణ లోపల ఆవుల దారలోసెను
అని యొక బ్రాహ్మలకు[55] అత్యబాసె కొడుకు
ఆవులమంద రాజుతోను యెత్తుపొత్తినాను
బోంచేస్తిని నేను వినియ కొన్నాళ్లకు
పట్టితిమోయి సంగడము ప్రధాని భీమన!
చప్పన్నదేశముల్ సపురదుర్గములు
అక్కడ రాజులకు అప్పనము (లిచ్చి)
పశువుల మేపితిమి ప్రఖ్యాతి గాను
వుత్తర దేశమున సత్యాన మేపి
వస్తిమి పాకనాడు వో! శింకర్ల భీమన!
మందనావులకు కర్త మా మాధవుడు నలనన్న
సన్నాసి పట్నాన స్వామిని జూసి
మళ్లి వత్తురుగాని మరియు ర"మ్మనెను.
ఆమాటకు భీమినీడు హర్షంబునొంది
వరుసతో అందలాలు వైనాన యెక్కిరి
నాయుడు ముందురా నందరుగూడి
(ఇంపైన) అందలాలు యెక్కి వేతెంచిరి[56]
పశుపతిని పొడగాంచి పాలకీలు దిగిరి
కని నమస్కారము జేసిరి కాటమరాజుకు
ఆ రాజు వర్ణంబు అదియెట్టి దనిన
మిక్కిలి కళలందు మీరిన రాజు
చక్కదనముగల సౌందర్యశాలి
చక్కని ముఖబింబము ఆరాజచంద్ర

55. బ్రాహ్మణులకు; 56. ఏతెంచిరి.

కాంతియు రఘురాముకళలుగల రాజు
చంద్రబింబముగల వింద్ర[57] చంద్రుండు
కందరము చవుకట్లు కర్ణములు మెరియ[58]
యింద్రనీలపు అజుడు యింపు సొంపైన
తరుపున జంజాంబు వుంగరాలూను
కమరమున[59] కెంపులు దాపిన రత్నాల హారములు
తలను కిరీటంబు దగ దగ మెరియ
సుక్కలు దాపిన సూర్య కిరీటంబు
మక్కువతో కన్నులకు మరి మెరియగాను
కరముల చామపూ కడియములు మెరియ
బంగారు చెరుగుల పట్టు పచ్చడములు
భుజపరాక్రమశాలి భూరి వల్లభుడు
రత్నాల తమకము మీద రాజు కూర్చుండె
క్షేత్రాచ బలగములు చేరి కొలువంగ
చెలి వింజామరల సేవలు సేయ
యేటు రూమాలలు వింజామరములు
పాటించి (.......) అభిషేకము సేయ
అనంత దర్పదనము ఆవులుగల రాజు
కాటకోటేశ్వరుండు కాటమరాజు!

**-: కాటమరాజు భీమినీడును సత్కరించి, సిద్ధిరాజుతో చెప్పి పాకనాటి భూములను పుల్లరికై తమకు ఇప్పించుమని కోరుట. అతని సలహాపై పద్మనాయుణ్ణి కొంత సేనను నెల్లూరికి పంపుట :-**

మన్నీల భీమినీణ్ణి మరియు చిమికిణ్ణి
తాను చేరబిలిచి దయతోడ పలికె
కర్పూర విడియములు యిప్పించె ఘనుడు నలనన్న
"పన్నుగా యీ భూమిని పష్యులకు[60] మేపులు

57. ఇంద్ర; 58. మెఱయ; 59. కమరు/కమరి = ఒడ్డాణము, మొలనూలు; 60. పశువులకు.

కలవని చెప్పిరి గవిరీలు మాకు
గవిరీల మాటలకు కీడు దొడ్డి గుడిపి
విముక్తితోను యిక్కడికి వస్తిమి
యెద్దులావులకు గాను వెన్నెకతో[61] ధనము
యెంత గావలసిన యిచ్చేము గాని
సన్నాసి పట్టపురాజును చప్పన చాయకుమీ
కొండంత ధనము ఇత్తుము గోవులకొరకు
తప్పు లేకుండ తగ కమ్మలిచ్చి
పంపుడి మీకు మాకు పత్రికలిచ్చి!"
వారికి కట్నాలు వరుసతో యిచ్చి
తశిరీబులు గప్పించి సంతోషపరచి
అనిన భీమినీడు ఆరాజుతో ననియె:
"ఓ రాజశేఖర! ఓ పట్టభద్ర!
వినయముగా నామాటలు విను కాటమేశ్వరా!
ప్రొద్దుటవేళ తర్లిపొయ్యేము రాజ!
మావి పనులకు అన్నిటికి మేము
మందగోపాల మన్నీలాల[62] కొంత మూకజేసి పంపించు
ఆపాటికి మేము మక్కువతో పోయి మాటలాడెదము"
మరియు సంతోషించి మాధవుడు నలనన్న
పొమ్మని సెలవిచ్చె భూనాథుడపుడు:
"మండల ధరుండు మందగోపాలుండు
యాకర్ల యామన, యల్లావుల సోదన,
అనంతకోటి యాదవులు, ఆ పద్మనాయుడు,
పైనమై నెల్లూరు పట్టణముకు మీరు
సిద్ధిరాజు పొడగాంచి బుద్ధిమంతులార!
అడిగినంత పుల్లరి అతనికి వప్పించి
మళ్లి ర"మ్మని వారిని మరియు నంపించె

61. ఎన్నికతో; 62. మన్నీలను = రాజులను.

మంచిదని వచ్చిన మందకంపటీలు
విందులు భోంచేసిరి మందలోపలను
అందలాలు యెక్కిరి యపుడు యాదవులు
పైడియంచుల పాలకి పద్మనాభుడు యెక్కెను
సొస్తవిడి పన్నిద్దరు బెస్తబోయలు మోయ
గాజు విల్లులందెను ఘనుడు పద్మనాయుడు
మొనచేసి కదిలెను మూకలతోను
వెలలేని రణభేరి వేయించె నాయుడు
పుడమి యావులమందకు పుల్లాలు వప్పను
గొల్లలు ఇరువంకల గొలచి రాగాను
తొమ్మిదివేల మూక దొరకొని నడువ
బల్యాలు విలుమూక బాకు జముదాళములు
కదిలేను మొనకత్తి కరవాలమూలు
వీటెలు బల్యాలు యినుప రాగోలలు
పన్నిన జముదాళములు బలు కత్తులూను
కోకల దిండ్లూను కోర కావిళ్లు
పోకలు కట్నాలు ఆకులు మొదలు
యిరివి గదిలెను ఇంజామరములు
వుదయాద్రి నెల్లూరు వూరి ముందరను
డెబ్బైయేడు వైభోగములతో తేజముతో నాయుడు
తమకము సేవించె తమ బలములతోను
పొందుగా నెల్లూరు అందలాలు పొసగంగ నెక్కిరి
సూర్యాధిపతులతో సొచ్చిరి నెల్లూరు.

**–: ఈ యాదవులు తనతండ్రి ముక్కంటి ఈశ్వరుని చంపిన పోలురాజు వంశమువారైతే సిద్ధిరాజు భూముల నీయననుట. భీమినీడు, తిక్కనమంత్రి "నీకెదురెవ్వరు?" అని ధైర్యము చెప్పుట. సిద్ధిరాజు అంగీకరించి పుల్లరి గట్టిచేయుమని తిక్కనతో చెప్పుట :–**

అప్పుడు నెల్లూరులోన ఆ సిద్ధిరాజు

నెమలిపురి కన్నుల నల్లమేడలోను
ముత్యాల గొడుగులు ముదమొప్ప వేయు
అలాపట్లమూలు అరువదివేలు
వింజామరములు వెలయు నొకలక్ష
పసిడిబద్దలవారు పదివేలు గలరు
వెండి బద్దలవారు వేయినొకలక్ష
పట్టపురాజు సరసన పాపసిద్ధిరాజు
కోర్కెరాంగుల సవికె కొల్వుకూటములు
కొమారసిద్ధిరాజు కొల్వుదీర్చి ఉంటేను
మనుమసిద్ధిరాజు మండలాపతియు
దండి పరివారముతో తగ కొల్వుదీర్చెను
అప్పుడు పన్నిద్దరు దళవాయులతోను
ముందర బజంత్రీలు మూకలతోను
మెండుగా వాద్యములు మొగవీణెలు మ్రోయంగ
ప్రధాని భీమినీడు పర్వునేతెంచె
ఘనవేగ రాజుకు కరములు మొగిచి
రయమున నలసిద్ధిరాజుతో ననియె:
"భూపాల నలసిద్ధిరాజ! పట్టభద్ర! వినుము
పన్నుగా యాదవులు పావరుగొట్లు
యన్నరాని గోకుళము యేతెంచె మన భూమికి
శేషాధిపతులకు శీగ్రమే[63] నేడు
మేల్మిగా పైకాలు ముల్లెలు గలిగె"
అనియిట్లు భీమన యా రాజుతో ననియె
వినయముతోడ పద్మనాయుడు వీరపరివారము
వచ్చిరి నలసిద్ధిరాజు వసుధేశు కొల్వుకు
అర్జునివలె పద్మనాయుడు తా నిలచె
అగ్రువంచి చేతులు హస్తములు యెత్తక

63. శీఘ్రమే.

(వెరిగొట్లుమూక) వెయ్యివేలు గూడి
కప్పిన గొంగళ్లు గొడ్డళ్లు భుజమున
కొండదుడ్డుకోలలు గుండ్లు పేరులును
దొంటళ్లో వంకకత్తులు వడదొళ్లు మరియు
అరగవూ గొడ్డళ్లు అందరు మరియు
పూని చేత దుడ్డుకర్రలు పూనుకొని రంత
పలువారు సాదిరి నవ్వ కన్నులను
తలను రుమాలలు దట్టికోకలును
అడ్డెకర్రలు మంచి గొరకయంబులును
దొనకొని కంపటము దురితంబు జూచి
అవనీశు సిద్ధిరాజు ఆడెనొకమాట:
"పరికింపలె నాటి పగతురు (వీరు)
అందలాలు దిగరైరి ఆర్రు వంచరైరి
పాలకీలు దిగి పాగచెరగులు విడిచి
రాచమ్రొక్కులు మ్రొక్కరైరి మనకు
రాజుల కొల్వుకు రాగూడదు వీరు
యేనాటి గొల్లరాజులు వెరుగంగ రాదు
ముందు మా తండ్రి ముక్కంటి ఈశ్వరుడు
పోలురాజు అనువాడు భోగదేవేంద్రుడు
అతనితో పోరాడి మా అయ్యలు చెల్లిరి
వారి వంశము అయితేను వద్దు మన భూమికి
చీమపారు సత్యము గద్దు చింకర్ల భీమన"
భీమినీడు ఒక మాట తిన్నంగ సెప్పెను:
"అవును సిద్ధిరాజ! అన వెరతునుగాక!
వెరపు మరపులేక మనభూమికి వీరు
నీ యెదుటికొచ్చినారు యెరుగక వారు
మన్నె గజపురాజ! మనకెవ్వరెదురు?
ధరయేలు యీ భూమికి ధన్యుడవు నీవు
యెన్నంగ యీ భూమికి యెదురెవరు మనకు?"

మరియు తిక్కన ప్రెగడ మండలవిభుతోడ
మనవి నలసిద్ధిరాజుతో నిట్లనియె:
"చూచితే కనరాదు సుగుణాత్మతనము
మక్కువ వెర్రిగొల్లల మాటలతీరు
మలయ శుభములు మందలు చేరి
అక్కడ భూములు ఆవుల మేపి
లెక్కలేక ధనము (రొక్క) ములు యిచ్చి
ఆదరించుకుందురు ఆవులనెల్ల
మొగులు పిడిగొల్లలు అగపడిరి మనకు
గొల్లమీది పుల్లరి గోగుమీది బచ్చలి
గొల్లని మీది పుల్లరి కొట్టిన పిండిపొట్టు
ఆకుమీద వ్రాత పడితె అప్పిదము పోరాదు"
అనిన తిక్కన మంత్రి యాడుమాటలకు
నలసిద్ధిరాజు యాపద్మనాయుని జూచి
"యేసీమ? యేకులము? యేభూమి మీది?
ప్రాకటంబుగ మాతోను పల్కుడీవేళ"
నల్లసిద్ధిరాజుతో యాపద్మనాయుడు
"బల్విడ నలసిద్ధిరాజ! పట్టాభిశేఖర!
ఉత్తరకాశి భూమి ఉన్న స్థళంబు
శ్రీ విశ్వనాథుని సేవలు మేము
యన్న[64] కాశిరామేశ్వరం యేలువడి మునుపు
ఉత్తర దేశంబు కాణాచి మాది
అక్కడ సేవించి ఆవుల మేపుతును
కటకంబు నుండి గడ్డి నీళ్లు గలవని
అక్కడ స్వామిని అతిభక్తి గొలిచి
డెబ్బైయేడు దేవదుర్గములు ధేనువుల మేపితిమి
అంబిట్ల కోనను ఆవుల మేపితిమి

64. యెన్న.

ఆరుద్ర పునర్వసు అన్ని కార్తెలు వరుసను
మహాత్యమైన చంద్రకాలము[65] ఆవులమందమీద వచ్చెను
పరగ దక్షిణాదిని పశువులకు మేపులు
కలవని చెప్పిరి గవిరీలు మాకు
గవిరీల మాటలకు కంపటము మేము
వస్తిమి నీకడకు వో సిద్ధిరాజ!
కొండలు మలలందు కొదవలేని పూరి[66]
అడిగినట్టిచ్చేము అప్పనము[67] పుల్లరి
కొట్టడికి ఆవుల కోడె నిచ్చేము
పదిపుట్ల నెయ్యి పరగ నిచ్చెదము
ఆదరించుడి మమ్ము అది మీకు మేలు"
అనిన సిద్ధిరాజు అరుషంబు నొంది
పట్టుతివాసీలు పరిపించె నపుడు
వేదపురోహితుల విద్వాంసులాను
పండువెన్నెల వలెను పరివారమంతయు
దండి చానలూను తగినట్లు దొరలు
నాయకులు ముగ్గురు నరపతులు కొంత
యాదవ కులజులు యాపద్మనాయుడు
పట్టుతివాసీల మీద పరగ కూర్చుండిరి
గంధం కస్తూరి కలపి గిన్నెలను
వైనాన అందరికి వరుస నిప్పించెను
తిక్కన మంత్రిని పిలిపించె నపుడు
పుల్లర్లు గట్టిచేయమని భూనాథుడనియె

**-: యాదవులు అమాయకులు కదా అని భావించి తిక్కనమంత్రి, సిద్ధిరాజు, అతని తమ్ములు గొంతెమ్మ కోర్కెలు కోరుట. దేవుళ్ళకు, తమవారికి ఎన్నో వేల, లక్షల వరహాలను పుల్లరిగా నిమ్మనుట. పద్మనాయుడు ఎంతో ఓర్పుతో అన్ని నిబంధనలకు అంగీకరించుట :-**

---

65. కఱవుకాలము(?); లేదా "శంబరకాలము"=వర్షాకాలము; 66. పచ్చగడ్డి; 67. కప్పము, కానుక.

అనిన తిక్కనమంత్రి అప్పుడేమనెను?
"విను పద్మరాఘవ! విన్నవించెదను
నిత్య ప్రపన్నుండు నీలకంఠుండు
కన్నులు మూడును కల్గిన స్వామి
మూడువేల వరహాలు ముందుగా మీరు
అప్పనము ఇవ్వగలర యాదవరాజ?"
మంచిదని పద్మనాయుడు మంత్రితో ననియె:
"మూడు కన్నులు గలవాడు ముక్కంటి ఈశ్వరుడు
మందను వున్నాడు మా యిలవేల్పు
ముందుగా నిత్తుము మూడువేల వరహాలు
కవిలెను వ్రాయించు ఘనుడ తిక్కనమంత్రి!"
"శివునంకమూర్తి సిద్ధగణేశు
బుద్ధులకు పెద్ద విద్యలకు గురువు
మద్దిల తాళలకు మాస్వామి యతడు
వడ్డికతో ఆరువేల వరహాలు ఇవ్వగలర?"
అడిగిన నాయుడు అప్పుడేమనెను:
"కర్ణములు తెలుపు కరములు నలుపు
నాగజందెపు బొజ్జ నమ్మిన స్వామి
వడ్డికతో ఆరువేల వరహాలు మేము
గణనాయక పూజకు ఘనుడ ఆరువేలు
యివ్వగలము వ్రాయించు ఇది యంతలోది"
"పల్లికొండ పెరుమాళ్లు ప్రత్యక్షవేల్పు
మథురలో చాణూర మల్లులా బట్టి
సందుగొందులు పెనగి తగజుట్టె యతడు
మామగండమున బుట్టి మథుర లోపలను
కంసుని పరిమార్చి ఉగ్రసేనునికి
పట్నము గట్టిన పల్లికొండయ్య
నందుని సుతుడైన గోవిందమూర్తి

పణిరాజు శయ్యపై పవళించు ఘనుడు
పధ్నాల్గు భువనములు పాదుకొని నిల్పను
వటపత్ర శయనుండు వైకుంఠపతియు
సతనిత్య దేవుని సర్వేశ్వరునకు
ఆటపాటలాడు మేటి విద్యాసేవకు
గరుడ పాలకిసేవకు ఘనుడ పద్మనాయుడ!
పాతకానికి మీరు పన్నెండు వేలు
స్వామికి కానుకలు సమర్పించగలర?"
కలకల నవ్వినాడు ఘనుడు పద్మనాయుడు:
"ఆయన యిలవేల్పు ఆది విష్ణుండు
కపిలావు గన్న గరుడు బొల్లావు
నరసింహ హనుమంతు నారాయణుండు
ఆదివిష్ణువు మూడు రూపుల ఆవై జన్మించెను
పాదముల్ జూడగా ఫణిరూపు వుండు
హరిభక్తులము మేము అవనెల్ల వెరుగ[68]
కొని యన్నరాదు కంపటము మాకు
అడగవోయి ఇది యంత అడిగియు రాజ!
విదియంత[69] ధనము యిచ్చేము రాజ!
కవిలెలు వ్రాయించు ఘనుడ సిద్ధిరాజ!"
మరియును సిద్ధిరాజు మండలేశ్వరుడనియె:
"సంగమేశ్వరుడు మాస్వామి యున్నాడు
ఆరువేల వరహాలు అర్పితము వ్రాయగలర?"
"నిత్యజన్నావు కోడె మచ్చుల బసవన్న
అభయమిచ్చి మమ్ము నాదరించినాడు
ఆరువేల వరహాలు అదియంత గనత[70]
కవిలెలు వ్రాయించు ఘనుడ సిద్ధిరాజ!"
"గురుతు విరుగుల గుళ్లో స్వామీసుకు[71]

68. ఎరుగ; 69. ఇదియెంత; 70. ఘనత; 71. స్వామి + ఈశుకు.

చిల్లర శక్తులకు సిద్ధి స్థళంబులకు
పదివేల వరహాలు ప్రాతరూకలివ్వగలర?"
"నూటొక్క శక్తులు నుర్వీశుని మంద
కాపాడు చుందురు (ఘన సిద్ధిరాజ)
అదియంత ఘనతయ్య ఆకునా వ్రాయించ"మనెను
కస్తూరి సిద్ధిరాజు ఘనుడు ఇట్లనియె:
"కొండలమీద పూరి కొదువలేదు రాజ!
దండి మందలకైన తరగదు పూరి
వరుస మేపులు గడ్డి వున్నారీతి
పిల్లిమీసం అలము కొల్లగా గలదు
(........) అలము కడగురుతు లేదు
హేమాద్రి గలదు ఎందు చూసినను
కులగిరి గట్లు(ను) కుంభిణీయందు
అదిమేయ గద్దు మీ ఆవులు యిపుడు
సద్దణిగి యున్నాది సముద్రము వలెను
వద్దన లేదయ్య వోపినంత పూరి
పరుమట సముద్రమువలెను పరగ మన భూమికి
కంచి శ్రీరంగము ఘనుడ మా వశము
దక్షిణ సముద్రము తగు శంకు బంధు
ఆడ మలమైను అవి మా వశము
మొవ్వగిరిసాల మొదలుకొని భూమిని
గుత్తిమేపగద్దు మీ గోకుళము నాయుడ!
నిన్న మొన్న వర్షములు మహా మెరువగను
కడు చెరువులు నిండి కైదొట్టినవి
నీళ్లకు యెద్దడి లేదు నీతోడు నాయుడా!
పరుమటి కొఱ్రులు నిండి బైలెక్కి వున్నవి
దండి చెరువుల నీళ్లు తరగవు నాయుడ!
నాయకమైన మా నలసిద్ధిరాజుకు

నాలుగులక్షల పదివేల పదార్థములు
యివ్వగలరా పద్మరాఘవేశ్వరా?"
"నేను నా పతికి అరుషంబు నొంది
సక్కని మా నలనన్న సర్వభూషుండు
అక్కరపడ భూమికి అతడు వేతెంచి
వొచ్చియున్నాడు యాదవవంశశేఖరుడు
సాలినంత ధనము సదా లక్షలైన
తుల్వణముగా[72] జూచును తుదియందు రాజ!
కవిలెను వ్రాయించు ఘనుడ తిక్కనమంత్రి!"
మరియును పద్మనాయునితో ననియె
యరసిద్ధిరాజగు పుణ్యశాలి (యపుడు):
"పాలెలు, దుర్గముల్ పల్లెలయందు
మిట్టను గుళ్లు మిగుల చెర్వులును
కట్టించిన యతడు ఘనపుణ్యశాలి
యనభై నూట తొంభైవేల వరహాలు
(.....) యివ్వగలర వెరసి సిద్ధిరాజుకు?"
"అనుజుడు నలనన్న యారాజుకు తమ్ముడు
పేరైన కులజుండు పెయ్యల యర్రయ్య
పన్నెండువేల బసవముద్ర యెద్దులు కలవాడు
పల్లెపట్నము (లందు) ప్రబలినవాడు
కంపటము ఒక మాట కద్దులేదయ్య
యంత్రమాత్రము అడిగితివి యరసిద్ధిరాజ!
ఆకున వ్రాయించు అదియంత ఘనత!"
"పాపసిద్ధిరాజు అక్షోణి[73] బలములకు నేత
నిప్పు – అర్థముకు నీతిమంతుండు
పూర్వమందు అతడు మహాపుణ్యశాలి
పట్నంబు మీద ప్రజలు అతని వశము

72. తృణముగా; 73. అక్షౌహిణి.

కోటసంపదయందు కొదవలేని ఘనుడు
అలుసును కొర్రలు అత్తిముగ పండ్లు
(........) దించిన యెట్టె సంగడవులును
కొండల వయ్యాళి[74] కొదువలేని పూరి
పదివేల వరహాలు పట్టగలరా కానుక?"
"అధికుండు సట్టవారి అట్టె మారినీడు
మారినీడుకు పుత్రుండు మన (......)యతడు
వడ్డె పెనుగులకు వైరి వసుమతి రాజు
సట్టవారి యర్రయ్య మహా సాహస ఘనుడు
అరునూరు అనుమంతు[75] మోర యెద్దులు అతని వశమున గలవు
సాలినంత ధనము యిప్పించగలడు
కమ్మలు వ్రాయించు ఘనుడ తిక్కన మంత్రి!"
"గోపాలసిద్ధిరాజు గోగణమూర్తి
యాపతులతోను పోరాడ గలడు
నేపాళ భూపాళ గోపాళ సిద్ధిరాజుకు
లక్షమాడలు తెచ్చి రాశులు పోయగలరా?"
"యంతలోది యీమాట యంత ఘనమయ్య
రఘురాము తమ్ముడు రాజశేఖరుడు
వెలియ యాదవులు అతని వశమున గలరు
కవ్వానికి ఒక మాడ కసుక లేదు
అడుగుడి యంత తొడెము అడిగితివి రాజ!"
"కుమారసిద్ధిరాజు కుంభిణీశ్వరుడు
యేడులక్షల గుర్రాలు యేనుగులకు కర్త
అధికమైన భూమి అతడేలుచున్నాడు
ఆడి తప్పడు యతడు అతి పుణ్యశాలి
(పలికి) బొంకనియట్టి పరమ పుణ్యుండు
కొమారసిద్ధిరాజు కోరినంత ధనము

74. వయ్యాళి = స్వారి, విహారము; 75. హనుమంతు.

యివ్వగలర వకలక్ష యివ్వేళ మీరు?"
"పశుపతిరాజు అన్న బాలచంద్రుండు
సల్లవారి[76] పిన్నయ్య సత్యచంద్రుండు[77]
అతని వశమున చక్కని ఆవులు గలవు
వెంకటాద్రి అచ్యుతు వెలయ కోనేరు
అతని తమ్ములు నల్గురు అతి బలాధికులు
వెసగ నూరువేల యల్లావులు గలవు
యసగంగ ఒక లక్ష యంత మాత్రంబు?
కవిలెను వ్రాయించు ఘనుడ తిక్కనమంత్రి!"
భీమినీడు నాయినితో ప్రియములు బలికెను:
"రక్ష కరణము తిక్కన రాజులకు మంత్రి
తిక్కనమంత్రి వశమున వీరు కరణాలు
ఆరు లక్షలిపుడు (ఆకురాసే కరణముకు)
ఆకురాసే కరణానికి ఆరులక్షలిపుడు
యివ్వగలర పద్మరాఘవ! యీ వేళ మీరు?"
"బ్రాహ్మణుండు మాకు బహు చరిత్రుండు
బ్రాహ్మణుండు మాకు భాగ్యముల కుప్ప
బ్రాహ్మణుడు దానాలకు బహు పుణ్యశాలి
బ్రహ్మయ్య* వశమున పదివేల ఆవుల మంద
కలిగియుండును అతడు ఘనుడు బ్రహ్మయ్య
తరతరము బ్రతుక మన దానంబు యిచ్చును
కవిలెలు వ్రాయించు ఘనుడ తిక్కనమంత్రి!"
"బొడ్డుగల కోడెల భూదికి యిపుడు
అడిగినట్లు ఇవ్వగలర యాదవరాజ?"
అనిన విటునవ్వి యా పద్మనాయుడు:
"బొడ్డుగల కోడెలు పొసగ మీ సొమ్ము
నీళ్లను బుట్టిన పూరి నీ సీమలోను

76. చల్లవారి; 77. సత్యసంధుండు; *"బ్రహ్మరుద్రయ్య"–చల్ల పిన్నమనీని మంత్రి, శైవబ్రాహ్మణుడు.

మాదని పలికిరి మంద కంపటీలు
కవిలెను వ్రాయించు ఘనుడ తిక్కనమంత్రి!"
అందుకు సిద్ధిరాజు ఆశ్చర్యమొందెను
"తల్లేగురు[78] సిద్ధిరాజు తరుణులందరికి
యిపుడు పశువుల పొదికి ఇవ్వగలరా వనము (వరము)?"
"రామచంద్రుని వంటివాడు రాజు నలనన్న
సన్నాసి పట్నాము గట్టిన సతుల వర్జితుడు
అప్పచెల్లెళ్లు రాజు సలను ఐదవుల నేల
అప్పచెల్లెళ్లకు అరణము యిచ్చినయట్లు
పదివేల వరహాలు పట్టుమని యిచ్చును
శెరశితి మరశితి మనక యనకటి బుద్ధులు
మతియందు దలపోసి మనసున వుంచక
అడగవలసిన ధనము అడుగుడా మీరు?"
"మా యేనుగుల కోర్నులు మీ నవ్రావులు మెయ్య గద్దు
గుర్రాల కోర్నన మీ నవ్రావులు మేయ గద్దు
మేలని యిస్తిని మెత్తన పూరి
సవిటి అడిల నీళ్లు సముద్రము వలెను
తరముగాని చెరువులు తగ పుడమియందు
కొదుప యంతయు లేక గోకులములకు మేత
కలదు పద్మనాయుడ కల్లమాట గాదు
పదివేల వరహాలు పంచిపెట్టగలర?"
"వినుము సిద్ధిరాజ! యిదియంత ఘనత?
కాక ఒక దొడ్డికి కానుక లేదు
ఆకున వ్రాయించు అది ఎంత ఘనత?"
మరియు నలసిద్దిరాజు మన్నె నాయకులు
ఆమాట (యనిరి) యాదవుల తోను:

---

78. తల్లి + ఏగురు.

**-: సిద్ధిరాజాదులు యాదవవీరుడు పెయ్యల ఎఱ్ఱయ్యను తమకు ఇమ్మనుట. పద్మనాయుడు అతని పరాక్రమమును వర్ణించి తెలిపి వారిని భయపెట్టుట :-**

"యిప్పర్ల నాయుడా! వినవయ్య! మనవి
యనభై నూరు ఎద్దుల యఱ్ఱయ్యను యికను
గిరి వుంచక గాను కూడదు" యనిరి.
"వినవయ్య! అతని జన్మము విన్నవించెదము
పుట్టెను నున్న భూతేశు కృపను
పెరిగెను బెజవాడ పెంపు మీరగను
లక్ష్మణార్యులవంటివాడు రాజుతమ్ముడు యఱ్ఱయ్య
రాజుతమ్ముడు యఱ్ఱయ్య రాగూడదు యిక్కడికి
వేనుగుల[79] రంతున యెద్దులకు గాదు
గుఱ్ఱాల గంతున నఱ్ఱావులకు గాదు
యఱ్ఱయ్య యెద్దుల యెడబాయడయ్య!
మరి యావులమంద వూరియావులవలె వుండేవి గావు
పంపున యేనుగులపై నురకగలవు
గుఱ్ఱాల నన్నిటిని గుదులగా బొడిచి
మల్లబడును[80] ఆవులు మనుజులకైన
యఱ్ఱయ్యను మీ కోటలో గిరి వుంచితేను
నెలకు మూడు కూనీలు తప్పవు రాజులార!
వుచితమైతె యెరిగి వుంచుకో"మనెను
అటువంటి వాని మనకు వద్దని పలికిరి.

**-: సిద్ధిరాజాదులు యాదవుల జాగిలములను తమకు ఇమ్మనుట. పద్మనాయుడు జాగిలముల భయంకర చర్యలను వర్ణించి చెప్పి వారిని భయపెట్టుట :-**

"మీ మందలోని జాగిలాలు మంచివి యనుచు
గొప్పెన జింకలు కొమ్ముపందులూను
యేదుములు మనుబోతులు యేగోలలూను
మా భూమిని గలవు మంచి మెకములును

79. ఏనుగుల; 80. మర్లబడును.

వెన్నంగ జాగిలాలు విడిపించు"మనెను
"పూర్వమందు జాగిలాల పుట్టుక వినుడు
ద్వాపర యుగమువాడు గోపిదేవమ్మ
గోవుల మేపుకొరకు వర్షాకాలముకు మ్రొక్కెను
అనిన దేవేంద్రుండు అపవిర్ధి[81] గాను
వర్షములు గురిపించె వాగులు డొల్లేను[82]
యేరులు క్రిష్ణనదులు యేకమై పారెను
గోవులకు మేత కొదువ లేకుండ
ఆమనిగ[83] విధించెను అపుడు దేవేంద్రుడు
ప్రబలి ఆవుల పితుక పాలు వలసినయట్లు
గోపెమ్మ సంతోషించి వారి గోవులలోను
యశోద దేవేంద్రునుకి యజ్ఞము గావించె
కావించినయపుడే కలిగె క్రిష్ణమ్మ
యిలవేల్పునై నేను యింట వుండంగ
పరయేల్పుల కొలువ సవ్యంబు గాదని
అని కొల్లలాడించెను అరికృష్ణుడెల్ల[84]
దేవేంద్రుని యజ్ఞము కొల్లలాడించెను
అలిగి దేవేంద్రుడు వారి యావుల మీదను
యడలేక కురిపించె వర్షము యేడు గడియలును
కురిపించె వర్షములు వారి గోవుల మీదను
ఆరాత్రి కురిపించ రాళ్ల పిడుగుల వాన
దేవేంద్రుని మహిమ తెలిసి కృష్ణమ్మ
కినిసి గోవర్ధనగిరి పెల్లగించె
పూని బొటిమనేలుతో[85] కొండ గొడుగుగా యెత్తెను
పషువులు[86] మృగములు గోవులునెల్ల
యలమితో డాసెను యేడు దినములును

81. అభివృద్ధి; 82. పొర్లేను; 83. ఆమనిగ = సమృద్ధిగా; 84. హరికృష్ణుడెల్ల; 85. బొటనవ్రేలుతో;
86. పశువులు;

వైరముగల మృగములకు వైరము లేకుండ
శరభ శార్దూల సింహములు మొదలు
యేనుగులతో నున్న యలమితో పులులు
ఘండభేరుండ ఘనమృగములూను
పులులును జాగిలాలు పూని కుదువసాగెను
వాటి సాహసము జాగిలాలకు వచ్చె రాజులార!
పులుల శౌర్యము కన్న పులిశౌర్యపు యేపులు[87]
మంద నెడబాసిన మన్నీల నుర్మాడును[88]
తురంగముల నన్నిటిని తునకలుగా గరుసును[89]
గజములనైననూ గడిసిపోనియ్యక
బంటును రాజులను నుర్మాడి సంపును
యీలాగె జాగిలాలు యీ మందలోకి
పట్టి తెత్తురుగా మీ పరివారమును బంపుడి''
నరనాథు సిద్ధిరాజు నాయుని జూసి
యీలాగు జాగిలాలు వేల[90] యీ పురికి
వద్దనే సిద్ధిరాజు పెద్దపిన్నలతోను.

**-: "మేము పుల్లరి అడిగితిమి; మీరు ఒప్పితిరి. మీరు కూడ ఏమైన అడిగెదరా?" అని సిద్ధిరాజు ప్రశ్నించుట. పద్మనాయుడు తమ కోడెలకు ఆవులకు ఏ కొంచెము గాయమైనను పుల్లరినీయమనుట. దేవతలు మన పుల్లరికి సాక్షిగా నుండవలెనని నియమము చెప్పుట:-**

భరద్వాజ సిద్ధిరాజు పల్కి యామనెను?
"అడిగితిమి పుల్లారి వొప్పితివి నీవు
అడుగుడు మీరును అవిశంబుయాల"[91]
అనిన పద్మనాయుడు ఆ రాజుతో ననియె:
"ధరయేలు సిద్ధిరాజ! ధర్మము మీ సొమ్ము

87. ఏపి + లు = ఏపులు = వేటకుక్కలు; 88. నుఱుమాడుట = చూర్ణము చేయుట; 89. కఱచును; 90. ఏల; 91. ఆలస్యమేల?

కర్మవర్తన జనులు కలరు యందైన
తనవునా ధర్మంబు తప్పక మీరు
ఆడిన మాటలు ఆడి తప్పకుడి!
కోడెల(కు) ఆవులకు కటకొౖరు దిగినగాని
కోరిన పుల్లరి కొంచపోలేరు!
ఆవుకాలు యెద్దుకాలు అతి భారమైతేను
మీరు అడిగిన పుల్లరి మేము యిచ్చేది లేదు!
ధరణీశ! మీ వల్ల ధర్మంబు దప్పిన
చాకవిండ్లవారు చెణికినా గాని
ధరపతీ! పుల్లరి యడుగ ధర్మంబుగాదు!
వాగున జాలరి వలవెయ్యరాదు
మడియేలు[92] రేవున మాందవీలు బెట్టిన
ఆరంతులకు ఆవులు అడవులకు వురుకును
సాలమందలు జడిసి సల్గుటెద్దులును
నిలువవు అడవిలో నీళ్ల త్రాగవును
మీకును మాకును మేదిని లోను
నదులు నిధులు సాక్షి! నరసాక్షిగాదు!
పారేటి పెన్ననది, పల్లికొండ సాక్షి!
సంగమేశ్వరుండు మల్లాపు భైరవుడు సాక్షి!
విరుగులసాని బాలసోమేశు సాక్షి!
ధరదేవి ఆకాశ సూర్యచంద్రులు సాక్షి!
పారేటి నదులు పల్కుటా సాక్షి!
కమ్మలు రాయించు ధర్మంబుతోను
శ్రీ సంవత్సరాది వినుము సరిగా మాసంబు
కవులుపత్రికలు మాకు కదువేగ యిమ్ము!"

**–: నల్లసిద్ధిరాజు యాదవులతో కలసి పల్లికొండ పెరుమాళ్ళ దేవళమునకు వెళ్ళుట. స్వామిని పూజించుట. :–**

---

92. చాకలి.

అంతట సిద్ధిరాజు అనుజునితోను
నల్లమేడ నీడను నరనాథు బిలచె
పట్టంచు అందలాలు పాలకీలు యపుడు
భద్రగజ అశ్వములు బారులు నడువ
బూరలు దారలు పొసగ వాద్యములు
భేరీ మృదంగములు పెళ్లుకొని మ్రోయ
మురియుచు యాదవులు ముందర నడువ
పన్నిద్దరు దళవాయిలు ప్రధాని భీమన
పొసగంగ పాలకీలు యెక్కిరి విరుగడల[93]
అనుజులు విరుగడల ఆత్మబంధువులు
పల్లకి ముందర పడివాగె* తేజీలు
యలమల సెట్లూను మలయనాయక ద్వారాలు
రాజు వెంట గదిలిరి రక్షమూకలును
పల్లికొండ దేవళము పరుమట మొగమండపమున[94]
పల్లవ నల్లసిద్ధిరాజులు పాలకీలు దిగిరి
యాదవులు తూర్పుగాను అందలాలు దిగిరి
భోజుడు నలసిద్ధిరాజు మొగమండపమున
పట్టుజముకాళములు[95] పరిపించెనపుడు
జముకాళముల మీద తమ్ములు నలసిద్ధిరాజు
కూర్చుండిరి యాదవ కొమరవర్గంబు
తరువాత యాదవ అధికశూరులంత
సమద్రిష్టిగా కూర్చుండిరి సంతోషముగను
తిరుమల దేవునకు దివ్యంబు[96]లెత్తించిరి
కంభాన దివ్వెలు ఘనముగా యెత్తించిరి
స్వామికి అభిషేకంబు సమర్పణ జేసిరి

93. ఇరుగడల; *"పడివాగె" లేక "పడవాగె"=ఎక్కుటకాయత్తపఱచునపుడు సవరించెడుగుఱ్ఱపుసవరణ;
94. ముఖమంటపమున; 95. జముకాణము – జంబుకాణము – జముఖాణము = ముతకనూలుతో చేసిన రంగుగల బట్ట; 96. దివ్య – దివియ – దివ్వె–దివ్వియ= దీపము, దివిటీ.

అందముగా సొమ్ములు అలంకరించిరి
తాళాలు వీణెలు దండి పాటలును
స్వామికి సేవలు సొంపుతో చేసిరి.

**-: నల్లసిద్ధిరాజు దేవతలను సాక్షులుగా జేసి, పెరుమాళ్ళ దేవాలయములో తిక్కనమంత్రిచే పుల్లరికమ్మలు వ్రాయించి, పద్మనాయునికిచ్చుట - యాదవులు వ్రాసిన కమ్మలు తాను స్వీకరించుట :-**

తగవేడ్క సిద్ధయ్యతనయుని[97] పిలిచిరి
మనసు నా తలపోసి మానవాధిపుడు
ప్రియమున తిక్కనప్రెగడతో ననియె
మనవారి సందు[98] మాట నిలకడకు
తప్పక కమ్మలు తగ వ్రాయమనిన
తగమేర గరిమిడి[99] ధర్మమార్గముగ
శీఘ్రమే వ్రాయమనెను తిక్కనమంత్రిని
(సరవి) విజయనామ సంవత్సర చైతర బహుళ
పంచమి శుక్రవారము రోజు వరకు
మేదినిపై యాదవులకు మెర్వుకట్టు దప్పిన
పుల్లరి డిల్లును భూనాథుకనిరి
వ్రాసిరి పత్రికలు వైన వైనాన
ధర్మంబు నిలిపితే దక్కును సొమ్ము
పారేటి పెన్న, భైరవుని సాక్షి!
సంగమేశ్వరుండు సదాశివుని సాక్షి!
భూమి ఆకాశము బొంకను సాక్షి!
హరిహరాదులు దేవతలు అయిసాక్షిగాను
కమ్మలు వ్రాసిరి ధర సాక్షిగాను
దేవుని ముందరకు తెచ్చిరి కమ్మలు
తీర్థప్రసాదముల్ తెరగొప్ప నందిరి

97. సిద్ధనామాత్యుని కుమారుడైన ఖడ్గతిక్కనను; 98. మనవారి సందు = మనవారి మధ్య; 99. ఒకరకమైన పచ్చగడ్డి.

నిల్పుదూ సత్యంబు నిది సాక్షిగాను
యాదవులకు వ్రాసిన కమ్మలు సిద్ధిరాజు తానందెను
పద్మనాయునికి కమ్మలు పట్టుమనిచ్చెను
కమ్మలు అందుకొనిరి కడు వేగమూగ
మగిడి యాదవులు నాయుడు మందకు చనుదెంచిరి.

**–: నల్లసిద్ధిరాజు యాదవుల ఆలమందలకు ఏమాత్రమును హానిచేయవలదని తనవారిని హెచ్చరించి, నెల్లూరు పట్టణమునకు వెడలుట :–**

నలసిద్ధిరాజు మన్నెనాయకుల బిలిచి*
పేరుపేరున బిలిచి ప్రియములు బలికెను
పటాని రౌతులను పరగంగ బిలిచి
చెంచు నాయకులను చెలువొప్ప బిలిచి
గురికాళ బోయల గొబ్బున బిలిచి
చేరి విచారంబు చేసి యిట్లనియె
గోవులు మెయ్యగా గోవులు తోలినను
సయ్యన బెదరించి సల్గుటెద్దుల తోలిన
కయ్యము చేసినా గొల్లరాజు మనము కడతేరలేము
సత్యము దప్పితిమైన పరియారము[100] వినుడ
పుల్లరి కాసులు అడుగ గూడదు మనము
వారితో భాషించి వార్తలు జెప్పి
పల్లవ నలసిద్ధిరాజు పట్నమున కరిగె

**–: పద్మనాయుడును, అతని పరివారమును కాటమరాజు దగ్గరకు వెళ్ళి పుల్లరి ఒప్పందమును గురించి చెప్పుట. పాకనాటిలోని అనేక ప్రదేశములలో తమ ఆలమందలను స్వేచ్ఛగా మేపుకొనవచ్చునని తెలుపుట :–**

ముగ్గురూ నాయకులు, ముష్టి ముమ్మినీడు,
పెదవెల్లి ప్రేమన, పెమ్మసాని భీమన,
అంగిరేకుల సాంగన, అమృతపు చింతగ,
యెండంచుల[101] పల్లకీలు యెక్కెను నాయకుడు

---
"పిలుచు" అను క్రియ క్త్వార్థంలో "పిలిచి" అవుతుంది. కాని యీ జానపదకవి అన్నిచోట్ల "పిలిచి" అని వ్రాశాడు, నేను సవరించాను. 100.పరిహారము; 101. వెండిఅంచుల.

అటువెనుక దిగనురికి రాజుకు మ్రొక్కిరి
నరనాథు ఆవులన్న నాయనిం జూచి
భూమీశు వార్తాది అక్కడ పొడగన్న వార్త
పుల్లర్లు అడిగెను పూని విచారంబునను
ఆశ్చర్యముగా నెల్లూరు రాజుల వార్తలు అడిగెను
అనవిని రాఘవుండు ఆ రాజుతో ననియె:
“నలనన్న! యిటువిను నా విన్నపంబు
మితి దప్పిన బాసలు పల్కిరి మేదినియందు
అర్దుగా[102] నలసిద్ధిరాజు మన యాదవులను పుల్లరి
అడిగెను అభారతపు[103] ధనము ఆవులన్నా వినుము
పల్కు నిజముగా నాడె పల్లవాది రాజులు
కాంచి విజయనగరము కడువేగ విరూపాక్ష
ఆనెగొంది మండలము అందు యిందు అనక
ద్రవిళ[104] కొంకణి యందు తన రాజ్యములు
శంఖు భందు రామేశ్వరము దాక
మనకు సెలవని పలికెను (నలసిద్ధి)
బొడ్డుగల కోడెలా భూనాథుకిపుడు
శంకలేక యిమ్మనెను నలసిద్ధిరాజు
నేను విన్నవించిన నేర్పులు వినుమ!
ఇప్పుడు యీనె ఆవులు యిరువది లక్షలు
కట్టగల[105] తరుపులు కడమేర లేవు
కట్టి[106] యీనిన కోడెలు కదుపులు[107] వెయ్యి
అని వప్పితిమి నలనన్న! ఆవులకు పుల్లరి
నీళ్ళను బుట్టిన పూరి నేర్పుతో యడిగితేను
మంచిదని వొప్పెను మనమసిద్ధిరాజు”
అనిన సంతోషించి ఆయావులన్న

102. అరుదుగా; 103. భరింపశక్యముకాని; 104. ద్రవిడ; 105 తఱిపి = ముదురుదూడ (తరుపులు=ముదురుదూడలు); 106. కట్టు= పశువులు గర్భము ధరించు; 107. గోసమూహములు.

చేతిలో చేయి వేసుకొని చెప్పుకొని నమ్మిరి
పుల్లరి వొప్పించినా భూపతులకపుడు
తశిరీబులు[108] గప్పించి తగు వేడ్కతోను

**-: కాటమరాజు పద్మనాయుడితో పోలురాజు పగలు తీర్చవలెనని చెప్పుట. పుల్లరి ఒప్పందము ప్రకారము సిద్ధిరాజును కూడ తాము కొనివేసినామనుట. పుల్లరి ఒప్పందము ఏడాది గడచెననుట :-**

"నాయుడ! వినవయ్య! నాచిన్న మరిది!
వెండంచుల పల్లకీలపతి రాఘువ!
మంతనాల రామశిలక! మరిది పద్మరాఘువ!
విన్నపము చేసేను యినవోయి (మరిది)*
(వాదు దగ్గరకు) వొచ్చింది సిద్ధిరాజులవారికి మనకు
పొందులు సేసుకొని పోరాదు మనము
అమ్మ సిరిదేవి వద్దనంగాను ఆవులు మనము
అగర్వులై వస్తిమి వారి భూములకు
పుల్లరి ధనము కొరకు భూములొప్పితిమి
వొప్పి ఆ పెన్న లోపల కల్లలాడకుండ
దేవ గణంబులు సాక్షులున్నారు
యెల్ల దేశములో మన కథలు వన్నెగావలెను
పాలిలోపల మన సత్యము పాటి ఉండవలెను
తగవు గెలిస్తే గాని మనకు ధర్మంబు గాదు
వొప్పు తప్పులు లేకుంటె గాని వుచితంబు గాదు
పత్రాలు చించకగాని మనకు భావ్యంబు గాదు
సిద్ధిరాజు మనము సత్యాన వుంటేను
వారికి వడబడ్డ పుల్లరి ధనము వారికి వప్పించవలెను
వరహాలు వకరాశి వంచించక పోసి

108. తసిరీబు / తసిలీబు = బహుమానము; *ఇంతవరకు గల "పుల్లరి కథ". "నేను సేకరించిన కాటమరాజు దక్షిణాది ఆవులమేపు" (జన్నివాడ కథ)లో లేదు. తరువాతి పాదములు ఇంచుమించుగా నున్నవి – తంగిరాల.

మాడలు ఒకరాశి మంచవ్వగాను
యడగలక చాతను వెన్నించవలెను
సిద్ధిరాజును బిలచి మనము చెయ్యిబుచ్చుకుని
మా వద్ద పుల్లరిధనము మీకు చెల్లిస్తిమి
నీరున పుట్టిన పూరిని మాకిస్తివి
నీరున బుట్టినవాడవు నీవుగాన
నిన్ను కొనుకొంటిమి నీవు మా సొమ్ము
నిన్ను నీఱు*చేయకగాని నిల్వమీచోట
అని పగదెల్పి కయ్యంబు ముందర బల్మిచేతముగాని
అందాక మేపుడి మన ఆవులచటను
నెల్లూరుదాక కందువతో మేపు
రోయి మన కవులావుల చాతను
పశువులు వచ్చెనంటె భూమి పారిపోవలెను
యేటి మీద ఆరునెలలు యడచేసినాము
యిచ్చినారు మనకు (యడచేసినారు)
యడచేసినా షరతు[109] యాడాది వెళ్లెను
కడచేసి పోదాము యీ భూమిని మన కవులావుల మేపుడి!"
చెలగి యీ భూమంత చెలువారగాను
మెయ్యనియ్యమన గోపాల్కులు మేలాయనని వచ్చిరి

**–: యాదవులు యథేచ్ఛగా నెల్లూరిసీమలో తమ ఆలమందలను మేపుకొనుట :–**

యెగవిడిసిరి కవులావుల యారాళముగను[110]
నెల్లూరికి పరుమట గన్నవరమయ్య
పందుము నాగవారము పరగ నున్నది
యేపెలు యలగ్రు యరగుడిపాడు
మరిమాడు వేమాడు మరి మల్లెపాడు
యూదుల భీమవరం యెలిముద్దపాడు
కోడిగుంపులపల్లి కొట్టాలపల్లి

109. షరతు = ఒడంబడిక, నిబంధన; 110. హేరాళముగను. *నీఱు=భస్మము.

రాళ్లగుండ్లపాడు రావులకొల్లు
కంపమడుగుపాడు గండికోటపాడు
పరుమట వెలిగొండ పంచలింగాలకొండ
కనియెద్దు కురువస్తాంబ ముదనరియె
ఆదూరు పెంట్రాల అన్నెబోయినపల్లి మేరగాను
యగవిడిసిరి కవులావుల యారాళముగను
అరెమాను చేతికే అచ్చోట తర్లెను
కదిలెను కంపటము కదువేడ్కతోను
పుడమెల్ల గప్పె భూనాథుని మంద
నవ్యతి కోటి మందలు నదులెల్ల గప్పెను
కడువేడ్కతో మందలు కదుపులు కదిలెను
ఆవులమంద రణభేరి అంచున మ్రోగెను
ధరణి వణుకంగ తర్లెను మందలు
చెరువులు వెల్లివిరిసె చెదిరినాయట్లు
దేశరాజు కవులావులు దేశములు నిండెను
మిడతలు ఆకాశము మీదికి వెగసి
చెదరి (చుక్కల తాకి చేరి)నా యట్లు
మింటికి ఆకాశము మెరయుచు భూమి
అవని కులగిరులకు అరిగినాయట్లు
చంకతీత కొమ్ములు సన్నదారులు బట్టిరి
యల్లావుల కదుపులు వెల్లివిరిసినయట్లు
తొంభైతొమ్మిదికోట్లు దారముద్రయెద్దులు
యిరువైఆరుకోట్లు విష్ణుముద్రయెద్దులు
సలుగుటెద్లు ఒక లక్ష సంగడావులును
అనంత యర్బుతము[111] ఆవులామంద
జడదారి లింగముద్ర శంఖుచక్రాల యెద్దులు

111. అర్బుదము = పదికోట్లు.

నర్రావులు పరమేశ్వరుని నందుల బోలు
ముందుగా ధేనువులు ముత్యకోట చొరబడెను
మేసెను ధేనువులు మెత్తని పూరి
బంధుశిరోమణి బడుగులరాజు
వేనూరు గొడుగులు వెలయ నొక లక్ష
పిల్లనగ్రోవు లాడించి పెయ్యల బిలిచి
సట్టువారి యర్రయ్య సమయేడు మందలు
ముందుగా పాకనాడు మెరసిన తురగాను
పెయ్యల యర్రయ్య ప్రిద్వీశ్వరుండు[112]
పన్నుగా పదివేల పాలకావిళ్లు
నందుల నిరుగడల నడచె సంపదలు
చల్లవారి ఆవులు సరస నిరుగడల
వేగమే కదిలెను వెల్లివిరిసిన రీతి
బీరినీని మందలు బారున కదిలెను*
సర్వసన్నాయములు[113] సంపదలు కదిలెను
దొమలేరు మంచ్యలు[114] మడిపరుపులు కదిలెను
సాలమేయు చిలుకలు జాలింరెగలు కదిలెను
నేతి సిద్ధకావిళ్లు నేర్పుతో కదిలెను
బియ్యము గోనెలు పిగిలిబంతుగడలు
ప్రబలి ధేనువులు కదిలెను పాకనాటి భూమికి

**-: కాటమరాజు అరవైయారు స్తంభాల గుడారులో అతివైభవముగా కొలువుదీరి పద్మనాయుడితో సొగటాలాడుట :-**

రాగిబిందెలు మంచి రత్నకంబళ్లు
జగజంపు గొడుగులు జల్లులు గడలు
అరువైయారు స్తంభాల ఆముర్తాల భారి[115]గుడారు క్రింద
కుంభిణి మీద యెత్తించి క్రిష్ణమ్మ మనుమడు

112. పృథ్వీశ్వరుండు; *సరియైన రూపము "కదలెను" 113. సర్వసన్నాహములు; 114. 'మంచెలు' లేదా 'మంచాలు' కావచ్చును. 115. భారీ = పెద్ద, పొడుగు.

ముదముతో ఎత్తించె ముత్యాల పందిరి
తీరుగా శృంగారించిరి దేవేంద్ర ముఖము
రత్నాల తమకము మీద రాజు రాఘవుడు
పంతముతో కూర్చుండె పశుపతిరాజు
సొగటాలు యాడుచు సొంపు మీరగను
నెలపది దినములు నెల్లూరు విరియేల
బలువైన యండ్రపాడు తీగెయలుము
పశువుల మేపుచు పశుపతిరాజు
అంతట నెల్లూరులోని అధికులందరును
రచ్చన కూర్చున్న రాజదొరలును
అప్పుడు తలపోసిరి ఆశ్చర్యమందిరి
ఉత్తరకాశి అమరావతి వుర్వీశుండు
పాటైన ధేనువుల పదహారు కోట్లు
యమునికి వెరువని యేరాజవరుడు
అవతారధీరుడు అతడు యాదవరాజు
సృష్టిలో కృష్ణమ్మకు సాటి యనవచ్చును
యితని జన్మము చూడ యీశ్వరుడె కాని
మనుజులు యంతవారికినైన మరి వశము గాదనిరి

**-: నందవాడ చెరువులో ఆలమందలు నీళ్ళు త్రాగకుండ నందవాడ బేతినీడు నన్నూరు మూకతో అడ్డుకొనుట. పెయ్యల ఎఱ్ఱయ్య, చట్టువారి ఎఱ్ఱయ్య కాటమరాజు దగ్గరకు పోయి అతనిని ప్రశంసించి, విషయము విన్నవించుట - వానిని తెగవేయుటకు కాటమరాజు ఆజ్ఞ ఇచ్చుట :-**

పచ్చి కసువులు మేసి పసువులన్నియును
నందవాడ చెరువుకు నటుసాగె నీళ్లకు
మునుకొని ధేనువులు ముంచి త్రాగంగాను
నన్నూరు మూకతోను నందవాడ బేతినీడు
నీళ్లు త్రాగకుండ నిలిచె తటాకము మీద
కోకబెదురులు పెట్టె కేకలు వేసిరి

ఎదురుపెట్టి ధేనువుల చెదరదోలంగ
నీళ్లు త్రాగక యెద్దులు నిలిచి పోట్లాడ
ఆవులు గాసేటి అధిపతులెల్ల
యర్రయ్య సట్టవారి యర్రయ్య యపుడు
ఆవులన్న సముఖానికి అదిగొని వచ్చిరి
యర్రయ్య తా బలికె మహరాజుతోను:
"మక్షమై[116] సోమకుని మర్దించి వేదములు
తెచ్చి బ్రహ్మకు యిచ్చిన దేముడవు నీవు
వొడుగు[117] రూపమున బలిని మూడడుగులడిగి
కూర్మావతారమున కుధరంబు వీపున
నిల్పిన స్వామివి నీలవర్ణుండ!
అట్టి దాసునుబట్టి అహంకారముతోను
పట్టి చంపినయట్టి బాలుడవు నీవు
రాఘురామచంద్రుడా! రాజు నలనన్న!
వినయముగా నా మాట విని వుద్ధరించుము
యిలనేలు నలసిద్ధిరాజు మనకు యిచ్చిన కవులు
ధర్మము తప్పననె మనకు తగ కమ్మలిచ్చె
కవులిచ్చి తప్పెను ఘనుడు సిద్ధిరాజు
నన్నూరు మూకతోను నందవాడ బేతినీడు
తటాకముపై నిలసి[118] త్రాగనియ్యక నీళ్లు
కేకలు వేయించి ఆవులను గుట్టలకు దరిమెను
వెయివేలు[119] మందలు వెరవక నిలిచెను
పోటురంకెలు[120] వేసి పోటుకు[121] దిరిగెను
మాకు సెలవిమ్ము మాధవుల నలనన్న!"
గారవించి తమ్మునికి కస్తూరి అలది
తెగనాగ్నె[122] చేయుమని సెలవిచ్చె రాజు

---

116. మత్స్యమై; 117. వడుగు = బ్రహ్మచారి; 118. నిలిచి; 119. వెయ్యివేల; 120. శౌర్యముతో రంకెలు; 121. బాధతో (పోటు = శౌర్యము, బాధ); 122. తెగ నఱకుటకు ఆజ్ఞ.

అని విన్నవించిన ఆరాజుకు మ్రొక్కిరి.

**-: చట్టువారి ఎఱ్ఱయ్య, నందవాడ బేతినీడును "నడుము రెండు తునియలుగా నరికి పడదోసి" అతని నెత్తుటి బట్టలను నెల్లూరుకు పంపుట. కాటమరాజు కంపటము పడమటిదిశగా పెన్నవెంట కదలుట :-**

కదలిరి యాదవులు ఘనకీర్తి వెలయ
సాహస ఘనుండు సట్టవారి యఱ్ఱయ్య
మహర్కొని[123] యాదవ మన్నీలు నడువ
అగ్రుడై యఱ్ఱయ్య అప్పుడేమనెను?
"నలసిద్ధిరాజు మాకు యిచ్చినా కవులు
న్యాయంబు తప్పి చెరువునీళ్లు త్రాగనియ్యవేమి?
నీళ్లాను పూరినీ నీకేమి తగవు?
సాలమేరాలు సల్కి సవాలక్ష కోడెలు
తా మనవిగ చేసి తగ కమ్మలిచ్చెను
పంపుట యెరుగవా పల్లవాది రాజులు?
నీళ్లను బుట్టిన పూరి నీళ్లు మాసొమ్ము
కడకు బోవుట మంచిది కావరంబేల?"
పోతినీడు మహర్కొని పొర్లదోలె[124] యావుల
గోవుల తోలంగ గోపాల్కులు కదిలిరి
(పేరువడె) సట్టువారి పెద్దపులి యనగ
సట్టువారి యఱ్ఱయ్య అగ్రుడై మండి
నరికెను నందవాడ బేతినీణ్ని అపుడు
నడుము రెండు తునియలుగా నరికి పడదోసెను
సన్నుదుము కాంతనటు కోల్పోరి*
నెత్తురు వస్త్రములు నెల్లూరు కంపిరి
మందనావులు నీళ్ళు మరి త్రాగెనంత
నెత్తురు వస్త్రములు జూసి నెల్లూరి రాజులు

123. మార్కొని = ఎదిరించి; 124. తిరుగునట్లు తోలెను; *ఈ పాదము అర్థమగుటలేదు.

చెల్లును యాదవ చంద్రునికి యనిరి
అచ్చోట నుండక యామరునాడు
కంపటము పరుమట[123] కదలమనె రాజు
పెన్నవెంట గోకులము పేరుసాగి నడిచెను

(అసంపూర్ణము)

**గమనిక:-** మిగిలిన కథ అంతా సంపూర్ణంగా నేను సేకరించిన "కాటమరాజు దక్షిణాది ఆవుల మేపు'' లేక ''జన్నివాడకథ''లో ఉన్నది. (చూ.కాటమరాజు కథలు, రెండవ సంపుటం, పుటలు 94-187)



123. పడమట.

# బొంగరాలకథ

## అవతారిక

### (ఇష్టదేవతాప్రార్థన - కవి వంశాదికము)

శ్రీపార్వతీనాథు చిత్తాన దలచి
గోపాల కృష్ణుని కోర్కె నుతించి
బ్రహ్మదేవుని దలచి భాగీరథికి మ్రొక్కి
సింహయాన సుతుడు చెలగి విఘ్నేశు
సాష్టాంగ మొనరించి శారదకు మ్రొక్కి
అష్టాదశవిద్యల అయ్యల గొనియాడి
ఆదికొలకు[1] నిత్య అస్తములు[2] మొగిడ్చి
మతిమంతు డైనట్టి మతంగ గోత్రుండు
జొంపార కులజుండు జగతిలోపలను
గాంభీర్య మైనట్టి కత్తిపరి సింహము
వాసిగా గొర్రెపాటి వంశవర్ధనుడు
కొసర పన్నీరు గోత్రపావనుడు
ఘనుడు లింగమయ్య కాంత లింగమాంబకు
తనయుడు మల్లయ్య ధర ప్రసిద్ధుండు
ధాత్రిలో జరుగుమల్లి ధన్యుడు చెన్నయ్యకు
పాదసేవకుండు ప్రజలెంచగాను
యాదవులకు బిరుదువాడైన ఘనుడు
పృథివిలో ముమ్మయ్య పోచయ్య యిద్దరు
ధనముకొండ లోపల తగు వేడ్కతోను
పనివడి కంఠసరి బాలలిద్దరును

1. ఆదికవులకు; 2. హస్తములు.

బొంగరాలాడిన పూనిక వినుడి
సంగతిగ జెప్పేను శ్రవణానందముగను
యింపుగా జనులార! యిందరు మీరు
కంపింప యీ కథను ఘనులార! వినుడు

**-: ముమ్మయ్య పోచయ్యలు వేడుక బొంగరాలాడుట :-**

ముమ్మయ్య పోచయ్య ముద్దుబాలలిద్దరు
అమ్మ నగరు బొంగరాలు అందుకొని వేగ
కనకసిరి పచ్చల కంఠసరి బాలలు
అనుదినము బొంగరాలు ఆడుచునుండిరి
పధ్నాలుగు యేండ్లు పర్యంతము దనక
అరుదైన బొంగరాలు ఆడుచునుండిరి
చిత్రభాను సంవత్సర శివరాత్రిమాసమందు
శాస్త్రవంతులైన చిన్న బాలలును
దేవేంద్ర వైభోగ ధీరులైనారు
*దేవతాబొంగరాలు దినదినము వారు
సంతోషచిత్తులై తమరాడసాగిరి
అంత్యకాలము వారి కయ్యేటి తుదకు
వేడుకలకు తమరాడిన వెండిములికి బొంగరాలు
ఆడి చాలించిరి అవి ముద్దరించి
బచ్చన బొంగరాలు పదివేలు చేయించి

**-: ముమ్మయ్య పోచయ్యలు దేవతాబొంగరా లిమ్మని సిరిదేవి కొమరక్కలను కోరుట :-**

పోచయ్య ముమ్మయ్య పొంకంబు మెరసి
"పెద్దలనాటి బొంగరాలు పెట్టెల వున్నావి

---

* ఈపాదము నేను సేకరించిన "వేడుక బొంగరాల కథ"లో నున్నది (చూ. కాటమరాజుకథలు, రెండవ సంపుటం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ, 1998. పుటలు: 266-301). ఇక మీదట దీనిని "వేబోక" అని సూచిస్తాను. (వేఁబోక = వేకువ, ప్రభాతము - అనే అందమైన అర్థంకూడా స్ఫురిస్తుంది.) **-తంగిరాల**

యిద్దరము పలుకరించకగాని యియ్యదు తల్లి"
అని యిట్లు తలపోసి అమ్మ నగరికి
బాలలు చయమున వచ్చి తల్లి సముఖమున నిలచి
కామిత ఫలధన్యులు కరములెత్తి మ్రొక్కిరి
"పద్మలోచనలార! పద్మినులార!
విద్వాంసులైనట్టి వో వెలదులార!
యిన్నాళ్ల దనుకను వేడకబొంగరా
లాడితిమి వినవె వోఅమ్మ! సిరిదేవి!
కడువేగ దేవత కనకసిరి బొంగరాలు
పదివేలు చేయించినారు బంగారు బొంగరాలు
ముదమొప్ప అవి మాకు ముందర బెట్టి
సిరిలక్ష్మి పార్వతి దేవతలు యిద్దరను
వాటంపు బొంగరాలు వరుసతో మీరు
వెలదిరొ యిప్పుడు హేమబొంగరాలు
మారుమాట్లాడక మంచి వాక్యముల
తీరైన బొంగరాలు దీవించి యీయండి!"

**-: అశుభములను తెచ్చెడి దేవతాబొంగరాలను ఆడవలదని సిరిదేవి కొమరక్కలు బాలురకు హితవు చెప్పుట :-**

బాలల మాటలు విని పణతు లిట్లనిరి:
"వాలాయముగ బాలలార! వచ్చి మీరిపుడు
దేవతా బొంగరాలు తెమ్మంట్రి మీరు
అవి మీకు వొద్దురోయి! అన్నలార! వినుడు
ఆరుగురు చక్రవర్తులు పదహార్గురు రాజులు
పరగంగ వావివరుసతో వారంత వర్ధిల్లరైరి
అంతలేసి వారు సహ ఆయుగమందు
కంటసమున కొందరు కలహమున కొందరు
పోయినారను కొరత భూమిలో విందుము

జయముగాని బొంగరాలు సంతోషమున నుండి
ఆడ మీకేటికి అన్నలార! వినుడు
బోడికెలు[3] మాయన్న బొంగరాలబయట
పాయక ఆడిన ఫలమేమి మీకు?
యప్పటివలె మీరు వొద్దికై యిద్దరు
తప్పులు నేరాలు తరవాత లేక
నే చేయించిన బొంగరాలు జయప్రదము మీకు
*ఆడుడి అన్నలార! అందముగ మీరు
దేవతా బొంగరాలు తెమ్మనవచ్చునా?
రామలక్ష్మణులు రమణతో నాడి
సీమెల్ల యెరుగంగ సీతను గోల్పోయిరి
బలభద్ర కృష్ణులు పరగంగ నాడి
జగములో ద్వారక సమయదే నాడు
నాటినుండి బొంగరాలు నేటిదనుకాను
*తరతరము బొంగరాలు తరవ[4] నే వెరతు
వశముగాని బొంగరాలు వద్దు మీ''కనిన
సిరిదేవి కొమరక్క చెప్పిన బుద్ధి
వరుసతో బాలలకు వజ్రాలు నాటి
యీపున మొనలు వెడలినట్లాయ
"సంపదలు చూచుక సభగ శరీరాలు దాచుక
బ్రతికెడివారి కంత భయముగాక తల్లి!
తతికాలము చేరువై సంవత్సరము తిరిగేను
వద్దనక నీవు వోయమ్మ! సిరిదేవి!
పైడిములికి బొంగరాలు యిచ్చి పంపవే తల్లి!
దేవతలాడినారు దివ్యబాణములవంటి
బంగారు ములుకుల బాగైన బొంగరాలు

---

3. బోడికలు = బాలకులు, చెలికాండ్రు. * "ఆడుడి అన్నలార!" అనుపాదమునుండి "తరతరము బొంగరాలు" అనుపాదమువరకు 'వేబోక'లోనివి. 4. తరవన్ = ఇచ్చుటకు.

అవి దెచ్చి మాకిచ్చి అంపవే! తల్లి!"
కంతసరి బాలల కదలికలు చూచి
"నీటైన బొంగరాలు నేనియ్య రాదు
అఘుమంచి[5] యిస్తేను అన్నిటికి లెస్స!
చక్కని బొంగరాలు సయిదోడు యిస్తేను
అనుమానము లేదు అన్నలార! యెపుడు"

**-: అగుమంచి దేవతాబొంగరాలు తెచ్చి బాలురకిచ్చుట :-**

ఘనమైన బొంగరాలు గ్రక్కున దెమ్మనిన
సిరిదేవి మాటలకు శ్రీగ్రాన[6] బోయి
హరిహరాదుల ప్రార్థించి అర్ఘంబులిచ్చి[7]
మందసపు తలుపులు మరివేగ తీసి
దండైన బంగారు జలపోత బొంగరాలు
జాలవల్లికలోన జననాథు చెల్లెలు
అలరంగ చీనిపట్టుచీరె పరిపించి
ఆమీద తనకము రాశిబెట్టుకొనె నేమొ
వేమారు అక్కన్న వెలది తా దెచ్చె
శేషువుల బోలిన తావెల బొంగరాలు
అతివేగ దీవించి అఘుమంచి యిచ్చె
యిచ్చి అఘుమంచి అప్పుడిట్లని పలికె:
"ప్రతివాదించక బాలలార! మీరు
వోడు గెల్పులు లేక పృథివిపై మీరు
ఆడుడి బొంగరాలు హరిహరాదుల బోలి
పుచ్చుకోండి బాలలార! పుత్తడి బొంగరాలు"
యెచ్చుగా ముమ్మయ్య యెలమిని పోచయ్య
అందరి బొంగరాలు అఘుమంచి చాత
కందువతో లింగముద్ర కలిగిన బొంగరాలు
ముమ్మయ్య పుచ్చుకొని మ్రొక్కె వేగంబె

5. అగుమంచి; 6. శీఘ్రాన; 7. అర్ఘ్యంబులిచ్చి.

కమ్మక హరిముద్ర కలిగన బొంగరము
పచ్చందుల పోచయ్య పరగ తా నందె
అక్షయంబుగ వారు అతివేడ్కతోను
అంపించుకొని వారు అమ్మనగరు వెడలి
రంజిల్లుచు అయితమరాజు కొలువుండేటి
మద్దికాయల మేడవద్ద మరివేగ నపుడు

**–: బాలురు సంగడీలతో కలసి పందెముల చవికెకు వెళ్ళుట :–**

*పట్టయిన మేషాలకు పల్లాలు వైచి
*పట్టువాగెలు బట్టుక బాలలకు దెచ్చిరి
తద్దయు నిలిచిరి తగువేడ్కతోను
జగబిరుదు డనువాడు, వుగ్రకాంతు డనువాడు
వదరక బోటికెలు[8] పరగంగ నపుడు
ముదమొప్ప వేడుకలు[9] ముస్తీదు[10] చేసి
కొదులేని బంగారు గొలుసుల పేర్లు
చుట్టుకొమ్ము వేడుకలకు సూర్యపుటము వాగెలు
పట్టుకుచ్చులు మంచి బంగారు పల్లాలు
ముత్యాల కుచ్చులు ముఖమరుగులూను
పుత్తడి తీరుట్లు పువ్వుల మెత్తలు
డాకాల పెంణ్యంబు[11] జల్లుల ముస్తీదులు
భీకరంబైనట్టి బిరుదు మేషములు
బటువయిన[12] మేషముల పట్టించుకోని
బోటికె లందరు వేడుకుల దెచ్చిరి
వేడుకలవంక జూచి బాలలు వేడుకబడి యపుడు
అచ్చుగా చిల్లకొని అలర వేడుకను
వెచ్చుగా[13] ముమ్మయ్య వెక్కె[14] నావేళ
పచ్చందుల పోచయ్య పల్లకొల్లి వేడుకను

* 'వేబోక'లోని పాదాలు. 8.బోటికెలు=బోడికలు=సేవకులు; 9. ఏడికలు=పొట్టేళ్లు; 10. అలంకరణ; 11. పెండెంబు; 12. బటువయిన =దృఢమైన, దిట్టతనముగల. 13. హెచ్చుగా; 14. ఎక్కె.

మచ్చికతో నెక్కి మరివేగ కదిలె
ముత్యాల గొడుగులనీడ ముమ్మయ్య కదిలె
చిత్తజుడు పోచయ్య శెంఖుచక్రాల
పట్టుగొడుగులనీడ బాగొప్ప గదిలె
పొందుగా బాలలు పొట్టేళ్ల నెక్కిరి
అందలాలు కొందరు అతివేడ్క నెక్కిరి
కొందరు సంగడీలు గుఱ్ఱాల నెక్కిరి
సూర్యసోమవీధులు బలుశూరులైన బాలలు
పేరాలు బారుచు బిరుదు మేషముల
తప్పెట్లు పిల్లంగ్రోవులు దారలు బూరలు
వుపాంగములచేత వూరువెళ్లి రాగ
అప్పుడు ఘోషింప అవని గంపింప
మెండైన వాద్యములు మెరసి మ్రోవగను
పట్నము వారెల్ల భ్రమపడి చూడంగ
విష్ణుండు పోచయ్య వీశ్వరుడు[15] ముమ్మయ్య
వాలాయముగ బాలలు వచ్చిన విధము
ముప్పయి కురుసాల ముమ్మయ్యను గొలిచిరాగ
అప్పుడు ముప్పయి అల్లుని గొలిచిరాగ
యిద్దరి వెంట అరవై యిరుగడల రాగ
అద్దయిన కంచుటరిగెలు బెట్టంగ
బంగారు బొంగరాలు పట్టించుకోని
సంగడీలు దాము సయ్యన కదిలిరి
*బొడ్డుగంటలు పేరెములు[16] బారుచూను
*వేడుకల బోడికలు హెచ్చరికతోను
*వడివడి బాలలు వచ్చిరి కదిలి
యెదువంశ బాలలు యెచ్చిరికతోను
యాదవులు వేడుకలు పోడెములు ద్రొక్కంగ

* ఈ పాదములు 'వేబోక" లోనివి. 15. ఈశ్వరుడు. 16. పేరెము = గుఱ్ఱపు పరుగు, పరుగు.

బాలలు బొంగరాలు బైటకు దెచ్చిరి
తెట్టురావుల బైట దేవుని గుళ్ళవద్ద
పుట్టమెగసి బాలలు పొట్టేళ్ల దిగిరి
వాగెలు తురుసాలలు వారందరకు వీడి
మేఘముల బోలిన మేషముల దెచ్చి
మరివేగ సురపొన్న మాకుల గట్టి
యిరుగడల సంగడీలు యెక్కిన అందలాలు జేర్చిరి
అన్నపురావుల అందలాలు జేర్చిరి
*ధన్యులకు బట్టిన జగజంపు గొడుగులు
కోడిగెరావుల గొడుగులు చేర్చి
పండిన పనసల పల్లకీలు జేర్చిరి
పందేల ఛవిక[17]లో బాలలు సంగడీలు
అందరు కొలువు దీర్చి అతివేడ్క నుండిరి.

**-: బొంగరాలాట ప్రారంభము :-**

అలరంగ బొంగరాలు ఆడుదా మనుచు
కొలువున్న బాలలు గొబ్బున లేచి
కాశలు బిగువార కట్టిరి వేగ
వాసిగా బొంగరాలు వారందుకోని
అందుకొని బాలలు అప్పు డిట్లనిరి:
"కుశలావు[18] లాడిన కృతాయుగము[19]నాడు
త్రేతాయుగము నాడు తెరగొప్ప నపుడు
మలినేటు రాముడు మరివేగ నాడిరి
ధరయల్ల యెరుగంగ ద్వాపారమందు[20]
బలభద్ర కృష్ణులు పరగంగ నాడిరి
దుర్వాసు శాపాన తుల్లిరి[21] యాదవులు
పేరులు కలియుగమున పెంపొందవలెనని

---

* ఈ పాదము 'వోబొక' లోనిది. 17. చవిక = చతురస్ర మండపము; చావడి; 18. కుశలవులు; 19. కృతయుగము; 20. ద్వాపర యుగము; 21. దుల్లిరి.

బ్రహ్మ త్రయముహూర్తుల[22] పరగ పూజించిరి
బ్రహ్మాండముగ అంభోధి బెళము[23]....
అంబరుషి గొల్లడు అంభోధుడాయెను
కుంభిని మీది రాళ్లెల్ల గోవులై పుట్టెను
అంభోధి వంశమున అయ పరీక్షిత్తు
పరిక్షిత్తు వంశమున బలువైన బొంగరాలు
తరతరము నాటి నుండి దాచింది తల్లి
దాచిన బొంగరాలు ధాత్రిపై నిలిపి
పోచయ్య ముమ్మయ్య బొంగరా లందిరి

**-: సంగడీలను ఉద్దీలుగా సమకూర్చుట :-**

పొంగుచు బాలలు బోటికెల[24] జూచి
సంగడీల వుద్దీలు సయ్యనె గూర్చిరపుడు
జెట్టెబోయిన మల్లు, జడదారు వెంకడు
యిట్టి మీరిద్దరు వుద్దిగమ్మనిరి;
శిట్టెబోయిన డచిరి, నరసింహ్వాద్రి[25] బక్షి
ఘట్టిగా మీరిద్దరు గారయ వుద్ది;
శెంఖుదారు మల్లు, చెవుల నారాయణ
పొంతముగ మీరిద్దరు బొంగరాల వుద్ది;
తరిగోటి ధర్మన, తమకము సాక్షి
మరువక మీరిద్దరు మరివేగ వుద్ది;
కరియావుల కనకన్న, గాలము చింతన
పదరక మీరిద్దరు పద్దుకు వుద్ది;
మద్దెబోయిన పాపన, మట్టేవుల[26] చెన్ను
అందంగా మీరిద్దరు ఆడుడి వుద్ది;
అనిన పంగడీలు అరుదైన బొంగరాలు
పోణిమితో[27] బాలలు బొంగరా లాడంగ
వనముల వీడుల పట్టపు ప్రజలు చేరంగ

22. త్రిమూర్తుల; 23. బిలము; 24. బోడికలు=చెలికాండ్రు; 25. నరసింహాద్రి; 26. మట్టె+ఆవుల = మట్టేవుల/మట్టావుల = బట్టచారలుగల ఆవులు కలిగినవారు, (ఇంటిపేరు); 27. పోడిమితో.

**–: పురస్త్రీలు బొంగరాలాటను వేడుకతో చూచుట :–**

భామలు నీళ్లు మోతురు బావులు మూడు
అఘుమంచి తొవ్వించిన ఆరెవారపు బావి
ముమ్మయ్య గట్టించిన ముత్యాలబావి
నిమ్మలు మారేళ్లు నేరేళ్లు చుట్టి
సిరిదేవి గట్టించిన చెంగల్వ బావి
ఆరువై బావికి అటు దక్షిణాన
కల్లోల కాంతులు గంగరావుల బైట
మల్లెలు జాజులు మారేళ్ళ నీడ
గురుతైన శంభుని గుళ్ల దాపునను
కూర్మితో బావుల కూడలి నపుడు
వుద్దీలు వొకరొకలు వయ్యనె బట్టి
అద్దాన బొంగాలు ఆడుచు నుండిరి
బాలలు ఆటలు వచ్చి ప్రజలు జూచేరు
నీళ్లకడవల వారు నిలిచి చూచేరు
పాలకావిళ్లవారు బారుకట్టుకోని
సిరిబాల ముమ్మయ్యను చేరి చూచేరు
తిరుపతి నవపరుషవలెను తిరుగువారుకొని
బోరున చూచేరు పోచయ్య నపుడు
ముంచుకొని సభవారు ముమ్మయ్యను జూచేరు
పొంచుకొని సభవారు పోచయ్యను జూచేరు
కాంతలు మగువలు గంధర్వ శ్రీలు[28]
సంతోషమున జూచేరి సభవారు నిండి
సంగడీల ఆటలు సభవారు చూడంగ
బొంగరాలాడుచు పోచయ్య ముమ్మయ్య
దాచేత[29] బొంగరాలు వలచేత జాలెలు
పుచ్చుకొని బొంగరాలు పృథివెల్ల యెరుగ

28.స్త్రీలు; 29. ఎడమచేత.

పదివేల దీరింది పాలమాని బొంగరము
పదిలెముగ దాచినారు పయిడిది ములికి
యేనూట దీరింది వెండిమాని బొంగరము
వినుతింప దాచినారు వెండిది ములికి
పట్నూలు[30] బేనిన బలువైన జాలెలు
చుట్టిరి జాలెలు చోద్యంబుగాను
సిరిబాల ముమ్మయ్య చిన్నిపోచయ్య
వేడుకతొ బొంగరాలు వకవిడత నాడి

**–: పందెము కట్టుమని పోచయ్య ముమ్మయ్యను సవాలు చేయుట :–**

ఆడి చాలించియు అపుడు పోచయ్య
వల్లవుల ముమ్మయ్యతో వకమాట బలికె:
“కల్లరి రిపులవైరి! కంఠసరి ముత్యము!
అమర విభునికి జోడు! మాయమ్మ సయిదోడు!
నామీద ప్రేమగల నా మేనమామ!
అరయ పుత్తడి బొమ్మ! అముర్త[31]గుమ్మ!
చెలగి పగడపు కొమ్మ! సిరిబాలముమ్మ!
విన్నపము చేసేను వినవోయి మామ!
యిన్నాళ్ల దనుక వేడుక బొంగరాలు
ఆడితిమి వోమామ! అవనెల్ల యెరుగ
వోడుగెల్పు లేక వుల్లాసము రాదు
వాడిగల వో మామ! వాది ప్రతివాదించి
ఆడవలె బొంగరాలు అవనెల్ల నెరుగ
వాట పంతముగాను వొచ్చు మనకిపుడు
వాటముగ పందెము వప్పవలె మామ!”

**–: పందెము వలదని పోచయ్యకు ముమ్మయ్య హితవు చెప్పుట :–**

పోచయ్య మాటలకు ఆ పోలురాజుసుతుడు
పరగ అల్లునితోను పలికె నొకమాట:

30. పట్టునూలు; 31. అమృతంపు.

"రచ్చరావుల చిలుక! రఘువంశ తిలక!
కొమనాల శింహ్వామా![32] గుణవిశాలుండ!
సమర బలభీమ! సర్వజ్ఞ! వినుము!
చిటినూకపట్టి! చెలగి జగఝెట్టి!
గట్టి యేనుగులబట్టి కరమున గొట్టి
హరివంశమున బుట్టి అఘుమంచిపట్టి
రవితేజ ఘనుడవు! రాజులకు అల్లుడ!
భావజ సమానుండ! పట్టభద్రుండ!
వనర అమృతపుతేట! వొంన్నెల[33] మూట!
ధరణి కనకపు కోట! ధర్మజుని మాట!
పోర రిపులవైరి! పోచయ్యా! వినుము!
పరగ వాదింతాము పందెమంటివి నీవు
వనర యిద్దరి సందు వోడుగెలుపైతె
అవమానముగాద వోయల్లుడ! పోచయ్య!
నీవుగనుక వోడితే నేరంబు తనది
తాను గనుక వోడితే తలవంపు నీది
వాట పందెము వద్దు వద్దికెతో మనము
ఆటలకు బొంగరాలు ఆడుదా మనిన
**దేవతలు ఆడి తొల్లి దేశములు విడిచిరి
కౌరవులు పాండవులు ఆడి కాపురాలు విడిచిరి
తాతలు ఆడిరి ధనములు వోడిరి
బలరామకృష్ణులు పరగంగ నాడ
జలములో ద్వారక సమిశను[34] నాడు
రాముడు మలిశెట్టి రమణతో నాడి
జమదగ్ని గోల్పోయెను చీకటికోనలోను

---

**ఈ రెండేసి చుక్కల మధ్యగల పాదములు 'వేబోక' లోనివి.అనగా "దేవతలు ఆడి..." అను పాదమునుండి తరువాతి పుటలోని "ఆడుదాము బొంగరాలు..." అను పాదమువరకు.
32.సింహమా; 33. వెన్నెల; 34.సమసెను = నశించెను.

రామలక్ష్మణులును రమణతో నాడి
సీమెల్ల యెరుగంగ సీతను గోల్పోయిరి
కుశలవులు తమరాడి ఘోరాజిలోన
యసగంగ తండ్రిమీద యెదిరించినారు
వోడుగెల్పులు లేక వూరికే మనము
*ఆడుదాము బొంగరాలు అల్లుడ! పోయచయ్య!"

**-: పందెము ఒడ్డుమని పోచయ్య ముమ్మయ్యను బలవంతము చేయుట :-**

మరివేగ పోచయ్య మామ మాటలు విని
అరయంగ వకమాట ఆనతి యిచ్చెను
పందెము వప్పుకొమ్మని పలికె పోచయ్య
కందువతో ముమ్మయ్య కలకల నవ్వి
"యంత జెప్పినగాని యెరుగవు నీవు
పందెము గావలెనని పదిరేవు సారె
యేమి పందెము అడిగిన యిత్తును నేను
ధీమంతుడ కోపంపు తెచ్చుకోవద్దు!"
పంతముతొ పోచయ్య పలికె నావేళ:
"యంత మాటాడితివి యదుకులాధీశ!
పోరు వచ్చిన వెనుక తల్లి పుట్టింటి
పేరు జెప్పుకుంటె బిరుదు పేదిరికెమౌను[35]
కనకము వకపందెము కౌలావు[36] లొక పందెము
మెడనున్న సొమ్ములకు మేటిపందె మొకటి
వీటితోనె వోడు గెలుపు వినవె వోమామ!
అడుగు దర్లక[37] వొప్పు" మనెను పోచయ్య.
*అప్పుడు పోచయ్య ఆడు మాటలకు
వొప్పుగా ముమ్మయ్య వనర యిట్లనియె:
"అప్పకొడుకువుగాక ఆడితివిగాక

*ఈ చుక్క గుర్తుగల పాదము 'వేబోక'లో "అల్లుడు మాటలకు అప్పుడు ముమ్మయ్య" అని ఉన్నది.
35. పేదరికమౌను; 36. కవిలి+ఆవులు=కవిలావులు>కౌలావులు=పుల్లావులు; 37. తరలక=తొలఁగక.

తక్కిన వారయితె తర్కించగలరు
వక్క పందెముకు నీవు వొంటు[38] జెప్పితివి
రెండో పందెము లేదనరాదు
మూడో పందెముకు ధీటు యే"దని ముమ్మయ్య అడిగె.
మామకు సరిపోను మరిచెప్పు పోచయ్య:
"మామరో! వోమామ! సిరిబాల ముమ్మయ్య!
నీ మెడ నున్నట్టి మేటైన[39] సొమ్ము
లక్షలకు దీరిన పచ్చల కంఠమాల
నా మెడనున్న మేటైన తులసియు
వనమాల కంఠమాల వక్కసరిచేసి
భూనాథ! బొంగరాలు పూని ఆడుదాము"
అని యిట్లు పోచయ్య ఆడినందులకు
అనిన అల్లుని జూచి హాగ్రుడై[40] పలికె,

**-: ముమ్మయ్య తన పచ్చల కంఠమాల విలువ చెప్పుట :-**

కడువేగ కోపాగ్ని కన్నులకు కురియంగ
బడబాగ్ని రీతిని పలికె ముమ్మయ్య:
"కళగలుగు నక్షత్రాల కంఠమాలకును
కొయ్యపూసలు సరికోరితివి నీవు
వయ్యనే యిట్లాడ వాకెట్లు దోచెను
చెల్లిలి కొడుకువు గాన చెప్పితిని గాక
చెల్లునా యిటువంటి చిన్ని మాటలును
రావణబ్రహ్మను రణములో బట్టి
కావరం బణచిన కంఠసరిమాల!
తాటక మర్ధించి దనసు యిరిశినయట్టి[41]
ఘనమైన వజ్రాల యీ కంఠసరిమాలకు
ధనకోటి స్తానంబు తగనాడి తెచ్చి

38. ఒంటు (మాండలికము)=ఇముడు, సరిపడు; ఒంటుజెప్పితివి=సరిపడునట్లుగా చక్కగా చెప్పితివి.
39. మేటియైన = శ్రేష్ఠమైన, గొప్పదైన; 40 ఆగ్రుడై; 41. ధనుస్సు విరిచినయట్టి.

*వనరంగ రత్నాల వజ్రకంఠమాలకును
వడ్రంగి చేసిన వనమాల పేరు
దొడ్డ కాగ నీకెట్టు తోచె పోచయ్య?
అమ్మవున్న ధనముకొండ అంగళ్ళ వెంట
అమ్ముదురు కాసుకొకటివార తులసిపేరు
కుభేర చింతనంత కొండవాగులను
నయిలలుగ బెరిగి యెరినైన గలవు
కూలికాండ్లు దెచ్చి కోసి రంపాల
వెలచేసి అమ్ముదురు యినపకాసులకు
వాసికెక్కిన యట్టి వజ్రాల సొమ్ముకు
దాసరి పూసలు సరిశాయ దగున?
గంద్రతనంబులను గ్రక్కున మాని
వుండుమా పోచయ్య! వుచితంబుగాదు"
బాల ముమ్మయ్య పలికిన మాటలకు
కల్లందుల పోచయ్యకు కత్తులు నాటి
కఠినమై యీటెలు కాడినట్లాయ
గురిజేసి బల్లేల గుమ్మినట్లాయ
నారసాలు కంఠాన నాటినట్లాయ
ధారుణి మిన్నును తారసిలి నట్లయి
సమరనిశ్యేకుడు[42] సరగ నిట్లనియ:

**-: పోచయ్య తన తులసి వనమాల మహిమను పొగడుట :-**

"తోచని మాట లాడేవు దొరయింట నీవు
యాచకులు బెట్టుదురు యెటువంటి సొమ్ము
లెఖ[43] దీరిన నీలము[44] నీవు బెట్టినావు
లెఖదేరని సొమ్ము నే పెట్టినాను
మేనమామవు గనుక మించి వకమాట
ఆడితివిగాక నిన్నైన కాదనను

*ఈ చుక్క గుర్తుగల పాదము 'వేబోక' లోనిది. 42. సమరనిశ్శంకుడు; 43. లెక్క; 44. నీలమణి.

తరువు బట్టిన ముమ్మయ్య తాళితి గాక
సాక్షాదిదేవుండు సకల జీవులయందు
వక్షము లేనట్టి యీ వనమాల పేరు
ముగ్గురు త్రయమూర్తులకు[45] మూలస్తంభమైన
జగమెల్ల రక్షించు చెన్నుని వనమాల
పుట్టింప రక్షింప భువనంబులాను
యిట్టి యీ వనమాలకు యీడేడ లేదు
యేనూరు కోట్ల భూమండలమెల్ల
యనభై నాలుగు లక్షల జీవుల నెల్ల
కాపాడు వనమాల కడలేదు నష్ట
శాపము కోపము శాంత గుణములు
వోపిక పోషించు యీ వనమాల పేరు
దాపులె రూపులు ధనధాన్య వస్తువులు
కృపతోడ వనమాల గురువు మోక్షమిచ్చు
యీ వనమాల కొంచాన[46] వున్నదె మామ
కానక ఆడుకుంటె ఘనుడ ముమ్మయ్య
నీసొమ్ము యేమైన నిక్షేపము చెన్నేను
పాషాణమై యుండు బాలముమ్మయ్య
వోమామ! ముమ్మయ్య వకవార్త వినుము
సామెత జెప్పేను జగమెల్ల యెరుగ
మీ తాతలు యేడు తరాలవారు
హతముగా మీ అయ్యలు అయిదుగురు చెల్లిరి
వారికి వచ్చె మోక్షము యీ వనమాలనుండి
యిరువంశములవారికి విహపరములకు[47] త్రోవ
కలిగిన తావు నీకు కలుగ దెలిపేను
విలువైన కంఠమాల భరియించిన తావు
చెప్పుమా ముమ్మయ్య! సంపన్నతనుత

45. త్రిమూర్తులకు; 46. కొంచెమున = అల్పమున, తక్కువ తనమున; 47. ఇహపరములకు.

దెప్పుళ్లు నీవు నేను తెలుపుకోవలెనా?
చెరుకూర మీతండ్రి జగమెల్ల యెరుగు
శిరసున పోట్లునాటి చెల్లిననాడు
హరిహరాదులు మెచ్చంగ అపుడు మీ తండ్రి
శంఖతీర్థము తులసి ప్రసాదము దెచ్చె వేగంబ
పొంకమున ప్రాణనీరు పోసె మాతండ్రి
కాంకామాటలాడకు కార్యంబు గాదు
యికనొకటి ముమ్మయ్య యరగడ్డపాడు
బాలరాజులందరు పయినాలు బోయినారు
కాలము వారికి నిండి నాయేల[48] బడితేను
యిలయెల్ల యెరుగంగ యుద్ధమంచితేను
దేవుళ్లు నీవు నేను తెలుసుకొనవలెను
మీతాత వలురాజు మండలేశ్వరుడు
కరణాల వెనక వేసుకొని కలబోదు[49]
గంగురాజు మీద కదిసి యుద్ధంబు
మీ తాత వలురాజు యిమ్ముగా రొమ్మున యీటెలు నాటి
వృక్షచెయి జంధ్యాలరాజుల సంహ్యారించి[50]
. . . . . . . . . . . . . . . . . . . .
యక్కడికి[51] తగజప్పవు[52] యేమిరో మామ!

**–: *వలురాజునకు తులసి తీర్థము పోయుట :–**

తమవారినుండి మీతాత తండ్రులకు
అమరపురికి త్రోవ అలనాడు కలిగె
బొంకుగా దామాట బొల్లావు పాదమాన!
వావిళ్ల గుట్టలు వంగల బయట
కాపుల కరణాల వెనక వేసుకొని
కలభూత గంగరాజు మీద కదిసి యుద్ధంబు

*ఈ ఘట్టము 'వేబోక' లోనిది. ఇది తాళపత్రగ్రంథంలో అసంపూర్ణంగా, సూచన ప్రాయంగా మాత్రమే ఉంది. 48.ఆవేళ; 49.కలభూత; 50.సంహరించి; 51.ఎక్కడికి; 52.చెప్పవు.

చేసెను ఘనుడు మీతాత వలురాజు
కాలము కురదలించ గంగ దయతప్పె
వురుస్తలాలు[53] మీ తాతకు గాయాలు నాటి
వక్షమున పోట్లునాటి వరిగె మీ తాత
అచ్టో మా తాత తరిముత్త బోయదుండగాను
మీ తాతకు తులసి తీర్థము యిస్తేను
యిహపరములకు త్రోవ గలిగె విబుధనాథుడు మెచ్చె
సురలోక పుణ్యము చూడగలిగేను
అచ్చోట నావనమాల వశీకరము* ఆయ
నీ కంఠమాల యేమి వశీకరము మామ?

**-: సింహాద్రిరాజునకు తులసితీర్థము పోయుట :-**

యింకను వకమాట వినవె ముమ్మయ్య
శ్రీ కూర్మము మీద మీతండ్రి శింహ్వాద్రిరాజు[54]
శ్రీవైష్ణవుల మొరకు సింధుబళ్ళాని రాజు మీద
విడిబడి యుద్ధము చేసి మీతండ్రి శింహ్వాద్రిరాజు
గట్టిగా యెదురొమ్మున గాయాలు నాటి
సింధుబండనిరాజు[55] శిరసు తెగనరికి
చంద్రాయుధము నాటి చెల్లె మీ పెదతండ్రి
అచ్చోట మాతండ్రి మరిముత్య బోయదు వుండగాను
తులసి తీర్థము వేగంబె తెచ్చి
పొంకముగ ప్రాణనీరు పోసె మాతండ్రి
అచ్చోట నా వనమాల వశీకరణ మాయను
నీ కంఠమాల యేమి వశీకరమో మామ?

**-: పెద్దిరాజుకు తులసితీర్థము పోయుట :-**

యింకను వకమాట యినవె వోమామ!
మై మీద పెదతండ్రి మీ పెద్దిరాజు

* వశీకరము (వశీకరణము) = స్వాధీనము చేసికొనుట (ఇక్కడ "ఉపయోగకరము" అనే అర్థంలో వాడబడింది); 53. ఉరస్థలాన; 54. సింహాద్రిరాజు; 55.సింధుభళ్ళానిరాజు.

మారాజ పగలకు మరి దండు కదిలి
యేడేడు కుంభిళ్లు యేర్పడ బొడిచి
కడకుంభిణి మీద కంబమెత్తించి
జముదాళి[56]పోట్లు పెద్దిరాజుకు యెత్తె
తోలుపుగా పాట్ని. . . . . . . . .. .
యిమ్ముగా రొమ్మున యీటెలు నాటి
లక్షహేయి[57] జంజల రాజుల సంహ్వారించి[58]
మస్తుగా పలుగురాళ్లు వెనవద్దను[59]
*ఆర్లపెంట రణమునందు అల్లిమాను వద్దను
అతముగా[60] (చెల్లెను మీ తండ్రి) పెద్దిరాజు
అచ్చోట మాతండ్రి దామసాని పోతినేడు
వుండగాను తులసితీర్థంబు యేగంగ[61] తెచ్చి
తక్కముగ ప్రాణనీరు పోసి మీతండ్రికి
యేయవ్వరము[62] త్రోవగ సాగెను యాదైవము
సూర్యలోక పుణ్యాలు చూడగలిగెను మామ
అచ్చోట నా వనమాల వశీకరమో మామ!
కంతమాల మేమి వశీకరమోయి?

**–: యఱనూకరాజునకు తులసితీర్థము పోయుట :–**

యింకను వకమాట వినవె వో మామ!
యరుకుల పగలకుగాను యరనూకరాజు
యేనుగనాథు కొండకు యేతెంచి పోయి
యరభూపతి రాజు మీద యెదిరించి యుద్ధంబు చేసి
*యెదురొమ్ము గాయాలు యేకముగ నాటి
యేనుగకొండ తావాయ మీతండ్రి యరనూకరాజుకు

*ఈగుర్తుగల పాదాలు 'వేబోక'లోనివి; 56.జముదళము=నిడుపు పిడిగల కత్తి, బాకు లేదా "జెంజాళి" – డేంజాడి = కటారి, కత్తి; 57. లక్షవేయి; 58. సంహరించి; 59. "వన్నెగల పలుగురాళ్ళ వరిగె మీతండ్రి" 'వేబోక'లోని పాదము. 60.హతముగా; 61. వేగముగా; 62. ఈ పదం యేమిటో తెలియడం లేదు. "ఏ వ్యవహారము" అని కావచ్చును.

అచ్చోట మా పులిమద్దుల రాఘవుండు
మహాపుణ్యాత్ముండుండగాను
తులసి తీర్థంబు వేగంబె తెచ్చి
పొంకముగ ప్రాణనీరు పోసె మీ తండ్రికి
అచ్చోట నా వనమాల వశీకరమాయె!
నీ కంఠమాల యేమి వశీకరము మామ?

-: నలనూకరాజునకు తులసితీర్థము పోయుట :-

యింకను వకమాట వినవె వోమామ!
నున్నబెజవాడను మీతండ్రి నలనూకరాజు
కరచుకు పెంతుకు కదిసి పోరాడి
నందికేశవరాజు చేతి నరుకులు తగిలి
నడికల్లున చెల్లెను మీ తండ్రి నలనూకరాజు
అచ్చోట మావద్ద సూరినేడు వుండగను
తులసితీర్థంబు యిచ్చె మీ తండ్రికి
పొంకముగ ప్రాణనీరు పోసె మీతండ్రికి
అచ్చోట వనమాల వశీకరమాయెను
నీ కంఠమాల యేమి వశీకరమో మామ?

-: పోలురాజునకు తులసితీర్థము పోయుట :-

యింకను వక మాట వినవె వోమామ!
*ఆవుల పోలురాజు అతి విక్రమశాలి
శ్రీరంగనాథుని చిత్తాన సేవించి
సీమకు మలిరాగ చెరుకూరి వద్దను
*చెరుకూరికి పడమర చిలకలమర్రి
మర్రి దగ్గర ఆవుల మందలు వుండగాను
జంగాలు వచ్చి మీతండ్రి పోలురాజు మరుగున జొచ్చిరి
మరుగుజొచ్చిన వారల మళ్ల బట్టియక

*ఈగుర్తుగల పాదాలు 'వేబోక' లోనివి.

శ్రీశైలానికి బంపె మీతండ్రి పోలురాజు
జంగాలకొరకు మంచువంటి బోయదండు
(మంచువంటి బోయదండు) మందమీదికి వచ్చెను
(మందమీదికి వచ్చిన) బాణాలు పొగమ్రిమీద వ్రాలెను
*వృక్షము తిరుగు భీకర వీరక్షేత్రమాయె
కాయలు రాలినయట్లు కంపటీలు చెల్లిరి
ఆకులు రాలినయట్లు యాదవులు చెల్లిరి
కొమ్మలు బడ్డంతమేర గోపాలకులు చెల్లిరి
మర్రిక్రింద రక్తము మడుగులు గట్టెను
శలకమంటి రక్తము చిలకలమర్రి క్రింద
ప్రదక్షణముగ తిరిగి పారంగ సాగెను
అప్పుడు మాత్రండి పల్లెకొండ రఘుపతికి
ముప్పయిమూడు పోట్లు ముప్పెళ్ల తగిలి
అరవైఆరు గాయాలు అతిబాధలాయెను
'పట్టలేను ప్రాణములు నిలవలేను బొంది
గంటవేసి కైలాసము అంపవే మామ!'
అని యిట్లు పల్లికొండ ఆడినందులకు
అప్పుడు పోలురాజు విభూతి మంత్రించి
పల్లికొండ గాయాల (పరగంగ) వైచెను
పల్లికొండ గాయాలు కడుసోబె[63] లాయెను
అక్కడ పోలురాజుకు అతిభార మాయెను
నొసట పోటుదాకి మీతండ్రి వరిగి వుండంగ
మాతండ్రి తులసి తీర్థంబు వేగంబె తెచ్చి
పొంకముగ ప్రాణనీరు పోసె మీ తండ్రికి
అచ్చోట వనమాల వశీకరమాయెను

*ఈగుర్తుగల పాదము 'వేబోక' లోనిది. 63. సోబె = సోబియ = సిబ్బెము = దేహమునందు కలిగెడి ఒక దినుసు పొడ.

యెక్కడి తెగజెప్పవు యేమె వోమామ?
నీ కంఠమాల యేమి వశీకరమె మామ?

**-: కల్లందుల పోలినేనికి తులసి తీర్థము పోయుట:-**

యింకను వక మాట వినవె వో మామ!
కల్లందులపోలినేడు రాళ్లదిడ్డి కురువవద్దను
జలాధరుని జంపి శానలు నరికి
గట్టిగా యెదురొమ్ము గాయాలు నాటి
చిత్తు చిత్తుగ పోట్లు కత్తులనాటి చెల్లెను నాడు
అప్పుడు మా తల్లి చిటినూక గుణ్ణాంకు[64]
సాగుమానము గావలెనని చయ్యన లేచి
వొయ్యనే గుణ్ణంకు పయనమై రాగాను
యానాల బాలనై[65] వుంటిని తాను[66]
వల్లవుల కాంతలు తిరుమందుల కాంతలు
శీఘ్రమే వచ్చిరి చిటినూక కొలువులకు
చిటినూక కొలువు సిరితామర కొల్లు
పోచయ్యను పెంచుకొందుమని వేగమే వచ్చిరి
అప్పుడు అఘుమంచి అతివేగ వచ్చి
అందముగ నిమ్మపండు అగ్నిదేవుని కిచ్చిన చందాన
వచ్చిన అఘుమంచి చేతికిచ్చె మాతల్లి
మండలాధిపతితోడ మడిసె గుణ్ణాన[67]

**-: యఱగడ్డపాడులో బాలరాజులకు తులసి తీర్థము అవశ్యకమనుట :-**

యింకను వకమాట వినవె వోమామ!
యరగడ్డపాటికి యిరుబలములును
కదిసి బాలరాజులందరు పయినాలు పోతాము
కాలము వారికి నిండి గాయాలు పడితేను
యిలయెల్ల యెరుగంగ యుద్ధము చేసితేను

---

64. గుండానికి (అగ్నిగుండమునకు); 65. ఏడునెలల బాలుడనై; 66. నేను; 67. గుండాన.

వాలాయముగ బ్రహ్మావ్రాలు చెడితేను
యెదురొమ్ము పోట్లు యీవలావల యెడలితేను
ముదమొప్ప హరితులసి ముట్టక కాని
వల్లవులకు తిరుమందులకు వైకుంఠము లేదు
వుల్లసాలాడకు మామా వుచితంబు గాదు
పందెము సరిపోతె పరగంగ నిపుడు
సందేహ మందక జాలెలు చుట్టుము.”
పోచయ్య మాటలకు పొసగంగ సరిపోయి
ఆచరణతో అల్లుని అతి సంతసించి

**-: బాలురు పందెపు బొంగరము లాడుట :-**

పచ్చల కంఠమాల పరగ వనమాల
సరివంచెలు జేసి జాలెలు చుట్టురి.
పరగంగ నప్పుడు పలికె ముమ్మన్న:
“ఆవులు ధనమును అఘుమంచికి తమరు
భావింప అర్లము[68] పొలిచ్చినాము
వనరంగ వాటికి వప్పరాదు పందెము
వనమాల కంఠమాల వప్పె పందెంబు”
బిరబిర కాసెలు బిగువార జుట్టి
ఆరూఢి బొంగరాలు ఆడంగ సాగిరి.
మునుపు పన్నివొడ్డి ముమ్మయ్య వైచె
వెనుక పన్ని వొడ్డి వైచె పోచయ్య
పోచయ్య పన్నివడ్డి[69]పొసగంగ నపుడు
పుచ్చుకొని బొంగరం పుటమెరసి ముమ్మయ్య
హెచ్చుగా కుంభిణి వెలసినట్టింకు
వోడు గెలుపు లేక వకవిడత నాడిరి.
వడివడి నాడంగ వచ్చె కోపంపు

68. అరణము; 69. పన్ను + ఒడ్డు – పన్ను = పోటీకి సిద్ధపడు, ఒడ్డు = పందెమువేయు.

తగువేడ్క బొంగరాల జాలెలు జుట్టిరి
యగసి కోయని యార్చి యాదవజనులు
యవ్వరు జూచిన యెరుగ రాకుండ
రివ్వున బొంగరము నిలిచి తావైచె
అబ్బురముగా ప్రజలు అందిచూడగను
మబ్బుపొడువు నెగసి మాయ బొంగరము
సభవారికి గానరాకుండ ఝరీన నెగసి

**-: ముమ్మయ్య వేసిన బొంగరము కోమటి అచ్చమ్మ కాలిలో దిగబడగా ఆమె మూర్ఛిల్లుట :-**

యగసెను బొంగరము యవ్వరెరుగకుండాను
దిగదిగ బొంగరము తురుతున వచ్చి
అంత సభవారిలో ఆచ్చర్యము[70]గను
అంతెకాలము[71] వారికి అగుటచే తుదకు
బాటదప్పి అడవిలో పడ్డ చందమున
చేటుకు బొంగరము చేడెకాలు నాటె
ఘరీన మీగాలు కాడె బొంగరము
అరికాలు సరివడ్డి అవనిపై నొరిగె
అదిరిపాటున బొంగరము అరికాలు నాటె
దద్దిర్లి యాకాంత తబ్బుబ్బులాడెను[72]
కత్తివలె బొంగరము కాడిన యపుడె
నెత్తి నీళ్లకడవ నెలత తానపుడు
భుజమున బట్టెను పూబోణి యపుడు
రాజీవనేత్ర తా రగిలి భీతిల్లి
గడగడ వణకుచు కడవ పడవైచె
పడి మూర్ఛబోయెను భామ తానపుడు
ముత్యాల పోలిశెట్టి ముద్దు కుమార్తె

70. ఆశ్చర్యము; 71. అంత్యకాలము; 72.దద్దరిలి యాకాంత తబ్బిబ్బులాడె.

వుత్తమా పతివ్రత వొరిగె ధరమీద
వజ్రాల మల్లిశెట్టి వాసిగల కోడలు
సజ్జనోత్తమురాలు సొమ్మసిలె నంత
ఆకాంత మూర్చిల్ల అందరు జూచి
కోకలు గప్పిరి కూడిరిరుగడల

**-: ముమ్మయ్య అచ్చమ్మకు ఉపచారములు చేయుట :-**

అప్పుడు ముమ్మయ్య హరహరా యనుచు
కర్పూరము దెచ్చిరి కర్ణముల[73] పూరించి
కారున బట్టించి కడునొవ్వకుండ
*పెరికె బొంగరము పిరికి వారకుండ
గ్రక్కున దీయించె కమ్మరి చాత
పుక్కిటి తాంబూలము పొత్తిగా వైచి
పట్టుచీర దెప్పించి పట్టెలుగా జేసి
ఘట్టిగా గాయము కట్టించె నపుడు
గాయము కట్టిన యపుడె యాకాంత వేగంబె
దేహము చమట బుట్టి తెప్పిరాలేచి[74]

**-: అచ్చమ్మ ముమ్మయ్యను దూరుట :-**

అడలుచు యాకాంత అసురసుర యనుచు
ఝుడిసి తోచిన యట్లు తా దూరసాగె:
"అయ్యయో ముమ్మన్న శ్రీహత్య[75] గట్టుకుంటివి
**వయ్యవాడసులెల్ల వారెల యీమాట
ఆడికెలకు[76]లోనైతిని అన్న ముమ్మన్న
తోడబుట్టుకవని తా జూడవస్తి

* ఈ గుర్తుగల పాదము 'వేబోక' లోనిది. **ఈ పాదానికి అర్థం తెలియడంలేదు. "వయ్యన వాడవాసులెల్ల వాడల యీమాట' అని కావచ్చును. (వయ్యన=వ్యర్థముగా); 'వేబోక'లో 'వొయ్యన జనువెల్ల వోర్వలేని మాటలు" అని స్పష్టంగా ఉంది. 73. కర్ణముల; 74. తెప్పరిలి లేచి; 75.స్త్రీహత్య; 76. లోకుల నిందలకు.

నేరము తనవల్ల నింద మోపేరు
కూర్మితో పెద్దశెట్టి కూతురు తాను
కోటికి పడగెత్తినవారి కోడల నేను
తన సాటివారిలో తలవంపు గాను
చెప్పిరి బాలలార! చెల్లబో[77] మీరు
చేకొనరు అత్తవారు జెనుల[78] నోరు
ముయ్యమూకుడు గలద ముమ్మన్న వినుము
పక్షపాతము చేసి పాపము కట్టుకుంటివి
మచ్చికతో పుట్టిల్లు మరి వార లొచ్చేరు
కటకటా!" యనుచు కన్నుల వుదకము
పొటపొట గురియంగ పూబోణి తాను
"పడుచు బాలలు గనుక పాపమెరుగరు గనుక
మూడు ప్రాణములు గొంటివి ముమ్మన్న!" యనుచు
"బలిమి గలిగితె చాల బ్రతుకవలె గాక
నేల మిన్నొట నేడు యెరుగరైతిరి
మీ అయిశ్వర్యముచాత హత్య గట్టుకుంటివి
అందలాలు పల్లకీలు అనిగేది[79] యెరుగరా?
హెచ్చుగా మీయన్నలకు వచ్చిన త్రోవలు
యీక్షణమె మీకు యన్నదు వచ్చీని?
తన వుసురు మీకు యన్నదు తాకేని?"
అని కోమటివారి అచ్చమ్మ కోపించి పలికె.
ఆమాటలు బాలులకు అలుగులై నాటె
భామాడిన మాటలు బాకులై నాటె
సిరిబాల ముమ్మయ్యకు చిన్ని పోచయ్యకు
గురిచేసి బల్లేల గుమ్మినట్లాయ
కల్లందుల పోచయ్యకు కత్తులు నాటి
కల్లిలో పగతులు కమ్మినట్లాయ

77. సంతాపమును సూచించు అవ్యయము; 78. జనుల; 79. అణిగేది.

వల్లవుల ముమ్మయ్యకు వజ్రాలునాటి
బల్లేలు రొమ్మున బదివినట్లాయ.

**–: ముమ్మయ్య తన అన్నల వార్తలు చెప్పుమని అచ్చమ్మను కోరుట :–**

బాలలు కోమటివారి భామను జూచి:
"చాల చక్కని యింతి! సఖియ మెరుగుల దొంతి!
మరుని పట్టపుదంతి! మల్లెపూబంతి!
మరువంపు పూగొమ్మ! మగువ పుత్తడిబొమ్మ!
యలమి నవ్వులకొమ్మ! యలనాగవమ్మ!
అలివేణి! చెప్పుమా అఘుమంచి మారు
పైడివారితల్లి మా పాపన[80]మారు
దయగలిగి యీమాట దాచనైతివి గద
యిప్పుడాడిన మాట నేర్పాటుగాను
చెప్పవే వోయక్క! మాచెల్లెండ్ల మారు
మొనసి కోమటిమాటకు మోసంబు లేదు
కనకాంబరంబులు కట్నాలు సొమ్ములు
దొనకొండనుండినాళ్లు[81] తోడబుట్టుకవని
సారెలు నడిపేము సయిదోడ! నీకు
నేరము లేకుండ నేడు వోయక్క!
వనరంగ మీవారికి వొప్పజెప్పేము
ప్రాణము కలిగిన పరియంతము[82] దనక
పోటిమిగా[83] పుట్టింటికి పోకుండ నీకు
సంతతముగా నీకు సారెలు నడిపేము
నాతి నీవాడిన నవ్వుల మాటలు గావు
బొంగరము నాటమండి[84] పుట్టుపూర్వాలు
ముంగల[85] వచ్చెడి మోసంబు తెలియక

---

80. పాపనూక; 81. ఉండినన్నాళ్లు; 82. పర్యంతము; 83. పోడిమిగా; 84. నాటుటచేత, నాటుటనుబట్టి; 85. ముందర.

ఆడితి వోయక్క! నీ వాడిన మాటలు
కొమరక్క సిరిదేవి కొలువు లోపలను
ఆ మాటలు వారితో ఆనతియ్యవలెను
నలినాక్షి! చెప్పవే నాతోడ నీవు
యలనాగ! మూడు ప్రాణములు యటువంటి వమ్మ?
అమరంగ జెప్పవే అక్కరో! నీవు"
అనిన ముమ్మయ్యతో అలకాంత బలికె:
"మేదిని కుమ్మరి మడిచేసిన[86] కడవ
కాదనక చెప్పేను వడినొక[87] ప్రాణి
నాడొక్క ప్రాణిగా నాయన్న వినుము
మూడు ప్రాణులు గొంటివి ముమ్మన్న! వినుము!"
"అక్క! నీమాటలకు అనుమాన మాయ
యెక్కువగా మాయన్నలు పోయిన త్రోవ
చక్కగా జెప్పవే సఖియరో! నీవు
దొనకొండ రాజులు తర్లిన వార్తలు
దాచక చెప్పుమీ సైదోడ! నీవు
కొంచక యీవార్త గొబ్బున జెప్పుమా?"

**-: అన్నల వార్తలు సిరిదేవికి తెలియునని అచ్చమ్మ చెప్పుట :-**

బాలల మాటలకు పణతి యిట్లనియె:
"కలియుగమున దొనకొండ కదువేడ్కతోను
యేలిన వార్తలు తానెరుగదు గాని
ముప్పయి నేలకోటలు మూడు గిరిదుర్గాలు
యెప్పుడు స్థిరముగా యేలింది యెరుగదు
యలమంచి పంపాద్రి విడిచి యెలపలకు[88] వచ్చి
పాలించి దొనకొండ పట్నమేలంగ
*యిటువంటి వార్తలు తా నెరుగుగాని

* 'వేబోక' లోని పాదము. 86. మడి = పరిశుద్ధముగా చేసిన. "మేదిని కుమ్మరి మేటి చేసిన కడవ" 'వేబోక'. 87. వడిని+ఒక = వడినొక (=ఒడిని ఒక) = గర్భముతో ఒక; 88. వెలుపలకు.

అచ్చోట వరిడి వార్తలవారు
కంఠసరి బాలలార! కడమ వార్తలు యెరుగ
ముమ్మయ్య బొంగరము ములికినాటిన యించుక
దిమ్మబడి యిట్టుల తిట్టితిగాని
నెత్తురు యర్ర జూచి నేడు వంది[89] తాను
మదితప్పి నేనొక మాటాడితి గాక!
చురుకున బొంగరము ములికి నాడిన[90] యందులకు
ధీరులార! మిమ్ము తిట్టితిగాక!
మీయన్నలు బోయిన త్రోవ మీయమ్మ సిరిదేవిని
అతివేగమున మీరడుగుడు పోయి
మీ మేనత్త కొమరక్కను మెచ్చుగా నడుగుడి
అమరంగ జెప్పీని అన్నలార! మీకు
క్రమమున వున్నట్లె కన్నతల్లి జెప్పు
అన్నల చెల్లెలు అఘుమంచి నడుగుడు
వున్నట్లు చెప్పీని వో బాలలార!
కోపపు మనుషులు చేయకుడి మీరు
ఆపద మాటలు అవి నిజము గావు
పగవారి మాటలు పాటింప దగదు
పోరోయి ముమ్మయ్య! పోచయ్య! మీరు
యడపక పురిలోకి నేనెటువలె పోదు?
కడువేగ పంపుడి కంఠసరి బాలలార!"

**-: బాలురు అచ్చమ్మను ఆమె అత్తవారింట దించుట :-**

యింపైన మాటలు వెలది[91] చెప్పినను
కంపటీ[92] లెక్కెడి కనకడండ పాలకి
జెట్టిబోయిన మల్లును శలవడిగి యపుడు

89. వందు = దుఃఖించు; 90. నాడు = గ్రుచ్చుకొను, నాంటు; 91. "యెలది" అని జానపద ఉచ్చారణ. అప్పుడు యతి సరిపోవును; 92. కంపటీలు = ఆలమందలను రక్షించెడి సైనికులు(?);

అట్టిపాలికియందు అతివను కూర్చుండ నునుచి
పరగ బెస్తలచేత పట్టించుకోని
సురటీలు[93] బట్టంగ సూరులై[94] బాలలు
తద్దయు వచ్చిరి ధనముకొండలోకి
పెద్దలయిన కోమటి పెద్దల పిలిపించి
వద్దికతో బాలలు వడివడిగ బోయి
యిద్దరికి తశిరీబులు[95] యిచ్చిరి వేగ
"కద్దు వక నేరము కాయుడ మీరు
చేతప్పి బొంగరము చేరుతెగి వచ్చి
అతివ కాలును నాటె అనుమాన పడక
*అనుమాన పడవద్దు అతివ మీరంగ
నేరము తమవల్లె నింద మోపేరు
వరుసతో పెనుగొండ పురహరులు మీరు
మరివేగ నేరములు మన్నించు" మంచు
ప్రియముగ జెప్పంగ పెద్దలిట్లనిరి:
"పోచయ్య ముమ్మయ్యలయిన
యెంతవారికినైన ఆటల తమిని
వాతప్పు చేతప్పు వచ్చును వినుడయ్య
యిది యెంతపని మీరు వేంచేయు" డనిన
అత్తవారింటికి అతివె నొప్పగించి
అతివేగమున బాలలు తమ అమ్మ సముఖమైరి

**–: సిరిదేవి కొలువు దీరుట :–**

కూటాల నడుమను కురువేళ్ల చవికెలోను
పాటించి యాదేవి భామయో మీరు
పొలతి తా రత్నాల ప్రోలు[96] చేయించె

---

* "అనుమాన పడవద్దు అయ్యలార! మీరు" 'వేబోక'; 93. సురంటీలు = వట్రువ విసనకఱ్ఱలు; 94. శూరులై. 95. తసిలీబులు = (హిందీపదం) బహుమానములు; 96. స్థానము;

తెలివైన శీతాళ దిబ్బెలు[97] నిలిపె
కొమరు[98] బంగారము కుప్పలు బోయించి
కొమరక్క సిరిదేవి కొలువు గూర్చుండి
వియ్యాలు సిరిదేవి యిరుగడల నుండిరి
పైడివారితో పందుముల యరనప్ప
అఘుమంచి మొదలయిన అర్ధాంగలక్ష్ములు
సఖియలు యాదవశ్రీలు సిరిదేవి సముఖాన నుండిరి.

**-: బాలురు అన్నల వార్తలు చెప్పుమని సిరిదేవిని నిర్బంధించుట :-**

పరుగున వచ్చి బాలలు పోటేళ్ల దిగిరి
దరవాజలు జొచ్చి తల్లి సముఖాన
సిరిదేవి కొమరక్కకు శీఘ్రమే మ్రొక్కిరి
కొమరక్క సిరిదేవి గొబ్బున దీవించిరి
గొబ్బున బాలలు కూర్చుండ మనిరి
నిబ్బరముగ బాలలు నిలచి యిట్లనిరి:
"కొమరక్క! వోయక్క! కృపనందులనూక!
సామజగంధులార! శ్రీకాంతలార!
ధారిణీమతులార! వోపణతులార!
శ్రీలక్ష్మి కాంతలార! పార్వతీదేవి!
వొప్పైన వల్లవుల వోపణతులార!
మచ్చికతో వదినె మరదండ్లు మీరు
అలరు వేగుచుక్క అక్క కొమరక్క
అలరు భూదేవి మాయమ్మ సిరిదేవి
పన్నుగా వినరమ్మ! పరాకుశాయక
విన్నపములు చేసేము వినరమ్మ! మీరు
బొంగరము చాతపుచ్చుకొని మేము
అంగనామణులార! ఆడబోతిమి మేము
పాటించి బొంగరాలు పట్టియాడంగ

97. దిబ్బెములు = దీపములు; 98. మనోజ్ఞమైన.

వేటుదప్పి బొంగరము వెలదికాలు నాటె
నాటిన కోపాన నాతి యిట్లనియె:
'మీయన్నలకు వచ్చిన త్రోవ మీకెన్నడు వచ్చును?'
వోయమ్మ! యిట్లని వుల్లసమాడేను
నాటిన నారసాన[99] నాతి యిట్లనియె
ఆ వార్త జెప్పుమంటె ఆమె అలిగిపోయెనమ్మ
నీవు అంతలేక మేమాడిన మాటలు
అన్నలుతో బోయిన వార్తయె మాకు ఆనతియ్యరమ్మ
కన్నతల్లివి గనుక కల్లలాడవని మేము
అడుగంగ వచ్చినాము అమ్మ సిరిదేవి
కడువేగ జెప్పవె? వో కన్నతల్లి!"

**-: సిరిదేవి బాలురను మభ్యపెట్ట జూచుట :-**

ముమ్మయ్య పోచయ్య ముచ్చట వచ్చి
అమ్మయు కొమరగిరి అప్పుడిట్లనిరి:
"వివేక మెరుగని వెర్రి బాలలార!
యవ్వ రెందుబోయి రేమి ఏమిటికి మీకు?
ఆవార్తలు మీకేల ఆటతమి[100] బాలలు
మీ అతిథులు రాజపూజితులుగ వుండగ
*మీ మాటలో జేరు యిద్దరును మీరు
శ్రీమంతులైనట్టి చిన్ని బాలలార!
బొంగరాలాడురని పుట్టిన పొత్తులే కాని
సంగతి యాటలు తా జూడవలెను
తనయుల ఆటలు తల్లి జూస్తేను
ఘనవేగ శెవిర్యంబు[101] గానంగ వచ్చె
ఆడుదు బొంగరాలు అన్నలార! మీరు"
ఆడుమని సిరిదేవి అనిన మాటలకు

* "యేమి మాటలాడేరు యిద్దరు మీరు" 'వేబోక' లోని పాదము; 99. నారసము = ఇనుపబాణము;
100. తమి = మోహము, మైమఱపు; 101. శౌర్యంబు.

క్రమమెరిగి బాలలు కలకల నవ్విరి:
"యేమి మాటలాడేరు యెరుగనివారి వలెను
వాటముగ అన్నల వార్తలు జెప్పితేను
పాటించి బొంగరాలు పట్టి ఆడేము
అన్న వార్తలు అడిగితే మేము
కన్నతల్లివి నీవు కబురు చేసేము
చిన్నవారని మాకు చెప్పరు గాబోలు
వున్నట్లు మాకు వప్పడ చెప్పితేను
యెరిగి వుండేము తల్లి యాల దాచేవు?
గురుతుగా జెప్పవే చెక్కర[102] నందులనూక!"
ముమ్మయ్య పోచయ్య ముచ్చటలు వినియు
అమ్మయు కొమరక్క అప్పు డిట్లనిరి:
"యేరువ[103] దొనకొండ అన్నలు యేలుచున్నపుడు
*ధరణిలో మాన... బాలలు మీరు
విషవాక్కులు గోరేరు వెర్రిబాలలార!
యక్కడెక్కరివారు హెచ్చరికతోను
గ్రక్కున వేటలాడ కదిలిపోయినారు
దేవస్థళాలు కొందరు త్రిపురాంతకము
భావజ గురుడైన పల్లికొండ రఘుపతి
మారకాపుర చెన్నరాయునికి మహాసంభ్రమముగాను
శావలు సేవించి శనివారమునాడు
మగటి[104] వస్తున్నాదురోయి మాయన్నలార!
పరగంగ కరియావుల పట్టభద్రుండు
పర్వతపు మలల వెంట పందివేటలాడి
వురివీశ్వరుడు తిరిగి వస్తున్నాదురోయి!
యిరుగలసాని నరువ[105]వద్ద నిలిచి

* "పరిణాన వున్న బాలలు మీరు" 'వేబోక' లోని పాదము; 102. చక్కెర; 103. ఏఱువ = విలాతి, దేశము, సీమ; 104. మగుడి = మరల, తిరిగి; 105. నరవ = కొండత్రోవ.

నాటకసాల ఆడిస్తువుండినాడు నాయన్నలార!
మాటవాసిగలదు మన్నె శింహ్వోము[106]
ఘడియలో బట్టావుల ఘనుడు వల్లభన్న
త్రిపురాంతకపు దేవునికి తేజంబుతోను
కృపతోను జంగమార్చన గొబ్బున చేయించి
కల్లూరి భావప్పకు గరుడశావ చేయించి
వల్లవకులజుండు వస్తున్నాదురోయి
త్రైలోక్య మాధవుడు ధన్యు దయితన్న
కైజీతపుదొరలు కలిగిన బాంధవులు
వెలిగొండ సాల్వున వేటలాడ బోయినారు
బలువైన మృగముల పంది యెలుగులను
గొలుసుల బట్టించుక కొంచు[107] వస్తున్నామని
వాలాయముగ జాబులు వ్రాయించినారు
కొమరమ్మ వుత్తమరాజు కొందరు దొరలు
అమరంగ పూరిమెట్ట వారికి వేవేగ
తిరుపతి తిరునాళ్ల సేవించి వేగ
వూరిమెట్లరాయునికి వుత్తమరాజు
పేరిడివాండు గనుక పెండ్లి సేయించి
వస్తున్నామని జాబులు వ్రాయించినారు
సుస్తిరముగా[108] దొనకొండ సోమవమిశమంత[109]
వరుసతో నేటరేపట వచ్చేరు బాలలార!
తిరుమందులు వల్లవులు స్తిరమై వున్నారు
చల్లవారును బొల్లావు చట్టువారి యర్రయ్య
పైయ్యల యరణన్న పద్మరాఘవుడు
వైనాన బీరన్న వారి గోసంగులు
బసువన్న యెద్దులు బలువైన ఆవులు

106. మన్నెసింహమ్ము (మన్నెము=కొండభూమి) – కొండభూమికి సింహమువంటివాడు.
107.కొనుచు; 108. సుస్థిరముగా; 109. సోమవంశమంత;

పశువుల దక్షిణాదిని పరిణాన మేపుకొని
పాలేరు దాటితిమని పట్టభద్రుండు
ఆ రావు[110] వార్తలు అన్నియు వ్రాసి
కాటమరాజు తన పేర కమ్మలంపినాడు
వాటముగ కాలారి[111] వచ్చెను మొన్నను
వస్తువులు యెక్కడెక్కడనుండి వచ్చేది యెరుగరు
వస్తువులు దొనకొండకు రాగాను జూడరు
ముప్పయి నేలకోటలు మల్నాడు గిరులు
యిప్పుడు స్థిరమై యేలుచున్నారు
బాలలార! అంతేసి పనులేవి లేవు
జాలెలు జుట్టిన సముఖాన మీరు
ఆడుడు బొంగరాలు అన్నలార! యిపుడు"

**-: తమ్ము దీవించి పాలేటికి పంపుమని బాలురు సిరిదేవికి ఆనలు పెట్టుట :-**

ఆడుమని సిరిదేవి ఆనతిచ్చినను
కడువేగ ముమ్మయ్య కల్లందుల పోచయ్య
అమరంగ వకమాట ఆడిరప్పుడును:
"తల్లిరో! యీమాట దాస్తివి నీవు
కల్లలాడితివి నీవు వోకన్నతల్లి!
అందరి కన్నిపనులు అమ్మరో! నీవు
వద్దన మాటలు బెట్టేవు తల్లి సిరిదేవి!
నీలాటి రేవున నిండు కడవలవారు
వాలాయముగ దొనకొండ వారువీరనక
చెన్నార విద్యలు చేడెల మాటలు
*వాలాయముగ పోయిన వార్తలైన వింటిమి
అన్న మందనుండి అతివేగమునను
కాలారి మారన్న కమ్మలు దెచ్చెను

* 'వేబోక' లోని పాదము. 110 ఆ రావు = ఆంధ్రదేశమందలి. 111. దూత.

కమ్మలు చదివించెను ఘనుడు అయితన్న
కమ్మలు నీవు విని కడు మూర్ఛబోయి
సొమ్మసిలి పోతేను చూచి అఘుమంచి
భ్రమనీకు తెలుపదటె పణతి సిరిదేవి?
యేవార్తలు మేము యెరుగమటె తల్లి?
వోతల్లి! అన్నల వార్తలన్నియును
అతివేడ్క మిమ్ము అడిగితిమిగాన
దేవాధిదేవతలు దివ్యమానవులు
భావింప రథములు పంపిరివేగ
జాగాలు మహాసంభ్రమ మాయనని
ఆగతి వ్రాయించి అంపినారే తల్లి!
బ్రహ్మత్రయమూర్తులు బాటలు నరికించి
శ్రీకూర్మము కళ్యాణపు జాబులు
యేనుగనాథుకొండకు యెరుకగా పంపించి
బెజవాడ వద్దను భక్తులు బోనాలు పెట్టి
కాపురాలు చెరుకూరికి కదిలివచ్చిన వార్తలు
జాబులు వస్తేను చదివించుకొంటివి
యీ భూమి రాజ్యము యిన్నాళ్లు యేలితిమి
చాలు వెళ్ళెను తల్లి సరసంబులందు
అతనికి ఛత్రాదు లంపవే తల్లి!
అంత్యములు వచ్చింది అమ్మ నీవెరుగవ?
చింతింప పనిలేదు శివుని దూరంగ వలదు
శమను తోరణకట్టిరి[112] శలవిచ్చి మమ్ము
అమరంగ పాలేటికి అంపవే తల్లి!
పంపితే నీకు ప్రజ్ఞ దక్కునమ్మ
అంపకుంటివైన అపకీర్తి నీది
బసువన్న పాదమాన! పంపకుంటివైన

112. శమను=యమునియొక్క, తోరణకట్టిరి = తోరణము కట్టిరి.

యసగంగ త్రైమూర్తులు యెదురు చూచేరు
అన్నల పాదమాన! అంపకుంటివైన"
మన్నీని తమ్ముని మాటలు వినిరి
కర్పూరగంధులు కడుచిన్నబోయి
వొప్పుగా వొకమాట వనరంగ బలికిరి:

**-: ఆయుధములు చూపి సిరిదేవి బాలురను భయపెట్ట జూచుట :-**

యెటువలె జెప్పిన యెరుగరు బాలలు
మాటల నిలుపలేము మనస్సు యెరుగ తాను
ధీరత యిద్దరి దిట్టతనము జూతాము
సురియలు దెమ్మని సిరిదేవి బలికెను
సురియలు చూచిడకకాని[113] స్రుక్కరుబాలలు
అలుగులు చూడకకాని అణగరు బాలలు
భయపడకకాని పయనంబు మానరు
అట కలిపోలు[114] బోసి ఆయుధాలు దెప్పించిరి
పటుతరముగ నిలిపిరి పరుజులు[115] కిందుగాను
ఆయుధాలు జూచి బాలలు హాగ్రులై[116] నిలిచిరి
భైరవుని పగిదిని ఆర్భటములు చేసిరి
సురియలు చూస్తానే[117] బాలలు శూరులై నిలిచిరి
వెరువక బాలలు వీరభద్రుని రీతి
పెడబొబ్బ లార్చిరి పృథివి కంపింప
బడబాగ్ని రీతిని పలికి యిట్లనిరి:

**-: అలుగులపోలు చూచి బాలురు వీరాలాపము లాడుట :-**

"అమ్మరో సిరిదేవి! ఆయుధాలు దెప్పించి
నిమ్మళాన నీవు నిలిపితివి తల్లి!

113. చూచి విడువక కాని; 114. కల్లిపోలు – కల్లి = యుద్ధము, పోలు = పెండ్లిలో పందిట్లో నలుచదరముగా గురుగులు పట్టి, వాటిని కలుపుచు దారము చుట్టి, చుట్టును ధాన్యము పోయుట. ఇక్కడ "కల్లిపోలు" అనగా "యుద్ధములో ఉపయోగించెడి ఆయుధములను పూజించుట" అని అర్థము చెప్పుకొనవలెను; 115. పరుcజు = కత్తిపిడి; 116. ఆగ్రులై; 117. చూచుటతోడనే.

నవ్వులకు నిలిపితివివా నా తల్లి నీవు?
ఆ వార్తలు జెప్పక అడుగు తర్లనీయము
కన్న మందెమేళమున కానీవు గాక!
యెన్నంగ లోకాన యెదురెవ్వరు తమకు
నారసాలు[118] తమకు నదురటే[119] తల్లి?
చేరి పగతుల నుగ్గుశాయగలవారము
సురియుట[120] జీవితమ్ము స్రుక్క[121] నాడెదవు
కఠిన రొమ్మున కాడించుకొందుము
అలుగులు[122] చూపి మమ్ము అదలించ వస్తె
*వాతకలగక ముకుదు యెల్లగల సాడగు
వుల్లసము లాడకె వుచితంబు గాదు
కల్లరి రిపులను ఖణ్నింప[123] గలము
చేడె ఆడిన మాటలు చెవుల విన్ననుండి[124]
కడుపులో బాణాలు కళపెళమనుచు
తిరుగుచున్నవి మీకు తెలియదు గాక!
వూరువారాడిన వార్తలు వింటేను
అప్పటినుండి తమకు అలుగులు నాటి
గుప్పున గుండెలు గుచ్చినయట్లు
ఆడవారాడిన ఆడికెలకు[125] తల్లి!
దండిగా శరములు తాకినట్లాయ
యిల ఆయుధాలు జూచి యిట్లు బెదిరితేను
ఆలములో వైరుల హతము చేసేమ?
యడపక యీవార్త యెట్లు ఆడితిరి
గడి[126]నుండి పెద్దిరాజు కమ్మ లంపితేను

---

*ఈ పాదం ఏమీ అర్థం కావడంలేదు. "తొలగక మొనలపై దూకుదుమా తల్లి?" అనే పాదం 'వేబోక'లో దీనిస్థానంలో ఉంది. 118. ఇనుపబాణములు; 119. భయపడుట; 120. చలించుట; 121. స్రుక్కు = వెనుదీయు, భయపడు; 122. కత్తులు (ఖడ్గములు); 123. ఖండింప; 124. విన్నప్పటి నుండి; 125. ఆడికలకు = నిందలకు, దూఋలకు; 126. కోట.

యెన్నాళ్లు పట్నమేలను యడలె ముందట
పన్నుగా అయితన్న మూడు ఘడియలు పట్నమేలి
ప్రాణబంధువులతో పాలేటికి దర్లె
ప్రాణంబునకు వెరచి పంతంబు విడచి
ప్రాపుచేసుక యింట్లో పరగ దాగితేను
అపకీర్తి వచ్చును అన్నలు వింటేను
యిఘనైన[127] బోకుంటె యిహపరములకు త్రోవ
లేకపొయ్యాని తమకు లేమరో! వినుము
క్రమమెరిగి కాశిబోయిన కంఠమాల గురువు
రాశ్యము[128] జెప్ప మమ్ము రమ్మని పోయినాడు
హేషశము[129] కాశిలో యెరిగించ కుంటేను
యతీశ్వరుడు మమ్ము యన్నటికి నమ్మడు
సదాశిముడు[130] తమకు సాయుజ్యమియ్యడు
దూరము దెలిసి దీవించు మమ్ము
అరయంగ పాలేటికి అంపవే తల్లి!
చెరుకూర పోలురాజు చెల్లిననాడు
ఆరువేల వల్లవుల ఆరువేల తిరుమందుల
పన్నెండువేల యిండ్ల బంధువులనెల్ల
పిన్నల చేపట్టి పెంచుమని తండ్రి
అప్పగించె పల్లికొండకు అయ్య పోలురాజు
అప్పగించిన పూట అందరిని దోడుకొని
పోయినాడు హరిగురువు పూట వప్పగించి
యిప్పుడు మేము కదిలిపోకగాని
వొప్పదు తమతండ్రి వోయమ్మ! వినుము
వేవేగ పంపవే యరగడ్డపాటికి
పూట వప్పిన వెనుక పోయి కాశిలోకి
కంఠమాల భక్తిరన్నను గ్రక్కున నడిగి

127. ఇకనైన; 128. రహస్యము; 129. హేష్యము=నిమిత్తము, కారణము; 130. సదాశివుడు;

తోడి తేబోవలెను త్వరితము తమరు
యడమలేదు దెవసాలు[131] యిద్దరము బోయి
పలుకరించక కాని భక్తిరన్న రాడు
అలరంగ మమ్ముల అంపకుంటివైన
పోకమానము మేము పొలతి సిరిదేవి!
చేకొని పంపకుంటె శ్రీహరి పాదమాన!
యిట్టిమమ్ము పంపకుంటె యీశ్వరుని ఆన!
దిట్టముగ పంపకుంటె దేవేంద్రలోకాలు
పట్టి కొల్లలాడుదుము మా ప్రజ్ఞ జూడు తల్లి!
వినవమ్మ సిరిదేవి! యింద్రాది సురలు
దొనకొండ లోపలికి తోడితెత్తుమా తల్లి?
మునుపు పోయినవారి పోట్లాట ముందుగాక తలికె[132]
వెనుక బోయినవార ముంపడితోన యదరె
వుక్కుటలుగుల మీద వొరగవా తల్లి?
అక్కడివారి కయ్యమందక తొలికె[133]
వొడ్డిన పంజులమీద వొరగవలె తల్లి!
దొడ్డుగా[134] చల్లవారు తొలినుండి యుద్ధము
అడ్డావు కట్టను ఆవు పోట్లాట
మర్నాడు బీరన్న మంగోలిపాటను
అరయంగ యుద్ధము అయిదోనాడు తమరు
ఆవులకు యెద్దులకు ఆరోనాడు జరుగు
వేవేగ రాజు రాఘవునికి యేడోనాటి యుద్ధము
మునుపుగా జగడము ముదమొప్ప జేసి
కనకగొలుసు లంటక దీవించి వత్తుము
యిద్దరికి మోక్షము యిహపరముల త్రోవ
కందువతొ తమ్ముని కలవవలె తల్లి!

131. దివసాలు = దినములు. 132. ముందుగాక ముందే; 133. అందకముందే "తలికె, తొలికె" (జానపద భాష) = "అంత లోపల", "అంతకు ముందే" అని అర్థం; 134. దొడ్డుగా = గొప్పగా;

అమ్మరో! దీవించి అంపకుంటివైన
కొమ్మరో! బండారము[135] కొల్లలాడుదుము తల్లి!
అతివేగమున నీవు అంపకుంటివైన
శీతాళ దిబ్బెము చిందుజేతుము తల్లి!
పలుమారు మీతోను పట్టాక తగదు
అలుగుల పోలంత హతము జేతుము తల్లి!
మోదముతో వొకమాట ముదమొప్ప వినుడ
మేదిని కొల్లారు మేలుకొల్పి పంతము
పోవలె పాలేటికి పొద్దులేదు తల్లి!
దీవించి పంపవే తీవ్రముగాను
విడెమిచ్చి తిరుమూళ్ల[136] వీరశాస[137] యిచ్చి
కడువేగ పంపవే! వో కన్నతల్లి!
మారుమాటలాడితివైన మామీద యాన!
సిరిదేవి చెరుకూరి శిలల పాదమాన!
పల్లికొండ పాదమాన! పంపకుంటివైన
బొల్లావు పాదమాన! పోవలె తమరు
అఘుమంచితోడు! మమ్ము అంపకుంటివైన"
దిక్కరించి బాలలు ధీకొని పలికిన
యన్నంగ కొమరక్క వెలది సిరిదేవి
చిన్నబోయి యిద్దరు శిరసులు వంచిరి

**-: బాలురను యుద్ధమునకు పంపుమని అగుమంచి తల్లికి చెప్పుట :-**

అప్పుడు అఘుమంచి అన్నల చెల్లెలు
వప్పుగా తల్లితో వినగ యిట్లనియె:
"కొమరక్క! వోయక్క! కృపనందుల నూక!
భ్రమలు మీకేటికి వోభామలార!
దక్షిణాది భూమికి ధనముకొండనుండి

135.బొక్కసము, ధనము. 136. వీరసేసలు = యుద్ధమునకు పోవు వీరుని శిరస్సుపై చల్లెడి అక్షతలు; 137. తిరుముడుల = జడలు కట్టిన జుట్టుమీద.

అక్షయము ఆవుల మేపబోవంగ
కాటమరాజులమీద యింత కరుణ లేదాయ!
బట్టావుల వల్లభన్న పరగ యరణన్న
కరియావులరాజు మీద యింత కరుణ లేదయ్య!
పరవారిగా జూచి పంపితి వో తల్లి!
ఆవులనుండి దక్షిణాదికి అంపిననాడు
నవ్వుచు నుంటివి వో తల్లి! నీవు
అయితన్నను పాలేటికి అంపేటినాడు
ధైర్యము విడిచి నోట తడిలేక వుంటివి
వకరిని వకచూపు వకరిని వక్కచూపు
వలపక్షనంగా జూస్తివి వోయమ్మ! నీవు
నీకు యిటువలె జాయ నిమితంబు[138] గాదు
కోమాళ్ల మీద నెల్ల కృపనందుల తల్లి!
సమముగా జూడకుంటె జనులు యెన్నేరు
ముమ్మయ్య పోచయ్య అంటె మోహమొ తల్లి!
సమ్మతము గాదంటి సందియ్యవు నీవు
కయ్యము వచ్చినవేళ కన్నతల్లివి నీవు
వయ్యక యేరుశాయ[139] వలదమ్మ! నీకు
బాలల దీవించి పంపితివైన
మేలు దక్కును నీకు మేదినిలోన
మాటలు కథలై మరి నిలుచుగాని
దిట్టము దెచ్చుక బాలల దీవించి పంపు"

**–: బాలురను యుద్ధమునకు పంపజాలక సిరిదేవి దుఃఖించుట :–**

కూతురి మాటలు విని కృపనందుల నూక
కాంతి మూర్తి దప్పె కాంతకు నపుడు

138. నిమిత్తము = నియమించుట, ఏర్పాటు; 'వేబోక'లో ఇచ్చట "విహితంబుకాదు" అని ఉన్నది. అది మంచి పాఠముగా తోచుచున్నది. ఈ శబ్దము "నియతంబుగాదు" అని కూడ కావచ్చును. నియతము = నియమము కలది, నిత్యమైనది. 139. వేరుచేయుట.

కడుపులో దిగులు బుట్టి కడు భీతినొంది
వాలుగన్నుల వెంట వచ్చె కన్నీరు
కలవరపడుచును కాంత సిరిదేవి
తాగన్న కూతురిని తప్పక జూచి
"అక్కన![140] వుపకారము ఆడవైతివి నీవు!
యెక్కువలు దెలిపేవు యేమి పగ వుండేనె?
తోడబుట్టిన తోడు దొడ్డదందురు జనులు
అడుగవైతివి మాటలు పెంపుజేసేవు
కన్నతల్లిని నేను కడు చిన్నబాలలు
*పన్నిన ఈటెలమీదికి పంపుదునె యెట్లు?
చూచిచూచి పగవారి సురియల మీదికి
యీచిన్నబాలల యెట్లు పంపేది తాను?
ఆటపాయపు బాలలు అఘుమంచి వినవె!
పోటుకు యెటువలె పొమ్మందు నేను?
*బాలల దీవించి పగవారి మీదికి
*యేలాగు పంపుదుమో వెలది అగుమంచి?
మంచిదిగా బెరిగిన భుజబల భీముల
పగవారి యీటెల పాలెట్లు జేతు?
గర్భాన బెంచిన కంఠసరి బాలల
యేరీతి పంపుదు యేమని వారిమీదికి?
చెల్లబోరగ వీరు మన్నెశింహ్వముల[141]
బల్లేల మీదికి పంపేది యెట్లు?
యేకాదశరుద్రుల యేమని వారిమీదికి
అఘుమంచి యేరీతి అంపుదు నేను?
**యేకాదశరుద్రుల వల్లభుల పసులపాతట

---

* ఈ గుర్తుగలవి 'వేబోక' ప్రతిలోని పాదములు; **ఈ పాదానికి అర్థము కుదురట లేదు "పదరె బాలుల పసులపాతరిలోకి" అని 'వేబోక' లోని పాదము. 140. అగుమంచికి మరియొపేరు. 141. మన్నె సింహములు.

కాదనక నేనెట్లు కల్లి[142] కంపుదును?
పనసపండ్ల సూరవిడిచి[143] భక్తిరన్నను గంటి
గొనకొని పాలేట కూలేది యెరుగ!
అరటిపండ్ల చూరవిడిచి అయితన్నను గంటి
అరయంగ పాలేట అణగేది యెరుగ!
ముత్యాల చూరవిడిచి ముమ్మన్నను గంటి
కత్తుల పాలయ్యేది కాంత! నేనెరుగ!
సూర్యకాంత నోములు నోచి సూర్యులగంటి[144]
మురిపెము పాలేట మునిగేది యెరుగ!
చంద్రకాంత నోములు నోమి చంద్రులగంటి
చద్రులు పాలేట సమిసేది యెరుగ!
దేవకాంత నోములు నోచి దేవతలగంటి
ఆవులన్న పగదెచ్చునని అక్కన్న! యెరుగ!
ఆరవెల్లి వద్దను ఆడిన మాటలు
నేరము వచ్చేది నేనెరుగనైతి
కాటమరాజు తనయింట కాలమృత్యువు అవుట
యిటువలె చేయునని యెరుగంగ నయితి!
యర్రయ్య మాయింట యముడై పుట్టె
యేరువులకు[145] పగదెచ్చేది నేనెరుగనైతి!
బాగుగా ధనరుణాలు పంచిపెట్టినట్లుగాను
పగ పాలుపెట్టుమంటినా బావురే దైవమా!
పంపాద్రి యలమంచిన పరిణాన బ్రతుకంగ
చంపదెచ్చె పల్లికొండ తానేమి సేతు?
రామకుల గోత్రమ రమణి యో కూతుర!
యముడాయ పల్లికొండ యేమిసేయుదును?
సోమవంశమంత శోధించి పాలేట

142. కల్లి = యుద్ధము; 143. చూఅవిడిచి = కొల్లపెట్టనిచ్చి. 144. "శూరులగంటి" అని 'వేబోక' లోని పాదము; 145. ఏఋవ = విలాతి, దేశము, సీమ.

యెముడు[146] దివ్యెబెట్టి వెదికేది[147] యెరుగ!
పాయక దొనకొండ పట్నమంతయును
కాయలు గొట్టిన మానౌట కానలేనైతి!
తల్లిదండ్రిలేని తనయుల దోడుకొని
తల్లి వున్న బాలల తావుంచడాయ!
సంతులేని బాలల తా తోడుకపోయి
సంతుగల్గిన అయితన్నను తా వుంచడాయ!
భద్రేభములవంటి బాలల పంపుచుండేని
నిద్రెట్లు వచ్చునే నేడు వోయక్క?
పాండవార్జుననివంటి బాలల బంపుకొని
గుండె కూడుబట్టునటె కూతురా! తనకు?
ధనముకొండన పండిన ధాన్యాదులెల్ల
గోనెలబట్టి పాలేటికి కొంచపొయ్యేది[148] యెరుగ!
హరిహర బ్రహ్మాదులు అందరు గూడి
కోరుదాలు చేసేది కూతురా! యెరుగ!
ధనముకొండ ఫలములు దక్షిణ పాలేట
పనివడి వేగ వారు పంచిపెట్టేది యెరుగ!
కోమటి అచ్చమ్మ కోపపు మాటలకు
ధీమంతులకు యీటెలై తగిలేది యెరుగ!
అత్తింటి కోడండ్లు ఆడిన మాటలు
పొత్రపు నేజాల[149] పోట్లాయ గదవె!
అమ్మయింటి బిడ్డలు ఆడిన మాటలు
అమ్మలార! బాలలకు అంబులాయ గదవె!
అల్ల చెడుమాటలు అఘుమంచి వినవె
పోచయ్యకు బల్లేల పోట్లాయ గదవె!
ముత్యాల పోలిశెట్టి ముద్దుల కూతురి మాటలు

146. యముడు; 147. "యెదికేది" అని జానపదుల ఉచ్చారణ. 148. తీసికొనిపోయేది;
149.నేజాలు=ఈటెలు;

వుత్తమ క్షత్రియులకు వుక్కుటలుగులాయ
వజ్రాల యెల్లిశెట్టివారి కోడలి మాటలు
బొజ్జలో జముదాళి[150] పోట్లగుట యరుగ!
యలమంచి ఆకుతీగె యెరువుకల్లెనని వుంటిమి
చెలరేగి పూగొమ్మలు చిదిమేది యెరుగ!
మొదళ్లు పడినాక[151] మోసులు[152] తిరుగ పెట్టెను
విధిదప్పి మేను అదిరేది యెరుగ!
కొయ్యకొంప లిగురుబెట్టి[153] కొంచెము పండెను
అయ్యయో! యేరువలు అతినిష్ఠ నుండంగ
పండిన పైరంత పాలేట వెట్టి
దట్టంగ పగవారు తరిగేది యెరుగ!
కటకటా బాలల కల్లి కంపితేను
తాటేకు మంటగదె తనకు వోయక్క!
ముమ్మయ్య పోచయ్య మునికల్లి కంపితేను
కుమ్మరామము[154] చిచ్చుగదే కూతురా! తనకు
తెగిచేసి[155] బాలల దీవించె నంటినా
మొగిలి మాను సొదగదె[156] ముదితరో! తనకు
పగవారి మీదికిని బాలల పంపుమంటివి
తగునటే అక్క! నీకు దయలేదు గాక!"
దయతోడ సిరిదేవి దద్దిర్లి[157] పలికిన
భయము దెలపంగ సాగెను పణతి అఘుమంచి
సిరిదేవిని జూచి సామితెలు[158] గాను
చేరి అఘుమంచి బుద్ధులు చెప్పంగ సాగెను:

**–: అగుమంచి తల్లికి ధైర్యము చెప్పుట :–**

"తల్లిరో! నీకొక్క ధర్మంబు దెల్పేను

150. జముదళము=నిడుపు పిడిగల కత్తి, బాకు. 151. పడిన వెనుక; 152. మోసులు = మొలకలు; 153. ఇగురుబెట్టి = చిగురించి; 154. కుమ్మరావము; 155. తెగువ చేసి; 156. చితిలోని అగ్ని కదా!; 157. దద్దరిల్లి; 158. సామెతలు.

తొల్లిటి వారికన్న దొడ్డటే వీరు?
రామలక్ష్మణులు తొల్లి లంకపై రాగ
కంసల్య[159] దీవించి కానలకంపదా?
యిలయెల్ల యెరుగంగ పుత్రుల దీవించి
అలనాడు కుశలౌల[160] అంపదా సీత?
వూర్జితముగ[161] దీవించి వనర యశోద
అర్జుని మీదికి కృష్ణుని అంపదా నాడు?
హనుమంతుని దీవించి అంజనీదేవి
పనివడి పంపదా పాతాళలంకకు?
పరశురాముని దీవించి పరగ కార్తవీర్యుల మీదికి
ఆరూఢి రేణుక అంపదా తల్లి?
కౌరౌవుల[162] మీదికి ఘనుల పాండవుల
ఆవేళ కుంతిదేవి అంపదా తల్లి?
ఆర్గురు చక్రవర్తులు పదహార్గురు రాజులు
హతమై పోయారు అలనాడు తల్లి!
వారికన్నా దొడ్డ వారటె వీరు?
బాలల దీవించి పంపవే తల్లి!
నేలమిన్ను గలంత కాలము నిలచీని మాటలు
గ్రక్కున దీవించి కన్నతల్లి పంపవలె"

### -: సిరిదేవి బాలురను దీవించుట :-

అఘుమంచి మాటలు విని అమ్మ కొమరక్క
ఆయుధాలు విడియములు[163] అపుడు బుచ్చుకొని
దీవించసాగిరి తెరగొప్ప నపుడు:
*"ఆచంద్రతారార్కమై అవని లోపలను
*పోచయ్య ముమ్మయ్య! పురహరుల బోలి

---

* ఈ గుర్తుగల పాదాలు 'వేబోక' లోనివి. 159.కౌసల్య. 160.కుశలవుల; 161. ఊర్జితముగ = దృఢముగా, ఉత్సాహముగా; 162. కౌరవుల; 163. వీరతాంబూలములు.

వర్ధిల్లు ముమ్మయ్య! వాసుదేవు కృపను
*మర్దించి పగతుల మట్టిమల్లాడి
వాయునందను బోలి వర్ధిలుడ! మీరు!
పోయిరా కల్లందుల పోచయ్య! మీరు!
రామలక్ష్మణుల బోలి రారయ్య! మీరు!
భైరవుని పగిదిని బలముల ద్రుంచి
జయమంది రారయ్య! చిన్ని బాలలార!
సూర్యుని చంద్రుని సురలను బోలి
మరివేగ దొనకొండకు మగిడి రారయ్య!
పయికొని వచ్చిన పగతులను జూచి
*జేయించి రారోయి సిరిబాల ముమ్మయ్య!
*తరిమి పగతుల బట్టి తలలు ఖండించి
*భోరున తిరిగి రావోయి ముమ్మయ్య!
*ఆవులన్నను జూచి, అయితన్నను జూచి
ఆవుల యెద్దుల అన్నిటి జూచి
పల్లికొండను జూచి, బాలరాజుల జూచి
సాహసులైనట్టి చల్లవారు యెల్లవారు
బొల్లావుల జూచి, బసవన్నను జూచి
అదరక బెదరక అన్నలార! మీరు
గొదకొని బీరన్న గోసంగుల జూచి
బలరామ కృష్ణుల పార్థివుల బోలి
బాలలార! జయించి పరిణాన రండి!
బలువైన కార్యమయితె బాలలార! వినుడి!
బావలు మరుదులు బంధువర్గముతోను
కాలుకాలు[164] మొనసుక[165] కయ్యంబు సేయుడా!
వాలాయముగ కాశిబోయిన వల్లవుల గురువును

*ఈ గుర్తుగల పాదాలు 'వేబోక' లోనివి. 164. ప్రతికాలిబంటును (కాలరిని/కాలారిని); 165.మొనయు = మార్కొను, ప్రతిఘటించు;

వార్త హేష్యము[166] వయ్యనె[167] అడిగి
మూర్తుల పంపున మోసపోక మీరు
యిలలోన బాలలార! యింద్రుని బోలి
తలపువ్వు వాడకతొలికె[168] ధనముకొండకు రండి!
మేలువార్తలు గొంచు మేటి దొనకొండకు
రాజపూజితులై రారయ్య! మీరు!"
తేజముతో దీవించి తెరగొప్ప నపుడు
అమ్మాను కొమరక్క ఆయుధాలు విడియము[169]
ముమ్మయ్యకు కొమరక్క ముద్దుగా నిచ్చెను
సిరిదేవి పోచయ్యకు శీఘ్రమే యిచ్చె
సురియలు[170] బుచ్చుక బాలలు సూరులై[171] యపుడు
అత్తకు సాష్టాంగము అల్లుడు మ్రొక్కెను
ముత్తవకు సాష్టాంగము మ్రొక్కె పోచయ్య
బాలలకు అఘుమంచి పళ్ళేలతోను
పొలుపొంద అన్నము భోంచెయ్య బెట్టెను.

**-: ముమ్మయ్య పోచయ్యలు పాలేటికి ప్రయాణమగుట :-**

బాలలు భోంచేసి పయనంబులైరి
యెలమితో సంగడీలు యేర్పడిరంత
బోడికెలు భోంచేసి పొట్టేళ్ల బట్టిరి
గొడుగులు బలు పడిగెలు కోలుటెక్కెములు
అనోవేగమున తులవలు[172] అరిగెలు[173] బట్టిరి
ఘనవేగమున వచ్చిరి బాలలు కలకల నవ్వుచు
ఆశీర్వదింపగా అలర పురోహితులు
వాసిగ బాలలు వచ్చిరి వేగ
భజంత్రీలు శెంఖులు బహువాయిందర్యములును[174]

166. నిమిత్తము, కారణము; 167. ఒయ్యన = తిన్నగా, వరుసగా; 168. వాడకముందే; 169. వీరతాంబూలము; 170. చురకత్తులు; 171. శూరులై; 172. తులువ కత్తులు = వంపు చురకత్తులు; 173. అరిగలు = డాలులు. 174. శంఖములు (సంకులు) బహు వాద్యములును.

తేజముతో మ్రోవంగ ధీరులై యపుడు
ఆడశ్రీలచాత[175] అంపించుకోని
పోణిమితో[176] బాలలు పొట్టేళ్ల నెక్కిరి
సంగడీలు యెక్కిరి సరగ తేజీల
గంగవరపు కడిమిని కదలిరి బాలలు
భంట్లును ఝెంట్లును పరివారము దొరలు
పెట్లు తుపాకులు పెద్ద బాణాలు
జల్లులు యీటెలు జగజంపు గొడుగులు
*బల్లేలు పగిలి ప్రబంతుల గడలు
ముమ్మయ్య కయిజీతము మూడువేల మూక
కమ్ముక యిరుగడల కదిలిరి వేగ
పొందుగా మూడువేలు పోచయ్య మూక
ముందర మూడు మొనలు[177] ముస్తీదు[178] కదిలె.

**–: శకునములు :–**

బాలలు పాలేటికి పయినమయి పోగాను
పాలగరుడలు రెండు పర్వకట్టగాను
యెడమనుండి కుడికి యేతెంచె నపుడు
కుడినుండి యడమకు గుర్రమిడిబడెను
అవిజూచి ముమ్మయ్య అల్లుని బిలిచి
"భావింప కల్లందుల బాలపోచయ్య
యిలలోన యీశకునము యెటువలె నున్నాది?
తెల్పుము అల్లుడ! తెలివంద నిపుడు"
"వలనొప్ప వినవయ్య! వో మామ! నీవు
పాలగరుడులు రెండు పర్వకట్టినందుకు

175. ఆడస్త్రీలచేత. 176. పోడిమితో=ఒప్పుగా; 177. సేనలు; 178. సిద్ధమై, ఆయత్తమై.

* ఈ పాదం స్పష్టంగాలేదు. 'వేబోక'లోని "బల్లేలు నేజాలు బాకు జముజాలములు" అనే పాదం బాగున్నది.

అరుషించి ఆవులన్న @అతిభక్తి చేసేను
జకిదేవత శఖనాన చట్టువారి యర్రయ్యను
యెక్కువగ పెయ్యల యర్రయ్యను తమకు
ఆవులన్న యెదురుగా అంపేను మామ!"
రవితేజఘనుడు (ఆ) రాజుతో జెప్పిన
సరిపుచ్చుకొని యిద్దరు సాగిరాగాను
చెల్లించి మిట్టను శితవులు గూసెను
వర్లబడి పశువులు వూరు బట్టెనంత
అప్పుడు ముమ్మయ్య అల్లుని బిలిచి:
"చెప్పవోయి పోచయ్య! యీశకున పంతంబు?"
మాధవుడు పోచయ్య మామకిట్లనియె:
"కదనసంహారుండ ఘనుడ ముమ్మయ్య!
పశువులు వుర్లబడి పరువెత్తినందుకు
మందకు మోసమౌను మామ ముమ్మయ్య
పరగంగ శితవులు పలికినయందుకు
హేరాళముగ పగవారు యేతెంచగలరు!"
అల్లుని మాటలు హరుషించి[179] రాగ
కళ్యాణపు చెల్లిలికి కనకమేడమీద
*పైండికంట్లెలు వేగపరువున వచ్చి
పిల్లలకు మేతలు పెట్టంగ సాగెను
అటవేగ శఖనము# అల్లుడు పాటించి
"యిటువిను వోమామ! యీశఖున పంతము
పల్లికొండ తమతండ్రి బాలలందరిని
అలనాడు చెరుకూర అప్పగించినపుడు

179. హరుషించి = హర్షించి; #శకునము .
*పైండికంటి" = ఒక రకమైన పక్షి. "పైండి"లో అరసున్న "కంటి"లో నిండుసున్న ఉన్నవని సూచించడానికి తాళపత్ర లేఖకుడు "పైండి కంట్లె" అని వ్రాశాడు.
@ నేను సేకరించి ప్రచురించిన "వేడుక బొంగరాల కథ"లో ఇంతవరకు మాత్రమే ఉన్నది – తంగిరాల (చూ. కాటమరాజుకథలు, రెండవ సంపుటం 1998, పుట.301)

అప్పగించబొయ్యాని అయ్య పల్లికొంద
వొప్పుగా ఆ పూట వొప్పిన దెవరు?
మీతండ్రి వేసిన మేర వొప్పించి
సతతముగ అందరము సరగ పాలేట
*బాలుగా పంక్తిని బావుమే బొంచెని
ఆలంబు శాయను అతివేగ నపుడు
పరగంగ వోమామ! పగతుల మీదికి
శలవిచ్చి పంపుమని శరిజన పంతంబు
తరిమి పగతులనెల్ల తలలు ఖండించి
శరాన యెడసందు లేకుండగాను
యిద్దరికి యెదురొమ్ము యీటెలు నాటి
వద్దికెతో కాటమరాజు వద్ద నిలువ గద్దు''
ఆయింట బోగాను అరటిపండ్లు మూడు
అదిమరంగ బట్టుక అతివేగిరాన
బాటను తోటశర్మ పరగ యెదురాయ;
“అరటిపండ్ల శఖునము అల్లుడ పోచయ్య!
యేరీతి వున్నాది యెరిగింపు''మనిన
అరయంగ ముమ్మయ్యతో అల్లుడు పలికె:
“ఆరవెల్లివద్దను ఆవుల పిలువలేదని
నలనన్న వచ్చి పెట్టెనందులకు
బలముల యెదురేగి పగతుర జంపి
పశుపతి చూడంగ పగతుల నరికి
మొగశి మూడు శిరస్సులు హెచ్చుగా నరికి
తమకాన నివ్వాళి తాబట్ట గద్దు''
దండిగా బాలలు తర్లి పోగాను

180. దేశాంతి = దేశాంతరి = ఇతర దేశీయుడు. * ఈ పాదానికి అర్థం తెలియడం లేదు.

కొండవాగువద్ద దేశాంతి[181] యెదురాయను
అటవెనుక ముమ్మయ్య అల్లుని పిలిచి
"రతిరాజచంద్ర! రాజులకు అల్లుడ!
యీశఖున మంతయు యిసిదంబుగాను[181]
యేరీతి వున్నాది యెరిగింపు" మనిన
పొసగంగ బలికెను పోచయ్య అపుడు:
"యేకాంబరాదం యెదురైనందులకు వినవె వోమామ!
యేకమై యిద్దరము యెదురొమ్ము పోట్లతోను
కడువేగ కాశిలో కరకంఠ గురువుకు
పొడగట్టి తడితేను పోగద్దు మనము
సంన్యాశి[182] శఖునాన సరగ భక్తిరన్న
పరగ వన్నెగా యరగడ్డపాటికే వచ్చు"
అల్లుడు మామకు అటు విన్నవించును
వెలవాగు దాటి మరి వేగ పోగ
ఆబోతు పోటుబడి అరుచుకుంటు వచ్చి
గాంభీర్య ప్రతిమలకు పరుగున యెదురాయను
తాంబూల విడియము తగువేడ్క నిచ్చి
ఆబోతు శఖునము అల్లుడు జెప్పెను:
"పట్టపురాజు తమ్ముడ! బాలముమ్మయ్య!
యిట్టె విను యీశఖునము యిరుబలములు కదిసి
యెసగంగ వినుము యరగడ్డపాటను
బసవన్న పోటుబడి పట్నానికొచ్చిన
మేలువార్తలు గొంచు మేటి దొనకొండకు
ఆడశ్రీలకు[183] వార్త అందించగలదు"
జట్టెబోయిన మల్లు జడదారు వెంట
చుట్టాలు బంధువులు సుద్దులాడుచును

181. విశదంబుగాను. 182. సన్యాసి; 183. ఆడస్త్రీలకు.

ఆరవెల్లిపాటికెల్లి అరిగిరి బాలలు
ఆరూఢి ముసిదాటి అక్క చెరువుకు వెళ్లి
కదిలిరి బాలలు గ్రక్కున బోయిరి
పల్లెబోయిన మల్లు బండారు లచ్చన్న
వల్లవులు తిరుమందులు వార్తలాడుకొనుచు
ఆంద్రకొండకు వెళ్లి అరిగిరి బాలలు
తండ్రి చెల్లిన కారణయాచిని సంతోషపడిరి

**-: బాలరాజులు వచ్చుచున్న వార్తలు విని కాటమరాజు వారిని తోడి తెచ్చుటకు యఱణన్నను ఇతర పెద్దలను పంపుట. బాలురు వచ్చి కాటమరాజుకు ఇతర పెద్దలకు నమస్కరించుట :-**

రుద్రాక్షుని మల్లురు కంఠవేదిన
రుద్రాక్ష గంగన్న బడుగుల వెంగన్న
బాలలు వచ్చిరని పల్లికొండ రఘుపతికి
ఆవులమంద రాజులకు అందరికి యావార్తలు
అని విచారము చేసి అంపిరి హేజీబుల
పనివడి హేజీబులు పరువున బోయి
కాటమరాజుకు పల్లికొండకు కబురు చేసిరంత
మాటవాసి గలిగిన మాధవుడు నలనన్నను
వాయువేగమున వచ్చిరి బాలలని
ఆవులమందరాజులు అందరు వినిరి
ధనముకొండరాజులు సంతోషపడిరి
అనుమాన పడకుండ బాలలు అదిగొని వచ్చిరి
బాలల తోడితెండు యిక్కడి కనుచు
అంపేను యరణన్నను ఆవులన్న యపుడు
హరిగురువు పల్లికొండ అయితన్నను అపుడు
నాచకూళ్ళ నాయుని, నేతివారి ముద్దయ్యను
వాడిగా పెద్దల వైనాన పంపిరి

పచ్చవరాజుల కొల్లు పడమటికెళ్లి
వచ్చిరి బాలలు వాయువేగమున
ఆవులమందరాజులు అతివేగ రాంగ
రవితేజ ఘనులు రభసంబు మెరసి
పంచనార్తులు[184] చేసిరి పైన పైనాన
అంచితముగా పెద్దలకు అంజిళ్లు[185] చేసిరి
రాజులు పెద్దలు రాచబాలలును
రాజుకొలువునకు వచ్చిరి రయము నయమునను
తుడుములు వాయించిరి దిగుమణనగాను
కడువేడ్క బాలలు గ్రక్కున నపుడు
కాటమరాజు కొలువుకు కదిలి వచ్చిరంత
బాలలు పల్లికొండకు దండప్రణామంబు చేసిరి
అలరంగ మ్రొక్కిరి ఆవులన్న కపుడు
ఘనుడు పల్లికొండ కాటమరాజు
దట్టీలు బాలలు తాళిచౌకట్లు
మెడనూళ్లు కంఠసరి మేడి పతకములు
కడువేడ్క నిచ్చిరి కంఠసరి బాలలకు
యీడైన పెద్దలకు యిచ్చిరి కట్నాలు
పల్లికొండ కాటమరాజు పద్మరాఘవుడు
వల్లవులు తిరుమందులు యిరువంశకులు గొలువంగ
తమకము మీదను తగువేడ్క నుండిరి;
తమకము యిరుగడల ధనముకొండరాజులు
కోమారవర్గంబు కొలువుదీర్చి వుండిరి.

**–: యుద్ధము సమీపించిన వేళ ఏమి చేయవలెనో చెప్పుమని**
**కాటమరాజు మంత్రి పల్లికొండను అడుగుట :–**

అమితాకృతశాలి[186] యా కాటమరాజు

---

184. పంచనార్తులు = పంచహారతులు; 185. అంజలులు = నమస్కారములు. 186. అమిత పరాక్రమశాలి.

బలభద్రసేనుని పల్లికొండను జూచి:
"కలికావతారము కయికొన్న ఘనుడ!
మదన గోపాలుండ! మాపాలి స్వామి!
కుదిరి మూడడుగులు కొలిచిన ఘనుడ!
వక మనవి వినవయ్య! వో పల్లికొండ!
సకలంబు దెలిసిన సర్వజ్ఞమూర్తివి
తలచిన తలంపు తనకు చెడుగాదె
తాతతండ్రుల తరమునాటి పగలు
యీతావు నన్నియు యీడేర్చుతాను
అన్నలు తమ్ములు అందరు వచ్చి
యేకార్యమైనను యెదటికి వచ్చు
చేకొని కార్యంబు చేకూడు తనకు
అన్ని పనులు లెస్సాయను హరిగురువ! వినుము
పన్నుగా కాశీకి బోయిన భక్తిరన్న రానిది
వక్కటే కొదువగాని వోమామ! వినుమ
గ్రక్కున యెవ్వరెవ్వరి కారియములు[187] దెలియ
బుద్ధిమంతుల జెప్పుమా పుండరీకాక్ష!
యుద్ధము కదిసినవేళ విచారము వలదు
నెల్లూరి రాజులు నేలయీనిన రీతి
పల్లవాది రాజులు బారులు తీర్చి
కరితురంగములు కాలారినెల్ల
కణితీలు తెప్పించిరన్న కభురాయ మనకు
కణగియు బలములు కదిసిన వేళ
విచారము శాయరాదు వినవె వోమామ!
బావ! వచ్చి కదిసినవేళ వంచింపరాదు
నీవు యెవ్వరెవ్వరికి నేర్పులు జెప్ప
బావరో! అనిశాయ పంపుదువుగాని"

187. కార్యములు.

**-: యుద్ధములో విజయము చేకూర్తునని పల్లికొండ, కాటమరాజునకు అభయమిచ్చుట. ఆ రాత్రి గడచుట :-**

అనిన కాటమరాజు ఆనతిని యిట్లు
పన్నగ శయనుండు పలికెనావేళ:
"పెద్ద భూపతి తనయ! పేరుగలరాజ!
వద్దికెతో[188] నీవు చెప్పిన కార్యము నీతి యికనయ్య
చెరుకూర పోలురాజు చెల్లిన నాడు
బరువు తనకెత్తి ప్రమాణము బుచ్చుకొనెను
అరయ పహ్నెండువేల[189] ఆవులు యాదవులు
అని లేఖ వ్రాసుకొని అభయమిచ్చేను
పూని నమ్మికె తనచాత పుచ్చుకున్నాడు
హరిహర బ్రహ్మాదులు అష్టదిక్కులు సాక్షిగాను
అరయంగ నమ్మికె మీ అయ్య బుచ్చుకున్నాడు
పోలురాజు తమ్ములు చప్పని రొచ్చుకుంటెను
నమ్మక పొయ్యేరు నరులాన నవ్వరు
నారిమెకె దప్పినవేళ వడబడరిచి పోవలెను
అరమర అయ్యాగాని అంటదు మనస్సు
మీరలు హరదులె అటుమించినారు
వకరికన్న వకరు వరుస మన్నీలు
పోకుండ అందరిని పోషించినారు
యలమంచి విత్తనాలు యెరువులు పంణ్నించి[190]
బలువైన పయిరంత పరిలోక తప్పక
కోతపరువైతేను కొంచురమ్మన్నాడు
పంతముగా సాక్షి పలికెనన్నాడు
వల్లవుల తమమామ వప్పగించిన పూట
కల్లలాడించకుడి కాటభూపాల!
వప్పించ్చిన పూట వప్పగించిన వెనుక

188. ఒద్దికతో = పొందికతో, ఆనుకూల్యముతో; 189. పన్నెండువేలు; 190. పండించి.

చెప్పిన మాటను శిలాక్షరము చేసి
వొప్పుగా గడుపుదు వోయావులన్న!
వంత్తుకెక్కిన మీకీర్తి వర్ధిల్లజేతు!
పంతముల యీడేర్చి మీప్రజ్ఞ చెల్లింతు!
తనరుణము దీర్చు కొనక ధరణీశ! వినుము!
అనిశాయ మిమ్ముల అంపంగ రాదు
శుక్రవారమునాడు స్తుతి శాయరాదు
వక్రదివసము నేడు వలదురెపాటి
అంచితముగ మంచిదినము ఆదివారమునాడు"
అనుచు యీవిధమెల్ల అందరితోను
పనిబూని పల్లికొండ పలికె నావేళ
పల్లికొండతో బాలలు పరగ నిట్లనిరి:
"కలకాలము పోషించి కాపాడినావు
హరిగురువ నీమాట అతిగడపరాదని
తిరుమందులు వల్లవులు తేజమున నుండిరి"
అంత్తట్టు[191] యినుడు అకలంకముగను
మంతనంబున పశ్చిమాంబుధి గ్రుంకె
చుక్కలు మింటను సొంపుతో బొడమె
మక్కువతొ గోకులము మందను కుదిరె.

**-: మరునాటి ఉదమున యాదవవీరులు, పల్లికొండ మాఘస్నానములు చేసి, పట్టువస్త్రములు ధరించి, వివిధ ఆభరణములతో అలంకరించుకొని, పంచలింగాల కొండపైగల శివుని, వీరశిలల రూపములోనున్న తమ పెద్దలను పూజించుట :-**

నాలుగు జాములు గడచె నట తెల్లవారె
వెలయంగ రథమెక్కి యినుడుదయించె
మరివేగ యాదవులు మాఘస్తానమాడి
పసిమించు[192] బంగారు పట్టువస్త్రములు గట్టి

191. అంతట; 192. పసిమి మించు; పసిమి = ఆకుపచ్చ, ఎఱుపుగల పసుపువన్నె.

పొసగంగ పశువుల పొలము బోకుండ
అని వేగ పల్లికొండ యాదవులకు జెప్పెను
కంపటులకు[193] జెప్పించెను మును పల్లికొండ
రంపిల్లుచు యాదవరాజు లందరును
శెరిదముల సొమ్ములు శానగ బెట్టిరి
పచ్చల కంఠమాల పతకము మెడనవాళ్లు
హెచ్చిన చౌకట్లు ఇంద్రనీలాలు
సందికడియాలు సరిపెనగొలుసులు
కందువతో వేళ్లకు కనకముద్రికలు
అందరు ఆరీతి ఆయత్తపడిరి
పందుమల రఘుపతి బలభద్రశైనుండు[194]
కందువతో పాలేటి ఘనుడు ఆవేళ
స్తానంబు చేసెను శుచిపాత పులుగ గట్టి
మేనున గంధము మెచ్చుగా నలది
వలపల జంద్యము వనమాలపేర్లు
అమరంగ ధరియించె నా పల్లికొండ
చంద్రకావి ధోవతులు బంతులు చంగల్వ దండలు
ఇంద్రనీలంబులు వెలగ ధరియించి
అందముగా ధరియించె అంగజగురుడు
పందుముల రఘుపతి పట్టెతిరుమణి దిద్దెను
మారేడుపత్రియు మల్లెపుష్పాలు
జారి బిందెలతోను జలముల బట్టుక
ధూపదీప నైవేద్యములు తురుతుగా గొంచు
ఆపతోదారుండు[195] అతినిష్ఠతోను
ఘనమైన మేళాలు కదిసి మ్రోవంగ
గొనకొని లింగాలకొండ కెత్తించె
సాహసవంతులు సత్యానకు వెంటి

193.కంపటీలకు. 194. శయనుండు లేదా సేనుండు; 195. ఆపదోద్ధారుండు.

కొలిచి వచ్చిరి యాదవులకు గురువైనయట్టి
బలభద్రసేనుని పల్లికొండ నందరు
సురపతి గొలువంగ శూరులందరు వచ్చి
సరగున వారల దెచ్చి సముఖమున నిలిపిరి
పొడగనుపు సేయించి పొసగ పల్లికొండ
కుడిచెయ్యి లోగాను వలపూరి దిరిగి
వచ్చి యాదాద్రిష్టశి వయ్యనె నిలిచి
అచ్చుగా బాలలు అందరు నపుడు
వల్లవులు తిరుమందులు వరుసను నిలిచిరి
జారిబిందెల వుదకాన సద్భక్తితోను
శిలలకు జలకము శీఘ్రమే చేసి
చిలికించె కస్తూరి శ్రీధరుం డపుడు
మల్లెలు జాజులు మారేడు పత్రి
బల్లిదుడు పూజించె పాణపట్నము[196]మీద
తాంబూలము నిడెను తగు పల్లికొండ
సాంబ్రాణి ధూపము సద్భక్తితో నిలచి
నైవేద్యము వచ్చేయ ద్రిష్టిని వయ్యనె నిలిచి
అచ్చుగా బాలలు అందరు నపుడు
వచ్చెను నడలింగమూర్తికి నపుడు

**–: పంచలింగాలకొండపై లింగరూపముననున్న ఆవుల పోలురాజును పంచలింగాలకొండను పల్లికొండ ప్రస్తుతించుట :–**

హస్తములు ముఖళించి[197] అతినిష్ఠతోడ
ప్రస్తుతి చేసెను పల్లికొండ రఘుపతి:
"వదనవేది పుట్టలో పాలుద్రాగి పెరిగిన
మరివేగ పర్వతాల మల్లప్ప కృపను
వలురాజు సతియైన వల్లమ్మ గర్భాన

196. పానవట్టము; 197. ముకుళించి.

తెల్లముగా బుట్టిన దేవుడవు నీవు
భావంబు దెలిసిన ప్రముఖుడవు నీవు
హరిహర బ్రహ్మేదు లందర మెప్పించి
గరిమెతో మించిన ఘనుడవు నీవు
భట్టు బ్రాహ్మల మీద పరవుపకారంబు
శరణుజొచ్చిన వారిని చేపట్టినావు
కరుణించి వారిని గాచిన రాజువు
సత్యంబు ధర్మంబు శౌర్యంబు కాంతి
వుత్తమా గుణములు వోమామ! నీవు
ఈశ్వరుండు శలవు యిచ్చెను మాకు
శాశ్వతముగా మారుట శంభుని కృపను
అన్నలు తమ్ములు అయిదుగురు వచ్చి
ధన్యులార యిచ్చట తావైతిరి మీరు
పంచలింగాల ప్రఖ్యాతి మించి
యంచగలిగె మీ కీర్తులు యెల్లలోకముల
అర్జును నంతటి వాడవు ఆవుల వలరాజుకు
వూర్జితముగా బుట్టిన వో మామ! నీవు
కంర్ణునంతటి[198] వాడవని కలియుగమందు
వన్నించ[199] వచ్చును వో మామ! నిన్ను
మన్మథుని సాటిగా మరి యంచవచ్చును
ధర్మాత్ముడవు నీవు తగ పోలురాజ!
నలచక్రవర్తితో సరిశాయవచ్చు
విక్రమశాలివి వినవె వో మామ!
పదహార్గురు రాజులలోన ప్రతియంచవచ్చును
యదువంశము(న)రాజ! యాదవచంద్ర!
విజయనందుల మామ! వీరనందుల మామ!
భుజవిక్రమశాలి వో పోలురాజ!

198. కర్ణునంతటి; 199. వర్ణించ.

రాయనందుల మామ! రత్ననందుల మామ!
సాయుజ్యమందితివి జగమెల్ల యెరుగ
కంచునందుల మామ! గజానందుల మామ!
పంచపాండవులతో ప్రతియన్నవచ్చు
నవతొమ్మిది వేలు నందులు గలిగి
శెయ్యమున మీరుట శెంభుడ! నీవు
కొండలెల్ల యిచ్చోట కూడివుండగను
దండిగా యీకొండ తావాయ మీకు!
యలమి పర్వతానకు యీడన వచ్చు
తగును లింగాలకొండ తావాయ మీకు!
నూట యెనిమిది తిరుపతులలోన నుతిశాయవచ్చును
సాటి లింగాలకొండ సాటాయ మీకు!
మహంమెరువకు[200] సాటి మరియాడవచ్చును
సాయుజ్యము లింగాలకొండ జగతిలోపలను
పంచమాపాతకాలు[201] పరగ దుల్లింప
కొంచక లింగాలకొండ యనగాను
రంజిల్లగా ప్రాణరక్షయిన యట్టి
సింజిల్ల కొండ యీ లింగాలకొండ
పసవడి[202] కైలాస పర్వతంబుగను
శివపురి విష్ణుపురి చలగి బ్రహ్మపురి
అవుననగ లింగాలకొండ ఆయనో మామ!
ఖర్మబంధములన్ని ఖండించునట్టి
మర్మమున లింగాలకొండ మహిమీద వెలసె
దుష్ట నివారణములు తొలగి పారంగ
ద్రిష్టము లింగాలకొండ దేవుడవు నీవు!
పాపవినాశనము పవిత్రము చేసిన

200. మహామేరువుకు; 201. పంచమహాపాతకాలు; 202. బసవడి.

శాదన వుగ్రశేషంబును నీవు!
గంగావతి యమున గవతమి[203] పాలేరు
సంగతిగా కృష్ణ సరి తుంగభద్ర
సరివచ్చు పాలేరు జగమెల్ల యెరుగు
ఘనమైన యీకొండ కాణయాచి మీకు!
నరలోక సురలోక సరి నాగలోక
దృఢము అయినది లింగాలకొండ యిరువాయ[204] మీకు
కీర్తి మూర్తిగల కైలాస శ్రీపర్వతముకు
పూర్తిగా లింగాలకొండ పుట్టెనో మామ!
కాశిలో గంగరావికి సాటి యీ గంగరేగు
పొసగంగ శివచింతను బోల్పంగ వచ్చు
వేదాలమ్రికి సాటి యంచంగ వచ్చును
ఆదర్వు[205] గంగరేగు ఆయగా మామ!
జాంబవ నేరేడు సరిశాయ వచ్చును
గాంభీర్య మైనట్టి యీ గంగరేగు
వడ్లు పడనవేది లింగాల బోటు
ముండ్లు వజ్రాయుధాల మోల్పంగ[206] వచ్చును
అలరంగ జనులకు ఆధారమై వుండు
కల్పతరు వైనట్టి యీ గంగరేగు
యిటువంటి స్థలము యిరువాయ మీకు
అటగన్ను యిచ్చోట అవుతారమాయ
వెలయంగ లింగమై మెలసితివి మామ!

**-: పోలురాజు చెరుకూరుదగ్గర ముక్కంటితో పోరి వీరస్వర్గమలంకరించుట. అతని ఆజ్ఞప్రకారము పల్లికొండ బాలరాజులను రక్షించి; స్త్రీలు, సేనలు, ఆలమందలతో వారిని యలమంచికి తీసికొని వచ్చిన విధమును సుదీర్ఘముగా వర్ణించి చెప్పుట :-**

---

203. గౌతమి; 204. ఆదరవు = ఆశ్రయము; ఆధారము; 205. ఇరవు + ఆయె = ఇరవాయె; ఇరవు = స్థానము, ఇల్లు; 206. బోల్పంగ.

చూడ చోద్యమ్మైన చోడాని కూడి
(చోడాన) రాజుతో యధరించి[207] నీవు
కడువేగ జంగాల కరుదెంచి నీవు
భక్తుల నందరిని పర్వతము బంపి
సత్యానకు బలుకు లింగాల వీరకల్లుగా
చెల్లితివి చోడాని క్షితిపాలకుని మీద
పల్లికొండ రమ్మని బాలల దెచ్చి
అప్పగిస్తివి నీవు హరిహరులు యెరుగ
తప్పకుండ దెమ్మని ధరసాక్షిగాను
పూట పుచ్చుకుంటివి పుంన్యుడవు[208] నీవు
కంటికి రెప్పవలె కాపాడి అందరిని
తెచ్చినాను నీవున్న జన్మదేశానకు
పక్షయతో మీరు పరాకు శాయక
నీవు చెప్పిన మాట నిల్పితిని మామ!
తావు జెప్పితివి నాకు ధర్మసాక్షిగాను
ఆమాట మీదను నేను అరువయి యేండ్లకు
మాలోకి తెస్తిని చిన్ని బాలలను
వడి కూడగట్టుమని వప్పగిస్తివి తనకు
కడు చిన్నబాలల గారవించుమంటివి
అలరంగ బాలల ఆదరించి నేను
అరిచెయ్యి గొడుగుసేయుమంటివి అరలేక నీవు
తొడ గద్దెసేయుమని దొరయ జెప్పితివి
యడముగా జూడకుమని యిస్తివి బాలల
చావకుండ సాకుమని చెప్పితివి నాడు
చివరకు ఫలియించుమని చెప్పితివి నాకు
యేమని బనిచిన యెరుపరికెము శాయక(ను)
నీమాట మీదను నిలిపితి మామ!

207. యెదిరించి, 208. పుణ్యుడవు.

బావని పిలిచిన పలికితి నేను
చావకుండ అందరిని సాకినాను మామ!
అయ్యాని పిలిచిన అమరశాయకను
అబ్బురాన పెంచితిని అందరిని తాను
అన్నయని పిలిచిన అమరశాయక(ను)
పన్నుగా నందరిని బ్రతికించుకుంటిని
పల్లికొండయన(గ) పలికితి తాను
వల్లవగోత్రము వర్ధిల్లజేస్తిని
బావయని పిలిచిన పలికితి తాను
వేవేగ నందరిని యీడేర్చినాను
రాచయింటి బాలల రాచపట్నము గట్టి
ఆలించి యందరిని అలర బెంచితిని
ప్రధానియింట బాలల ప్రధానిపట్నము గట్టితిని
తతికాల మొస్తేను తా దెచ్చినాను
మతిమంతుడైనట్టి మామ పోలురాజ!
చిత్రభాను సంవ్వత్సరానకు తిరిగి రమ్మంటిని
నిలకడగా నీకీర్తి నిలిచెను మామ!
కలియుగమున నీ మాటలు కథలు అయ్యేని
ఆరువేల వల్లవుల ఆరువేల తిరుమందుల
పేరు పేరు వరుసల పెంచినాను మామ!
యిందులో యేమైన యించుక తప్పకుండ
అందరిని తెచ్చినాను అనుమానము లేదు
చల్లవారిని యేపట్ల సరియిచ్చ నియ్యకుంటిని
వోమామ! నీమీద ఆన వప్పించుకుంటివి
ఆలాగు వారిని అన్నాను మామ!
పోలురాజ! వోమామ! బొంకను నీకు
మరివక మాట మామరో! తమకు
గురుతుగా జెప్పితిని కోర్కెలు మీర

అమ్మరో! ఆరుయింద్ల ఆడశ్రీలెల్ల
అరవైఆరు గుండాలు ఆయత్తపరచుకొని
సమాధులు ముప్పయిమూడు సమకూర్చుకోని
సామజగంధులెల్ల సొర్గానకు[209] బోవలె
ఆయత్తపడి వున్నారని ఆవార్త జెప్పిరి
పైనములయి వున్న పణతుల నిల్పి
తప్పక వోమామ! తరుణులందరిని
వప్పగించి నీవు చెప్పిన సత్యంబుచాత
నిల్పను పోతిని నిలువక వారు
ఆసరలు[210] చేసుకు వారు అజ్నిగుండాలకు[211]
పయనమై పోగాను పట్టవెననుచు
ముప్పయి మూళ్ల గుండము ముహూర్తముజేసి
అప్పుడె తవ్విస్తిని అందరు చూడంగ
ఆగుబ్బుగా నపుడు ఆజ్ఞమందగాను
మగువలందరు జూచి మరియు నిట్లనిరి
సమాధుల గుండాలు సమమాడె[212] తమకు
వేరుగుండము యవ్వరికని వనితలడిగినను
ఆడశ్రీల జూచి అతివేగమునను
పొందువ సత్యమున పలికితిని తాను
గుండాలు మీకాయ గోపకాంతలార!
ఖండితముగా బాలలకు తనకు కావించినాను
గుప్పున మీరంత గుండాల బడితేను
వొప్పుగా బాలల వర్లంగ వేసి
ఆ వెనుక తా బడుదునని అంటిని తాను
శివలోకముననుండి శివుని కృపచాత
విభూతి వర్షంబు వేగంబె గురిసె

209. స్వర్గమునకు; 210. ఆసరా = ప్రాపు, ఆశ్రయము, అండ; 211. అగ్నిగుండాలకు; 212. సమమాయె (సరిపోయినవి).

గుబులు గుబులున వురిమి కుంభవరుషంబు
అరఘడియలో గురిసె ఆరె గుండాలు
అరయంగ వుదము అవనిపై బారె
వుదకము గుండాల వుద్భవించె నపుడు
సతత పుణ్యాత్ముడని సత్యంబు వలన
అరవై యేండ్లు అయిదవతనము అమరలేక
*నండివ పంపుదల నెరి తెచ్చినాను
వాసిగా వాల్మీకి వచనములో బుట్టిన
కుశలౌల చేపట్టి గొబ్బున రాముకు
వప్పగించిన రీతి వప్పగించినాను
వొప్పుగా వొకవార్త వోమామ! నీతోను
చెప్పెద వినవయ్య! శీఘ్రాన నేను
వారిధి బంధించి వడివేగ దాటి
చేరి రావణుబట్టి చెండాడి చంపి
కుంభకర్ణాదుల[213] కొట్టి రాక్షసుల
మబ్బులో యింద్రజిత్తును మర్దించి చంపి
రావణు వధియించి రమణి గయికొని
అతివేగ రాముడు అంబుధి దాటి
హరణ్యము[214] ఛేదించి అయోధ్యకు వచ్చి
సరిసరి శానల[215] సర్వదళములను
రామలక్ష్మణులు వచ్చిరి రాజ్యంబులకును
క్షేమాన అయోధ్య చేరినంతకును
కొంచు వచ్చినాను నీవు కోరినయట్లు
పంచలింగాల కొండవద్దకు బాలల దెచ్చినాను
తెచ్చినాను వో మామ! తెరగొప్ప జూడు!
చూచినట్టుల జూపు సురలు సాటిగాను

* ఈ పాదానికి అర్థం తెలియలేదు. 213. కుంభకర్ణాదుల; 214. అరణ్యము; 215. సేనల.

బొల్లేవు[216] యెద్దులు కల్లందుల మారినేడు
గొల్లలు మసినేడు గోసంగులంత
బల్లికురవ వద్దను బలములతోను
యెల్లలోకంబులు యెరుగంగ చెల్లిరి
వారు చెప్పు నందరిని వెస దెచ్చినాను
వరుసతో దెచ్చినాను వొప్పుకో మామ!
పాండవ దుర్యోధనులు పాలికై వారు
దండిగా ఆయుధాలు జమ్మికొమ్మ నుంచిరి
జన్మభూములు వారికి చేకూడు కొఱకు
అలుగులు జమ్మిమానున అతినిష్ఠ నుండెను
అటువలె మీరిక్కడ అవుతారమెత్తిరి
పట్టుదప్పి తమరు పరగ భూమని విడిచి
కాణయాచులకు మగడిపోయి గాంభీర్యమునను
రాణింప అక్కడి రాజ్యభూమి యేలిన
అయిదు ఖండాల వారిని అందరి గూర్చి
పెంచి యీడేర్చి పెండ్లిండ్లు చేసి
మగుడి వచ్చినారము మామ పోలురాజ!
తెగువతో పాండవులకు జమ్మి ఆయుధాలు
నొసగినరీతి పలుక మానవత్వంబు బాలలకు తనకు

**-: పోలురాజు పిల్లలనే కాక ఆతని నలుగురు అన్నల పిల్లలను కూడ కాపాడి వారినందరిని ఒకచోట చేర్చితినని పల్లికొండ చెప్పుట. పంచలింగాల కొండ చుట్టును మోహరించిన యాదవవీరులను, ఆలమందలను పల్లికొండ లింగరూపుడైన పోలురాజునకు నివేదించుట :-**

తలకూడె దేవసాలు[217] దగ్గెర[218] వచ్చినావి
పలుక పలుక కిట్టివైన బాలలు వారుగో!
యెద్దులు ఆవులు యాదవులు వారుగో!

216.బొల్లావు; 217.దివసాలు; 218. దగ్గర.

పద్దువద్దులు చూడ పరాకు శాయక
ఆరునూరుగతి కవ్వము వప్పగించిన గణితి
శిరసెత్తి చూడవు శివలింగమూర్తి!
పోలురాజు సింహ్వాద్రి[219] భూపతి సుతుల
వాలాయముగ దెచ్చినాను వో మామ! నేను
కల్యాణాన సేవించిన ఘనుడు పెద్దిరాజు సుతుల
పార్థిగెల్చి దెచ్చిన బాలలు వీరుగో!
బెజవాడనున్న వారిని పెంపు మీరంగ
నిజముగ నలనూకరాజుసుతులు వీరుగో! చూడు
చెరుకూర అయిదు ఖండాన చెల్లితివి నీవు
నరశంభుడ[220] వైతివి నరనాథ! నీవు
యిందలి సాక్షులు తిచక్షా వచ్చినయట్లు
కందువతొ వీరిని కరుణించవయ్యా!
పొన్నూరి భావన్న[221] భూమెల్ల యెరుగు
పన్నుగా సత్యంబు బ్రాహ్మణికి బలికెను
అందుకు సాక్షిగా ఆవుల పోలురాజు
పొందుగా భావనను బోలుదువు నీవు!
యెలమితో వృక్షాలు విప్రునికి బలికిన యట్లు
పలుకవే సత్యంబు బాలలకు తనకు
పయిరంత పండి పరువమయినాది
కైవాలి పయిరంత గాసి[222] కాకుండ
కావలై వర్థిలను కాపాడినాను
అమరంగ నీ పయిరంత అంగెలెను తాను
తాళము చేతులు డబ్బీలు కనకము
యిలలోని సొమ్ము లివిగోనె మామ!

219. సింహాద్రి; 220. పోలురాజు శివాంశతో పుట్టినవాడని చెప్పుదురు. మానవరూపంలో ఉన్న శివుడతడు; 221. గుంటూరుజిల్లా పొన్నూరులో వెలసిన శ్రీభావనారాయణస్వామివారు; 222. గాసి = నిష్ఫలము, నశించినది.

వుత్తమా నగ్రావుల[223] సత్యమానరాలు
యీ తావుకు దెచ్చినాను యివిగోనె మామ!
లింగముద్ర యెద్దులు సంగడీలు ఆవులును
లింగాలకొండచుట్టు నిల్పినాను మామ!
పన్నెండువేల యిండ్ల బంధువులనెల్ల
నిండు యెగురున దెస్తిని నేడు వోమామ!
భక్తులుడు నీ కొమారుడు ప్రయాగ బోయినాడు
అతడు నేట రేపట వచ్చునీ అనుమానమే లేదు
యెటువలె నందరిని యీశ్వరుడు తమ్ము
కటకట! పాలేట చురకల్లు చేసినాడు
పుట్టింది యలమంచి భూముల తావు
వాలాయముగ బ్రహ్మ వ్రాసినాడు యిక్కడ
బలరాజులు మీదికి పగవాడు గూడి
దక్షిణాది మూకలు తర్లి రాగాను
యెచ్చరించి బాలల యీటెల మీదికి
తిమురుచు నున్నారు తిరుమందులవారు
మామరో! వల్లవులు నామాట వినరు
తిమురుచు నున్నారు తిరుమందులు వల్లవులు
సమసిన వెనుకను సాక్షులు యవ్వరికి
యెటువలె వప్పగింతును యెరిగించు మామ
తప్పక శిముడు[224] యిప్పుడు దయతప్పినాడు
నేరము లేకుండ బాలల దెచ్చినాను
యిరువంశ తనయులు యిరుగోనె మామ!
అప్రకారము యట్లు అయ్యరో! వద్దు
గూడార్లు నామగిరి కోలుపడిగెలును
కొల్లారుబండ్లను కోలుటెక్కెములు
కుందనపు సొమ్ముల కొని కూర్తు పుత్రులను

223. నఙ్గావు = ప్రయాసముచేత పిదుకదగిన ఆవు; 224. శివుడు.

పొందుగా తెచ్చినాను వో పోలురాజ!
జగజంపు గొడుగులు జమిరి టెక్కెములు
పగతుల నుగ్గాడు బసువశంకర బిరుదు
హనుమంతు పడిగెలును, ఆలపర్నములు
గరుడటెక్కెమూలు, గజాంకుశములు
కనకాద్రి సెలగోల, గండభేరుండములును
సామంత రాగోల, శంఖుచక్రాలు
టెక్కెములు వోమామ! యివిగోను వొప్పుకో నీవు!
నిలుపలేను వీరిని నీపాదమాన
పలుకవే వోమామ! నీబాలలు యిరుగొ!"

**-: పల్లికొండ సూచనపై వల్లవులు తిరుమందులు, పోలురాజునకు ఇతర వీరశిలలకు మ్రొక్కుట. బాలరాజులు మ్రొక్కినను వీరశిలలు పలుకకుండుట :-**

అని యిట్లు పోలురాజుతో అంతయు జెప్పి
బాలరాజుల జూచి పల్లికొండ రఘుపతి
సెలవిచ్చి సాష్టాంగములు సేయుడని పలికె
ఆవేళ పల్లికొండ ఆనతిచ్చినను
బావలు మరుదులు బంధువర్గములు
వల్లవులు తిరుమందులు వొప్పిరందరును
మొత్తముగా సాష్టాంగము మ్రొక్కిరావేళ
బాలరాజులు మ్రొక్కిన పలుకవాయ శిలలు
లీలతో పల్లికొండ నిలిచి ఆవేళ
ద్రిష్టమూర్తిని[225] జూచి ధీరత పలికె:
"ద్రిష్టము జూపె(ద)నంటివి దేవతల కృపను
అమరి తనవల్ల అణుమాత్రము లేదు

**-: కాటమరాజు దక్షిణాది ఆవులమేపు, పుల్లరి ఒప్పందము, మందపోటు విషయములను పల్లికొండ, పోలురాజు వీరశిలకు విన్నవించుట :-**

---

225. దృష్టాంతమును చూపు విగ్రహము.

మరివక విన్నపము మామ పోలురాజ!
యేరువ సీమ కరువాయ యెద్దులావులకు మేత లేదాయ
పరగంగ ఆవుల పట్టభద్రుండు
అంతట దక్షిణాదికి ఆవుల దర్లించి
పంతపు నలసిద్ధి పట్టభద్రునితోను
పుల్లరికి వొచ్చితిమి భూమెల్ల యెరుగ
కల్లలాడమని వారు కవులిచ్చినారు
పయిరు మేపినారని వారు పశువుల వేయించిరి
ఆవులన్నిటికి అంపకోలలు నాటి
మూడు యెద్దులు చెల్లి మొనకలని అందులో
ఆడను వక ఆవు అవనిపై గూలెను
జన్నివాడవద్దను పశువులకు సొర్గమాయ ననుచు
పెన్న వెంటను గొబ్బిళ్లు పెట్టితిమి మామ!
నావల్ల నేరంబు నాలుగు తక్కువ
పోలురాజ! వో మామ! బొంకను నీకు!

**-: పల్లికొండ ఆవులను ఎద్దులను పేరుపేరున పిలిచి పోలురాజునకు మ్రొక్కించుట. అయినను అతడు పలుకకుండుట :-**

వాలాయముగ యిక నొక వార్త వినవయ్య
పశువులు మ్రొక్కవాయనని పలుకవు గాబోలు!
బసువన్న పుల్లయెద్దు పశువులకు రాజులు
బొల్లావు చల్లవారు (పొంకముగ) బీరన్న
తాణెల వున్నవారు తర్లిరారాదు
మ్రొక్కి తెచ్చిన మోసంబు లేదు"
ఆవులు చుట్టును అర్లు చాచుకొని
యిరుగడల వున్నట్టి యెద్దులావులను
పేరుపేరున పల్లికొండ పిలిచిన వేగ
సలాము సేయుమని శలవిచ్చెనంత

బలువైన[226] యెద్దులు పంచమా[227] కవులావులు[228]
సలాము చేసిన సాక్షి పలుకడాయ!

**–: నిరుత్సాహమునకు గురియైన పల్లికొండ ప్రాణత్యాగమునకు సిద్ధపడగా దేవతలు పుష్పవర్షము కురిపించుట – వీరశిలలకు కళవచ్చుట :–**

మనసులో పల్లికొండ మరి చింతచాత
"అనుమానము తనవల్ల అణురేణువ లేదు
పలుకకుంటె మేలాయనని పానపట్నము[229] మీదను
పోలురాజ! వోమామ! బొందులు విడుతుము
చెరుకూరి వద్ద నీవు చెల్లిన మేర
సరిపోయిన మనసు సంతోషమైతేను
చేపట్టి నా మనవి శిలలు పలికించుమా!
యీపట్ల అందరిని యీడేర్చి తెచ్చినాను
అఘుమంచి తెచ్చింది అప్పకుమారుని
పోడిమిగా కల్లందుల పోలినేని సుతుడు
కడిగిన వజ్రాయుధమువంటి కల్లందుల సింహ్వము
హరిహరాదుల పేరిడి వాండు అతిముద్దుబాల
వరుసతో కల్లందుల వంశవర్ధనుడు
. . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . యనుదానితో బంపినాము
మొప్పమెరిగి తెచ్చినాను యలమితో మారు"
పల్లికొండ యీరీతి బాలపోచయ్యను
వల్లెలేరట బడి . . . . . . . . . . . . .
. . . . . . . . . . . వొప్పి పోలురాజు
అప్పుడు మీరాజుకు హరుషంబు (కలిగి)

226. బలువు=బలము, అధికము, పెద్ద; 227. పంచము = విశాలము, వ్యాప్తము; 228. కవిల + ఆవులు=కవిలావులు; కవిల=కపిల=గోరోజనమువంటి వర్ణముగల ఆవులు, పుల్లావులు. 229. పానవట్టము.

దేవలోకముననుండి శిలలు దేవతలు
అందరు ద్రిష్టించి అతివేడ్కతోను
. . . . . . . . . . . . . . . . . డు
కురియించి రప్పుడు కుసుమవరుషములు
వైకుంఠపతులెల్ల పువ్వులవాన గురియించిరి
కైకొని శిలలకు కళవచ్చె నంత

**-: లింగాలకొండపైనున్న పలురకముల చెట్లు అందముగా పుష్పించుట :-**

ఆవులు యెద్దులు అర్లెత్తి చూచెను
కావురు గప్పెను కడు చోద్యముగను
సురదేవతలు యెద్దులు సుందరీమణులు తరువులు
పరమేశ్వరుడు బసవని పరగ పుల్లయెద్దు
ఆవులు లేగలు అతి నిష్ఠతోను
లింగాల కొండచుట్టు కనిపించె మంద
వెలగలు వేములు వెణుతుర్లు* మరియు
నేరేళ్లు మారేళ్లు నిమ్మ తరువులును
పాలలు కారుమునుగలు మంచి కానుగలు
వలనొప్ప సంపెగలు వటవృక్షములును
వుంద్రలు సంద్రలు వుప్పికోరిందలు
తండ్రి పోలురాజు ధర్మంబుచాతను
సోమిందలు వుశిరెకెలు[230] సోరవెంపలూను
జమ్ములు గూబదళ్లు కొమ్మనేసలును
అందమైన బూరుగలు అలరు మోదుగలు
చిందుగలు అందుగులు# చిల్లమాకులును
బృందావనము పోలురాజు చుట్టు
. . . . . . . . . . . . . . . . .
. . . గా నన్నియు కారడవి యంత

* వెణుతురు = వెలుతురు చెట్టు, కరీరవృక్షము; 230. ఉసిరికలు; #అందుగు = ఒక జాతి చెట్టు – ఏనుగులకు మిక్కిలి ప్రియమైనది, సల్లకీ వృక్షము.

గంగరేగు మొదలు కడు వెరువు బుట్టేను
గంగ సముఖాన కారణము వారికి
వచ్చేటి తుదకు వైన వైనాన
వృక్షాలు బూసెను . . . . . . . .
పారిజాతమ్ములు పరిమళించినయట్లు
తరువులు బూచి దాసాన పువ్వులై వుండ

**–: పూచిన చెట్లను చూచి సంతోషించిన పల్లికొండ పోలురాజునకు మ్రొక్కగా, శిలలు పలుకుట. వెంటనే కొన్ని భయంకర ఉత్పాతములు తోచుట. శిలలనుండి కన్నీరు కారి పానవట్టముపై పారుట :–**

అవిజూచి పల్లికొండ ఆత్మనుప్పొంగి
భావంబు దెలిసిన బలభద్రశేనుండు[231]
"పల్లికొండ మ్రొక్కనిదె పలుకవుగావా?
అల్లుదు మొక్కడని అలిగె కాబోలు!"
పల్లికొండ రఘుపతి పడిసాగి మ్రొక్కె
పల్లికొండ మ్రొక్కంగ పలికెను శిలలు
పల్లవులు తిరుమందులు వుగిబెట్టిరంత[222]
గగనంబు పెళపెళ గ్రక్కున వురిమెను
కణుకువలె మండుచు గగనంబు మెరసి
బిగాది[223] మడుగున పిడుగులు పడ్డట్లు
కొప్పుకొండ చాల్పున* కొండగొర్లు గూసెను
నిప్పులు గాల్చినయట్లు లింగాలకొండంత
చినచిన శిలలెల్ల చెదిరి పడసాగెను
శిలలు యర్రనాయను చెట్టుకు గంగిరేంగు
కాయలు పండ్లును కడు రాలసాగెను
ముండ్లు ఆకులు రాలి మోడువలె నుండెను
పోలురాజుశిలలు బూరుగపువ్వుల రీతి

---

221. బలభద్రసేనుండు; 222. వుగిబెట్టిరి = బిగ్గరగా అరచిరి(?); 223. బిగాది=మిక్కిలి దరిద్రుడు, బిచ్చగాడు. (ఈఅర్థం ఇక్కడ సరిపోవడంలేదు); 224.పానవట్టము; *చాల్పు=వరుస.

యెలమితో కళల దప్పి యఱ్రనై వుండెను
తురుతుగా శిలలవెంట దుఃఖంబు నీరు
పారంగ సాగెను పానిపట్నము[234] మీద

**-: రామరావణ యుద్ధమువంటి భయంకరయుద్ధము జరుగనున్నదనియు, అది యాదవులకు కీడు తెచ్చుననియు పల్లికొండ సూచించుట. యాదవవీరులు రణోత్సాహమును చూపుట :-**

అది జూచి పల్లికొండ హరహరా యనుచు
"కాశివిశ్వనాథుండు గరుడవాహనుడు
హరిహరాదులు మీరు అలిగితిరో! లేక
అయితె మేలాయ ఆవుల పోలురాజు
కొమాళ్లు అల్లుండు గోపాలవర్గంబు
పాలేట అందరు పగవారముగను
తెగువతో నందరు తిరిగిపోరెవరు
రామరావణయుద్ధము గావలె రణవీథిలోను
తమరు చేశ్నిన[235] యుద్ధము తగ జూడవలెను"
అని యిట్లు పల్లికొండ ఆవుల యెద్దుల
పనిబడి పశువుల తోలుమనెను
సాక్షులు వొప్పించి జననాథులంత
రాజులు పల్లికొండ రాణింపగాను
భోజు(డు) దేవేంద్ర భోగంబుతోను
పంచవాయుద్యములు[236] (పరగ మ్రోగగను)
(జగజంపు)[237] గొడుగు నీడలతోను
వల్లవులు తిరుమందులు పంతములాడుచు
కుంకుమ కస్తూరి గుబులుకొనగాను
లంకకు రాముడు. . . . . . . .

**(గమనిక:-** ఈ కథ సంపూర్ణమో అసంపూర్ణమో స్పష్టముగా తెలియుట లేదు. "బాలరాజుల యుద్ధము" ప్రత్యేక కాండముగా (ఐదవ కాండగా) ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో నున్నది కావున, ఈ కథ యిక్కడికి సంపూర్ణమనియే భావింపవచ్చును. - తంగిరాల సుబ్బారావు)

235.చేసిన; 236.పంచవాద్యములు; 237.జగజంపు గొడుగు=ముత్యాలసరములతో కూడినగొడుగు.

# పాపనూక వలపోత

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు తమ కాటమరాజుకథల గ్రంథంలో కాటమరాజుకథల్లో ఒకటైన "పానూక వలపోత" లభించలేదని రాశారు. "పాపనూక వలపోత"ను విజయనగరంజిల్లా గజపతినగరం మండలంలో ఉన్న పొడపోతులవారు పాడుతున్నారు. వీరు కాటమరాజుకథలను చెబుతూ యాదవులను ఆశ్రయించి జీవిస్తున్నారు. వారుపాడే పాపనూక వలపోతకథయిది.

– ఆచార్య మట్టెబోయిన జయదేవ్

**–: కాశినుండి భక్తిరన్న ధనముకొండకు వచ్చుట. తల్లి సిరిదేవిమేడలో చెల్లెలు పాపనూక లేకపోవుట గమనించి, ఆమెను ప్రశ్నించుట. సిరిదేవి ముఖము వెలవెలపోవుట :–**

శ్రీవిశ్వనాథుండు శిసువుల గాంచి
భావించి తల్లియున్న వారి పట్నము
అర్థించి ఏతెంచి అమ్మతో కలిసె
పందుముల ఎరినప్ప[1] అందరూ (కూడి)
గురువును పొడగనిరి గుణవంతులెల్ల
తివాసు వేసిరి త్రిపురాంతకునకు
తివాసు వొల్లక త్రిపురాంతకుండు
శివుడు గూర్చుండేటి పులితోలు మీద
కూర్చుండె (శివ) గురువు (గొప్పతేజమున)
ఎడగల కూర్చుండిరి యాదవాస్త్రీలు
మరుగున దాగిరి చిన్న మరదళ్ళు

1. ఈ పేరు "ఎఱనప్ప" అని ఉండాలని భావిస్తున్నాను. ఈ కథచివర్లో "ఎరనప్ప" అని ఉంది. ఎఱ్ఱనిఅప్ప > ఎఱనప్ప (ఎరనప్ప) ఈమె పల్లెకొండ భార్య. జానపదోచ్చారణతో వ్రాయాలంటే "యఱనప్ప" అని వ్రాయాలి, "యఱనూకరాజు" – "యఱగడ్డపాటి పోట్లాట" అని వ్రాసినట్లుగా వ్రాయాలి. కొన్నిచోట్ల ఈ పదానికి "యఱణప్ప" అనే ఉచ్చారణకూడా ఉంది.

బావను కనులెత్తి భావించి చూడక
వయ్యారితో కొంత వదిగుండిరంత
"కొండంత బలగంబు కన్నవారిని జూస్తి
వంచినాతని బట్టి వదినల జూస్తి
అప్పలు చెల్లెళ్ళు అందరిని జూస్తి
తీరైన చెల్లెలు మన దివానములో లేదు
పందుముల ఎరినప్పను బాగుగా జూస్తి
ఎందును కనబడదు ఏదమ్మ పాప?
అంత నాకు మొక్కే అప్పలను జూస్తి
ఇంతి (కనపడదు) ఏదమ్మ పాప?
చేరి నాకు మొక్కే చెల్లెళ్ళను జూస్తి
గర్భపు చెల్లెలు కానరాదమ్మ!
మర్లవారిని జూస్తి, మగువలను జూస్తి
నేతివారిని జూస్తి, నాతులను జూస్తి
వత్తైన చెల్లెలు పరికింప నాతోను
ముచ్చటాయెను పాప ముచ్చటాయెనమ్మ!
చెల్లెల తలపులు చేయుదునెపుడు
పసినికాళ్ల పాప మన బలగమున లేదు
దవ్వున కాశిలో దలతు నిత్యంబు
ఎప్పుడు మనసు బాయదు చెల్లెలు నాకు
తల్లి దండ్రీ లేని చెల్లెలి మీద
మనసులో (కడు) భక్తి యున్నాది నాకు"
వల్లవుల బత్తుడు వాంఛతో అడగంగ
తల వాలవేసెను తల్లి సిరిదేవి
వెరగంది (సిరిదేవి) వెలవెలాబోయె

**–:పల్లికొండభార్యయైన పందుముల ఎరినప్ప(ఎఱ్ఱినప్ప>యఱనప్ప>యఱణప్ప) జరిగిన విషయము చెప్పుట–పాపనూక దుష్టనక్షత్రమున పుట్టుటచే ఆమెను అత్తింటికి పంపితే పుట్టింటివారు నశించిపోవుదురని, ఊరిబయట ఏడంతస్తుల ఒంటిస్తంభం మేడలో నుంచవలెనని బ్రాహ్మణులు (జ్యోతిషులు) చెప్పిరని తెలియజేయుట:–**

పందుముల ఎరినప్ప అంతట తెర గట్టించి
తెరచాటున గురువుకు అస్తమెత్తి[2] మొక్కి
“వల్లవుల పుణ్యగురువా! వలపోత నీకేల?
నీ – చెల్లెలు పాప కతలు చెబుతాను వినుమ!
నీ – పెదబావ రగుపతి[3] పెద్దలందరును
ఓరుగంటికి పెద్దవాడు వడ్నాల బావిరెడ్డి
చెరుకూరి కామిరెడ్డి, సింగముల భీమిరెడ్డి
అరికాయల కుపిరెడ్డి, అముతుముల మాదిరెడ్డి
నూజాల పోతురెడ్డి, నూగి గంగిరెడ్డి
నాసుగుల్ల నాయుడుకు[4] అడిగిరి పాపను
వెండి పుస్తాకాల బ్రామ్మనులు[5] వెయినూరు వచ్చినారు
పైడిపుస్తాకాల బ్రామ్మనులు పదినూర్లు వచ్చినారు
అంత పురోహితులు పాప అస్తములు[6] జూసిరి
‘ఇంతిరో! వినుమ! ఈ పాప పూర్వజననంబు
పుట్టు బుధవారము పట్టపగలు
జ్యేష్ట నచ్చత్రాన[7] జన్మించె పాప
ఆపాప పుట్టిన ఐదు దినంబుల నాడు
ఐదురుగు తండ్రులు చిత్తుచిత్తుగాను
కత్తులు నరుకులు తగిలి (కదన రంగమున)
చిత్రభాను సంవత్సరమున చెల్లిపోయిరి
తల్లిగండమున పాప తండ్రిగండమున
వల్లవుల – తిరుమందులవారి వంశగండమున
పాప గండపుపాప కల్యాణమిస్తేను
కొండంత బలగంబు గోత్రానికి లేదు
కల్యాణంపు చెల్లెలిని కల్యాణమిస్తేను
తల్లి సిరిదేవికి తగులునే కీడు
దోరనాలు[8] దూరేటి దొరలకు కొరగాదు

---

2. హస్తమెత్తి; 3. రఘుపతి; 4. నాచకూళ్ళనాయుడు (కొమరక్క కొడుకు); 5. బ్రాహ్మణులు.
6. హస్తములు; 7. జ్యేష్ఠ నక్షత్రాన; 8. తోరణాలు;

ఆరూఢి పుట్నింటికి అచ్చిరాదు పెళ్ళి
ఇచ్చిన వారిల్లు ఇలమీద కుంగు
పుచ్చుకున్న వారిల్లు బూమిమీద వెలయు
ధనము గండమున పాప ధాన్యగండమున పాప
కన్య మన ఇంట దిరిగిన పాపకర్మము సంభవించును
అతివను ఇల్లరికము ఇచ్చిన హాని వచ్చును పుట్నింటికిని
మదిలోన వారి అన్నివాక్యములకు మనువియ్యరాదు
మనువిస్తే కాపురము మరితప్పగలదు'
జననాథుండు ఐతమరాజుతోను చెప్పిరి బ్రామ్మనులు
'మనువియ్యకుంటేను మరివొకటి కలదని
ఏడు అంతారాల మేడ కట్టించి
కడమేడ పెట్టవలెను కల్యాణపు చెల్లెలును
మేడ పెట్టిన గాని కీడు పో'దనిరి

**–: నాచకూళ్ళ నాయుణ్ణి ఇల్లరికం పంపుమని సిరిదేవి కొమరక్కను అడుగుట – ఆమె పాపనూక దుష్ట నక్షత్రమున జన్మించుటచే తన అన్నలు ఐదుగురును రణరంగాలలో ఒరిగిపోయిరని నిందించి, ఇల్లరికమును తిరస్కరించుట :–**

బత్తుడన్న మీతల్లి పలికెను ఒక మాట
అత్త కొమరగిరిని పిలిచి అమ్మ ఇట్లనిరి:
'వింటివె కొమరగిరి! విన్నపంబు ఒకటి
వల్లవుల గోత్రమునకు వంశతిలకము
నేను పాపను ఇల్లరికముంచేను
పట్టభద్రుండు ఐతమారాజుతో
ధనధాన్యసంపదలు చెరిసగముగా
పంచి పెడుదును సురసు దివానంబున'
కొమరగిరి (అంతట) కోపించి లెగసి[9]
'వదిన ఎందుకాడితివి? ఏలనాడితివి?
కలిమి బలిమిచే కానకాడితివా?

9. లేచి;

పాపను ఇల్లరికముంచిన ఇలువరస కాదు
పాపపు బసవన్న పంపాద్రిలోన
అప్పలు చెల్లెల్లు[10] అందరూ గూడి
అల్ల బసవన్న నోములు నోచిననాడు
నలుగురు చేతిపాలు ఆరగించి
ఆతల్లి పెద్దమ్మ చేతిపాలు ఆరకపోయె[11]
ఒల్లకపోయే అలిగెను అయిదు తానాలకు
అన్నదమ్ములను వదిలి సింహాద్రిరాజు
సింహాద్రిరాజు శ్రీకూర్మము పోయి వరిగెను
కన్నవారిని బాసి కళ్యాణము పోయి
పెద్దన్న కుంబీల్లు[12] మీద హతమై పోయె
ఎర్రబెజవాడను ఎరనూకరాజు
పోట్లుపడి చెల్లెను (పొసగ) రణమందు
నల్లబెజవాడను నలనూకరాజు
పోట్లుపడి చెల్లెను (పొసగ) రణమందు
అన్నలకు తమ్ముడు ఆపోలురాజు
పన్నుగా చెరుకూరు పయనమైపోయె
చెరుకూరి జంగాల క్షణములో తెమ్మంటె
పోయిరి జంగాలు పోలురాజు కడకు
మరుగు జొచ్చిన వారిని మల్లి[13] పట్టివ్వక
(వారిని కాపాడ)–చోడ చక్రవర్తిరాజు అంతట
మూకలదొడ్డి మీదకు దండును ముందుగా పంపించె
మూడు కన్నుల మీద ముక్కంటి మీద
వడియ* భక్తులకొరకు వరిగె పోలురాజు'
ఆశపడ నేటికి అడిగె కొమరమ్మ
కోడలా ఇది అంత కొదవిరిగె ననుచు
గోడుగోడున అడివి కొలువెల్ల పోయె

10. చెల్లెళ్ళు; 11. ఆరగించకపోయె; 12. కుంభిణీలు; 13. మళ్ళి; మరల.
*వడియ = అడియఁడు = పాదసేవకుఁడు, దాసుఁడు;

**-: పాపనూకను ఊరిబయట మేడలో నుంచుటకు అనుమతి కోరుచు ఐతమరాజు కాటమరాజునకు కమ్మవ్రాయుట - అతని అంగీకారముతో పాపనూకను ఊరిబయట మేడలోనుంచుట :-**

అది విని ఐతమరాజు ఆవులన్నకు రాసె ఉత్తరము
పంపిన ఉత్తరాలు చదివించుకొనుచు
అన్నకు మొక్కి అమ్మకు మొక్కి
కొమరగిరి అత్తకు మొక్కి తమ్ముని కీర్తించి
దండమని ఎరినప్పకు తమరు ఎరుగని బుద్ధి
నేను ఎరుగుదునా యనుచు
తిరిగి జాబులు పంపె అయితమరాజుకు
చక్కగా ఉత్తరాలు చదివించుకోని
నగరికి పడమట నాతియుండేటి మేడ
తగ సల్లచెరువుకు దచ్చినాది[14] మేడ
పాలగెడ్డ బయలు పాపయుండేటి మేడ
ఒంటిస్తంభము మేడలో ఒంటిదానసుంచితిమి"

**-: పాపనూక విషయము తెలిసిన భక్తిరన్న కన్నీరు మున్నీరుగా దుఃఖించుట :-**

అప్ప చెప్పగ గురువు ఆందోళనొంది
గోడుగోడున భక్తుడన్న శోకింపసాగె
వాలుకన్నుల నీరు గురువుకు వరదలై పారె
పులితోలు చెర్మము[15] మీద బొటబొటామని వానకురిసినలాగు
వద్దనున్న శెంకు[16] గంట వానుకొని మోగె
బుజమునున్న కక్షపాల బూమిమీద వరిగె
యేసిన గజాశూలము గజగజ వణికె
శివలింగాలు గురువుకు చిక్కులు పడెను
తాల్లపు[17] రుద్రాక్షలు తల్లటింపసాగె
పరచిన పులితోలు చెర్మముమీద
కారిన కన్నీరు పాయలై వరసె

---

14. దక్షిణదిక్కు ; 15. చర్మము; 16. సంకు (శంఖము); 17. తావళపు.

అరచేతిని కప్పిరి అవనిపై వొరిగె
శోకించె గురువు తమ చెల్లెలును తలచి
తాటికొమ్మ మంట దరికొని సాగినట్లు
“నమ్మించి తెస్తిని నాతోటి పాపను
అమ్మ నిన్ను పగవారికి అప్పగిస్తిని
ఓయమ్మ! పాలు ఇరగని కాటమరాజును ఆవులపాలు జేస్తిని
కడమేడ పెట్టి కాశీయాత్ర పోతిని
బలగమున కలిపితే పాపకు బ్రతుకు తెరువనుచు
బ్రతికిస్తినే తల్లి! గతి నేల గలిపితిని
పులిని గొట్టి బోనులో వేసినట్లు
పాపను నేను తెస్తిని దాయాదులు నీకు
కనపడకుండా పాప కడమేడ పాలాయెనమ్మ!
నా తల్లి గుండము తిరిగి అగ్నిబాసలు చేసి
నిలువెల్ల సోదించి నిను తెస్తినె పాప!”

**-: పాపనూకను మేడలో పెట్టినందులకు భక్తిరన్న తల్లి సిరిదేవిని నిందించుట. పాపను చూచువరకు అన్నము ముట్టనని ప్రతిజ్ఞ చేయుట :-**

తల్లి సిరిదేవిని దాయంగా పిలిచినాడు
పిలగానే[18] సిరిదేవి త్వరగా వచ్చింది
“ఏదమ్మ సిరిదేవి! ఎక్కడున్నాది చెల్లెలు?
మేడపెట్టుట నీకు మేలాయెనటమ్మ?
మేడ పెట్టితివి కటకటా! సిరిదేవి! కఠినాత్మురాల!
మేడ పెట్టినావు పాప ఏమనెను నిన్ను?
ఆడబిడ్డ ఉసురు అది నీకు మేలా?
ఏడు తరాల వరకు తల్లి ఆడబిడ్డ ఉసురు
ఆడబిడ్డ వుసురు అంబులై తగులు
ఏమి జేస్తివే తల్లి! ఎరవ జూపిస్తివే!
బావ బిడ్డలనుచు బత్తించవైతివి

18. పిలువగానే.

బావ బిడ్డలను కత్తుల బోనులో కట్టివేసితివి
ఆపాప నీకంత పగదాయెనటమ్మ!
అడలంగ చెల్లెలును అంతరువుల మేడ కట్టించితీవు
కోడళ్లు నీవును కొదవ లేకుండ
మేరువ బోలినట్లు మేడలోపలను
తిరుమందుల వారిలోను దిగుడాయె చెల్లెలు
నీగర్భమున పుట్టదాయె ఆపాప
పాపను చూడక నీవు మేడ పెట్టితివి
పాప శోకము కొంత పగదీరెనటమ్మా
వరులు గాక పాపను వల్లక నీవు
చెర బెట్టితివి యుల్లంబులో నీవు
ఒంటిస్తంభపు మేడలో ఒంటినే తాను
కంటినీరు పెట్టిన కానకైతివి తల్లి!
ఒక్కన్న చెల్లెలకు ఒలపోతలాయె
తరగని దుక్కంబు[19] తాగట్టుకుంటివే
గురువని చెల్లెలు గుండె కొట్టుకొనునేమో
బ్రమ్హదేవుండు[20] పల్లికొండవుండి
ఇన్ని తెరువుల జేసినాడు బావకు పాప
పాప ఉసురు (మనకు) అంబులై తగులు
తానుండి ఐతన్న కడమేడ పెట్టుమనెనా?
ఐతన్నకు పాప ఉసురు అంబులై తగులు!
కాటమరాజుకి మందలోనికి కబురు పంపించితేన
అందుకే మనడాయె ఆ కాటమారాజు
కాటమరాజుకి పాప ఉసురు సురకత్తులై తగులును!
తల్లిదండ్రులు లేరు దయ అన్నది లేదు
తల్లిలేని బిడ్డల మీద దయలేదటమ్మా!
పెద్దమాదేవి కూతురని పెద్దరకముంచవైతివి

19. దుఃఖంబు; 20. బ్రహ్మదేవుడు.

పరస్తనముతో కాటమారాజుకి
ఆవులలోను పట్నం కట్టించితివమ్మ!
చెల్లెలును కన్నుల చూడంగ నాకు ప్రాప్తంబు లేదు
బాలను కడమేడ పాలు చేసితివి
వజ్రపురాయ[21] ఆయెనా వనిత నీగుండె?
గాజుస్తంభపు మేడకట్టించి వుంచితివి
తిరుమందులు వల్లవులు తీర్తంబు[22] బాపి
చెరపాలు చేస్తివి యుల్లంబులోన తల్లి!
అవునె కొమరగిరి తండ్రితోడ బుట్టితివి దయనీకు లేదా?
కొండ ఏనుగు వంటి కొమరగిరి అత్త
కోడలను మేడ బెట్టి అన్నంబు నీకెట్లు వెళ్ళునోయత్త?
పెద్దిరాజు కుమార్తెపై పెద్దరిక ముంచవైతివి
పల్లికొండ భార్య పందుముల ఎరినప్పా!
మాతల్లి! వినవె ఏమి చేసేను పాప నీకు?
నీలాగు పుష్పముల పూజ చేసిన గాని
మరి పుట్టదోయమ్మ మన ఇంట పాప
ఒక మాట ఐతన్నగానీ వద్దనడాయె
అతివలకు రాజు అగుమంచి నీవు
ఐదు తరంబుల వరకు (ఆ) పాప (ఉసురు)
(పాప) ఉసురు తగిలి అగ్నిపాలు అవుతారు
పగలు రేయిని పాప శోకింపగాను
శోకింపవద్దని చెప్పువారు లేరు
శివశివా! నేనెంత పాపాత్ముడను!
నమ్మించి పాపను నేతెచ్చినాను
పాపను కనుల చూడక ప్రసాదం పుచ్చుకోను!
కాశికి పోయినప్పుడు పాపను కన్నుల చూస్తిని
ఆశించి యుంటిని నేను" అంటాడు.

21. వజ్రపుఱాయి; 22. తీర్థంబు.

**-: సిరిదేవి, ఎరనప్ప, కొమరక్క భక్తిరన్నను ఓదార్చుట - సిరిదేవి పాపనూకను మేడదించి తీసికొని వచ్చుటకు పందుముల ఎరినప్పను, పద్మరాఘవుని భార్య పైడివారి ఎల్లప్పను, పాపనూక చెలికత్తెలను పంపుట :-**

అడిగెను సిరిదేవి అడిగెను ఎరినప్ప
అడిగెను కొమరప్ప అత్త తానపుడు
శెంబుని[23] గంగ గుడికి చెయ్యెత్తి మొక్కిరి అందరూను
"వల్లవుల బత్తుడన్న[24] వలపోత నీకేల?
చెల్లెలును మేడ దింపుదుము ఈక్షణములోన!
కల్లమాటలు కావు కరకంటమూర్తి![25]
పల్లజడల గు(రువా?) పాపను తెస్తాము
ఆలకించుము నీవు అతివను తెస్తాము
అన్న వచ్చినాడని అతివను తెస్తాము
సత్యముగల గురువా! శోకము మానుమా!"
అత్త కొమరగిరిని పిలిచి ఇట్లనియె:
"పందుముల ఎరినప్ప! పైడివారి ఎల్లప్ప![26]
అందరూ పోయి కాశినుండి అన్న వచ్చినాడని
నేరంబులు ఎన్ని చెప్పిన గాని (పాప)
గారాబపు చెల్లెలు కడమేడ దిగదు
అన్న బత్తడన్న మము పంపినాడని
నమ్మించి తెస్తాము పాపను నీవద్దకు
అలిగి రాకుంటేను గయా విబూది, కాశీ తీర్తము[27]
దయచేయు మాకు తరుణి కొని తెచ్చెదము
రాకుంటె తీర్తంబు రమణి కిచ్చెదము
నీకడకు వేగమొచ్చెదము నీలకంటుండ!"[28]
అప్పలాడిన మాటలు గురువుకు నిప్పులై తగిలె
"కల్యాణము లోనున్నవారిని కడమేడ పెట్టితిని

---

23. శంభుని; 24. భక్తిరన్న లేదా బత్తిరన్న; 25. కరకంఠమూర్తి; 26. ఈమె పద్మరాఘవుడు లేక పద్మనాయుడి భార్య. 27. తీర్థము; 28. నీలకంఠుండు.

వల్లవుల చెల్లెలుకు ఉండె దుక్కంబు[29]
పందుముల ఎరినప్ప! కొచ్చెర్ల కొమరప్ప!
తోడతను[30] వెళ్ళి తోడ్కొని రండి
వెంట నెందుకు తీర్తంబు వెర్రి అప్పలార!
పట్టపురాజు చెల్లెలు పట్టకపోవును
ఎదురుగా వచ్చి చింతించెను యాదవరాజు చెల్లెలు
అది వరస గా"దని అత్తలను బంపె.
యాదవ పుణ్యగురువు పంపించె నప్పుడు
పదమని అప్పలు చెల్లెళ్ళు పయనంబులైరి
పందుముల ఎరినప్ప, పైడివారి ఎల్లప్ప
అంసల[31] పల్లకీలు పట్టించిరంత
అప్పల కనుగొని ఆ బత్తుడన్న
తనచేతి గజాశూలంబు బూమిపై వేసె
"నాకళ్ల ఎదుట మీరు నడిచి పోతిరి
నామనసు పట్టక నామాట వినక
శుబోశుబో యనుచు చోద్యమొందేను
ఆనవాలు మీకు ఆపాప బ్రతుకు
పెళ్లిపేరంటాలు పెద్దలు మీరు
మీరు కన్నుల గానక నన్నుక్కడజేసితిరి*
చాలును మీరు చాలించరమ్మ!"
పదపదమని అప్పలు చెల్లెళ్ళు పయనంబులైరి
చెలికత్తెలు లేనిది చెల్లెలు మేడ దిగదమ్మ!
చెలికత్తెలు ఎవరెవరు చెప్పమంటేను
బలిజవారి భద్రమ్మ, పాంచిరెడ్డివారి పార్వతమ్మ,
రాచవారి రంగమ్మ, కోమటివారి గొంతమ్మ,
ఎంచంగ కోమటి ఎలనాలుగు మొదాలు
కమ్మవారి కాంతలందరు కిలకిలా నప్పుడు

29. దుఃఖంబు; 30. తోడుత = వెంటనే; 31. హంసల. *ఉక్కడంచు/ఉక్కడదించు = చంపు.

మేడలకు పయనాలు అయినారు వాలముగ
శంభుని గంగగుడికి మ్రొక్కిరి వనితలందరును

**-: పాపనూక మేడ వర్ణన :-**

మేడకు నిచ్చెనలు మేలుగా వేసిరి
పందుముల ఎరినప్ప, పైడివారి ఎల్లప్ప
గంధవతులెల్ల మేడ (గ్రక్కున) నెక్కిరి
ఒక్కో అంతరువు ఎక్కిరి ఓహో అని మెచ్చిరి భామలు
దనుముకొండ బజారులు జూచిరి
రెండో అంతరువు[32] ఎక్కిరి యాదవా స్త్రీలు
రెండో అంతరువున పసిడి కుండలు జూచిరి
గండభేరుండాలు కనకమృగాలు జూచిరి
ముత్యాల పోత అయిన మూడో అంతరువు ఎక్కిరి
చిత్తూరు[33] ప్రతిమలు చిలుకలు జూచిరి
పగడంపు స్తంభాలు దొవారాలు[34] జూచిరి
నిగనిగ మెరిసేటి నీలదొవారాలు చూచి
బాగుగా యున్నాదని పందుముల ఎరినప్ప
ఆగడియలోను అందరు నల్లచెరువు నీళ్ళకు
మేడ నడుమకు నీళ్ళకు రాగా జూచి
అచట నిలబడి అతిసోద్యమొంది
సూస్తిరి అప్పలు చెల్లెళ్ళు యిది కొంత సూత్రమనంగ
ఆ స్త్రీలు మొకివార్జనలు[35] అచ్చోట జేసిరి
"భామరో! ధనుముకొండ బజారులు జూచితిమి
సోమవీథులు జూస్తిమి సోద్యమొందగను"
అయిదో అంతరువు ఎక్కిరి యాదవా స్త్రీలు
ఆపాప పేరెట్టి కొనియాడ పిలిసిరి[36]
చిలుకలు రొదలు కొట్టి గోరొంకలు చెదరి కూసె

---

32. అంతస్తు; 33. చిత్తరువు; 34. దువారములు = వాకిళ్ళు. 35. ముఖమార్జనములు = ముఖములు కడుగుకొనుట; 36. పిలిచిరి;

అలికిడి విని పాప అదిరిపడి లెగిసె[37]
పైడి ఎల్లప్పను జూచి చోద్యమొందుచును
కనుసుదుప్పులు కలసి వున్నావి
పోతుజింకలు మంచి కొమ్ముపందులును
కొండగొఱ్రులు మంచి కారుమృగములును
ఆరో అంతరువు ఎక్కిరి యాదవా స్త్రీలు
ఆరో అంతరువున అపురూపుమైన
తిరుమందుల పార్వతమ్మకు దీటైనమేడ
శంభుని గంగగుడికి చెయ్యెత్తి మొక్కిరి
అబ్బురంబున ఈపాప తీరు అనుచు
ఆపాప పేరెత్తి కొనియాడి పిలిచిరి
గుబగుబ బెదిరేటి గూళ్ళ పక్షులూను
పరమనిషి అలికిడి విని పావురాలు బెదరసాగె
గొలుసులతో చిలుకలు కొట్టుకొనుచు
లెగిసిన గోరొంకలు పిలిసెను పాపను

**-: యాదవస్త్రీలు మేడను ఎక్కుచుండగా, ఎరనప్పను జూచి అక్కడి పక్షులు భయపడి, పెద్దగా కలకలము చేసి చనిపోవుట - దానిని బట్టి యాదవులు ఎఱగడ్డపాడులో ఒరిగిరని ఎరినప్ప ఎల్లప్పకు చెప్పుట :-**

పెంచిన మృగములు పెనుగాడసాగె
మేడమీద పక్షులు అడలంగసాగె
పసిమి ఆకుల మఱ్రి పక్షులు ఆడిన రీతి
సిగవతిని జూచి వెగసిన[38] రీతి
ఎరినప్పను జూచి లెగిసెను పక్షులు
అరుదుగా మేడవారిని జూచి
పసిడి కుండల మీద పాపంబు పక్షి
వృక్షము విరిగినట్లు ఎరినప్పకు విరిగెను తన నడుము
అనగతు వేసంబు అంతయు జెప్పుమీ

37. లేచె; 38. ఎగసిన.

గౌతముల మ్రర్రి కందతుండము[39]లనుచు
శివశివా! యనుచు పక్షులు కూసె
పక్షులు పాపలు పసిబడ్డ తల్లులు
మత్సరంబున మడిసెను పాపకు తోడున్న పక్షులు
మృగములు పోయి రేపుట వలన మంటల పాలాయెను
చినచిన్న పావురాలు చెదిరి పోలేక
కాలి నేలగూల కారణమున్నాది
కాముని రూపమై కడమేడలోన
దూబ్రంహ్మమై పోవుదుము
కొండైన చిచ్చులు తగులునని పక్షులు
తాబల్కె వెరసేమనుకుంటేను
పకపక నవ్వెను పాపంబు పక్షి తానపుడు
వృక్షము విరిగినట్లు ఎరినప్ప నడుము విరిగె
పైడి ఎల్లప్ప అడిగెను
పందుముల ఎరినప్ప చెప్పెను
"నాతోన జెప్పుము నా ముద్దుబాల!
ఆడవారికి గురువు అప్ప ఎరినప్ప!
కడమేడ సికరము[40] కడతేర జెప్పుమీ!"
తలవంచి ఎరినప్ప తల్లటింపసాగె
"చెల్లెలా! ఇకనేమి చెప్పుదును నేను!
కాపురము దనుముకొండ కడముట్టలేము
మీబావ పల్లికొండ పాలేటి వద్దను
పట్టాభి అయితమారాజుకి పైనింద
అలుగులు బల్లెములు బల్యాలు నాటె
నవరత్నాల పతకము నడుముకు వరిగె
నీపెనిమిటి పద్మరాఘువునకు
రొమ్ముపోట్లు తగిలి రోషంబుతోను

39. కందతుండములు = ముక్కలు ముక్కలు; 40. శిఖరము.

గాజువిల్లు విరిగి కత్తులు నాటి
రణములో వరిగె అని చెప్పె పాపంబు పక్షి!
ఎ(ర్రయ్య ఉత్తమారాజులు యాదవులెల్ల
బొల్యావుకు పోట్లు తగిలెనని
వల్లవులు తిరుమందులవారెల్ల
వరిగిరని చెప్పెనే పాపంబు పక్షి!
బిరుదుమన్నీలు వీరన్న చెల్లె గాబోలు
కంటసిరి[41] బాలులు కోట్లుగా చెల్లిరి
(వడి)పోట్లు పడిపడి వచ్చు బసవన్న
ఎలమంచి పట్నములోకి (వచ్చు బసవన్న)
ఎరినప్ప కల్లగాదు మనకేమి తెరువనుచు''

**-: ఏడవ అంతస్తు చేరిన యాదవకాంతలను పాపనూక స్వాగతించుట – ఆరు నెలలనుండి రానివారు ఈనాడు ఏల వచ్చితిరని ప్రశ్నించుట :-**

ఏడో అంతరువు ఎక్కిరి యాదవాస్త్రీలు
ఆపాప పేరెట్టి కొనియాడి పిలిచిరి
చిలుకలు రొదకొట్టె గోరింకలు చెదరి కూసె
అలికిరి విని పాప అదిరిపడి లెగిసె
“నేటికి ఆరు మాసమూలాయె ఎక్కితిని మేడ
మాట వినికిడి లేదు పరమనిషి అలికిడి వినలేదు''
అప్పల అలికిడి ఆపాప ఆలించి
అప్పలుగా జూచి గుబ్బటిలె గుండె
పాపను ఎత్తుకొనె పైడివారి ఎల్లప్ప
ముచ్చటతోను యుదకము దెచ్చి
అప్పలకు పాదములు (అతిభక్తి) కడిగి
పట్టుచీర కొంగుతో పాదములు వత్తె
అప్పలకు దండములు అతివ మొక్కింది
జంబుకానాలు జాదుగా పరిచింది

41. కంఠసరి.

చటాపట్లు పట్టిరి చెల్లెలు తాను
గప్పున జంబుకానా మీద గూర్చుండిరి
కలుపన్న తీసిన గందము దెచ్చి
చెల్లెలు పాపకు మేనుకు అలది
కర్పూర విడియములు కాటుకాపెట్టి
అప్పలు పాపకు అలదంగ వచ్చినారు
"అంటకే ఎరినప్ప! అన్నెకారిని[42] నేను!
కటకటా! నాకేల గందవిడియములు?
పున్యము[43] గల స్త్రీలకు గాక ఈ పూలపుష్పములు
అంటకే ఎరినప్ప! అన్నెకారిని నేను!
సంతోసముగా ఉన్నవారికి సకలభోగములు
చింతయున్న వారికి శ్రీగంధమేల?
(ఒంటరి) బోటికి ఎందుకీ బ్రతుకు?
మీరు వచ్చుట నాకు మిగుల భోగంబు
అప్ప మీరు వచ్చినది నాకు ఆచ్చర్యము[44]
ఏమి అపాయము వచ్చెనో అంతరువుల మేడ కొచ్చితిరి
ఒంటిస్తంభపు మేడలో ఒంటిదాన నుంచితిరి
నేటికి ఆరుమాసములాయె నేడు మీరు వస్తిరి
ఆనాడు నా మీద దయలేదా మీకు?
తల్లి సిరిదేవి చూడకుండా వస్తిరా?
పందుముల ఎరినప్ప చెప్పవే నీవు?"

**-: "కాశినుండి భక్తిరన్నవచ్చినాడు - కాశితీర్థము గయావిభూతి ముందుగా నీకు ఇచ్చి, తరువాత ఇతరులకు ఇచ్చెదనన్నాడు - నిన్ను తీసికొని రమ్మని మమ్ము పంపినాడు" అని ఎఱినప్ప చెప్పుట :-**

పాప మాటలకు ఎరినప్ప ఏమి చెప్పేనంటె:
"చెల్లెలా! వినుమా! చెపుతాము మాట
మేలుగా వస్తినమ్మా! నీమేడ కడకు

42. పాపాత్మురాలను; 43. పుణ్యము; 44. ఆశ్చర్యము.

వినవమ్మా! ఈమాట వినిపించుదూను
అనిన నన్నేమని ఆడిపోదువనుచు
ఒక మాటచెప్పెదను వున్నట్లుగాను
ముకము వాడియున్నాది నాముద్దుబాల!
దూరమునుండి వస్తినని దూరంపుమాట కాదు
నేరంబు లెంచక నేను వచ్చినాను"
అప్ప ఆడిన మాటలకు ఏమనెను పాప?
"మీరు చెప్పితె వినక నేనెంత దానను!
ఎవల దానను ఎరినప్ప నేను?
పందుముల ఎరినప్ప! చెప్పవే నీవు"
ఆమాటలకు ఎరినప్ప ఏమనెను?
"వినవమ్మ! నీవొక్క వృత్తాంతమంత
వల్లవులవారి చెల్లెలా! (వకమాట వినుమ!)
నేను వచ్చిన పని చిన్నబుచ్చుకుమీ!
కాశియాత్ర పోయిన కరకంటమూర్తి[45]
దినకరుడు ఉదయించిన వేలకు[46]
మన దివానమునకు వచ్చినాడు
గయాయాత్రనుండి వచ్చినాడు మీయన్న బత్తుడన్న
అమ్మా! పాప ఏదని? అడిగినాడు నన్ను
కన్యను కడమేడ ఉంచితిమని చెప్పినాము
అన్నకు ఈమాట అన్నియును చెప్పితిమి
కాశీ తీర్తంబు[47] గయావిబూది
నీకు ముందు ఇచ్చి పరులకు వెనుక ఇస్తునని
గర్భపు చెల్లిలిని కదిలి రమ్మన్నాడు
నిన్ను మేడ దింపమని నను పంపినాడు
అన్నా చెల్లెలు మీద ఆసలుంటాయి"

45. కఱకంఠమూర్తి; 46. వేళకు; 47. తీర్థము.

**-: భక్తిరన్న పేరు చెప్పగనే పాపనూక అగ్గిలోపల నేయి చల్లినట్లు మండిపడుట – సుఖముగా కల్యాణములో నున్న తనను ఇక్కడికి తీసికొని వచ్చి కష్టముల పాలుజేసెనని భక్తిరన్నను నిందించుట – తన ఒంటరిస్థితికి దుఃఖించుట ఎఱనప్ప ఆమెను ఓదార్చి తమతో రమ్మనుట :-**

'అన్న' అనగా చెల్లెలకు కోపము కొట్టుమిట్టాయె
కోపమే సోకము గోరసోకము[48]
అగ్గిలోపల నెయ్యి జల్లినట్టయ్యె
ఎండి మొగలిమాను ఎరగట్టినట్లు
కుమ్మరి ఆము లెస్సగా కూలినట్లు
ఏరున్ను గెడ్డన్ను ఎగపొంగినట్లు
గర్భపు చెల్లెలు కన్నీరు తుడుచుకొని
"అన్నలనకె ఎరినప్ప ఆరదు మంట
నన్ను కిన్నడ జేసిన అన్నలింకెవరు? తమ్ములింకెవరు?
నమ్మించి తెచ్చిన నాకేటి అన్నలు?
అన్నలు నాకెవరు ఆసపడనేటికి?
కన్నవారికి నేను కదు ద్రోహినైతి
చిలుకలు నాతోడు! జింకలు నాతోడు!
పావురములు నాతోడు! బత్తుడన్న ఎవరు?
జీవిలేని ప్రతిమను నేను అయితిని
వేటగానికి పక్షి వెగసిన రీతి
గూట వేసిన పుణ్యగురువు వారెవరు నాకు?
తమ్ములకు చెల్లెలు అగుమంచి గాక
నన్ను సొదజేసిన* నాకేటి అన్నలు?
పుణ్యముగలవారికి అన్నలు గానీ
అన్నెకారిని నేను అన్నలింకెవరు?
అగుపడ్డ పులికి ఆవు వెగసిన రీతి
పరవాని బాలలకు బత్తుడన్న ఎవరు?
చెర ఉంచిన చెల్లెలుకు అన్నలింకెవరు?

---

48. శోకము ఘోరశోకము. *సొదజేసిన=దుఃఖముపాలుజేసిన (సొద = దుఃఖము, చిత్యగ్ని).

బత్తుడన్నకు నామీద బత్తి యున్నదో లేదో
ఆకాశమే తండ్రి! భూకాంతయే తల్లి!
ఎక్కడ కన్నవారు? ఎరినప్ప నీవు!
కడమేడ పుట్నిల్లు! కంబమె అన్నలు!
కడమేడ పుట్నిల్లు! కంబమె నాతోడు!
కర్రలే చుట్టాలు! నిప్పులే బంధువులు!
మేడమీద దూలాలు మేనత్తలు నాకు!
నేనెట్లు వస్తునే అప్ప ఎరినప్ప?
అన్నదమ్ములు లేక ఆత్మబంధువులు లేక
బావమరుదులు లేక బంధువులు లేక
శివుడు నాబతుకు ఒంటి జేసెనో యమ్మ!"
కటకటా! యనుచు కన్నీరు కార్చె.
"ఏడ్వకు చెల్లెలా" అని ఎరినప్ప చెప్పెను
పట్టుచీర కొంగుతో ఎరినప్ప పాపకన్నీరు తుడిచెను
"ఎంత ఏడ్చుతావు ఎర్రినాపాప!
ఎంత దుక్కిస్తివో[49] ఎర్రినాపాప!
గురువేమి చేశాడు? కోదువేమి తల్లి?
బత్తుడన్నకు నీమీద బత్తియున్నది గాని
పగలేదు చెల్లెలా! భక్తి యున్నదిగాని
బత్తుడన్నను నీవు సాధింపరాదు
బలగము ఒక ఎత్తు, అన్నకు నీవు ఒక ఎత్తు,
నీమీద గల ప్రేమ నామీద లేదు!"
ఎరినప్ప మాటలకు ఏమనెను పాప?
"నిజమేనె ఎరినప్ప నీవాడిన మాట
మాయమ్మ ఏమి చేసెనో మాయన్న ఏమి చేసెనో
నాపూర్వ పున్నెము గాబోలు గాక!"
అప్పుడు ఎరినప్ప ఇట్లని పలికె:
'చెల్లెలా! నేను వచ్చిన పని చెల్లించు'మనగ

49. దుఃఖిస్తివో.

**-: పాపనూక ఎరినప్పతో తన తండ్రి పెద్దిరాజుకథ చెప్ప ప్రారంభించుట -**
**తల్లిపెద్దమ్మ పంపాద్రి నోములు ఫలింపకుండుటచే దంపతులిరువురును**
**సంతానము కొరకు కల్యాణ నగరమునకు వలసపోవుట :-**

ఆమాటలకు పాప ఏమని పలికె:
"హరిగురువంటారు అప్ప ఎరినప్ప!
మరిచినావటె అప్ప ముందు వృత్తాంతమంత
కన్నవారి కతలు చెపుతాను వినుమి
తల్లులైదుగురున్ను తండ్రులైదుగురున్ను
పంపాద్రి వెళ్ళిరి ఆనందముగను
మూప్రమైన జడలు ముద్దుల బసవన్న నోములు నోచిరి
నలుగుర చేతిపాలు ఆరగించి
తల్లి పెద్దమాదేవి చేతిపాలు వల్లకపోయె
అలిగెను బసవన్న అయిదు తానాలకు
సంతానములేని స్త్రీ చేతిపాలు వల్లకపోయిన
పెద్దమ్మ చింతించి మారుమూల
నులకమంచము మీద అలిగి పడుకొని చింతించుచుండె
కల్యాణములో స్వామి కలలోకి వచ్చి
కలలోన చెప్పెను పెద్దమాదేవికి
'వేగముగాను కల్యాణమొస్తేను
కల్యాణములో మాపూజ ఘనముగా జేస్తేను
ఏడుతరాల పగను సాధించెడి
కొడుకును నీకిచ్చేను కులముద్దరించేను
ఏడు గోత్రాములు ఎంచి పాడే నాతిని ఇస్తాను'
కలగని పెద్దమ్మ గ్రక్కున లెగిసి[50]
కాంత సంతోషపడి తన విభుని కలుసుకొని
విచారించి తన కల (విభునికి) చెప్పెను
అన్నదమ్ములతో పాలు పంపకాలు అనెను

50. లేచి.

అన్నదమ్ములు పంపాద్రమ్మ గుళ్ళ దగ్గర
పంపకాలు (అపుడు) పంచడమైనది
తల్లులు బిడ్డలు అన్నలు తమ్ములు
ఫలములై కొంత పాయి గాలేక
ఎలమంచిలి సంపద ఎడగలగా జేసి
దేశములు గాని దేశములు జెప్పి
పెద్దమాదేవి మాతల్లిదండ్రి
పసినేగలు[51] బాపిన పాపము తగిలి
పసిబిడ్డ తల్లులు పలు తెరువులాయె
ఆనాడు గోకులము ఎడబాసినందులకు
తల్లిమొకము బిడ్డలము గానమైతిమి
భూములు గాని భూములు (వెళ్ళిపోవచ్చిరి)
పుట్టలు గాని పుట్టలు వెళ్ళిపోవచ్చిరి
విన్నావా ఓఎరినప్ప! ఇది ఎల్ల?

**-: పెద్దిరాజు వాలికేతువరాజుతో యుద్ధముచేసి మరణించుట :-**

పట్టభద్రుడు ఏడేండ్ల నాటివాడు కాటమరాజు
నాతండ్రి పెద్దిరాజు యుద్ధమునకు నడిచి,
విజయకొమ్మును బొడిచి, వీరకొమ్మును బొడిచి*
రాయకుంభిని బొడిచి, రత్నకుంభిని పొడిచి,
అరవైయ్యారు కుంభినీలు అతము[52] జేసి,
మది వీరకుంభినీ మీదకు మల్లి[53]రాగాను
వాయుకేతువుచేత పరిగెనే రాజు
నాగకేతువుచేత నేలకూలెను తండ్రి
రాజులను తెగటార్చి పెద్దిరాజు పరిగె
రాజు ఆయుధరక్తపు బట్టలు జూచి
గంగయు పోతురాజు కటకటాయనుచు
రణమునకు కావలియుండిరి వారు

51. పసిలేగలు; *విజయకుంభిని బొడిచి, వీరకుంభిని బొడిచి; 52. హతము; 53. మరలి.

పావురాలచేత పంపించె కల్యాణముకు ఉత్తరాలు
పంపిన ఉత్తరాలు కాటమరాజు చదివి అప్పుడిట్లనియె:
'అన్నదమ్ముల బాసి యాదవరాజు కల్యానమొచ్చె
మమ్ములను కని రణమునకు వెళ్ళి చెల్లిపోయెనుగ
పుత్రుని ఐతేను పుట్టగానేమి నేను గల్గిన ఫలము?
నా తండ్రిని పంపితిని బ్రహ్మపట్నమునకు
రణములోనికి వెళ్లి నా తండ్రిని చంపిన పగ
తీర్చుకొందు'నని పయనమై కాటమరాజు
ఎదురుగా వచ్చిన కొడుకును తల్లి ఎత్తుకొని
'వద్దు! పోకు కుమారా! వల్లవుల సుతుడా!
తల్లి నీకు తండ్రి నీకు! ఎవరు ఆ రణములోను?
ఆ రణముకు (నిన్ను) ఎట్లు పంపుదును?'

**-: ఏడేండ్ల కాటమరాజు తండ్రిని చూపుదునని తల్లికి ప్రతిజ్ఞచేసి చెప్పి యుద్ధభూమికి వెడలుట - గంగ కాటమరాజుకు సహాయము చేయుట :-**

బాలుడు 'కన్నతండ్రి ప్రళయకాలుడును
కులముద్ధరించను కొడుకునై పుట్టితిని
ఎన్నాళ్ళకైనను కన్నతండ్రిని తెచ్చి
కన్నుల జూపుదును' అని తల్లికి జెప్పి
పని బూని రణముకు పయనమైపోయె.
రణము సాధింతు రేయిపగలనుచు
కాటమరాజు తల్లికి జెప్పి (కదలి)
యుద్ధమునకు యుద్ధభూమికి వెళ్ళెను
కలిపోతురాజు పొలితిరుగగాను:
'ఎవ్వడవురోరి! ఇచ్చటకు వచ్చినావు?'
ఏడు మణుగుల గద ఎగరేసి కొట్టబోయె
గనముగా (నా వార్త) గంగకు చెప్పె
అప్పుడు ఆ గంగ అతివేగమున వచ్చి
'ఎవ్వడవురోరి ఇచ్చటకు వచ్చినావు?'

'నీవు ఎవర్తివే ఇక్కడకు వస్తున్నావు?
నీపేరు చెప్పవే ఓ కాంతకాన?'
'నాపేరు కొండరా ఓ బాలకాన!
నీపేరు చెప్పరోరీ ఓ బాలకాన?'
'కొండవు నీవైతే, కొండను దొలిచేటి బండ నాపేరు!'
'రాయిరా నాపేరు ఓ బాలకాన!'
'రాయివి నీవైతే రాయిని తరిగేటి రంపము నేను!'
'నీపేరు చెప్పరా ఓ బాలకాన?'
'నీపేరు చెప్పవే? ఓ కాంతకాన?'
'నాపేరు గంగరా ఓ బాలకాన!'
'గంగవు నీవైతే కాటమరాజును నేను!'
'మేనమామ కుమారుడవు ఓ మేనమరిది!
నన్ను పెండ్లాడుమీ! ఈ క్షణములోన!'
'చెల్లిపోయిన మాతండ్రి మూడు మాటలు ఆడితేను
నిన్ను పెండ్లాడుదును ఈ క్షణములోన!'
అప్పుడు జనని జోదు తుమ్మెదలాయె
నాసికలో జొరబడి మూడు మాటలు ఆడించెను,
బయటకు రాగాను అంతట పెద్దిరాజు మాట్లాడలేదు.
'నన్ను పెండ్లాడుమీ ఈక్షణములోన!'
'మైలతో పెండ్లాడుట మంచిదా నీకు?
మా తండ్రిని పట్నమునకు మల్లించితేను
నిన్ను పెండ్లాడెదను నిక్కంబుగాను!'
అప్పుడు గంగ పెద్దిరాజును పల్లకిలోన వేయించి
వెనుక పోతురాజును ముందల తాను
మోసెనట్లే కాని మోసేది కాదు
పరుగున ఆ గంగ పట్నముకు తెచ్చి
'పెండ్లాడవోయి రాజ! పెండ్లాడవయ్య!'
'మర్లవారింటను గంగవై పుడితేను

వల్లవులవారింటను వరుస పెళ్ళికొడుకును నేను'
గంగను పుట్టుక్కు పంపెను కాటమరాజు
తెలతెల్లవారంగ తండ్రిని తెచ్చి తల్లికి చూపెను
'ముచ్చటాయెనయ్యా నాముద్దుకుమారా!'
నందుల చెరువెనుక నాగవీర బయల
పొందైన సురపొన్న(నీడ)ల కింద
తండ్రిని దించి తల్లికి ఎరిగించె.

**-: పెద్దిరాజు శవమును జూచి పెద్దమ్మ శోకించుట – సహగమనమునకు సిద్ధమగుట :-**

అప్పుడు పెద్దమాదేవి పైడిపళ్ళెములో నివ్వాళి దెచ్చి
కల్యాణములో ఉన్న కాంతలతోను
వాయిద్యములతోను ధరణి కంపింప
ఎదురుగా పెండ్లికి ఏతెంచినట్లు
తన విభుని దగ్గరకు వచ్చి నవ్వుచు సతి
రాజుకు ముసుగు తీసి పన్నీరు ముఖము నింద అలది
తన చీరకొంగుతో ముఖము తుడిచి
పైనిండ జవ్వాది పచ్చని కస్తూరి
మెడను శ్రీగంధము పూసి, కుంకుమ బొట్టును ఉంచి
కురులు నున్నగ దువ్వి కురుచంగ ముడివేసి
పకపక నవ్వెను తన ప్రాణేశ్వరుని గూడి
'పాన్పుపై నిద్రించేవు నాప్రాణనాథా!
జంబుకానా మీద నిద్రించేవు సకల సంభ్రమముతో
స్వామీ! నాతో ముచ్చట ఆడవా?
అన్నదమ్ముల బాసి, ముద్దు తమ్ముల బాసి,
అన్నలను బాసిన పగ తీరునా నీకు పలుకు నాతోను'
సాలటే[54] ఎరినప్పు! తల్లిసాటి ముచ్చట!
ఇచ్చోట చెల్లెల నువు వస్తివే మీరు

54. చాలటే.

మన వంక వారెవరు (మరియిచట) లేరు
చక్కని ఎరనూకరాజు సాగి మొక్కినాను
నలనూకరాజుకు కూతురును నేను
పోలురాజు తలపోతలాయెనే నాకు
బావలు మరదులు బంధు సహోదరులు
మరదళ్లు కొమరమ్మను అందరును
చాల మనుముకు చెప్పితే సమ్మత పడక
కల్యాణమొస్తేను తగులునే కీడు
ఇంక చరిత్ర చెప్పెదను వినవె ఎరినప్ప!
'మరదళ్ళ విడిచి కల్యాణమొచ్చితి సంతానము కొరకు
సంతానము కలిగిన సంతోషమాయెను
పంతమా నీకొడుకు పలకవేమి రాజా!
గర్భమున పుట్టిన కాటమరాజును
ఎవరికిస్తివి (మరి) ఏమి చేస్తివి?
బలగమున కలిపిన బ్రతుకు తెరువు లేదు'
చెక్కిళ్ళు తీసి(తా) చేరి ముద్దాడి
పకపక నవ్వెను ప్రాణేశ్వరి తాను
కర్పూర విడియములు పుత్రిని ఏమి ఎరుగుదువు?
బూములు కొని పెద్దమాదేవి భూసురుల కిచ్చెను
నాగలోకమున గుండము నాడు ఏర్పరచెను
తవ్వించిన గుండములో కలప ఏర్పరచి
మల్లెతోట చిగురుమామిడి కింద
మాతల్లి తముకు[55] వేయించి (తాను)
జనులంత ఎరుగంగ జగమంత ఎరుగ!"

**-: ఎఱినప్ప ఎల్లప్పలు పాపనాకను ఓదార్చుట - ఆరుమాసములనుండి తాను ఒంటరిగ నుంటినని పాపనూక చెప్పుట :-**

అదియంత ఎరిగి పందుముల ఎరినప్ప

55. చాటింపు.

పైడివారి ఎల్లప్ప “చెల్లెల (నీవు)
తల్లి గురుతులేమి ఎరుగుదువు?
తండ్రి గురుతులేమి ఎరుగుదువు?
వారు చెల్లిపోయి ఏడు ఏండ్లు అయిపోయె
ఎన్నాళ్ళ బాలవు ఏమి ఎరుగుదువు?
కన్నవాళ్ళ పూర్వకతలు[56] కవిలకట్టలాయె తలపోతలాయె
ఎలమంచి రాజులు ఎందుకీమాట
ఎలమంచిలివారు నిన్ను ఎదురు చూసెదరు
తరలి రావమ్మ! ఇటకు తడవు లేదమ్మ!”
పందుముల ఎరినప్ప, పైడివారి ఎల్లప్ప
ఇద్దరాడిన మాటలకు ఏమనెను పాప?
“నేను ఏమని చెప్పెదను మీకు
చుట్టములు బంధువులు లేక సహోదరులు లేక
పుట్టుతోడు లేక పుట్టితిని నేను
కంచంత బలగంబు మాతల్లి కన్నవారు తాతముత్తాతలు
తండ్రులు మీతో చెప్పితే మరిచేనా నేను
ఏడు తరాల గోత్రాలు పాడుటకు
వరమడిగె నా తల్లి ఉత్తమాదేవి
తండ్రిరాజులు మొదలైనవారు
కన్నవారును మరచుటకును కర్మమే అక్క
విన్న మరపులు రావు విశ్వేశ్వరునకు
ఆడ ముచ్చట గాని అనరాదు మీతొ
ఎరనప్ప నేటికి ఆరుమాసములాయె ఎడబాసి మిమ్ము
అన్నలెవరే తల్లి? అన్నబత్తుడన్న చేసినది

**–: పెద్దమ్మ తన పిల్లలిద్దరిని కలబోతులవారికిచ్చి, తాను సహగమనము చేయుట: –**

వినుడి తరులాక్షి[57] మాతల్లి (వివరము)

56. పూర్వకథలు; 57. తరళాక్షి.

రామ శ్రీరామా యని పలికి
దశరథరామా యని పలికి
బగవంతుని[58] దలచి సోడసమ[59] దానంబులను
నవనందుల పెద్దమాదేవి
పైనిండా పుష్పాలు బాతి[60] సేతబట్టి
ఆడుచు పాడుచు బలగమున కెల్లి
బళ్ళతో కుంకుమ పంచిపెట్టేను
కాటమరాజును ఎత్తుకొని, ఎఱ్ఱకన్నుల పాపను ఎత్తుకొని
పేరుపేరున వర్నించి[61] పెద్దలను పిలిచి
'కల్యాణములో నున్న అప్పలారా!
పాపను ఇచ్చెదను బ్రతికించుకోరె!
ఇరుపార్శ్వవారు ఇద్దరిని ఇచ్చెదను పెంచుకోరె మీరు
ఒక్క కుమారుని మీరు కాటమరాజును
(అనువుగా) ఇచ్చెదను అందుకోరమ్మ !
పచ్చినెత్తురులోన గన్నపాపను
రాచబాలను ఇచ్చెదను రక్షించుకోరె!
పట్టభద్రుడు నాకు ప్రాణప్రదము నాకు
పుట్టుబోగి నిచ్చెదను పుచ్చుకోరమ్మ !
చందమామ వంటి చక్కని పాపను
(అతివలార!) ఇచ్చెదను అందుకోరమ్మ !
సూర్యుని ఇచ్చెదను చేకొనరె మీరు!
(గోపకాంతలార!) మంచి గోవులను ఇచ్చెదను
పట్టపురాజు చెల్లెలను ఇచ్చెదను పట్టుకోరమ్మ !
బంగారు పట్టుదట్టీల కాటమరాజు నిచ్చుదును కరుణించరమ్మ !
నవరత్న సంపదలు సకల బాగ్యములు ఇచ్చెదను పుచ్చుకోరమ్మ !
తమకంబు పైనున్న తల్లి అన్న మాట విని

58. భగవంతుని; 59. షోడశ; 60. బాంతి/బ్రాంతి = ప్రేమతో, శ్రద్ధతో; 61. వర్ణించి.

గోపకాంతలు, (మరి) యాదవేశ్వరులు,
ఎన్నముద్దలవారు, పున్నపెన్నలవారు,
చిన్నకృష్ణవారు, చిన్నెలవారు,
పొన్నపువ్వులవారు, జన్నెలవారు,
అల్లబోయినవారు, ఆవాలవారు,
పన్నగేంద్రునివారు, కరిమావులవారు,
ఎన్నబోయినవారు, పూజారువారు,
కన్నిబోయినవారు, కవులావులవారు,
రామచంద్రునివారు, రాజులవారు,
సోమనీలవారు, కామధేనువువారు,
గంగావులవారు, కొమనాలవారు,
గుంటుబోయినవారు, గురుమూర్తివారు,
చల్లావారు, పందుములవారు,
లక్ష బలగము వచ్చెను ఎరనప్ప!
'ఎలమంచిలి పెద్దమాదేవి! ఏలనాడితివి?
కులమువారు గల్గి, గోత్రములు గల్గి,
దాయాదులు గల్గి, నిండేగురు బలము గల్గి,
సింహబూములు గల్గి, చాలమంది గల్గి,
అమ్మ బాలలను పరులకు అప్పగించె
కించి నీళ్ళమీద విరగినవి కాటమరాజును
అతి ప్రీతితోను కాటమరాజును
మేమే పెంచుదుము, బూములు ఏలింతుము,
తండ్రి వరిగిన తండ్రి పగ దీర్చిన
కొండదాపు యాదవాకుల'మనిరి
యాదవులు మమ్ము ఎవరు తీసికొనలేదు
మాతల్లి ఏమి సేతునని విచారించి
తన విభునితో గుండమున పడక తప్పనని
కలబోతులవారికి మమ్ములను ఇచ్చివేసెనుగా!

**–: కాశియాత్రకుబోయిన భక్తిరన్న కల్యాణమునకు వచ్చి, పాపనూక పాట విని, పెద్దిరాజు పిల్లలను గుర్తించి ధనముకొండకు తీసికొని వచ్చుట :–**

కాశీయాత్ర పోతున్న భక్తుడు తోవ తప్పి
కల్యాణములోనికి వచ్చి నాపాట ఆలకించి
వచ్చి మమ్ములడిగెను వాళ్ళు ఇవ్వక
ఆరిపోయిన గుండమున మంటలు చెలగించి
మమ్ముల తీసుకవచ్చెను ఈ ధనుముకొండకు
నన్ను సౌధము జేసిన కన్నవారు ఇంకెక్కడ ఉన్నారు?"

**–:పాపనూక మేడదిగి రాదని తన దివ్యదృష్టితో తెలిసికొన్న భక్తిరన్న, ఎఱగడ్డపాదులో తన అన్నదమ్ములందరును చెల్లిరని తెలిసికొని, విభూతి మంత్రించి ధనముకొండపై చల్లుట–పాపనూక ఎఱనప్పతో మాటలాడుచుండగనే మేడకు అగ్నిముట్టుకొనుట:–**

అంతలో బత్తుడన్న పాప రాదని ఆలోచించి
దివ్యదృష్టిని జూసి ఎరగడ్డ యుద్ధములో
అన్నదమ్ములు అందరు చెల్లిరని తెలిసికొని
కాశీ విభూతి మంతరించి ధనముకొండ
అగ్గి ముట్టుకోవలెనని, సాప్యముంచి[62]
ఎరగడ్డకు పోయెను. పాప ఎరనప్పతో
మాట్లాడుచుండగ మేడకు అగ్గి ముట్టుకుంది!



62. శాపముంచి.

## ఖడ్గతిక్కనపై ఒక అద్భుతమైన చాటుపద్యం
### (స్థానిక చరిత్రలు – 18వ సంపుటం)

ఒకసారి ఒక భట్రాజు ఖడ్గతిక్కన దగ్గరకు వచ్చి అతని గుణగణాలను కీర్తిస్తూ ఒక సీసపద్యం చెప్పాడు:–

**సీ॥ ధైర్యంబు నీ మేనఁ దగిలియుండుటఁజేసి,**
**చలియించి మందరాచలము దిరిగె;**
**గాంభీర్యమెల్ల నీకడనె యుండుటఁజేసి,**
**కాకుత్స్థుచే వార్ధి కట్టువడియె;**
**అల లక్ష్మి నీయందు నలరియుండుటఁజేసి,**
**హరి పోయి బలి దానమడుగుకొనియె;**
**ఆకారమెల్ల నీయందునుండుటఁజేసి,**
**మరుఁడు ధూర్జటి కంటిమంటఁ గ్రాఁగె;"**

సీసపద్యంలో నాలుగు పాదాలే చెప్పాడు; ఎత్తుగీతి (తేటగీతికాని, ఆటవెలది కాని) చెప్పలేదు. రణతిక్కన అతనికి ఎనిమిది వేల వరహాలు ఇచ్చి గౌరవించాడు. రెండవసారి యుద్ధానికి వెడుతూ తన తల్లిని, భార్యను పిలిచి, "ఆ భట్రాజు మళ్ళీ వస్తాడు. ఎత్తుగీతి చెపుతాడు. అప్పుడు అతనికి మరో నాలుగు వేల వరహాలు ఇవ్వండి" అని చెప్పి వెళ్ళిపోయాడు. యుద్ధంలో వీరమరణం పొందాడు. కొన్నాళ్ళకు ఆ భట్రాజు తిరిగి వచ్చి, ఎత్తుగీతిని (ఆటవెలదిని) ఎంతో అందంగా పూరించాడు:–

**ఆ.వె. "తిక్కదండనాథ! దేవేంద్రపురము నీ**
**వరుగుటెఱిగి నగము తిరుగుటుడిగె,**
**అబ్ధి కట్టువాసె, అచ్యుతక్కుఱ తీఱె,**
**మరుఁడు మఱలఁ బుట్టె మగలరాజ!"**

తిక్కన చెప్పినట్లుగానే అతని తల్లి, భార్య ఆ కవిని నాలుగువేల వరహాలతో సత్కరించారు.

## 5. అనుబంధం– I

### 1964–67 సంవత్సరాల మధ్య నాకు లభించిన కాటమరాజుకథల తాళపత్ర గ్రంథములు

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామం | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | కంసుదుకథ లేక విష్ణుభాగవతము | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 01.03.1966 | శ్రీతోడేటి సుబ్రహ్మణ్యం | శ్రీ ఎం. ధర్మయ్య<br>శ్రీ డి. శ్రీరాములురెడ్డి |
| 2. | ” | ” | ” | ” | ” | ” | ” |
| 3. | ” | ప్రకాశం | దర్శి | ఎఱ్ఱబాలెం | 17.09.1966 | శ్రీ మోడి ముసలయ్య | శ్రీ దొనకొండ లక్ష్మీకాంతదాసు<br>శ్రీ ఎ. బాలకోటయ్య |
| 4. | ఆవుల వలురాజుకథ | గుంటూరు | పల్నాడు | గామాలపాడు | 31.08.1966 | శ్రీ దమ్మాలపాటి లింగప్ప | శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి |
| 5. | పంపాద్రికథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయపూడి | 05.09.1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ టి.వి.కె. సోమయాజులు<br>శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 6. | పంపాద్రికథ | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12.09.1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ దొనకొండ లక్ష్మీకాంతదాసు<br>శ్రీ ఎ. బాలకోటయ్య |

| నెం. వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామం | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|
| 7. పెద్దిరాజుకథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 05.09.1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ టి.వి.కె. సోమయాజులు<br>శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 8. పెద్దిరాజుకథ | ప్రకాశం | కనిగిరి | కంకణంపాడు | 16.09.1966 | శ్రీ తాళ్ళూరు కోటయ్య | శ్రీ జోసెఫ్<br>శ్రీ యస్. వెంకటశివయ్య |
| 9. పెద్దిరాజుకథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 25.02.1967 | | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 10. కాటమరాజు అర్లపెంట యుద్ధము (కాగితపు ప్రతి) | కృష్ణా | కైకలూరు | పెరికగూడెము | 09.09.1964 | శ్రీ గుజ్జర్లపూడి మస్తాన్ | శ్రీ టి.వి.కె. సోమయాజులు<br>శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 11. పోలురాజుకథ | ప్రకాశం | దర్శి | ఎఱ్ఱబాలెము | 17.09.1966 | శ్రీ మోడి ముసల్యయ | శ్రీ ఎ. బాలకోటయ్య |
| 12. పోలురాజుకథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 05.09.1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ వి. విశ్వేశ్వరరావు |
| 13. పోలురాజుకథ | ప్రకాశం | కనిగిరి | కంకణంపాడు | 16.09.1966 | శ్రీ తాళ్ళూరు కోటయ్య | శ్రీ రాయల మాలకొండయ్య |

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామం | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 14. | బల్లికురువ పోట్లాట | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12.09.1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ దొనకొండ లక్ష్మీకాంతదాసు |
| 15. | కాటమరాజుకు పట్నంకట్టినకథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 05.09.1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 16. | కటియావుల రాజుకథ | గుంటూరు | పల్నాడు | గామాలపాడు | 31.08.1966 | శ్రీ దమ్మాలపాటి లింగప్ప | శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి |
| 17. | కటియావుల రాజుకథ | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 01.03.1966 | శ్రీ తోడేటి సుబ్రహ్మణ్యం | శ్రీ యం. ధర్మయ్య |
| 18. | పాపనూక కథ | " | " | " | 19.07.1966 | " | శ్రీ డి. శ్రీరాములురెడ్డి |
| 19. | పాపనూక కథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 05.09.1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |
| 20. | పాపనూక కథ | " | " | " | " | " | " |
| 21. | ఆవులమేపు (కాగితపుప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16.03.1966 | – | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామం | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 22. | ఆవులమేపు | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12.09.1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ దొనకొండ లక్ష్మీకాంతదాసు |
| 23. | గంగతర్కము | కృష్ణా | కైకలూరు | పెరిగగూడెము | 09.09.1964 | శ్రీ గుజ్జర్లపూడి చింతాలు | శ్రీ టి.వి.కె. సోమయాజులు |
| 24. | గంగతర్కము | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 01.03.1966 | శ్రీ తోడేటిసుబ్రహ్మణ్యం | శ్రీ యం. ధర్మయ్య |
| 25. | గంగతర్కము | ప్రకాశం | దర్శి | గంగదొనకొండ | 12.09.1966 | శ్రీ పూజారి సుబ్బయ్య | శ్రీ ఎ. బాలకోటయ్య |
| 26. | పాలేటికథ | గుంటూరు | పల్నాడు | గామాలపాడు | 31.08.1966 | శ్రీ దమ్మాలపాటి లింగప్ప | శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి |
| 27. | ఎఱ్ఱయ్య తర్కవాదము | కృష్ణా | కైకలూరు | పెరిగకూడెము | 09.091964 | శ్రీ గుజ్జర్లపూడి చింతాలు | శ్రీ టి.వి.కె. సోమయాజులు |
| 28. | జన్నివాడకథ | ” | ” | ” | ” | ” | ” |
| 29. | వేడుక బొంగరాల కథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16.03.1966 | – | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 30. | ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట | చిత్తూరు | చంద్రగిరి | పెడకంటిపల్లె | 19.07.1966 | శ్రీ తోడేటి సుబ్రహ్మణ్యం | శ్రీ డి. శ్రీరాములురెడ్డి |
| 31. | అగుమంచికథ | ” | ” | ” | 01.03.1966 | ” | శ్రీ యం. ధర్మయ్య |

| నెం. | వీరగాథ పేరు | జిల్లా | తాలూకా | గ్రామం | లభించిన తేది | ఇచ్చిన గాథాకారుడు | సహకరించిన మిత్రులు |
|---|---|---|---|---|---|---|---|
| 32. | మమ్మయ్య – పోచయ్య బొంగరాలు | చిత్తూరు | చంద్రగిరి | పెదకంటిపల్లె | 09.03.1966 | తోడేటి సుబ్రహ్మణ్యం | శ్రీ యం. ధర్మయ్య |
| 33. | అలుగులపోలు (కాగితపుప్రతి) | కడప | ప్రొద్దుటూరు | ప్రొద్దుటూరు | 30.04.1966 | శ్రీ శూలం నారాయణ | శ్రీ గంగయ్య |
| 34. | భక్తిరన్నకథ | ప్రకాశం | కనిగిరి | వెంగళాపురం | 15.09.1966 | శ్రీ బొడ్డెబోయిన గంగయ్య | శ్రీ యం.వి.కృష్ణమూర్తి |
| 35. | భక్తిరయ్యకథ (కాగితపు ప్రతి) | గుంటూరు | తెనాలి | ఎడవూరు | 16.03.1966 | – | శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్య |
| 36. | భక్తిరన్న కథ | కృష్ణా | గుడివాడ | కుచ్చికాయలపూడి | 05.09.1964 | శ్రీ కొడాలి సీతారామాంజనేయులు | శ్రీ బి. విశ్వేశ్వరరావు |

**ఈ గ్రంథముద్రణకు విరాళాలు ఇచ్చిన కుటుంబ సభ్యులు–శిష్యులు:–**

| | |
|---|---|
| 1. చి॥ సౌ॥ తంగిరాల సీతామహాలక్ష్మి(మా పెద్దమ్మాయి) | –రూ. 10,000/– |
| 2. చి॥ మిహిర్ కులకర్ణి (దౌహిత్రుడు) | –రూ. 5,000/– |
| 3. చి॥సౌ॥ రసజ్ఞ కులకర్ణి (దౌహిత్రి) | –రూ. 5,000/– |
| 4. చి॥ తంగిరాల వెంకట నాగ వైజయంతి (పౌత్రి) | –రూ. 5,000/– |
| 5. శ్రీ ఖండాపు మన్మథరావు (శిష్యుడు) | –రూ. 5,000/– |
| 6. డా॥ నాగమ్మగారి భీమన్న (శిష్యుడు) | –రూ. 5,000/– |

## యువపరిశోధకులకు, యాదవమిత్రులకు
## ఒక ముఖ్యమైన మనవి:–

ఆంధ్రదేశంలో కొమ్ములవారి దగ్గర, గొల్లసుద్దులవారి దగ్గర, యాదవుల దగ్గర చాలా తాళపత్ర గ్రంథాలు ఉన్నాయి. మనం అడిగితే వాళ్ళు ఒక పట్టాన ఇవ్వరు. వారిని బ్రతిమాలి బామాలి, ధనమిచ్చి మచ్చిక చేసికొని ఈ క్రింది కాటమరాజుకథలు సేకరించవలసిందిగా కోరుతున్నాను:–

**(1) గంగపుట్టుక; (2) పల్లికొండపుట్టుక; (3) సింహాద్రిరాజుకథ; (4) నలనూకరాజుకథ; (5) భైరవకురువయుద్ధం; (6) అగుమంచి వలపోత.**

పై కథలు లభిస్తే, వాటిని నోటుబుక్‌లో ఎత్తివ్రాసి, నాకు పంపితే, నేను ముద్రిస్తానని అందరికీ హామీ యిస్తున్నాను.

ఇట్లు

బెంగుళూరు
14–01–2021
(శార్వరి సంక్రాంతి)
సెల్ నెం. 99454 22742

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**
ఇంటినెంబరు: 1708, "సీతావధానం"
11వ క్రాసు, 1వ 'జి' మెయిన్ రోడ్డు
కెంగేరి ఉపనగరం, బెంగుళూరు–560060

# 6. అనుబంధం–II: ఛాయాచిత్రములు

## 6.1 చారిత్రక ప్రదేశములు

### 6.1.1 నేను 1964–66 సంవత్సరాలలో తీసిన నలుపు–తెలుపు ఫోటోలు



జాతర ఏడరోజు బంకమట్టితో చేసిన 'సుద్దగంగమ్మ'



తిరుపతి గంగమ్మ



తిరుపతి గంగజాతర



దొనకొండ గంగగుడి ప్రాంగణంలో ఉన్న శక్తులు, యాదవవీరులు



యాదవరాజులు పూజించిన దొనకొండ గంగగుడి (ప్రకాశంజిల్లా)



యాదవవీరుడు (గంగ దొనకొండ)



యాదవవీరులు (గంగ దొనకొండ)



పంచలింగాలకొండపై  భైరవునిరూపంలో వెలసిన పోలురాజు



ఓరుగంటి బేతాళుడు (గంగ దొనకొండ)



"పెయ్యలతిప్ప" లేక "ధనముకొండ" (గంగ దొనకొండకు సమీపం)



"పాపనూక" ఒంటిస్తంభంమేడ శిథిలాలు (గంగ దొనకొండ)



"పాపనూక" విగ్రహం (గంగ దొనకొండ)



"పంచలింగాలకొండ"-"ఎఱ్ఱగడ్డపాడు"ల ప్రక్కనే ప్రవహిస్తున్న
"పాలేరు" ("గంగ -కాటమరాజు తరకవాదము" జరిగిన ప్రదేశం)



పాలేటి మధ్యనున్న "గుంటిగంగ"



"పంచలింగాలకొండ" (కనిగిరికి సమీపం)



కాటమరాజు కోట (పంచలింగాలకొండపైనుండి దృశ్యం)



"తమకము చింత" (కాటమరాజు సింహాసనం ఉండిన ప్రదేశం)



"గుడారు గుట్ట" (కాటమరాజు గుడారం వేసికొనిన ప్రదేశం)



దొనకొండ గంగగుడికి ఎదురుగా ఉన్న
"కల్లి అరుగులు" లేక "రాయబారపు అరుగులు"



పాలేటి మధ్యన రాతిగుండుపై "కొంగవాలు కత్తి" తో ఉన్న "బీరినీడు"



“కొయ్య బొమ్మ” (దొనకొండ గంగగుడి)



“కంచు బొమ్మ” (దొనకొండ గంగగుడి)



“అగుమంచి బొడ్డన బావి”

(అగుమంచి త్రవ్వించిన బావి–గంగ దొనకొండ)



“అగుమంచి బొడ్డన బావి”

(మరియొక వైపునుండి దృశ్యం)



"అగుమంచి బొద్దు" – అగుమంచి పూజించిన శివలింగము(?)
(అగుమంచి బొద్దనబావి ఒద్దున ఉన్నది)



"పెయ్యల తిప్ప"లో ఉన్న "బత్తిరన్నగవి"
(దీని గుండా భక్తిరన్న కాశికి పోయినాడట!)



"చంపుడు కట్ట" పై నున్న అగుమంచి పాదాలు (దొనకొండ గంగగుడి)



"అగుమంచి గుండం"

(అగుమంచి సాగుమానం చేసిన అగ్గిగుండం–దొనకొండ గంగగుడి)

## 6.1.2 మిత్రులు పంపిన రంగుల ఫోటోలు



గొల్లసుద్దులవారి ప్రదర్శన (కడపజిల్లా) (గంగ-కాటమరాజు:శిరకనాదము)



కొమ్ములవారి ప్రదర్శన (ప్రకాశంజిల్లా)



కాటమరాజుగుడి, కోనేరు (పుష్కరిణి), నల్లమల





పోలేరమ్మ – ఇతర శక్తులు, నల్లమల



"గూబగుండంబావి" – నల్లమల





దొనకొండ గంగగుడి (ముందుభాగం)



అగుమంచి (గంగగుడి, దొనకొండ)



"చంపుడు కట్ట" పై అగుమంచి పాదాలు (దొనకొండ గంగగుడి)



పెద్దమ్మ-చాముండి-పోలేరమ్మ-యాదవవీరులు
(దొనకొండ గంగగుడి ప్రాంగణం)



పాలేటిగంగ గుడి (ఎల్లగడ్డపాడు)



పాలేటిగంగ గుడిలో "ముమ్మయ్య-పోచయ్య"









ఎఱ్ఱగడ్డపాటి త్రవ్వకాలలో దొరకిన "కాటమరాజు" విగ్రహం



“ఒంటికొమ్ము బొల్లావు” (పాలేటిగంగ గుడి)



కాటమరాజు పుట్టినరోజు (ఫాల్గున శుద్ధ పంచమి)
యాదవకాంతల పూజ (గంగగుడి–తిరుపతి)



తిరుపతి గంగజాతరలో ముగ్గుతో వేసిన కాటమరాజు చిత్రం







తిరుపతి గంగజాతరలో ముగ్గుతో వేసిన గంగచిత్రం

## 6.2 దాతలు - బంధుమిత్రులు - శిష్యులు




శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు
పార్లమెంటు సభ్యులు, నంద్యాల



శ్రీమతి పుల్లమ్మ-శ్రీపోచా బ్రహ్మానందరెడ్డి దంపతులు



శ్రీమతి జ్ఞాన ప్రసూన - డా॥ కాదరబాద్ రవీంద్రనాథ్ దంపతులు




తంగిరాల సోదరులు
(సోమయాజులు-సుబ్బారావు-భాస్కరరావు-కృష్ణమూర్తి)



మా చిరంజీవులతో..
(చి॥ కాళి - రాము - సీత - నేను - శీను - శశి)



శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు
(శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు)
(కృతిస్వీకర్త)



'వీరగాథల సవరాల జిమ్మడు" – "రసజ్ఞ రాజశేఖరుడు"
ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు
(ప్రధాన సంపాదకుడు)



డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు
(సహాయకుడు)

జననం: 04.03.1925 మరణం: 16.12.2006



కీ.శే. ఆరాధ్యుల పిచ్చయ్య యాదవరాజుగారు
(1890-1982) (తాళపత్ర గ్రంథం)







డా॥ కనకబండి మోహనరావుగారు
(1944-2000) (తాళపత్ర గ్రంథం)



శ్రీ పావళ్ల మహేష్‌గారు
('ప్రజాశక్తి' విలేఖకుడు)







మా అమ్మ
కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మిగారు
(1907–1990)



60 శరత్తుల సీతమ్మకు సత్కారం (02.12.2020, బుధవారం)



చి॥ కాళిదాసు – చి॥ సౌ॥ నాగలక్ష్మి దంపతులు



చి॥ శ్రీనాథ్ – చి॥ సౌ॥ జయశ్రీ దంపతులు



డా॥ తంగిరాల రేవతీ శశిప్రియగారు



చి॥ పుట్టప్ప సంజయ్ (దౌహిత్రుడు)



చి॥ మిహిర్ కులకర్ణి (దౌహిత్రుడు)



"నవ్వుల పువ్వులు" (మనుమడు–మనుమరాలు–మునిమనుమడు)
చి॥ సంజయ్ – చి.సౌ. అక్షత – చి॥ అర్జున్



చి॥ సౌ॥ రసజ్ఞ – చి॥ అమిత్ దంపతులు



కీ.శే. బొడ్డెబోయిన గంగయ్యగారు (1912-1997)
పాలేటి గంగగుడి పూజారి, ధర్మకర్త







శ్రీ దండమూడి అవనీంద్రకుమార్‌గారు

